శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమద్రామాయణము

## అయోధ్యాకాండము

### ఉత్తరభాగము

ఆంధ్ర తాత్పర్య సహితము

తాత్పర్య కర్త

శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు

ప్రచారకులు

శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్సు

హైదరాబాదు

1981

శ్రీమద్రామాయణము - అయోధ్యాకాండము, ఉత్తరభాగము
ఆంధ్ర తాత్పర్యసహితము

ప్రథమ ముద్రణ 1981



తిరుమల తిరుపతి దేవస్థానమువారి ద్రవ్యసహాయము
రు. 5,000/- పొందినది.

ప్రచారకులు :
శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్సు,
కేశవనగర్, శ్రీనగర్ కాలనీ, P. O.
హైదరాబాదు-500 873

ముద్రణ :
Avon Printing Works,
Esamia Bazar, Hyderabad - 500 027.



గ్రంథాలయ ప్రతి రు. 85-00

# మా మాట

శ్రీనివాసుని యనుగ్రహముచే చిరకాలముగ మా రామాయణ పాఠకు లెదురుచూచుచున్న అయోధ్యాకాండ ఉత్తరభాగ మీ నాటికి వెలువడుచున్నది. విఘ్నపరంపర లెదురైనను ఈ గ్రంథ మిట్లీనాడు వెలువడుటకు తోడ్పడిన మహాశయుల సహకార మిచట ప్రధానముగ ప్రశంసార్హము.

ఆర్ష సంస్కృతిని పరిరక్షించుటకు, ధార్మిక గ్రంథములు ప్రచురించుటకు, అట్టి గ్రంథములు రచియించు రచయితలను ప్రోత్సహించుటకును తిరుమల తిరుపతి దేవస్థానములవారు చేపట్టిన ప్రణాళికలో భాగముగ ఈ గ్రంథముద్రణమునకు దేవస్థానమువారి అర్థికసహాయము రు. 5,000/- లభించినది. ఇందులకు మొట్టమొదట దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారైన శ్రీ పి వి. ఆర్. కె. ప్రసాద్, (I.A.S.) గారికి మా హార్దిక ధన్యవాదములు. అట్లే దేవస్థానం పబ్లిక్ రిలేషన్సు ఆఫీసరు శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి గారికిని మా కృతజ్ఞతలు.

హైదరాబాదు నగరమున ప్రముఖ మిఠాయి వ్యాపారులు, వదాన్య శేఖరులు, శ్రీ జి. పుల్లారెడ్డిగారు మొదటినుండియు ఈ ప్రయత్నమున తమ సహకారము నిచ్చి మమ్మాదరించుచున్నారు. వారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు ప్రముఖులు, ధార్మిక కార్యదీక్షితులు, సంతతోత్సాహులు శ్రీ పి. వెంకటేశ్వర్లు గారు తమ చేయూత నిచ్చి మా కెంతో సహకరించిరి వారికి మా ధన్యవాదములు.

అట్లే శ్రీ టి. ఎస్. ఆర్. నరసింహంగారు (రిటైర్డ్. ఇన్కం టాక్స్ కమీషనరు), శ్రీ వి. హనుమంతరావు (I.T.O. తెనాలి) శ్రీమద్రామాయణముపై ఆదరముతో సహకరించిరి వారిరు వురకును మా ధన్యవాదములు.

మా ఈ గ్రంథమునకు ప్రచురణ పూర్వవిరాళముల నందించి సహకరించిన సహృదయులు, ఇది తమ పనిగా భావించి, పలువురు మిత్రులచే సహకరింపజేసిన మిత్రులు, అధి కారులు, అనధికారులగు ఆప్తులకు మా కృతజ్ఞతాంజలులు.

గ్రంథమును చక్కగా ముద్రించి యొసగిన **Avon printing works** వారికి మా కృతజ్ఞతలు.

తాత్పర్యకర్త & ప్రచారకులు

# శ్రీరామాయణ మాహాత్మ్యమ్

ఉమాసంహితాయాం –

శ్రీరామప్రాతిపదిక మవశేనాపి సంగృణన్,
ముక్తిం ప్రాప్నోతి మనుజః కిం పున ర్బుద్ధిపూర్వకమ్. 1

రాశబ్దోచ్చారణాదేవ పాతకా దేహపంజరాత్,
నిర్యాం త్యాయాంతి పాపాని మవర్ణాదర్శనాత్ పునః. 2

రాశబ్దోచ్చారణే జాతే వక్త్రాత్ పాపం విగచ్ఛతి,
మకారశ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి. 3

రామేతి రామచంద్రేతి రామభద్రేతి వా మనుం,
యావజ్జీవం జపన్ మర్త్యో జీవన్ముక్తో న సంశయః. 4

రామాయణస్య మాహాత్మ్యం వక్తుం వర్షశతై రపి,
అశక్యం విస్తరా ద్వక్తుం సంక్షేపా ద్వచ్మి సాంప్రతమ్. 5

రామాయణస్య వాక్యం వా పాదం వా పదమేవ వా,
భుక్త్యంతే తు ప్రయుంజానో బ్రహ్మభూయాయ కల్పతే. 6

రామాయణకథా మేవ యే శృణ్వంతి నరోత్తమాః,
విధూతపాపా స్తే యాంతి బ్రహ్మలోక మనామయమ్. 7

తత్త్వసంగ్రహరామాయణే

సంసారతాపయుక్తానాం జంతూనాం హతచేతసాం,
శ్రీమద్రామాయణాఖ్యానపీయూషం భేషజం స్మృతమ్. 8

# శ్రీవైష్ణవైః శ్రీమద్రామాయణపారాయణారంభే పఠనీయాః శ్లోకాః

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం,
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్. 1

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్,
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్. 2

యో నిత్య మచ్యుత పదాంబుజయుగ్మ రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే. 3

మాతా పితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా. 4

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్. 5

## అథ శ్రీశైలపూర్ణ విషయమ్

పితామహస్యాపి పితామహాయ
ప్రాచేతసాదేశ ఫలప్రదాయ

శ్రీభాష్యకారోత్తమ దేశికాయ
శ్రీశైలపూర్ణాయ నమో నమస్తాత్. 6

ఇతి శ్లోక మారభ్య శ్రీభాష్యకారప్రభృతి స్వాచార్య పర్యంత విషయాః సాంప్రదాయికాః శ్లోకా అనుసంధేయాః. యద్వా స్వాచార్యప్రభృతి శ్రీధరపర్యంత ప్రతివ్యక్తివిషయాః శ్లోకా అనుసంధేయాః.

## విష్వక్సేనధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం,
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే. 2

## శ్రీహయగ్రీవధ్యానమ్

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే. 1

అభంగురకలాదాన స్థూలలక్షత్వ మీయుషే,
తుంగాయ మహసే తస్మై తురంగాయ ముఖే నమః. 2

## వాల్మీకిధ్యానమ్

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 1

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 2

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్. 8

ఆంజనేయప్రార్థనా

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్. 1

అంజనానందనం వీరం జానకీశోకనాశనం,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్. 2

ఆమిషీకృతమార్తాండం గోష్పదీకృతసాగరం,
తృణీకృతదశగ్రీవ మాంజనేయం నమామ్యహమ్. 8

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి. 4

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్. 5

ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయవిగ్రహం,
పారిజాత తరుమూలవాసినం
భావయామి పవమాననందనమ్. 6

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్. 7

శ్రీరామాయణ ప్రార్థనా

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా. 1

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్. 2

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులం,
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్. 5

యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్ పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోఃపదం శాశ్వతమ్ 6

తదుపగత సమాస సంధియోగం
సమమధురోపనతార్థ వాక్యబద్ధం,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 7

శ్రీరామ ప్రార్థనా-

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్,
అజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి. 8

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 9

తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కార్యమ్

అథ-ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్.

తప స్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్.

ఇతి శ్లోకద్వయం పఠిత్వా 'శ్రీ రఘునందన పరబ్రహ్మణే నమః'
ఇత్యుక్త్వా పారాయణ మారభేత.

# పారాయణసమాపనే అనుసంధేయశ్లోకక్రమః

ఏవ మేతత్ పురావృత్త మాఖ్యానం భద్ర మస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్. 1

లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః. 2

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః. 3

కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్. 4

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు. 5

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్. 6

వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్. 7

విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్. 8

పితృభక్తాయ సతతం భ్రాతృభిః సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్. 9

త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్. 10

సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్. 11

దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్. 12

సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్. 13

హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్. 14

శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘిత సింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్. 15

ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్. 16

మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్. 17

కాయేన వాచా మన సేంద్రియై ర్వా
బుద్ధ్యాఽఽత్మనా వా ప్రకృతేః స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి. 10

తతః పితామహస్యే త్యారభ్య స్వాచార్య పర్యంతశ్లోకా అనుసంధేయాః. యద్వా స్వాచార్య మారభ్య శ్రీధరపర్యంతా గురుపరంపరాఽనుసంధేయా. సీతావివాహ పట్టాభిషేక సర్గయోస్తు 'ఇయం సీతా మమ సుతా' 'అభ్యషించ న్నరవ్యాఘ్రం' ఇతి శ్లోకపఠనాత్ పూర్వం మధ్యే విశేషతో భగవదారాధనం చ కర్తవ్యమ్.

## స్మార్తాదీనాం శ్రీమద్రామాయణపారాయణోపక్రమే అనుసంధేయాః శ్లోకాః

ఆదౌ శ్రీమహాగణపతిధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

అగజాననపద్మార్కం గజానన మహర్నిశమ్,
అనేకదం తం భక్తానా మేకదంత ముపాస్మహే. 2

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యాః స్యు స్తం నమామి గజాననమ్. 3

సరస్వతీ ప్రార్థనా

శారదా శారదాంభోజవదనా వదనాంబుజే,
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్.

యా కుందేందుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా,
యా బ్రహ్మాచ్యుత శంకరప్రభృతిభి ర్దేవైః సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా. 2

దోర్భిర్యుక్తా చతుర్భిస్స్ఫటికమణిమయీ మక్షమాలాందధానా
హస్తే నైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసా కుందేందు శంఖస్ఫటిక మణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా. 3

వాల్మీకి నమస్క్రియా-

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 1

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్. 2

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్. 3

ఆంజనేయ నమస్క్రియా-

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్. 1

అంజనానందనం వీరం జానకీశోకనాశనం,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్. 2

అమిషీకృతమార్తాండం గోష్పదీకృతసాగరం,
తృణీకృతదశగ్రీవ మాంజనేయం నమా మ్యహమ్.

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

అంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయవిగ్రహం,
పారిజాతతరుమూలవాసినం
భావయామి పవమాననందనమ్.

యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్.
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

శ్రీరామాయణ ప్రార్థనా

వాల్మీకిస్మృతిమందరేణ మథిత స్సీతారమాసంభవ
స్సుగ్రీవామరభూరుహో౽ంగదగజ స్సౌమిత్రి చంద్రోదయః,
వాతోత్పన్నమణి ర్విభీషణసుధః పౌలస్త్యహాలాహలః
శ్రీరామాయణదుగ్ధసింధు రమలో భూయాత్స న శ్శ్రేయసే. 1

యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్పిబ త్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్.

తదుపగతసమాససంధియోగం
సమమధురోపనతార్థ వాక్యబద్ధం,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 3

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ. 4

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులం,
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్. 5

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా. 6

శ్రీరామధ్యానమ్

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 1

వామే భూమిసుతా పురశ్చ హనుమాన్ పశ్చాత్ సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదలయో ర్వాయ్వాదికోణేషు చ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్. 2

మాతా రామో మత్పితా రామభద్రో
భ్రాతా రామో మత్సఖా రాఘవేశః,
సర్వస్వం మే రామచంద్రో దయాళు
ర్నాన్యం దైవం నైవ జానే న జానే. 3

సాకేతే శరదిందుకుందధవళే సౌధే మహామండపే
పర్యస్తాగరు ధూపదీపలలితే కర్పూర దీపోజ్జ్వలే,
సుగ్రీవాంగద జాంబవత్పరివృతం సౌమిత్రిణా సేవితం
లీలామానుషవిగ్రహం రఘువరం రామం భజే శ్యామలమ్ 4

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై,
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః. 5

తతః శ్రీకోశోపరి శ్రీరామావాహనాది నైవేద్యాంతపూజా
విధేయా. పారాయణావసానే చ పునః పూజా కర్తవ్యా.

## పారాయణసమాపనే అనుసంధేయశ్లోకక్రమః

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు. 1

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః. 2

అపుత్రాః పుత్రిణ స్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః,
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్. 3

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్. 4

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా. 5

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః. 6

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్. 7

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్. 9

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్. 10

త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
యదాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళమ్. 11

ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ తే,
మంగళాని మహాబాహో దిశంతు తవ సర్వదా 12

కాయేన వాచా మనసేంద్రియై ర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
శ్రీరాఘవాయేతి సమర్పయామి. 13

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ శ్రీరాఘవ నమోఽస్తు తే. 14

ఆత్మా త్వం క్షితిజా మతిః పరిజనాః ప్రాణా శ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః,
సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వా గిరో
యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం రామాస్తు తే పూజనమ్.

సీతావివాహ పట్టాభిషేకసర్గయోస్తు 'ఇయం సీతా మమ సుతా' 'అభ్యషించ న్నరవ్యాఘ్రం' ఇతి శ్లోకపఠనాత్ పూర్వం విశేషతో ధ్యానావాహన నైవేద్యాది నీరాజనాంత సపర్యా సంవిధేయా.

అనేన శ్రీమద్రామాయణపారాయణేన భగవాన్ సర్వదేవతాత్మకః సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రః సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు.

# మాధ్వానాం రామాయణ పారాయణోపక్రమే
# అనుసంధేయాః శ్లోకాః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

లక్ష్మీనారాయణం వందే తద్భక్తప్రవరో హి యః,
శ్రీమదానందతీర్థాఖ్యో గురు స్తం చ నమామ్యహమ్. 2

వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా,
ఆదా వంతే చ మధ్యే చ విష్ణుః సర్వత్ర గీయతే. 3

సర్వవిఘ్నప్రశమనం సర్వసిద్ధికరం పరం
సర్వజీవప్రణేతారం వందే విజయదం హరిమ్. 4

సర్వాభీష్టప్రదం రామం సర్వానిష్టనివారకమ్,
జానకీజాని మనిశం వందే మద్గురువందితమ్. 5

అభ్రమం భంగరహిత మజడం విమలం సదా,
ఆనందతీర్థ మతులం భజే తాపత్రయాపహమ్. 6

భవతి యదనుభావా దేడమూకోఽపి వాగ్మీ
జడమతి రపి జంతు ర్జాయతే ప్రాజ్ఞమౌళిః,
సకలవచనచేతోదేవతా భారతీ సా
మమ వచసి విధత్తాం సన్నిధిం మానసే చ. 7

మిథ్యా సిద్ధాంత దుర్ధ్వాంత విధ్వంసన విచక్షణః,
జయతీర్థాఖ్య తరణి ర్భాసతాం నో హృదంబరే. 8

చిత్రైః పదైశ్చ గంభీరై ర్వాక్యై ర్మానై రఖండితైః,
గురుభావం వ్యంజయంతీ భాతి శ్రీజయతీర్థవాక్. 9

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్. 10

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ 11

యః పిబన్ సతతం రామచరితామృత సాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్ 15

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్. 18

అంజనానందనం వీరం జానకీశోకనాశనం,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ 14

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి. 15

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః,
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్. 16

ఆంజనేయ మతి పాటలాననం
కాంచనాద్రి కమనీయవిగ్రహం,
పారిజాతతరుమూలవాసినం
భావయామి పవమాననందనమ్. 17

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్. 18

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజె,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా. 19

ఆపదా మపహ ర్తారం దాతారం సర్వసంపదాం,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్. 20

తదుపగతసమాస సంధియోగం
సమమధురోపనతార్థ వాక్యబద్ధం,
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. 21

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే,
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. 22

వందే వంద్యం విధిభవమహేంద్రాదిబృందారకేంద్రైః
వ్యక్తం వ్యాప్తం స్వగుణగణతో దేశతః కాలతశ్చ,
ధూతావద్యం సుఖజితిమయై ర్మంగళై ర్యుక్త మంగైః
సానాథ్యం నో విదధ దధికం బ్రహ్మ నారాయణాఖ్యమ్. 23

భూషారత్నం భువనవలయ స్యాఖిలాశ్చర్యరత్నం
లీలారత్నం జలధిదుహితు ర్దేవతామౌలిరత్నం,
చింతారత్నం జగతి భజతాం సత్సరోజద్యురత్నం
కౌసల్యాయా లసతు మమ హృన్మండలే పుత్రరత్నమ్. 24

మహావ్యాకరణాంభోధి మంథమానసమందరం,
కవయంతం రామకీర్త్యా హనుమంత ముపాస్మహే. 25

ముఖ్యప్రాణాయ భీమాయ నమో యస్య భుజాంతరం
నానావీరసువర్ణానాం నికషాశ్మాయితం బభౌ. 26

స్వాంతస్థానంతశయ్యాయ పూర్ణజ్ఞానమహార్ణసే,
ఉత్తుంగవాక్తరంగాయ మధ్వదుగ్ధాబ్ధయే నమః. 27

వాల్మీకే ర్గౌః పునీయా న్నో మహీధరపదాశ్రయా,
యద్దుగ్ధ ముపజీవంతి కవయ స్తర్ణకా ఇవ. 28

సూక్తిరత్నాకరే రమ్యే మూలరామాయణార్ణవే,
విహరంతో మహీయాంసః ప్రీయంతాం గురవో మమ. 29

హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి యో వదేత్
తస్య నిస్సరతే వాణీ జహ్నుకన్యాప్రవాహవత్. 30

(పారాయణ సమాపనవిధి శ్రీ వైష్ణవులకు వలె)

# శ్రీమద్వాల్మీకిరామాయణస్య అంగన్యాసాదిమంత్రాః

అస్య శ్రీమద్వాల్మీకిరామాయణమహామంత్రస్య నారదో భగవా నృషిః, అనుష్టుప్ ఛందః, శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రో దేవతా, ఓం బీజమ్, 'ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది' ఇతి శక్తిః, పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్' ఇతి కీలకమ్, శ్రీ సీతారామచంద్ర ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః.

ధర్మాత్మా-అంగుష్ఠాభ్యాం నమః
సత్యసంధశ్చ-తర్జనీభ్యాం నమః
రామః-మధ్యమాభ్యాం నమః
దాశరథి ర్యది - అనామికాభ్యాం నమః
పౌరుషే చాప్రతిద్వంద్వః - కనిష్ఠికాభ్యాం నమః
శరైనం జహి రావణిమ్ - కరతల కరపృష్ఠాభ్యాం నమః
ధర్మాత్మా - హృదయాయ నమః
సత్యసంధశ్చ - శిరసే స్వాహా
రామః - శిఖాయై వషట్
దాశరథి ర్యది - కవచాయ హుం
పౌరుషే చాప్రతిద్వంద్వః - నేత్రాయ వౌషట్
శరైనం జహి రావణిమ్ - అస్త్రాయ ఫట్
భూర్భువ స్సువరో మితి - దిగ్బంధః.

ధ్యానమ్

సహస్రాదిత్య సంకాశం సర్వశత్రు నిబర్హణం,
రామశక్తిమయం ధ్యాయే దమోఘం రామసాయకమ్.

అథ పంచోపచారాః

లం పృథివ్యాత్మనే గంధాన్ కల్పయామి.
హం ఆకాశాత్మనే పుష్పాణి సమర్పయామి.
యం వాయ్వాత్మనే ధూప మాఘ్రాపయామి.
రం వహ్న్యాత్మనే దీపం దర్శయామి.
వం అమృతాత్మనే అమృతోపహారం నివేదయామి.
సం సర్వాత్మనే సర్వోపచారాన్ సమర్పయామి.

అథ మూలమంత్రః

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్.

ఇతి యథాశక్తి జపః. తతః,

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ.
ఇత్యేతం మంత్రం యథాశక్తి జపేత్. ఏవ ముత్తరన్యాసః.

## శ్రీమద్రామాయణపూజాక్రమః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.

ఓం భూః. ఇత్యాది సువరోం. మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ భగవత్ప్రీత్యర్థం, సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న

హనుమత్సమేత శ్రీ రామచంద్ర ప్రసాద సిద్ధ్యర్థం, శ్రీరామ చంద్ర ప్రసాదేన సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీరామచంద్రపూజాం కరిష్యే. శ్రీ....కాండ పారాయణం చ కరిష్యే. తదంగత్వేన విష్వక్సేన, బ్రహ్మేంద్రాది పంచపాలక, దీపరాజ, కలశ శంఖాత్మ పీఠపూజాం చ కరిష్యే. అస్మిన్ పుస్తకే సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రం ధ్యాయామి. ఆవాహయామి. రత్నసింహాసనం సమర్పయామి. పాద్యం సమర్పయామి. ఆచమనీయం సమర్పయామి. అర్ఘ్యం సమర్ప యామి. ఆచమనీయం సమర్పయామి. స్నానం సమర్పయామి. స్నానానంతరం ఆచమనీయం సమర్పయామి వస్త్రం సమర్ప యామి. యజ్ఞోపవీతోత్తరీయాభరణార్థం పుష్పాణి సమర్పయామి. గంధాన్ ధారయామి. అక్షతాన్ సమర్పయామి. పుష్పాణి సమర్పయామి.

ఓం కేశవాయ నమః....శ్రీకృష్ణాయ నమః. శ్రీరామ చంద్రాయ నమః. సమస్తోపచారాన్ సమర్పయామి. ధూప మాఘ్రాపయామి. దీపం దర్శయామి. కదళీఫలం నివేదయామి. తాంబూలం సమర్పయామి. కర్పూరనీరాజనం దర్శయామి. ఛత్రచామరాది సమస్తోపచారాన్ సమర్పయామి. ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

## శ్రీగాయత్రీరామాయణమ్

తప స్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరం,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. 1

స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః,
ఋషిభిః పూజితః సమ్య గ్యథేంద్రో విజయీ పురా. 2

విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితం,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. 3

తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాంపతేః,
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత. 4

వనవాసం హి సంఖ్యాయ వాసాం స్యాభరణాని చ,
భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ. 5

రాజా సత్యం చ ధర్మశ్చ రాజా కులవతాం కులం,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. 6

నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్. 7

యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్,
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః. 8

భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో,
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. 9

గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలం,
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ. 10

దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. 11

వంద్యా స్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యా స్తేఽపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః. 12

స విజిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీం.
విక్రమేణ మహాతేజా హనూమాన్ మారుతాత్మజః. 13

ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్. 14

మంగళాభిముఖీ తస్య సా తదాఽఽసీ న్మహాకపేః,
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్. 15

హితం మహార్థం మృదుహేతుసంహితం
వ్యతీతకాలాయతి సంప్రతిక్షమమ్,
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసంగవా నుత్తర మేత దబ్రవీత్ 16

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః,
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నో త్యకంటకమ్. 17

యో వజ్రపాతాశనిసన్నిపాతా న్న చుక్షుభే నాపి చచాల రాజా,
స రామబాణాభిహతో భృశార్తశ్చచాల చాపంచ ముమోచ వీరః.

యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్. 19

న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా. 20

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,
బద్ధాంజలిపుటా చేద మువా చాగ్నిసమీపతః. 21

చలనా త్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః,
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్. 22

దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనం,
సర్వ మేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర. 23

యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తా మేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయమ్. 24

ఇత్థం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతమ్
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. 25

యావ దావర్తతే చక్రం యావతీ చ వసుంధరా,
తావ ద్వర్షసహస్రాణి స్వామిత్వ మవధారయ. 26

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్. 27

శ్రీ గాయత్రీ రామాయణం సంపూర్ణమ్.

# విషయానుక్రమణిక

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమద్రామాయణము

# అయోధ్యాకాండము

## ద్విపంచాశః సర్గః - ఏబదిరెండవ సర్గము

ప్రభాతాయాం తు శర్వర్యాం పృథువక్షా మహాయశాః
ఉవాచ రామ స్సౌమిత్రిం లక్ష్మణం శుభలక్షణమ్. 1

ఆ రాత్రి తెల్లవారగా (మిక్కిలి యుత్సాహముచే) విస్తరిల్లిన వక్షఃస్థలము కలవాడును, (ధర్మము తప్పనివాడని) గొప్ప కీర్తి కలవాడగు రాముడు-సుమిత్రాతనయుడును, మంగళకరములగు లక్షణములు కలవాడును అగు లక్ష్మణున కిట్లనెను.

భాస్కరోదయకాలోఽయం గతా భగవతీ నిశా
అసౌ సుకృష్ణో విహగః కోకిల స్తాత! కూజతి. 2

నాయనా! ఇది (సూర్యసంబంధియగు) అరుణోదయకాలము కామమును వృద్ధినందించు రాత్రి గడచినది. మిక్కిలి నల్లని భరద్వాజ పక్షియు, కోకిలయు కూయుచున్నవి

బర్హిణానాం చ నిర్ఘోషః శ్రూయతే నదతాం వనే
తరామ జాహ్నవీం సౌమ్య! శీఘ్రగాం సాగరంగమామ్. 3

ఓ సౌమ్యుడా! ఈ అరణ్యమున నెమళ్ళు గంభీరముగ చేయు కేకారవము వినిపించుచున్నది. వేగముగ పారుచు, సముద్రమున కేగుచున్న ఈ గంగానదిని దాటుదము.

విజ్ఞాయ రామస్య వచ స్సౌమిత్రి ర్మిత్రనందనః
గుహ మామంత్ర్య సూతం చ సోఽతిష్ఠ ద్భ్రాతు రగ్రతః. 4

రాముని మాటలోని (మన మీ నది దాటజాలము. శీఘ్రమే నది దాటుటకు నావను రప్పించుము అను) తాత్పర్యమును గ్రహించినవాడై మిత్రుల నానందింపజేయు లక్ష్మణుడు, గుహుని, సూతుని పిలచి, "రాముని మాటలలోని తాత్పర్య మవగత మాయెనా" అని యడిగి, అన్న ఎదుట నిలచెను.

స తు రామస్య వచనం నిశమ్య ప్రతిగృహ్య చ
స్థపతి స్తూర్ణ మాహూయ సచివా నిద మబ్రవీత్. 5

నిషాదరాజగు గుహుడును రాముని మాట నాలించి, యట్లే యాచరింతునని శిరము వంచి యంగీకరించి, శీఘ్రమే తన మంత్రులను పిలిచి వారి కిట్లు చెప్పెను.

అస్య వాహనసంయుక్తాం కర్ణగ్రాహవతీం శుభామ్
సుప్రతారాం దృఢాం తీర్థే శీఘ్రం నావ ముపాహర 6

మీరు శుభమైనదియు, చుక్కానితో కూడినదియు, నావికుడు కలదియు, చక్కగా దాటింపజేయునదియు గట్టిగా నిర్మింపబడినదియు అగు నావను శీఘ్రమే రేవు కడకు కొనితెండు.

తం నిశమ్య సమాదేశం గుహామాత్యగణో మహాన్
ఉపోహ్య రుచిరాం నావం గుహాయ ప్రత్యవేదయత్. 7

శ్రేష్ఠులగు గుహుని మంత్రులు రాజునాజ్ఞ విని, సుందర

మగు నావను రేవు చెంతకు రప్పించి, గుహున కా విషయము తెలిపిరి.

తత స్స ప్రాంజలి ర్భూత్వా గుహో రాఘవ మబ్రవీత్
ఉపస్థితేయం నౌ ర్దేవ! భూయః కిం కరవాణి తే. 8

అంత నా గుహుడు రామున కంజలి ఘటించి యిట్లు పలికెను - "ప్రభూ! నావ వచ్చియున్నది. మఱల నేమి చేయుమనెదవో అనతిమ్ము".

తవామరసుతప్రఖ్య! తర్తుం సాగరగాం నదీమ్
నౌ రియం పురుషవ్యాఘ్ర! తాం త్వ మారోహ సువ్రత. 9

దేవతనయునితో సమానుడవు, నరశ్రేష్ఠుడవు, ఉత్తమ నియమములు పాటించువాడవగు రామా! సముద్రమున ప్రవేశింపబోవు నీ విశాలమైన నదిని నీవు దాటుటకై ఈ నావ వచ్చి యున్నది. దీని నెక్కుము.

అథోవాచ మహాతేజా రామో గుహ మిదం వచః
కృతకామోఽస్మి భవతా శీఘ్ర మారోప్యతా మితి. 10

అంత మహాతేజశ్శాలి యగు రాముడు గుహున కిట్లనెను - "నా కోరిక నీవు తీర్చితివి. తప్పుగోల, తట్ట మున్నగు వస్తువులు, సీతయొక్క వస్త్రములు, అభరణములు మున్నగువానిని పడవలో పెట్టింపుము".

తతః కలాపాన్ సన్నహ్య ఖడ్గౌ బద్ధ్వా చ ధన్వినౌ
జగ్మతు ర్యేన తౌ గంగాం సీతయా సహ రాఘవౌ. 11

అపుడా రామలక్ష్మణులు కవచములు దాల్చి, యమ్ములు పొదులు, ఖడ్గములు ధరించి, విండ్లు చేతబట్టి సీతతో గూడి, యేమార్గమున పోయిన గంగానదిని చేరుదురో ఆ త్రోవను వెడలిరి.

రామ మేవ తు ధర్మజ్ఞ ముపగమ్య వినీతవత్
కి మహం కరవాణీతి సూతః ప్రాంజలి రబ్రవీత్. 12

సూతు డపుడు సేవకుల ధర్మమెఱిగిన రాముని వినయముతో సమీపించి, దోసిలి యొగ్గి, "నన్నేమి చేయుమందు"వని యాతని నడిగెను.

తతోఽబ్రవీ ద్దాశరథి స్సుమంత్రం
స్పృశన్ కరే ణోత్తమదక్షిణేన
సుమంత్ర! శీఘ్రం పునరేవ యాహి
రాజ్ఞ స్సకాశే భవ చాప్రమత్తః. 13

రాము డపుడు తన కుడిచేతితో సుమంత్రుని తాకుచు నాతని కిట్లనెను- "ఉత్తముడ వగు ఓ సుమంత్రుడా! నీవు శీఘ్రముగ అయోధ్యకు మఱలిపొమ్ము. ఏమఱక రాజునకు సన్నిహితుడవై యుండుము."

నివర్తస్వే త్యువా చైవ మేతావద్ధి కృతం మమ
రథం విహాయ పద్భ్యాం తు గమిష్యామి మహావనమ్. 14

నీవు రాజాజ్ఞ పాటించి నన్ను గంగాతీరమువఱకు రథములో కొనితెచ్చితివి కదా. మే మిటుపై రథము విడచి కాలి నడకనే మహారణ్యము ప్రవేశింతుము.

అత్మానం త్వభ్యనుజ్ఞాత మవేక్ష్యార్త స్స సారథిః
సుమంత్రః పురుషవ్యాఘ్రమైక్ష్వాక మిద మబ్రవీత్ 15

సారథి యగు సుమంత్రుడు రాముడు తన్ను మరలిపోవ ననుమతించు టెఱిగి, సీతాలక్ష్మణులతోబాటు తానును రాము ననుసరించిపోవ ననుమతించలేదని ఖిన్నుడై, నరశ్రేష్ఠు డగు నాతని కిట్లనెను.

నాతిక్రాంత మిదం లోకే పురుషే ణేహ కేనచిత్
తవ సభ్రాతృభార్యస్య వాసః ప్రాకృతవ ద్వనే. 16

నీవు సామాన్యజనునివోలె తమ్మునితో, భార్యతో కూడి యడవిలో నివసించుట లోకములో నెవ్వరైన నంగీకరించ లేరు (నా కంగీకార్యము కాదని వేరుగ చెప్పవలెనా ?)

న మన్యే బ్రహ్మచర్యేఽస్తి స్వధీతే వా ఫలోదయః
మార్దవార్జవయో ర్వాపి త్వాం చే ద్వ్యసన మాగతమ్. 17

బ్రహ్మచర్యము, స్వాధ్యాయము, మార్దవము, ఆర్జవము ను నీ నాలుగును కల నీకే యాపద కలుగుచో, నేలపై పరుండుట మున్నగు లక్షణములతో కూడిన బ్రహ్మచర్యమును, అధ్యయన కాలమం దనుష్ఠించిన వేదాధ్యయనమును, దయాగుణమును, ఋజువర్తనమును నిష్ఫలము లని తలంతును. బ్రహ్మచర్యా దులు సఫలము లగుచో నీకట్టి సత్ఫలము కలుగవలసినదే. కాని యట్టి ఫలము నీ యందు కానరాదు. సరికదా వనవాసరూపమగు క్లేశమే కనుపించుచున్నది. కాన నీ బ్రహ్మచర్యాదులు ఫలవంత ములు కావని తలంతును (ఇది సుమంత్రుడు మిగుల దుఃఖముతో పలికిన మాటయే గాని యాతని తాత్పర్యము గాదు).

సహ రాఘవ! వైదేహ్యా భ్రాత్రా చైవ వనే వసన్
త్వం గతిం ప్రాప్స్యసే వీర! త్రీన్లోకాంస్తు జయన్నివ 18

వీరుడవగు రామా! నీవు సీతతో, లక్ష్మణునితో కూడి యడవిలో నివసించుచు ముల్లోకములను జయించువాని (విష్ణువు) వలె సాటిలేని కీర్తిని పొందగలవు.

వయం ఖలు హతా రామ! యే త్వయా హ్యుపవంచితాః
కైకేయ్యా వశ మేష్యామః పాపాయా దుఃఖభాగినః. 19

రామా! మేము (సుమంత్రుడు తన్ను పౌరులతో కలుపుకొని పలుకుమాట) నీచే గూడ (రాత్రి నిద్రాసమయమున నెవ్వరికి తెలియకుండునట్లు నీ వేగుటచే) వంచింపబడినాము. అందువల్లనే దుఃఖము నందుచు పాపశీల యగు కైకేయికి వశము కాబోవుచున్నాము. మేము భాగ్యోపహతుల మైతిమి.

ఇతి బ్రువ న్నాత్మసమం సుమంత్ర స్సారథి స్తదా
దృష్ట్వా దూరగతం రామం దుఃఖార్తో రురుదే చిరమ్. 20

అని యిట్లు సారథియగు సుమంత్రు డపుడు భృత్యజనోచితముగ పలుకుచు, రాముడు దూరమేగుట చూచి, దుఃఖపీడితు డై చాల తడవు రోదించెను.

తతస్తు విగతే బాష్పే సూతం స్పృష్టోదకం శుచిమ్
రామస్తు మధురం వాక్యం పునః పున రువాచ తమ్. 21

అంత కన్నీరు కారుట నిలువగా, రోదనము అశుచిని కలిగించును కాన, జలములు తాకి (యాచమన మొనర్చి) పరిశుద్ధు

దైన సూతుడగు సుమంత్రునకు రాము డిట్లు మధురమగు నీమాట మాటిమాటికి పలికెను.

ఇక్ష్వాకూణాం త్వయా తుల్యం సుహృదం నోపలక్షయే
యథా దశరథో రాజా మాం న శోచే త్తథా కురు. 22

ఇక్ష్వాకువంశమువారికి నిన్ను బోలిన మిత్రుని వేరొక్కని గానను. దశరథమహారాజు నన్ను తలంచి దుఃఖింపకుండునటు లేమి చేయదగునో యట్లాచరింపుము.

శోకోపహతచేతా శ్చ వృద్ధశ్చ జగతీపతిః
కామభారావసన్నశ్చ తస్మాదేత ద్బ్రవీమి తే. 23

మహారాజు ముదుసలి. కామవేగముచే పీడితుడు, పుత్ర వియోగ మాయన మనస్సును కలచివైచినది. కావున నీకింత చెప్పవలసివచ్చినది.

యద్య దాజ్ఞాపయేత్ కించి త్స మహాత్మా మహీపతిః
కైకేయ్యాః ప్రియకామార్థం కార్యం త దవికాంక్షయా. 24

మహాత్ముడగు మహారాజు కైకేయి యభీష్టము తీర్చుకొఱ కే యే యాజ్ఞ నిడునో దాని నెల్ల ఏ సంశయమును లేక యను ష్ఠించుము.

ఏతదర్థం హి రాజ్యాని ప్రశాసతి నరేశ్వరాః
యదేషాం సర్వకృత్యేషు మనో న ప్రతిహన్యతే. 25

తాము కామముతో గాని, క్రోధముతో గాని తలపెట్టిన

కార్యములందు ఎదురులేకుండుట (తమ మనస్సు కార్యభంగముచే కలత నొందకుండుట) కొఱకే రాజులు రాజ్యములు పాలింతురు.

యద్యథా స మహారాజో నాళీక మధిగచ్ఛతి
న చ తామ్యతి దుఃఖేన సుమంత్ర కురు తత్తథా. 26

ఓ సుమంత్రుడా! నీ వెటులాచరించిన మహారాజున కప్రియము కలుగదో, ఆయన దుఃఖింపకుండునో యటు లా యా కార్యము లాచరింపుము.

అదృష్టదుఃఖం రాజానం వృద్ధ మార్యం జితేంద్రియమ్
బ్రూయాస్త్వ మభివాద్యైవ మమ హేతో రిదం వచః. 27

మహారాజు ముదుసలి మున్నెన్నడు దుఃఖమన నేమో తెలియనివాడు, పూజనీయుడు, జితేంద్రియుడును, నా ప్రతినిధిగ నీ వాయనకు ప్రణమిల్లి యిటులు నా మాటగా పలుకుము.

నైవాహ మనుశోచామి లక్ష్మణో న చ మైథిలీ
అయోధ్యాయా శ్చ్యుతా శ్చేతి వనే వత్స్యామహేతి చ. 28

నేను గాని, లక్ష్మణుడు గాని, సీత గాని అయోధ్యను వీడితిమే యనియో, అడవిలో నిడుమల బడుచుంటిమే యనియో దుఃఖించుట లేదు.

చతుర్దశసు వర్షేషు నివృత్తేషు పునః పునః
లక్ష్మణం మాం చ సీతాం చ ద్రక్ష్యసి క్షిప్ర మాగతాన్ 29

పదునాలుగు సంవత్సరముల గడువు గడవగా లక్ష్మణుడు,

నేను, సీతయు శీఘ్రమే మఱలివత్తుము. మమ్మపుడు మాటి మాటికి చూడగలవు.

ఏవ ముక్త్వాతు రాజానం మాతరం చ సుమంత్ర। మే
అన్యాశ్చ దేవీస్సహితాః కైకేయీం చ పునః పునః. 30
ఆరోగ్యం బ్రూహి కౌసల్యా మథ పాదాభివందనమ్
సీతాయా మమ చాఽఽర్యస్య వచనా ల్లక్ష్మణస్య చ. 31

సుమంత్రుడా! రాజునకు, నా తల్లి కౌసల్యకు, ఆమెతో కూడి యుండు తక్కిన రాణులకు, కైకేయికి మాటిమాటికి పైవిధముగ పలుకుము. నాతల్లి యారోగ్య మడిగితి నని, యామెకు పాదాభివందన మని నా మాటగా, సీత మాటగా, ఆర్యుడగు (శాస్త్ర విహితమైన జ్యేష్ఠు ననుసరించుట యను గొప్ప ధర్మ మెఱిగినవాడు కాన యార్యుడు) లక్ష్మణుని మాటగా తెలుపుము.

బ్రూయాశ్చ హి మహారాజం భరతం క్షిప్ర మానయ
ఆగతశ్చాపి భరతః స్థాప్యో నృపమతే పదే. 32
భరతం చ పరిష్వజ్య యౌవరాజ్యేఽభిషిచ్య చ
అస్మత్సంతాపజం దుఃఖం న త్వా మభిభవిష్యతి. 33

"భరతుని వేగమే రప్పించుము. భరతుడు వచ్చుటతోడనే యతనిని యౌవరాజ్యాభిషిక్తుని చేయుము. భరతుని యాలింగన సుఖము నంది, యౌవరాజ్యమున నాతని నభిషేకించగా మమ్మెడబాయుట వల్లనైన సంతాపముచే కలిగిన దుఃఖము నిన్ను పీడించదు" అని మహారాజునకు తెలుపుము.

భరత శ్చాపి వక్తవ్యో యథా రాజని వర్తసే
తథా మాతృషు వర్తేథా స్సర్వా స్వేవావిశేషతః. 34

యథా చ తవ కైకేయీ సుమిత్రా చ విశేషతః
తథైవ దేవీ కౌసల్యా మమ మా విశేషతః. ะ5

తాతస్య ప్రియకామేన యౌవరాజ్య మవేక్షతా
లోకయో రుభయో శ్శక్యం నిత్యదా సుఖ మేధితుమ్. 36

"రాజుపై నీ వెట్టి యాదరము చూపెదవో యట్టి యాదరమునే హెచ్చుతగ్గులు లేక తల్లు లందరియెడల చూపుము నీకు కైకేయి ఎట్లో సుమిత్రయు, నాతల్లి కౌసల్యాదేవియు విశేషించి యాదరింపదగినవారే. తండ్రికి ప్రియము కోరుచు, యౌవరాజ్యమంగీకరించి నీవు జనులకు (లేదా తండ్రికి) ఇహలోక-పరలోక సంబద్ధములైన సుఖములను వృద్ధినందింపదగుదువు." అని నా మాటగా భరతునకు తెలుపుము

నివర్త్యమానో రామేణ సుమంత్ర శ్శోకకర్శితః
తత్సర్వం వచనం శ్రుత్వా స్నేహా త్కాకుత్స్థ మబ్రవీత్.

రామునిచే నట్లు మఱలించబడుచున్న సుమంత్రుడు శోకపీడితుడై, రాముడు పలికినదెల్ల విని, వాత్సల్యముతో రామునకిట్లనెను.

యదహం నోపచారేణ బ్రూయాం స్నేహా దవిక్లబః
భక్తిమా నితి తత్తావ ద్వాక్యం త్వం క్షంతు మర్హసి. 38

నీయం దనురాగముచే నిర్భయుడనై సేవాధర్మము తలంపక

నేను పలికిన మాటల "నీతడు భక్తిమంతు"డను భావముతో క్షమింపదగుదువు.

కథం హి త్వద్విహీనోఽహం ప్రతియాస్యామి తాం పురీమ్
తవ తావ ద్వియోగేన పుత్రశోకాకులా మివ. 39

నీ వియోగముచే పుత్రు నెడబాయుటవలన శోకముచే వలె కలతనందియున్న అయోధ్యానగరమునకు నీవు లేక నేనెట్లు పోగలను ?

సరామ మపి తావ న్మే రథం దృష్ట్వా తదా జనః
వినా రామం రథం దృష్ట్వా విదీర్యేతాపి సా పురీ. 40

వెనుక నీవధిష్ఠించిన యీ రథమును చూచి, యిపుడీ రథముపై నీవు లేకుండుట గాంచిన అయోధ్య యందలి జనులు, తక్కిన ప్రాణి విశేషముల గుండెలు బ్రద్దలగును.

దైన్యం హి నగరీ గచ్ఛే ద్దృష్ట్వా శూన్య మిమం రథమ్
సుతావశేషం స్వం సైన్యం హతవీర మివాఽహవే. 41

యుద్ధమున నిహతుడైన వీరునిగాంచి యాతని సేనవలె, రథికుడు లేక, సారథి మాత్రమే కల రథమును చూచి యయోధ్య దైన్యము నందును.

దూరేఽపి నివసంతం త్వాం మానసే నాగ్రతః స్థితమ్
చింతయంత్యోఽద్యనూనంత్వాం నిరాహారాఃకృతాఃప్రజాః.

నీవు దూరమున నున్నను నిన్నే తలంచుచు, భావనాబలముచే తమ యెదుట నీవు నిలచి యున్నటులు చూచుచున్న ప్రజలు అహారముపై నాదరము చూపుటలేదు.

దృష్టం తద్ధి త్వయా రామ! యాదృశం త్వత్ప్రవాసనే
ప్రజానాం సంకులం వృత్తం త్వచ్ఛోకక్లాంతచేతసామ్.

రామా! నీవు నగరము వీడి పోవు సమయమున నీ యెడ బాటు వలన శోకముచే తల్లడిల్లిన మనస్సుకల ప్రజ లెట్లు క్షోభిల్లిరో నీవు స్వయముగ చూచియే యున్నావు.

ఆర్తనాదో హి యః పౌరైః ముక్తః స్త్వద్విప్రవాసనే
సరథం మాం నిశామ్యైవ కుర్యుః శ్శతగుణం తతః. 44

నీ వయోధ్యను వీడిపోవునపుడు ప్రజలెట్టి యార్తనాద మొనర్చిరో, వారు నేనొక్కడనే రథముతో మరలి వచ్చుచుండుట విని యంతకు నూఱురె ట్లార్తనాద మొనరింతురు.

అహం కించాపి వక్ష్యామి దేవీం తవ సుతో మయా
నీతోఽసౌ మాతులకులం సంతాపం మాకృథా ఇతి. 45

అసత్య మపి నైవాహం బ్రూయాం వచన మీదృశమ్
కథ మప్రియ మేవాహం బ్రూయాం సత్యమిదం వచః. 46

"అమ్మా! నీ తనయు నాతని మేనమామ యింటికి తీసికొని పోయితిని. నీవు చింతింపకు" మందునా, అది కౌసల్యకు ప్రియ మగునే కాని యసత్యమగుటచే పలుకరానిది. కాన నేనట్టిమాట పలుకను. అట్టిచో 'నీకుమారు నడవిలో విడచి వచ్చితి' నను అప్రియమగు సత్యమును కౌసల్యాదేవి కెట్లు పలికెదను?

మమ తావ న్నియోగస్థా స్త్వద్బంధుజనవాహినః
కథం రథం త్వయా హీనం ప్రవక్ష్యన్తి హయోత్తమాః. 47

నిన్ను, నీవారిని సదా రథముపై కూర్చుండబెట్టుకొని తీసికొని పోవునవి, నా యాజ్ఞావశమం దుండునవి యగు ఈ శ్రేష్ఠములగు గుఱ్ఱములు నీవు లేని యీ రథము నెట్లు లాగును?

తం న శక్ష్యామ్యహం గంతు మయోధ్యాం త్వదృతేఽనఘ
వనవాసానుయానాయ మా మనుజ్ఞాతు మర్హసి. 48

కావున ఓ సజ్జనుడా! నీవు లేక నే నయోధ్యకు పోజాలను. నీతో వనవాసము చేయుటకు నిన్ననుసరించుటకు నన్ననుమతింప దగుదువు.

యది మే యాచమానస్య త్యాగమేవ కరిష్యసి
సరథోఽగ్నిం ప్రవేక్ష్యామి త్యక్తమాత్ర ఇహ త్వయా 49

నే నింతగా ప్రార్థించుచున్నను నీవు నన్ను విడతువేని, నీ పట్టు విడచిన క్షణముననే నే నీ రథముతో నగ్నిలో ప్రవేశింతును.

భవిష్యంతి వనే యాని తపోవిఘ్నకరాణి తే
రథేన ప్రతిబాధిష్యే తాని సత్త్వాని రాఘవ! 50

రామా! అరణ్యమున నిన్ననుసరించుచు నీ తపస్సున కేవేని వన్యమృగములు విఘ్న మాచరించు నెడల వానిని నేనీ రథసాధనముతో (రథమెక్కి, రథికుడనై) పారద్రోలెదను.

త్వత్కృతే న మయాఽవాప్తం రథచర్యాకృతం సుఖం
ఆశంసే త్వత్కృతే నాహం వనవాసకృతం సుఖం 51

నీవు యౌవరాజ్యాభిషిక్తుడవై రథ మెక్కగా నీకై సారథ్యము

నడపుట వలన సుఖము పొందగలనని తలంచితిని. కాని యా మనోరథము తీరినది కాదు. కనీసము నీతో కూడి వనవాసము చేయుటవల్ల కలుగు సుఖము నభిలషించుచున్నాను. (లేదా త్వత్కృతేన యనునది ఒకే పదముగ స్వీకరించుచో- నీ యను గ్రహముచే నిన్నిట కీ రథముపై దీసికొని వచ్చుట యను సుఖము ననుభవించితిని. అట్లే నీ యంగికారముతో నీతో కూడి వనవాస సుఖ మనుభవింప గోరుచున్నాను అని భావము )

ప్రసీ దేచ్ఛామి తేఽరణ్యే భవితుం ప్రత్యనంతరః
ప్రీత్యాఽభిహిత మిచ్ఛామి భవ మే ప్రత్యనంతరః. 52

రామా! నీవు నాయెడ ప్రసన్నుడవు కమ్ము. అరణ్యమున నీకు సన్నిహితుడనై యుండ గోరుచున్నాను. "సుమంత్రా! నీవు నాచెంత నుండు"మని ప్రీతితో నీవు పలుకగా విన గోరుచున్నాను.

ఇమే చాపి హయా వీర! యది తే వనవాసినః
పరిచర్యాం కరిష్యంతి ప్రాప్స్యంతి పరమాం గతిమ్ 53

వీరుడవగు రామా! ఈ గుఱ్ఱములును వనవాసి వగు నీకు పరిచర్య చేయుచో (స్వామి శుశ్రూష చేయుటవలన) నుత్తమ లోకము నందగలవు.

తవ శుశ్రూషణం మూర్ధ్నా కరిష్యామి వనే వసన్
అయోధ్యాం దేవలోకం వా సర్వథా ప్రజహా మ్యహమ్ 54

నీతో నడవిలో నివసించుచు నీ యాజ్ఞ శిరసావహించి నిన్ను సేవింతును. అయోధ్యను కాని దేవలోకమునే కాని యన్ని విధములుగ త్రోసివచ్చెదను.

న హి శక్యా ప్రవేష్టుం సా మయాఽయోధ్యా త్వయా వినా
రాజధానీ మహేంద్రస్య యథా దుష్కృతకర్మణా. 55

పాపికి (దేవేంద్రుని రాజధాని) స్వర్గము ప్రవేశింపరానట్లు నీవు లేక నాకయోధ్య ప్రవేశింపరానిది

వనవాసే క్షయం ప్రాప్తే మమైష హి మనోరథః
యదనేన రథే నైవ త్వాం వహేయం పురీం పునః. 56

రామా! నీ వనవాసకాలము గడువగనే నిన్ని రథముననే కూర్చుండబెట్టి నగరమునకు తీసికొనిపోవలయునని నాయభిలాష.

చతుర్దశ హి వర్షాణి సహితస్య త్వయా వనే
క్షణభూతాని యాస్యంతి శతసంఖ్యాన్యతోఽన్యథా. 57

అరణ్యమున నీతో కలసియున్న నాకు పదునాలుగేండ్లు నొక్క క్షణమువలె గడచును. నీ సాంగత్యము లేనిచో నవి నూఱు సంవత్సరములవలె దీర్ఘముగ గన్పట్టును.

భృత్యవత్సల! తిష్ఠంతం భర్తృపుత్రగతే పథి
భక్తం భృత్యం స్థితం స్థిత్యాం త్వం న మాం హాతుమర్హసి.

సేవకులపై వాత్సల్యము కల రామా! నేను నీ భక్తుడను. భృత్యుడను. మర్యాద తప్పనివాడను. నా స్వామి పుత్రుడవగు నీ వడవి కేగుచుండగా నిన్ననుసరింప నిశ్చయించుకొనినవాడను. ఇట్టి నన్ను నీవు విడువదగదు.

ఏవం బహువిధం దీనం యాచమానం పునః పునః
రామో భృత్యానుకంపీ తు సుమంత్ర మిద మబ్రవీత్. 59

ఇట్లు దీనుడై యనేక విధములుగా మాటిమాటికి యాచించు చున్న సుమంత్రునకు సేవకులపై దయగల రాము డిట్లనెను.

జానామి పరమాం భక్తిం మయి తే భర్తృవత్సల ।
శృణు చాపి యదర్థం త్వాం ప్రేషయామి పురీ మితః. 60

స్వామిభక్తి పరాయణుడవగు ఓ సుమంత్రా ! నీకు నాయందుకల భక్తిని నే నెఱుగుదును. అట్లెఱిగియు నిన్నిటనుండి పట్టణమున కేల పంపుచుంటినో తెలిపెదను. వినుము.

నగరీం త్వాం గతం దృష్ట్వా జననీ మే యవీయసీ
కైకేయీ ప్రత్యయం గచ్ఛే దితి రామో వనం గతః. 61
పరితుష్టా హి సా దేవీ వనవాసం గతే మయి
రాజానం నాతిశంకేత 'మిథ్యావాదీ' తి ధార్మికమ్ 62
ఏష మే ప్రథమః కల్పో యదమ్బా మే యవీయసీ
భరతారక్షితం స్ఫీతం పుత్రరాజ్య మవాప్నుయాత్. 63

నీవు నగరమున కేగుట చూచి నా పినతల్లి కైకేయి, రాము డడవి కేగెనని విశ్వాసము నందును. నేను వనవాసమునకు పోగా నామె సంతోషించి, ధార్మికుడగు రాజును అసత్యవాదియని మిగుల సందేహించకుండును. నా పినతల్లి కైకేయి తన తనయుడు రక్షించునట్లు విస్తారమగు రాజ్యము నందుట నాకు ప్రధానమైన ప్రయోజనము.

మమ ప్రియార్థం రాజ్ఞశ్చ సరథ స్త్వం పురీం వ్రజ
సందిష్ట శ్చాసి యా నర్థాం స్తాంస్తా న్బ్రూయా స్తథా తథా

నాకును, రాజునకును ప్రీతి కలుగుటకై నీవు రథముతో నగరమున కేగుము. నీ వేయే విషయము లెవరికి తెలుపవలసి యుంటివో వానిని వారి కావిధముగ తెలుపగలవు.

ఇత్యుక్త్వా వచనం సూతం సాంత్వయిత్వా పునః పునః
గుహం వచన మక్లీబో రామో హేతుమ దబ్రవీత్. 65

ధీరుడగు రాముడు సుమంత్రునితో నిట్లు పలికి, మాటి మాటి కాతని నోదార్చి, యుక్తియుక్తముగ గుహున కిట్లనెను.

నేదానీం గుహ! యోగ్యోఽయం వాసో మే సజనే వనే
అవశ్యం హ్యాశ్రమే వాసః కర్తవ్య స్తద్గతో విధిః. 66

ఓ గుహుడా! నే నింక జనసంచారముకల యడవిలో నివసింపదగదు. తప్పక నే నాశ్రమముననే నివసింపవలయును. నా తండ్రి నా కాశ్రమవాసమునే విధించినాడు.

సోఽహం గృహీత్వా నియమం తపస్విజనభూషణమ్
హితకామః పితు ర్భూయ స్సీతాయా లక్ష్మణస్య చ 67
జటాః కృత్వా గమిష్యామి న్యగ్రోధక్షీర మానయ.

అట్టి (పట్టాభిషేకమును విడచి జడలు, కృష్ణాజినము ధరించి పదునాలుగేండ్లు దండకారణ్యమున నివసించుమని కైకచే నియుక్తుడనైన) నేను తపస్వులకు గొప్పదనము కలిగించు 'నేలపై పరుండుట' మున్నగు నియమము నంగీకరించి, నాతండ్రి యొక్కయు, సీత యొక్కయు, లక్ష్మణుని యొక్కయు మిక్కిలి హితమును కోరుచు (అధికముగ పరలోక సాధనమగు పుణ్య

మును కోరుచు) జడలు దాల్చి వెడలెదను. అందులకై నాకు మఱ్ఱిపాలు తెమ్ము.

తత్క్షీరం రాజపుత్రాయ గుహః క్షిప్ర ముపాహరత్. 68
లక్ష్మణ స్యాత్మన శ్చైవ రామ స్తేనాకరో జ్జటాః
దీర్ఘబాహు ర్నరవ్యాఘ్రో జటిలత్వ మధారయత్. 69

గుహుడును శీఘ్రమే ఆ రాజకుమారునకు మఱ్ఱి పాలు తెచ్చి యిచ్చెను. రాముఁడా పాలతో లక్ష్మణునిచే (ఆతడట్లు అన్న వలెనే జడలు ధరింప సంకల్పించుటచే) జడలు ధరింపజేసి తానును జడలు ధరించెను. పొడవైన భుజములుగల యా పురుషశ్రేష్ఠు డట్లు జడలు తాల్చెను.

తౌ తదా చీరవసనౌ జటామండలధారిణౌ
అశోభేతా మృషిసమౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 70

సోదరులగు ఆ రామలక్ష్మణు లపుడు (అట్టి యవస్థలో కూడ) నారవస్త్రములు, జడలు దాల్చి మునులవోలె ప్రకాశించిరి.

తతో వైఖానసం మార్గ మాస్థిత స్సహ లక్ష్మణః
వ్రత మాదిష్టవా న్రామ స్సఖాయం గుహ మబ్రవీత్. 71

అపుడు లక్ష్మణసహితుడగు రాముడు, విఖనస్సు అనబడు మహర్షిచే ప్రోక్తమగు వానప్రస్థధర్మము నాశ్రయించినవాడై, బ్రహ్మచర్యాదినియమము నంగీకరించి (గంగను దాటుటలో) సహాయుడగు గుహున కిట్లనెను. 'సహాయం' కు బదులు 'సఖాయం' అని పాఠాంతరము. అపుడు 'మిత్రుడగు' అని అర్థము.

విశే. విఖనోముని బ్రహ్మగోటినుండి పుట్టినవాడు. అయ నచే ప్రోక్తమగు వైఖానసమార్గ మనగా వానప్రస్థధర్మము. ఇది బ్రహ్మచర్య, గార్హస్థ్య-వానప్రస్థ-సన్న్యాసము లను నాలుగాశ్రమ ములలో మూడవదాని ధర్మము. కాన క్రమప్రాప్తముగ రాము డీ ధర్మము నంగీకరించినచో మఱల నాతడు గృహస్థాశ్రమమును స్వీకరించుట పూర్వాశ్రమమునకు దిగివచ్చుట యగుటచే నింద్యము. కాని రాము డీ వ్రతమును కేవలము తండ్రియాజ్ఞ పాలించుటకై సంకల్పించుటచే, ధర్మరాజాదు లాపద్ధర్మముగ సన్న్యాసధర్మము స్వీకరించి యాపద గడువగనే గృహస్థ ధర్మ మవలంబించినట్టులే యిదియు ధర్మవిరుద్ధము కాదు.

అప్రమత్తో బలే కోశే దుర్గే జనపదే తథా
భవేథా గుహ! రాజ్యం హి దురారక్ష్యతమం మతమ్.

గుహుడా! రాజ్యమును రక్షించుకొనుట చాల కష్ట మందురు. కాన నీవు చతురంగబలము, ధనాగారము, దుర్గము, దేశము వీని విషయమున కడు జాగరూకుడవు కమ్ము.

విశే. దుర్గము లాఱు. 1] ధన్వదుర్గము- నలుప్రక్కల ఇఱయిదామడల మేఱ మరుభూమిగల కోట, 2] మహీదుర్గము - మట్టిదిబ్బలు చుట్టునగల కోట. 3] వార్క్షదుర్గము- చుట్టును వృక్షములతో నిండిన కోట. 4] జలదుర్గము- చుట్టును నీరు గల కోట. 5] నరదుర్గము- చుట్టును చతురంగబలములుగల కోట, 6] గిరిదుర్గము- చుట్టును కొండలుగల కోట.

తతస్తం సమనుజ్ఞాయ గుహ మిక్ష్వాకునందనః
జగామ తూర్ణ మవ్యగ్ర స్సభార్యః సహ లక్ష్మణః. 13

అంతట ఇక్ష్వాకు వంశమున పుట్టినవారి నానందింపజేయు నట్టి రాము డా గుహుని వీడ్కొని, భార్యతో లక్ష్మణునితో గూడి కలతలేనివాడై శీఘ్రమే యట నుండి వెడలెను.

స తు దృష్ట్వా నదీతీరే నావ మిక్ష్వాకునందనః
తితీర్షు శ్శీఘ్రగాం గంగా మిదం లక్ష్మణ మబ్రవీత్. 74

ఇక్ష్వాకువంశ్యులకు సమృద్ధిని కూర్చు రాముడు గంగా తీరమున పడవను చూచి, వేగముగ పారు గంగను దాటగోరి లక్ష్మణున కిట్లనెను.

ఆరోహ త్వం నరవ్యాఘ్ర స్థితాం నావ మిమాంశనైః
సీతాం చారోపయాన్వక్షం పరిగృహ్య మనస్వినీమ్. 75

పురుషశ్రేష్ఠుడా! నిలచియున్న ఈ నావను పట్టుకొని పిఱికిది యగు సీతను మెల్లగా నెక్కించి, వెంటనే నీవు నెక్కుము.

స భ్రాతు శ్శాసనం శ్రుత్వా సర్వ మప్రతికూలయన్
ఆరోప్య మైథిలీం పూర్వ మారురోహాత్మవాం స్తతః. 76

బుద్ధిమంతుడు కావున రాముని యాశయము నెఱిగిన లక్ష్మణుడు అన్నయాజ్ఞ విని, దానికి [రామాభిప్రాయమునకు] విరోధము కలుగనట్లు నావపై ముందు సీత నెక్కించి, పిమ్మట తానెక్కెను. (సీత మనస్విని [పిఱికిది] లక్ష్మణు డాత్మవంతుడు [జితేంద్రియుడని]యు చెప్పవచ్చును.] నగుటచే సీత నాతడు తాకి [ఇది యన్నయాజ్ఞచే గాని కామముతో కాదు] పడవ నెక్కించుటలో దోషము శంకింప వీలు గలుగదు.)

అథారురోహ తేజస్వీ స్వయం లక్ష్మణపూర్వజః
తతో నిషాదాధిపతి ర్గుహో జ్ఞాతీ నచోదయత్. 77

తేజశ్శాలి, లక్ష్మణుని యన్నయగు రాము డంతట తానును పడవ నెక్కెను. పిమ్మట నిషాదరాజగు గుహుడు నావ నావలి గట్టునకు చేర్చుడని తనవారి కాజ్ఞ యిచ్చెను.

రాఘవోఽపి మహాతేజా నావ మారుహ్య తాం తతః
బ్రహ్మవత్ క్షత్రవ చ్చైవ జజాప హిత మాత్మనః. 78

మహాతేజశ్శాలి యగు రాము డటులా నావ నెక్కి, నీటిపై ప్రయాణము చేయవలసి వచ్చినపుడు బ్రాహ్మణుడు, క్షత్రియుడు కూడ జపించదగిన "దైవీం నావమ్" .... ఇత్యాది మంత్రమును తన హితము గోరి జపించెను.

అచమ్య చ యథాశాస్త్రం నదీం తాం సహ సీతయా
ప్రాణమత్ ప్రీతిసంహృష్టో లక్ష్మణ శ్చామితప్రభః. 79

పిమ్మట రాముడు సీతతో గూడ నాచమన మొనర్చి, ప్రీతి పులకితుడై శాస్త్రోక్తముగ నా నదికి ప్రణమిల్లెను. అమిత కాంతితో నొప్పు లక్ష్మణుడు నట్లే యాచమించి, గంగకు నమస్కరించెను.

అనుజ్ఞాయ సుమంత్రం చ సబలం చైవ తం [illegible]
అస్థాయ నావం రామస్తు చోదయామాస [illegible]

రాముడు సుమంత్రుని, సైన్యసమేతు[illegible] వీడ్కొలిపి పడవ నడుప నావికుల కానతిచ్చెను[illegible]

తత స్తై శ్చోదితా సా నౌః కర్ణధారసమాహితా
శుభస్ఫ్యవేగాభిహతా శీఘ్రం సలిల మత్యగాత్. 81

జాగరూకులగు చుక్కాని పట్టువారు కలది, మేలైన తెడ్లవే వేగముగ త్రోయబడినదగు ఆ పడవ, యట్లా నావికులు నడుపగా శీఘ్రమే జలములు దాటి యావలి యొడ్డువైపు సాగెను.

మధ్యం తు సమనుప్రాప్య భాగీరథ్యా స్త్వనిందితా
వైదేహీ ప్రాంజలి ర్భూత్వా తాం నదీ మిద మబ్రవీత్.

అనిందితయగు ఆ సీత గంగానది నడిమి ప్రదేశము చేరి, యానది కంజలి ఘటించి యిట్లనెను.

పుత్త్రో దశరథ స్యాయం మహారాజస్య ధీమతః
నిదేశం పారయిత్వేమం గంగే! త్వదభిరక్షితః 83
చతుర్దశ హి వర్షాణి సమగ్రా ణ్యుష్య కాననే
భ్రాత్రా సహ మయా చైవ పునః ప్రత్యాగమిష్యతి 84
తత స్త్వాం దేవి! సుభగే! క్షేమేణ పున రాగతా
యక్ష్యే ప్రముదితా గంగే! సర్వకామసమృద్ధినీ. 85

ఓ ఉత్తమ కీర్తిశాలినివగు గంగా! ఈతడు ధీమంతుడగు దశరథమహారాజు తనయుడు. నీచే రక్షింపబడినవాడై పదు నాలుగేం డ్లరణ్యవాసము చేసి, తండ్రి యాజ్ఞ పాలించి, సోదరుడగు లక్ష్మణునితోడను, నాతోడను గూడి మరలి రాగలడు. నే నపు డీడేరిన యన్ని కోరికలు కలదాననై క్షేమముగ తిరిగివచ్చి మిగుల నానందముతో నీకు పూజ లొనరింతును. "సర్వకామ ప్రసాధిని" యను పాఠాంతరము ననుసరించి సమస్తమైన కోర్కెలీడేర్చుదానా యని గంగకు విశేషణము.

త్వం హి త్రిపథగా దేవి! బ్రహ్మలోకం సమీక్షసే
భార్యా చోదధిరాజస్య లోకేఽస్మిన్ సంప్రదృశ్యసే. 86

నీవు మూడులోకములలో సంచరించుదానవు. ద్రవీభూతమగు ధర్మముగా బ్రహ్మకమండలమున నిలచి బ్రహ్మలోకమును చూచుచున్నావు. ఈ లోకమున గూడ నీవు సముద్రునిభార్యవుగా కన్పట్టుచున్నావు.

సా త్వాం దేవి! నమస్యామి ప్రశంసామి చ శోభనే!
ప్రాప్తరాజ్యే నరవ్యాఘ్రే శివేన పునరాగతే 87

గవాం శతసహస్రాణి వస్త్రాణ్యన్నం చ పేశలమ్
బ్రాహ్మణేభ్యః ప్రయచ్ఛామి తవ ప్రియచికీర్షయా. 88

శుభముల నిచ్చు ఓ దేవీ! నేను నీకు ప్రణమిల్లుదును. నుతింతును. పురుషశ్రేష్ఠుడగు నా పతి క్షేమముగ మఱలివచ్చి రాజ్యమును పొందగా నీ ప్రియముగోరి లక్షయావులను, వస్త్రములను, రమ్యమగు అన్నమును, బ్రాహ్మణుల కొసంగెదను.

సురాఘటసహస్రేణ మాంసభూతౌదనేన చ
యక్ష్యే త్వాం ప్రయతా దేవి! పురీం పున రుపాగతా. 89

ఓ దేవీ! నేను నగరమునకు మఱలివచ్చి నియమవతినై వేయి కడవల మద్యము, మాంసరూపమగు అన్నము నీ కుపాయనముగ సమర్పించి పూజింతును.

యాని త్వత్తీరవాసీని దైవతాని వసంతి చ
తాని సర్వాణి యక్ష్యామి తీర్థాన్యాయతనాని చ. 90

నీ యొడ్డున గల దేవత లెల్లరను పూజింతును. నీ తీర మందలి మణికర్ణికాది పుణ్యతీర్థములను, కాశి మున్నగు పవిత్ర క్షేత్రములను పూజింతును.

పునరేవ మహాబాహు ర్మయా భ్రాత్రా చ సంగతః
అయోధ్యాం వనవాసాత్తు ప్రవిశ త్వనఘోఽనఘే ! 91

ఓ పాపములేనిదానా ! పాపరహితుడు, మహాభుజు డగు రాముడు వనవాసము గడచి నాతోడను, సోదరునితోడను గూడి మరల నయోధ్యను ప్రవేశించుగాక.

తథా సంభాషమాణా సా సీతా గంగా మనిన్దితా
దక్షిణా దక్షిణం తీరం క్షిప్రమే వాభ్యుపాగమత్. 92

నిందింపబడనిది, కార్యనిర్వహణకౌశలము కలది యగు నా సీత యట్లు గంగనుగూర్చి పలుకుచు శీఘ్రముగనే యానది దక్షిణ తీరమును చేరెను.

తీరం తు సమనుప్రాప్య నావం హిత్వా నరర్షభః
ప్రాతిష్ఠత సహ భ్రాత్రా వైదేహ్యా చ పరంతపః. 93

శత్రువుల నణచు నా నరశ్రేష్ఠు డగు రాముడు గంగ కవ్వలియొడ్డు చేరి, పడవను వీడి సోదరునితో, సీతతో వెడలెను.

అథాబ్రవీ న్మహాబాహుః సుమిత్రానందవర్ధనమ్
భవ సంరక్షణార్థాయ సజనే విజనేఽపి వా 94
అవశ్యం రక్షణం కార్యం మదృష్టే విజనే వనే
అగ్రతో గచ్ఛ సౌమిత్రే సీతా త్వా మనుగచ్ఛతు. 95

పృష్ఠతోఽహం గమిష్యామి త్వాం చ సీతాం చ పాలయన్
అన్యోన్య స్యేహ నో రక్షా కర్తవ్యా పురుషర్షభ. 96

నహి తావ దతిక్రాంతా సుకరా కావన క్రియా
అద్య దుఃఖం తు వైదేహీ వనవాసస్య వేత్స్యతి. 97

ప్రణష్టజనసంబాధం క్షేత్రారామవివర్జితమ్
విషమం చ ప్రపాతం చ వన మద్య ప్రవేక్ష్యతి. 98

అంత నా మహాభుజు డగు రాముడు సుమిత్ర కానంద మును వృద్ధినందించు లక్ష్మణునితో — లక్ష్మణా! నీ విటుపై జనులు సంచరించు తావులలో నిర్జనప్రదేశములలో గూడ సావధానుడవై యుండుము. మున్నెన్నడు చూచి యెఱుగని నిర్మానుష్యమగు నీ యడవిలో తప్పక మన మాత్మరక్షణ చేసికొనవలయును. నీవు ముందు నడువుము. సీత నీవెనుకనే పోవలెను. నేను నిన్ను, సీతను గూడ కాపాడుచు మీ వెనుకనే పోయెదను. పురుషశ్రేష్ఠుడా! మన మిచట పరస్పరము కాపాడుకొనవలెను. సమయము తప్పినచో నే పనియైనను సుఖముగ చేయ వీలుకాదు. సీత కిపుడు వనవాసదుఃఖము తెలియగలదు. జనసమ్మర్దము లేనిది, పొలములు, తోటలు కానరానిది, ఎగుడుదిగుడుగా పల్లపు నేలలు కల యడవిలో నిపు డీమె ప్రవేశింపబోవుచున్నది.

శ్రుత్వా రామస్య వచనం ప్రతస్థే లక్ష్మణోఽగ్రతః
అనంతరం చ సీతాయా రాఘవో రఘునందనః. 99

రాముని వచన మాలించి ముందు లక్ష్మణుడు ఆ వెనుక సీతయు, ఆమెను వెన్నంటి రఘునందను డగు రాముడు వెడలిరి.

గతం తు గంగాఽపరపార మాశు
　　　　రామం సుమంత్రః ప్రతతం నిరీక్ష్య
అధ్వప్రకర్షా ద్వినివృత్తదృష్టి
　　　　ర్ముమోచ బాష్పం వ్యథిత స్తపస్వీ. 100

సుమంత్రు డట్లు శీఘ్రమే గంగ కావలియొడ్డు చేరిన రాము నట్లే కన్నార్పక చూచి, దూర మెక్కు డగుటచే చూడ జాలక చూపు మఱల్చుకొని బాధతో జాలికొల్పుదశ గలవాడై కన్నీరు గార్చెను.

స లోకపాలప్రతిమప్రభావవాం
　　　　స్తీర్త్వా మహాత్మా వరదో మహానదీమ్,
తత స్సమృద్ధా ఞ్ఛుభసస్యమాలినః
　　　　క్రమేణ వత్సా న్ముదితా నుపాగమత్. 101

లోక [దిక్] పాలురతో సాటియగు ప్రభావము కలవాడు, మహాత్ముడు, కోరిన వరము లిచ్చువాడు. అగు రాముడా గొప్ప నదిని దాటి, సంపన్నమును, చక్కని పైరుల వరుసలు కలదియు ఆనందించు జనులు కల వత్సదేశము చేరెను,

తౌ తత్ర హత్వా చతురో మహామృగాన్
　　　　వరాహ మృశ్యం పృషతం మహారురుమ్
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ
　　　　వాసాయ కాలే యయతు ర్వనస్పతిమ్. 102

రామలక్ష్మణులచట నాకలిగొన్నవారై పందిని, మనుబోతును, చాఱల దుప్పిని, దుప్పిని యీ నాల్గు మహామృగములను చంపి

వాని మాంసము భోజనార్థమై తీసికొని, శీఘ్రమే సాయంకాలమున కొక వృక్షరాజముకడకు నివాసమునకై చేరిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ద్విపంచాశః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమున అయోధ్యాకాండమం దేబదిరెండవసర్గము సంపూర్ణము.

—0—

## త్రిపంచాశః సర్గః - ఏబదిమూడవ సర్గము

స తం వృక్షం సమాసాద్య సంధ్యా మన్వాస్య పశ్చిమామ్
రామో రమయతాం శ్రేష్ఠ ఇతి హోవాచ లక్ష్మణమ్. 1

జనుల నానందింపజేయువారిలో శ్రేష్ఠుడగు రాము డట్లు చెట్టుమొదలు చేరి, సాయంసంధ్య నుపాసించి, లక్ష్మణున కిట్లనెను.

అద్యేయం ప్రథమా రాత్రి ర్యాతా జనపదా ద్బహిః
యా సుమంత్రేణ రహితా తాం నోత్కంఠితు మర్హసి. 2

జనసంచారముకల ప్రదేశములు దాటిన మనకు సుమంత్రుడు లేని తొలిరాత్రి రానే వచ్చినది. నీవు దీనిని తలంచి దుఃఖింపకుము.

జాగర్తవ్య మతంద్రిభ్యా మద్యప్రభృతి రాత్రిషు
యోగక్షేమౌ హి సీతాయా వర్తేతే లక్ష్మణాఽఽవయోః. 3

లక్ష్మణా! నేటినుండి మన మిరువురము రాత్రులం దేమఱక మేలుకొని యుండవలయును. సీతాసంరక్షణము మన యధీనమం దున్నది.

రాత్రిం కథంచి దేవేమాం సౌమిత్రే! వర్తయామహే
ఉపావర్తామహే భూమా వాస్తీర్య స్వయ మార్జితైః. 4

లక్ష్మణా! గడ్డి, ఆకులు మున్నగునవి తెచ్చి వానిని నేలపై బఱచికొని శయనింతము. శయ్య సమకూర్చుకొనక పూర్వమే వచ్చిన యీ రాత్రి నెట్టులో గడపుదము.

స తు సంవిశ్య మేదిన్యాం మహార్హశయనోచితః
ఇమా స్సౌమిత్రయే రామో వ్యాజహార కథా శ్శుభాః. 5

గొప్ప వెలగలశయనముపైపరుండదగిన రాముడట్లు నేలపై బరుండి లక్ష్మణునితో నీ శుభములగు మాటలను పలికెను.

ధ్రువ మద్య మహారాజో దుఃఖం స్వపితి లక్ష్మణ!
కృతకామా తు కైకేయీ తుష్టా భవితు మర్హతి. 6

లక్ష్మణా! నిశ్చయముగ మహారాజిపుడు దుఃఖముతో నిదురించుచుండును. తన మనోరథ మీడేరిన కైకేయి సంతుష్టురాలై యుండును.

సా హి దేవీ మహారాజం కైకేయీ రాజ్యకారణాత్
అపి న చ్యావయేత్ ప్రాణాన్ దృష్ట్వా భరత మాగతమ్
అనాథశ్చ హి వృద్ధశ్చ మయా చైవ వినాకృతః
కిం కరిష్యతి కామాత్మా కైకేయీవశ మాగతః. 8

భరతుడు తన మేనమామ యింటినుండి వచ్చుటతోడనే యాతనికి రాజ్యము కూర్చు కోరికతో ఆ కైకేయీదేవి మహారాజు ప్రాణములు తీయకుండునా ? దశరథుడు ముదుసలి. నేనాయనను వీడి వచ్చితిని. కామాత్ముడగు నాతడు కైకకు వశుడాయెను. ఆతడింకేమి చేయగలడు ?

ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞశ్చ మతివిభ్రమమ్
కామ ఏవార్థధర్మాభ్యాం గరీయా నితి మే మతిః. 9

మనకు కలిగిన కష్టము, రాజునకు కలిగిన బుద్ధియొక్క తిరుగుబాటును చూడగా ధర్మార్థములకంటె కామమే గొప్పదని నాకు తోచుచున్నది.

కో హ్యవిద్వా నపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్
ఛందానువర్తినం పుత్త్రం తాతో మా మివ లక్ష్మణ ! 10

లక్ష్మణా ! ఎంతటి తెలివిలేనివాడైనను, ఎవడు తన యాలికి ప్రీతిని చేకూర్చుటకై తన యిచ్ఛ ననుసరించి మసలు కొను తనయుని, మన తండ్రి నన్నువోలె విడచిపెట్టునా ?

సుఖీ బత ! సభార్యశ్చ భరతః కైకయీసుతః
ముదితాన్ కోసలా నేకో యో భోక్ష్య త్యధిరాజవత్. 11

అయ్యో ! కైకేయి కుమారుడగు భరతుడు పత్నీసహితుడై సుఖముల దేలుచు తానొక్కడే ముదమందిన జనులు కల కోసల రాజ్యము నెల్ల మహారాజువలె పరిపాలించునే.

సహి సర్వస్య రాజ్యస్య ముఖ మేకం భవిష్యతి
తాతే చ వయసాతీతే మయి చారణ్య మాస్థితే. 12

తండ్రి వృద్ధుడై, జ్యేష్ఠుడ నగు నే నడవికి పోగా, భరతుడే రాజ్యమున కెల్ల ప్రధానుడు కాగలడు.

అర్థధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే
ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా. 18

ఎవ డర్థధర్మములను వీడి కామము ననుసరించునో వాడిపుడు దశరథమహారాజువలె నాపదనందును.

మన్యే దశరథాంతాయ మమ ప్రవ్రాజనాయ చ
కైకేయీ సౌమ్య సంప్రాప్తా రాజ్యాయ భరతస్య చ. 14

ఓ సౌమ్యుడా! దశరథుని చేటునకు, నే నడవుల పాలగుటకు, రాజ్యము భరతునకు దక్కుటకునే కైక యిట దాపురించినదని తలంతును.

అపీదానీం న కైకేయీ సౌభాగ్యమదమోహితా
కౌసల్యాం చ సుమిత్రాం చ సంప్రబాధేత మత్కృతే. 15

కైకేయి తనకు కలిగిన సౌభాగ్యమునకు గర్వించి, మైమఱచి, నాకు సన్నిహితలైన కారణముచే కౌసల్యను, సుమిత్రను పీడింపకుండునా? [తప్పక పీడించునని భావము.]

మా స్మ మత్కారణా ద్దేవీ సుమిత్రా దుఃఖ మావహేత్
అయోధ్యా మిత ఏవ త్వం కాల్యే ప్రవిశ లక్ష్మణ. 16

లక్ష్మణా! నా కారణముగ సుమిత్రా దేవి దుఃఖ మనుభవింపరాదు. వేకువనే లేచి నీ విటనుండియే అయోధ్యకు పొమ్ము.

అహ మేకో గమిష్యామి సీతయా సహ దండకాన్
అనాథాయా హి నాథస్త్వం కౌసల్యాయా భవిష్యసి. 17

నే నొక్కడనే సీతాసమేతుడనై దండకారణ్యము ప్రవేశింతును. నేను లేక దిక్కులేనిదైన నా తల్లి కౌసల్యకు రక్షకుడవు కాగలవు.

క్షుద్రకర్మా హి కైకేయీ ద్వేష్య మన్యాయ్య మాచరేత్
పరిదద్యా హి ధర్మజ్ఞే భరతే మమ మాతరమ్. 18

కైకేయి నీచపుపనులు చేయునట్టిది. తన ద్వేషమునకు తగిన ట్లామె యన్యాయ్య మాచరింపక మానదు. కాన నాతల్లి కౌసల్యను ధర్మమెఱిగిన భరతున కప్పగింపుము

నూనం జాత్యంతరే కస్మిన్ స్త్రియః పుత్రై ర్వియోజితాః
జనన్యా మమ సౌమిత్రే తస్మా దేత దుపస్థితమ్. 19

లక్ష్మణా! పూర్వ జన్మమునం దెన్నడో నా తల్లి స్త్రీలను వారి తనయులనుండి వేరుచేసి యుండును. అందువలననే అమెకీ క్లేశము కలిగినది.

మయా హి చిరపుష్టేన దుఃఖసంవర్ధితేన చ
విప్రాయుజ్యత కౌసల్యా ఫలకాలే ధిగస్తు మామ్. 20

నాతల్లి నన్ను పెంచి పెద్దచేసినది. చిరకాలము క్లేశములు సహించి నన్ను పోషించినది. అమెకు నేను సేవచేయుట యను ఫలకాలమున నామెకు దూరమైతిని. ఛీ నాదెట్టి బ్రతుకు!

మా స్మ సీమంతినీ కాచి జ్జనయేత్ పుత్ర మీదృశమ్
సౌమిత్రే యోఽహ మంబాయా దద్మి శోక మనంతకమ్.

లక్ష్మణా! నేను నా తల్లికి ట్లంతులేని దుఃఖము కలిగించుచుంటినే ఏ వనితయు నావంటి పుత్రుని కనకుండుగాక!

మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణ శారికా
యస్యా స్త చ్ఛ్రూయతే వాక్యం శుకపాద మరే ర్దశ.22

లక్ష్మణా! నాకంటెను గోరువంక నాతల్లికి ప్రీతి గూర్చు నని తలంతును. ఆ గోరువంక ఎల్లపుడు వెంతనున్న చిలుకతో- 'ఓ చిలుకా! మన శత్రువగు పిల్లి కాలు కొఱుకుము' [లేదా కౌసల్యయొక్క శత్రువుల కాలు కొఱుకుము] అని పలుకుచు నాతల్లికి ఆనందము కలిగించుచున్నది. [తన్ను పోషించువారికి ప్రీతి గూర్చుటలో నొక పక్షియైన గోరువంకపాటి మనుజుడనైన చేయలేకపోతిని. నాకంటె యీ గోరువంకయే నాతల్లియం దెచ్చైన ప్రేమ కలదని తలంతును].

శోచంత్యా శ్చాల్పభాగ్యాయా న కించి దుపకుర్వతా
పుత్రేణ కి మపుత్రాయా మయా కార్య మరిందమ! 23

ఓ శత్రువుల నణచువాడా! నేనడవి కేగుటచే దుఃఖించుచు, తక్కువభాగ్యముకల నా తల్లికి కొంచెమైన నుపకరింపని కుమారుడనైన నావల్ల నేమి ప్రయోజనము?

అల్పభాగ్యా హి మే మాతా కౌసల్యా రహితా మయా
శేతే పరమదుఃఖార్తా పతితా శోకసాగరే. 24

అల్పభాగ్యముకల నాతల్లి కౌసల్య న న్నెడబాసి మిగుల దుఃఖపీడితయై శోకసముద్రమున బడి పరుండియున్నది.

ఏకో హ్యహ మయోధ్యాం చ పృథివీం చాపి లక్ష్మణ
తరేయ మిషుభిః క్రుద్ధో నను వీర్య మకారణమ్. 25

లక్ష్మణా! నే నొక్కడనే అయోధ్యను, భూమండలమును గూడ బాణములతో నాక్రమింప జాలుదును. కాని ధర్మమునకు హాని కలుగుపనిలో పరాక్రమమును సాధనముగ స్వీకరింపరాదు కదా!

అధర్మభయభీతశ్చ పరలోకస్య చానఘ!
తేన లక్ష్మణ! నాద్యాహ మాత్మాన మభిషేచయే. 26

అనఘుడవగు లక్ష్మణా! అధర్మమువలన కలుగు లోకాపవాదమునకును, పరలోకము లభింపదనియు భయపడినాను. ఆకారణముననే నన్ను నేనిపుడు రాజ్యాభిషిక్తుని చేసికొనలేను.

ఏత దన్యచ్చ కరుణం విలప్య విజనే బహు
అశ్రుపూర్ణముఖో రామో నిశి తూష్ణీ ముపావిశత్. 27

ఈవిధమైనట్టియు, మాటలతో చెప్పరానట్టివిధముగ దయ గొలుపుచు నిర్జనమగు నరణ్యమున నేడ్చి యారాత్రి రాముడు కన్నీటితో నిండిన ముఖముకలవాడై యుండెను.

విలప్యోపరతం రామం గతార్చిష మివానలమ్
సముద్ర మివ నిర్వేగ మాశ్వాసయత లక్ష్మణః. 28

అటు లేడ్చి మంటలు తొలగిన యగ్నివలె, వేగ ముడిగిన సముద్రమువలె యూరకున్న రాముని లక్ష్మణు డిటు లోదార్చెను.

ధ్రువ మద్య పురీ రాజ! న్నయోధ్యాఽఽయుధినాం వర!
నిష్ప్రభా త్వయి నిష్క్రాంతే గతచంద్రేవ శర్వరీ. 29

ఆయుధధారులలో శ్రేష్ఠుడవు, రాజవు నగు నీవు వెడలగా నిపు డయోధ్యానగరము చంద్రుడులేని రాత్రివలె కాంతిహీన మగుట నిక్కము.

నైత దౌపయికం రామ! యదిదం పరితప్యసే
విషాదయసి సీతాం చ మాం చైవ పురుషర్షభ! 30

పురుషశ్రేష్ఠుడ వగు రామా! నీ విటులు వగచుట యుక్త ముగాదు. నీ పరితాపముచే సీతను, నన్నుగూడ దుఃఖితులను చేయుచున్నావు.

న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ
ముహూర్త మపి జీవావో జలా న్మత్స్యా వివోద్ధృతౌ. 31

ఓ రాఘవుడా! సీతయు, నేనును నీవులేక, నీటి నుండి వెలికి తెచ్చిన చేపలవలె నొక్క క్షణమైన బ్రతుకజాలము.

న హి తాతం న శత్రుఘ్నం న సుమిత్రాం పరంతప
ద్రష్టు మిచ్ఛేయ మద్యాహం స్వర్గం వాపి త్వయా వినా.

ఓ శత్రువులను పీడించువాడా! నీవులేక నేనిపుడు తండ్రిని గాని, శత్రుఘ్నునిగాని, నాతల్లి సుమిత్రనుగాని స్వర్గమునే గాని చూడ నిచ్ఛగింపను.

తత స్తత్ర సుఖాసీనౌ నాతిదూరే నిరీక్ష్య తామ్
న్యగ్రోధే సుకృతాం శయ్యాం భేజాతే ధర్మవత్సలౌ. 33

అంత నా ధార్మికులగు సీతారాములా మఱ్ఱిచెట్టు క్రింద

సుఖముగ కూర్చుండి లక్ష్మణునిచే నటనే చక్కగా నేర్పఱుచ బడిన శయ్యపై శయనించిరి.

స లక్ష్మణ స్యోత్తమపుష్కలం వచో
నిశమ్య చైవం వనవాస మాదరాత్
సమా స్సమస్తా విదధే పరంతపః
ప్రపద్య ధర్మం సుచిరాయ రాఘవః. 84

అటులు మిక్కిలి భ్రాతృస్నేహముతో లక్ష్మణుడు పలికిన యుత్తమమగు పూర్ణార్థముకల మాట నాదరముతో నాలకించి, రాముడు చిరకాలమునకై వానప్రస్థధర్మమగు నేలపై పవళించుట వంటి వానిని స్వీకరించి, యన్ని [పదునాల్గు] సంవత్సరములు లక్ష్మణునితో గలసి వనవాసము చేయ నిశ్చయించెను.

తతస్తు తస్మిన్ విజనే వనే తదా
మహాబలౌ రాఘవవంశవర్ధనౌ
న తౌ భయం సంభ్రమ మభ్యుపేయతు
ర్యథైవ సింహౌ గిరిసానుగోచరౌ. 85

అంత నపుడా నిర్జనమగు నరణ్యమందా రఘువంశమును వృద్ధినందించు రామలక్ష్మణులు కొండచరియలలో దిరుగాడు సింహములవలె భయమును తొట్రుపాటును పొందరైరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్రిపంచాశః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమునందయోధ్యాకాండమున నేబదిమూడవసర్గము సంపూర్ణము.

—0—

## చతుఃపంచాశః సర్గః — ఏబదినాల్గవ సర్గము

తే తు తస్మిన్ మహావృక్షే ఉషిత్వా రజనీం శివామ్
విమలేఽభ్యుదితే సూర్యే తస్మా ద్దేశాత్ ప్రతస్థిరే. 1

వా రా మహావృక్షపు మొదట శుభమగు నారాత్రి నివసించి సూర్యుడు స్పష్టముగ నుదయింపగా నాప్రదేశమునుండి వెడలిరి.

యత్ర భాగీరథీం గంగాం యమునాఽభిప్రవర్తతే
జగ్ము స్తం దేశ ముద్దిశ్య విగాహ్య సుమహ ద్వనమ్. 2
తే భూమిభాగాన్ వివిధాన్ దేశాం శ్చాపి మనోరమాన్
అదృష్టపూర్వాన్ పశ్యంత స్తత్ర తత్ర యశస్వినః. 3

చాల కీర్తిమంతులగు ఆ సీతారామలక్ష్మణు లట్లు విస్తృతమగు నరణ్యమున ప్రవేశించి, మున్నెన్నడు చూచి యెఱుగని వివిధములగు భూములను, సుందరప్రదేశముల నట నట చూచుచు గంగాయమునాసంగమప్రదేశము చేరిరి.

యథా క్షేమేణ గచ్ఛన్ స పశ్యంశ్చ వివిధాన్ ద్రుమాన్
నివృత్తమాత్రే దివసే రామ స్సౌమిత్రి మబ్రవీత్. 4

రాము డట్లు క్షేమముగ పోవుచు, వివిధవృక్షములు చూచుచు, ప్రొద్దు తిరుగగనే లక్ష్మణున కిట్లు పలికెను.

ప్రయాగ మభితః పశ్య సౌమిత్రే ధూమ మున్నతమ్
అగ్నే ర్భగవతః కేతుం మన్యే సన్నిహితో మునిః. 5

లక్ష్మణా! ప్రయాగక్షేత్రము చుట్టును భగవంతుడగు అగ్నిహోత్రుని టెక్కెమగు పొగ యగపడుచున్నది. చూడుము. భరద్వాజ మహర్షి సమీపముననే యున్నాడని తలంతును.

నూనం ప్రాప్తా స్స్మ సంభేదంగంగాయమునయోర్వయమ్
తథా హి శ్రూయతే శబ్దో వారిణో వారిఘట్టితః. 6

మన మిపుడు గంగాయమునా సంగమప్రదేశమునకు వచ్చితిమి. జలముల పరస్పర సంఘర్షణముల వలన బుట్టిన శబ్ద మదే వినిపించుచున్నది.

దారూణి పరిభిన్నాని వనజై రుపజీవిభిః
భరద్వాజాశ్రమే చైతే దృశ్యంతే వివిధా ద్రుమాః. 7

అడవిలో పుట్టిన పండ్లు, దుంపలు మున్నగువానితో జీవించువారిచే నఱుకబడిన కొయ్య లిచట నగపడుచున్నవి. అట్లే బహువిధములగు చెట్లును భరద్వాజాశ్రమమున కన్పట్టుచున్నవి.

ధన్వినౌ తౌ సుఖం గత్వా లంబమానే దివాకరే
గంగాయమునయో స్సంధౌ ప్రాపతు ర్నిలయం మునేః. 8

విలుకాండ్రగు నా రామలక్ష్మణు లట్లు సుఖముగ పోయి,

సూర్యుడు వాలు సమయమునకు గంగాయమునా సంగమప్రదే
శమునకు చేరువన భరద్వాజాశ్రమప్రాంతమును చేరిరి.

రామస్త్వాశ్రమ మాసాద్య త్రాసయ న్మృగపక్షిణః
గత్వా ముహూర్త మధ్వానం భరద్వాజ ముపాగమత్. 9

రాముడా యాశ్రమము చేరి తన యపూర్వదర్శనముచే
నచటి మృగములను, పక్షులను బెదరజేయుచు, నొక్కముహూర్త
కాలములో పోవదగినంత దూర మేగి భరద్వాజ మహర్షిని సమీ
పించెను.

తత స్త్వాశ్రమ మాసాద్య మునే ర్దర్శనకాంక్షిణౌ
సీతయాఽనుగతౌ వీరౌ దూరాదేవాఽవతస్థతుః. 10

అటులా రామలక్ష్మణులు సీతాసమేతులై భరద్వాజు నాశ్ర
మము చేరి, భరద్వాజుని చూడగోరుచు దూరముననే నిలబడిరి.

స ప్రవిశ్య మహాత్మాన మృషిం శిష్యగణై ర్వృతమ్
సంశ్రితవ్రత మేకాగ్రం తపసా లబ్ధచక్షుషమ్ 11
హుతాగ్నిహోత్రం దృష్ట్వైవ మహాభాగం కృతాంజలిః
రామ స్సౌమిత్రిణా సార్ధం సీతయా చాభ్యవాదయత్. 12

రాముడట్లా యాశ్రమము ప్రవేశించి యచట మహాత్ము
డును, శిష్యులతో పరివేష్టితుడును, కఠోరవ్రతము నవలంబించిన
వాడును, ధ్యాననిష్ఠుడును, తపస్సుచే జ్ఞాననేత్రము పొందిన
వాడును, అప్పుడే అగ్నికార్య మొనర్చినవాడును, మహాను

భావుడును అగు భరద్వాజుని చూచి, యంజలి ఘటించి, సీతా లక్ష్మణసమేతుడై ప్రణమిల్లెను.

న్యవేదయత చాత్మానం తస్మై లక్ష్మణపూర్వజః
పుత్రౌ దశరథ స్యావాం భగవన్ రామలక్ష్మణౌ. 13
భార్యా మమేయం వైదేహీ కల్యాణీ జనకాత్మజా
మాం చానుయాతా విజనం తపోవన మనిందితా. 14

రాముడా మునికి తమ్మిట్లు తెలియజేసెను. ఓ భగవంతుడవగు మహర్షీ! మేము దశరథుని తనయులము, రామలక్ష్మణు లనువారము. కల్యాణియగు నీమె నా భార్య. జనకుని కూతురు. నిందింపబడని శీలము కలదై. యీనిర్జనమగు వనమునకు నన్ననుసరించి వచ్చినది.

పిత్రా ప్రవ్రాజ్యమానం మాం సౌమిత్రి రనుజః ప్రియః
అయ మన్వగమ ద్భ్రాతా వనమేవ దృఢవ్రతః. 15

నా తండ్రి నన్నడవి కపంగా నాకిష్టుడగు తమ్ముడు, సుమిత్రాతనయుడు, దృఢవ్రతుడగు లక్ష్మణుడు నన్ననుసరించి యడవికే వచ్చినాడు.

పిత్రా నియుక్తా భగవన్ ప్రవేక్ష్యామ స్తపోవనమ్
ధర్మమేవ చరిష్యామ స్తత్ర మూలఫలాశనాః. 16

ఓ పూజ్యుడా! మా తండ్రి యాజ్ఞచే మేము తపోవనమును ప్రవేశింతుము. అచట దుంపలు, పండ్లు అహారముగా గొని, ధర్మమునే యాచరింతుము.

తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్త్రస్య ధీమతః
ఉపానయత ధర్మాత్మా గా మర్ఘ్య ముదకం తతః. 17
నానావిధా నన్నరసాన్ వన్యమూలఫలాశ్రయాన్
తేభ్యో దదౌ తప్తతపా వాసం చైవాభ్యకల్పయత్. 18

ధీమంతుడగు రాముని యా వచన మాలించి, ధర్మాత్ము డగు భరద్వాజుడు. మధుపర్కమున కంగమగు నెద్దును, పూజా ద్రవ్యమును, జలమును తెచ్చెను. అడవిలో లభించు దుంపలు, పండ్లతో చేయబడిన వివిధములగు అన్నరసముల నా తపస్వి వారి కొసంగెను. వారికి నివాసము నేర్పఱచెను.

మృగపక్షిభి రాసీనో మునిభిశ్చ సమంతతః
రామ మాగత మభ్యర్చ్య స్వాగతే నాహ తం మునిః. 19

తన చుట్టును మృగములతో, పక్షులతో పరివేష్టితుడైన యా ముని తన కడ కతిథియై వచ్చిన రాము నర్చించి స్వాగతము పలికెను.

ప్రతిగృహ్య చ తా మర్చా ముపవిష్టం స రాఘవమ్
భరద్వాజోఽబ్రవీ ద్వాక్యం ధర్మయుక్త మిదం తదా. 20

తానిచ్చిన యాతిథ్యమును స్వీకరించి యొకచో నుపవిష్టుడైన రాముని కపుడా భరద్వాజుడు ధర్మయుక్తముగ నీ మాట పలికెను.

చిరస్య ఖలు కాకుత్స్థ పశ్యామి త్వా మిహాగతమ్
శ్రుతం తవ మయా చేదం వివాసన మకారణమ్. 21

ఓ కాకుత్స్థుడవగు రామా! నీ విటకురాగా నిన్ను చిర కాలమునకు చూచుచుంటిని. నిష్కారణముగ నీవడవికి పంప బడితివనియు విని యుంటిని.

అవకాశో వివిక్తోఽయం మహానద్యోః స్సమాగమే
పుణ్యశ్చ రమణీయశ్చ వస త్విహ భవాన్ సుఖమ్. 22

మహానదులు కలియు ఈ తావు జనసంచారము లేనిది. పవిత్రమైనది. సుందరమైనదియును. నీ విచట సుఖముగ నివ సింపుము.

ఏవ ముక్తస్తు వచనం భరద్వాజేన రాఘవః
ప్రత్యువాచ శుభం వాక్యం రామః సర్వహితే రతః. 23

రాఘవున కిట్లు భరద్వాజుడు తెలుపగా, సకల జీవులకు మేలొనరించుటయందాసక్తుడగు రాము డాతని కిట్లు బదులిడెను.

భగవ న్నిత ఆసన్నః పౌరజానపదో జనః
సుదర్శ మిహమాంప్రేక్ష్య మన్యేఽహ మిమ మాశ్రమమ్.

అగమిష్యతి వైదేహీం మాం చాపి ప్రేక్షకో జనః
అనేన కారణే నాహ మిహ వాసం న రోచయే. 25

ఏకాంతే పశ్య భగవ న్నాశ్రమస్థాన ముత్తమమ్
రమేత యత్ర వైదేహీ సుఖార్హా జనకాత్మజా. 26

ఓ పూజ్యుడవగు మహర్షీ! ఇటకు చేరువనే యున్న జనులు నన్నిచట సుఖముగ చూడవచ్చునని తెలిసికొని, సీతను, నన్ను

చూడగోరి యిట కేతెంచెదరని తలంతును. ఈ కారణముచే నే నిట నివసింప దలంపను. ఓ భగవంతుడవగు మహర్షీ ! సుఖము లనుభవింప దగిన యీ జానకి క్రీడింప ననువగునట్టి యేకాంతము, నుత్తమము నగు నాశ్రమము చూడుము." అని కోరెను.

ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం భరద్వాజో మహామునిః
రాఘవస్య తతో వాక్య మర్థగ్రాహక మబ్రవీత్. 27

మహాముని యగు భరద్వాజుడు రాముడు పలికిన శుభ వచనము నాలకించి, యాతని కనేకార్థములు కలుగునటు లీ మాట చెప్పెను.

దశక్రోశ ఇత స్తాత ! గిరి ర్యత్ర నివత్స్యసి
మహర్షి సేవితః పుణ్యః పర్వత స్సుఖదర్శనః. 28

గోలాంగూలానుచరితో వానరర్క్షనిషేవితః
చిత్రకూట ఇతి ఖ్యాతో గంధమాదనసన్నిభః. 29

నాయనా ! ఇటనుండి పది క్రోసుల దూరమున మహర్షులచే సేవితమైనది, పుణ్యవంతమైనది, ఎల్లెడల సుందర ప్రదేశములు కలిగి చూచువారికి సుఖము గూర్చునది, కొండముచ్చులు, కోతులు, ఎలుగులతో గూడినది, గంధమాదన పర్వత్వమునకు సాటియైనదగు చిత్రటకూమని ప్రసిద్ధమగు పర్వతమున్నది. నీవచట నివసింపవచ్చును.

యావతా చిత్రకూటస్య నరః శృంగా ణ్యవేక్షతే
కల్యాణాని సమాధత్తే న పాపే కురుతే మనః. 30

చిత్రకూట పర్వతపు శిఖరము నాలోకించు నరుడు శుభ కృత్యములే యాచరించువా డగును. పాప కార్యములపై నాతని మనస్సు ప్రసరింపదు.

ఋషయ స్తత్ర బహవో విహృత్య శరదాం శతమ్
తపసా దివ మారూఢాః కపాలశిరసా సహ. 31

ఋషు లనేకు లిచట వందలకొలది యేండ్లు సుఖముగా నివసించి, తపఃప్రభావముచే, నిరంతరము కపాలాసనముచే క్షీణించిన చర్మము, శిరోజములు కలవారై కపాలమాత్రము మిగిలి సశరీరముగ స్వర్గమున కేగిరి.

ప్రవివిక్త మహం మన్యే తం వాసం భవత స్సుఖమ్
ఇహ వా వనవాసాయ వస రామ! మయా సహ. 32

రామా! అది మిక్కిలి తక్కువ జనులు తిరుగాడుతావు. కావున నది నీకు సుఖము గూర్చు నని తలంతును. లేదా నీ విచటనైన వనవాసమునకై నివసింపుము.

స రామం సర్వకామై స్తం భరద్వాజః ప్రియాతిథిమ్
సభార్యం సహ చ భ్రాత్రా ప్రతిజగ్రాహ ధర్మవిత్. 33

ధర్మజ్ఞుడగు ఆ భరద్వాజుడు భార్యతో, సోదరునితో కూడిన ప్రియమైన అతిథియగు రామునకు పలయు సత్కారములతో నాదరించి వశీకరించుకొనెను.

తస్య ప్రయాగే రామస్య తం మహర్షి ముపేయుషః
ప్రసన్నా రజనీ పుణ్యా చిత్రాః కథయతః కథాః. 34

ఆ ప్రయాగక్షేత్రమున మహర్షిచెంత గూర్చుండి రాముడు విచిత్రములగు వివిధప్రసంగములు చేయుచుండగా, పుణ్యమగు రాత్రి సమీపించెను.

సీతాతృతీయః కాకుత్స్థః పరిశ్రాంత స్సుఖోచితః
భరద్వాజాశ్రమే రమ్యే తాం రాత్రి మవసత్ సుఖమ్. 35

సుఖము లనుభవింపదగినవాడు, అలసినవాడగు రాముడు సీతాలక్ష్మణసమేతుడై, సుందరమగు భరద్వాజాశ్రమమున నారాత్రి సుఖముగా నివసించెను.

ప్రభాతాయాం రజన్యాం తు భరద్వాజ ముపాగమత్
ఉవాచ నరశార్దూలో మునిం జ్వలితతేజసమ్. 36

రాత్రి తెల్లవారగా నరశ్రేష్ఠుడగు రాముడు తేజస్సుతో ప్రకాశించు భరద్వాజమునికడ కేగి యిట్లనెను.

శర్వరీం భగవ న్నద్య సత్యశీల! తవాశ్రమే
ఉషితాః స్మేహ వసతి మనుజానాతు నో భవాన్. 37

భగవంతుడవు, సత్యశీలుడవగు ఓ మహర్షీ! నీ యాశ్రమమున నీ రాత్రి నివసించినాము నీవు నిర్దేశించిన ప్రదేశమున నివసించుటకు మమ్మనుమతించుము.

రాత్ర్యాం తు తస్యాం వ్యుష్టాయాం భరద్వాజోఽబ్రవీదిదమ్
మధుమూలఫలోపేతం చిత్రకూటం వ్రజేతి హ. 38

ఆ రాత్రి తెల్లవారగా భరద్వాజుడు రామున కిట్లనెను —

రామా! నీవు తేనె, కందమూలములు, పండ్లతో కూడిన చిత్ర కూటమున కేగుము.

వాస మౌపయికం మన్యే తవ రామ! మహాబల!
నానానగగణోపేతః కిన్నరోరగసేవితః 39

మయూరనాదాభిరుతో గజరాజనిషేవితః
గమ్యతాం భవతా శైల శ్చిత్రకూట స్స విశ్రుతః. 40
పుణ్యశ్చ రమణీయశ్చ బహుమూలఫలాయుతః

మహాబలుడ వగు రామా! ఆ చిత్రకూటము వివిధము లగు పర్వత శ్రేణులతో కూడినది. కిన్నరులు, ఉరగు లట కే తెంచుదురు. నెమళ్ళ కేకారవము లట వినిపించుచుండును. శ్రేష్ఠములగు నేనుగు లట దిరుగాడుచుండును. నీ వా ప్రసిద్ధమైన చిత్రకూటమునకు పొమ్ము. అది పవిత్రము, సుందరము. దుంపలు, పండ్లు విస్తారముగ గలది. నీ కది నివసించుటకు యోగ్యమని నేను తలంతును.

తత్ర కుంజరయూథాని మృగయూథాని చాభితః. 41
విచరంతి వనాంతేఽస్మిం స్తాని ద్రక్ష్యసి రాఘవ!

రామా! ఈ యరణ్య ప్రదేశమున నేనుగుల గుంపులు, లేళ్ల గుంపులు, నెల్లెడల తిరుగాడుచుండును. నీవు వానిని చూచెదవు.

సరిత్ప్రస్రవణప్రస్థాన్ దరీకందరనిర్ఝరాన్
చరత స్సీతయా సార్ధం నందిష్యతి మన స్తవ. 42

నదులు, సెలయేళ్లు, కొండచరియలు, పెనురాళ్లు కలి

యుచోట్లు, గుహలు చీలిన పెనురాళ్లు కలయికలు కల ప్రదేశము లలో సీతతో గూడి తిరుగుచున్న నీ మనస్సున కానందము కల్గును.

ప్రహృష్ట కోయష్టిక కోకిల స్వనై
ర్వినాదితం తం వసుధాధరం శివమ్
మృగైశ్చ మత్తై ర్బహుభిశ్చ కుంజరై
స్సురమ్య మాసాద్య సమావసాఽశ్రమమ్. 48

రామా! అచట కొక్కెరలు, కోకిలలు ఆనందముతో కూయుచుండును. మృగములు, అనేక మత్తగజములతో కడు సొంపగు నా చిత్రకూటమును చేరి యట నివసింపుము.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
చతుఃపంచాశః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నేబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## పంచపంచాశః సర్గః - ఏబదియైదవ సర్గము

ఉషిత్వా రజనీం తత్ర రాజపుత్త్రౌ వరిందమౌ
మహర్షి మభివాద్యాథ జగ్మతు స్తం గిరిం ప్రతి. 1

శత్రువుల నణచెడి యా రాజకుమారు లిఋువురు నా రాత్రి యా భరద్వాజు నాశ్రమమున నివసించి, యా మహర్షికి ప్రణమిల్లి యా చిత్రకూటమునకు పోయిరి.

తేషాం చైవ స్వస్త్యయనం మహర్షి స్స చకార హ
ప్రస్థితాం శ్చైవ తాన్ ప్రేక్ష్య పితా పుత్రా నివా న్వగాత్.

భరద్వాజమహర్షి వారికి మంగళాశీస్సు లొసగెను. వారు బయలుదేరగనే చూచి కుమారులను తండ్రి వోలె వారి నను సరించెను.

తతః ప్రచక్రమే వక్తుం వచనం స మహాముని:
భరద్వాజో మహాతేజా రామం సత్యపరాక్రమమ్. 3

అంత మహాతేజస్వి, మహామునియగు భరద్వాజుడు విఫల ముకాని పరాక్రమము గల రామున కిట్లు చెప్ప దొడంగెను.

గంగాయమునయో స్సంధి మాసాద్య మనుజర్షభౌ
కాళిందీ మనుగచ్ఛేతాం నదీం పశ్చాన్ముఖాశ్రితామ్. 4

ఓ నరశ్రేష్ఠులారా! మొదట మీరు గంగాయమునల కూడలి కేగి, యటనుండి గంగా జలవేగముచే పడమటికి ప్రవ హించు కాళిందీ (యమునా) నది ననుసరించి పొండు.

అథాఽసాద్య తు కాళిందీం శీఘ్రస్రోతస మాపగామ్
తస్యా స్తీర్థం ప్రచరితం పురాణం ప్రేక్ష్య రాఘవౌ 5

తత్ర యూయం ప్లవం కృత్వా తరతాంశుమతీం నదీమ్
తతో న్యగ్రోధ మాసాద్య మహాంతం హరితచ్ఛదమ్ 6

వివృద్ధం బహుభి ర్వృక్షైః శ్యామం సిద్ధోపసేవితమ్
తస్మై సీతాఽంజలిం కృత్వా ప్రయుంజీ తాశిష శ్శివాః.

సమాసాద్య తు తం వృక్షం వసేద్వాఽతిక్రమేత వా
క్రోశమాత్రం తతో గత్వా నీలం ద్రక్ష్యథ కాననమ్. 8

పలాశబదరీమిశ్రం రమ్యం వంశైశ్చ యామునైః
స పంథా శ్చిత్రకూటస్య గత స్సుబహుశో మయా. 9

రమ్యో మార్దవయుక్తశ్చ వనదావై ర్వివర్జితః
ఇతి పంథాన మావేద్య మహర్షి స్స న్యవర్తత 10
అభివాద్య తథే త్యుక్త్వా రామేణ వినివర్తితః

ఆ కాళిందీనది యొక్క వేగముగ పోఋ ప్రవాహము కల తావున గమనాగమనములచే నలిగియున్న నది దాటు ప్రదేశమును చూచి, మీరట తెప్ప కట్టుకొని యా యమునను దాటుడు. పిమ్మట పచ్చని యాకులు కలిగి, చుట్టును పలు వృక్షములతో కూడుటచే, మిగుల శ్యామల వర్ణముకలదై, సిద్ధులచే సేవింపబడినట్టి పెద్ద మఱ్ఱిచెట్టు కడకేగుడు. పిమ్మట సీత యా వృక్షరాజమును-'మేము శీఘ్రమె వనవాసమునుండి తిరిగి రావలె' నని ప్రార్థించవలెను. అటుపై నా చెట్టుకడ మీరు విశ్రమింపుడు లేదా ఆ చెట్టుదాటి ముందుకు పొండు. అటనుండి యొక కోసు దూరముపోయి మోదుగ, రేగు చెట్లతో కూడి యున్నదియు, యమున యొడ్డున మొలచిన వెదుళ్ళతో సుందరమును, అగు నల్లని యడవిని చూడుడు. అది చిత్రకూటమునకు పోవుమార్గము. నే ననేక మార్లు పోయితిని. ఆ దారి సుందరము, మెత్తనిది, కార్చిచ్చు లేనిది. అని యా మహర్షి మార్గము తెలిపి వెడలెను. రాము డాయనకు ప్రణమిల్లి యట్లే యని పలికి యా మునిని పోయిరమ్మని మరల్చెను.

ఉపావృత్తే మునౌ తస్మిన్ రామో లక్ష్మణ మబ్రవీత్ 11
కృతపుణ్యాః స్మ సౌమిత్రే! ముని ర్య న్నోఽనుకంపతే.

భరద్వాజముని వెడలగా రాముడు లక్ష్మణున కిట్లనెను-
సౌమిత్రీ! ముని మనపై దయజూపుచుండుటచే మనము
పుణ్యము చేసిన వారమని నాకు తోచుచున్నది.

ఇతి తౌ పురుషవ్యాఘ్రౌ మంత్రయిత్వా మనస్వినౌ 12
సీతా మేవాగ్రతః కృత్వా కాళిందీం జగ్మతు ర్నదీమ్.

ధీరులగు నా నరశ్రేష్ఠు లట్లాలోచించుకొని, సీత ముందు
నడవగా కాళిందీనది కేగిరి.

అథాఽసాద్య తు కాళిందీం శీఘ్రస్రోతోవహాం నదీమ్ 13
చింతా మాపేదిరే సర్వే నదీజలతితీర్షవః.

పిమ్మట వేగముగ పాఱు ప్రవాహముగల కాళిందీనది
కడ కేగి యీ నది నెటులు దాటుటా యని వారు చింత నొందిరి.

తౌ కాష్ఠసంఘాత మథో చక్రతు స్సుమహాప్లవమ్ 14
శుష్కై ర్వంశై స్సమాస్తీర్ణ ముశీరైశ్చ సమావృతమ్.

అపుడా రామలక్ష్మణులు ఎండిన వెదుళ్లను పఱచి,
కట్టెలను తెచ్చి వట్టివేళ్లతో వానిని గట్టిగా కట్టి, పెద్ద తెప్పను
నిర్మించిరి.

తతో వేతసశాఖాశ్చ జంబూశాఖాశ్చ వీర్యవాన్ 15
చకార లక్ష్మణ శ్ఛిత్వా సీతాయా స్సుఖ మాసనమ్.

అంత పరాక్రమశాలి యగు లక్ష్మణుడు ప్రబ్బలితీగెలు, నేరేడుకొమ్మలను కోసి తెచ్చి యా తెప్పపై సీత సుఖముగ కూర్చుండుట కాసన మేర్పఱచెను.

తత్ర శ్రియ మివాచింత్యాం రామో దాశరథిః ప్రియామ్ 16
ఈష త్సంలజ్జమానాం తా మధ్యారోపయత ప్లవమ్.

అపుడు తలంపరాని సౌందర్యముచే లక్ష్మీదేవి వలె నున్నదై, ఒకింత సిగ్గుపడుచున్న తన ప్రియపత్ని సీతను రాముడా తెప్పపై కూర్చుండ జేసెను.

పార్శ్వే చ తత్ర వైదేహ్యా వసనే భూషణాని చ 17
ప్లవే కఠినకాజంచ రామ శ్చక్రే సహాయుధైః.

పిమ్మట రాముడా తెప్పపై సీత వస్త్రములను, అలంకారములను, గుద్దలిని, మేకతోలు కప్పిన పుటికను, ఆయుధములను ఆమె ప్రక్కనే యుంచెను,

అరోప్య సీతాం ప్రథమం సంఘాటం పరిగృహ్య తౌ 18
తతః ప్రతేరతు ర్యత్తౌ వీరౌ దశరథాత్మజౌ.

మొదట నా వీరులగు రామలక్ష్మణులు నావను పట్టుకొని దానిపై సీత నెక్కించి, పిమ్మట ప్రయత్నముతో తామును దాని నెక్కి నదిని దాటిరి.

కాళిందీమధ్య మాయాతా సీతా త్వేనా మవందత 19
స్వస్తి దేవి! తరామి త్వాం పారయే న్మే పతి ర్వ్రతమ్.

యక్ష్యే త్వాం గోసహస్రేణ సురాఘటశతేన చ 20
స్వస్తి ప్రత్యాగతే రామే పురీ మిక్ష్వాకుపాలితామ్.
కాళిందీ మథ సీతా తు యాచమానా కృతాంజలిః 21
తీరమే వాభిసంప్రాప్తా దక్షిణం వరవర్ణినీ.

యమునానది నడిమికి తెప్ప వచ్చుటతోడనే సీత యా నదికి ప్రణమిల్లెను. 'ఓ యమునాదేవీ ! నే నిపుడు నిన్ను దాటుచున్నాను. నా భర్త వనవాస వ్రతము దీర్చుకొని యిక్ష్వాకులచే పాలింపబడిన యయోధ్యానగరమునకు మఱలివచ్చుట తోడనే వేయి యావులు దానమిచ్చి, నూరు కడవల మద్యము నైవేద్య మిచ్చి, నిన్ను పూజింతును. అని ఇట్లు వరవర్ణిని యగు సీత యమునకు దోసిలియొగ్గి ప్రార్థించుచు దక్షిణతీరమును చేరెను.

తతః ప్లవే నాంశుమతీం శీఘ్రగా మూర్మిమాలినీమ్ 22
తీరజై ర్బహుభి ర్వృక్షైః సంతేరు ర్యమునాం నదీమ్.

ఇట్లు వారు శీఘ్రవేగముకలది, తరంగ పంక్తులతో కూడిన యమునా నదిని, నదీతీరమున బుట్టిన చెట్లకొమ్మలతో నిర్మితమైన తెప్ప నుపయోగించి దాటిరి.

తే తీర్ణాః ప్లవ ముత్సృజ్య ప్రస్థాయ యమునావనాత్ 23
శ్యామం న్యగ్రోధ మాసేదు శ్శీతలం హరిత[illegible]

వా రట్లు నది దాటి, తెప్ప విడచి [illegible] యమునా తీర మందలి యడవినుండి వెడలి చల్లనిది, పచ్చ[illegible] నల్లనైనది యగు మఱ్ఱిచెట్టును చేరిరి.

న్యగ్రోధం త ముపాగమ్య వైదేహీ వాక్య మబ్రవీత్. 24

మఱ్ఱిచెట్టును చేరి సీత ఇట్లు పలికెను.

నమస్తేఽస్తు మహావృక్ష! పారయే న్మే పతి ర్వ్రతమ్
కౌసల్యాం చైవ పశ్యేయం సుమిత్రాం చ యశస్వినీమ్ 25
ఇతి సీతాఽంజలిం కృత్వా పర్యగచ్ఛ ద్వనస్పతిమ్.

'ఓ మహావృక్షమా! నీకు నమస్కారము. నా భర్త తన వనవాసవ్రతమును పరిసమాప్తి నందించుగాక. నేను కీర్తిమతి యగు కౌసల్యాదేవిని, సుమిత్రాదేవిని చూతునుగాక!' అని సీత యంజలి ఘటించి యా వృక్షరాజమునకు ప్రదక్షిణ మాచరించెను.

అవలోక్య తత స్సీతా మాయాచంతీ మనిందితామ్ 26
దయితాం చ విధేయాం చ రామో లక్ష్మణ మబ్రవీత్.

అపుడు రాముడు అనిందితయు, తన యాజ్ఞకు లోబడి నడచు కొనునదియు, ప్రీతి పాత్రురాలయినదియు, వృక్షరాజ మును ప్రార్థించుచున్నట్టి సీతను చూచి లక్ష్మణున కిట్లనెను.

సీతా మాదాయ గచ్ఛ త్వ మగ్రతో భరతాగ్రజ 27
పృష్ఠతోఽహం గమిష్యామి సాయుధో ద్విపదాం వర!.

నరశ్రేష్ఠుడవగు లక్ష్మణా! నీవు సీతను తీసికొని ముందు పొమ్ము నే నాయుధములు దాల్చి మీవెనుక వచ్చెదను.

యద్యత్ ఫలం ప్రార్థయతే పుష్పం వా జనకాత్మజా 28
తత్తత్ ప్రదద్యా వైదేహ్యా యత్రాఽస్యా రమతే మనః.

సీత ఏ యే ఫలము గాని, పుష్పముగాని కోరునో, ఆమె మనస్సు ఏ పదార్థమం దనురక్త మగునో దానినెల్ల నామె కిమ్ము.

గచ్ఛతోస్తు తయో ర్మధ్యే బభూవ జనకాత్మజా. 29
మాతంగయో ర్మధ్యగతా శుభా నాగవధూ రివ

అట్లు పోవుచున్న ఆ రామలక్ష్మణుల నడుమ నున్న సీతాదేవి, రెండేనుగుల నడుమ నున్న చక్కని ఆడేనుగువలెనుండెను.

ఏకైకం పాదపం గుల్మం లతాం వా పుష్పశాలినీమ్ 30
అదృష్టపూర్వాం పశ్యంతీ రామం పప్రచ్ఛ సాఽబలా.

ఆ సీత తాను మున్ను చూచి యెఱుగని చెట్టును గాని, పొదనుగాని, పూలతో ప్రకాశించు తీగనుగాని చూచుచున్నదై యది యేమని రాము నడుగసాగెను.

రమణీయాన్ బహువిధాన్ పాదపాన్ కుసుమోత్కటాన్
సీతావచనసంరబ్ధ ఆనయామాస లక్ష్మణః.

సీత యడుగుటతోడనే లక్ష్మణుడు త్వరగా సుందరములు, పూవు లధికముగా కల పలు విధములగు మొక్కల నామెకు తెచ్చి యిచ్చుచుండెను.

విచిత్రవాలుకజలాం హంససారసనాదితామ్ 32
రేమే జనకరాజస్య తదా ప్రేక్ష్య సుతా నదీమ్.

సీత,(చాలదూరమువారు యమునాతీరముననే పయనించుటచే) చక్కని యిసుక, నీరు కలదియు, హంసలు, సారసపక్షులు

రొదచేయుట కలదియగు యమునానదిని చూచి, యపుడు మిగుల నానందించెను.

క్రోశమాత్రం తతో గత్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ
బహూన్మేధ్యాన్ మృగాన్ హత్వా చేరతు ర్యమునావనే.

పిమ్మట నా రామలక్ష్మణులు యమునా తీరమదంలి యడవిలో నొక్క క్రోసుదూర మటనుండి వెడలి. భక్ష్యములగు మృగములు పెక్కింటిని చంపి, భక్షించిరి.

విహృత్య తే బర్హిణపూగనాదితే
శుభే వనే వానరవారణాయుతే
సమం నదీవప్ర ముపేత్య సమ్మతం
నివాస మాజగ్ము రదీనదర్శనాః. 34

ఆ సీతారామ లక్ష్మణు లట్లు క్లేశముల పాలయ్యును, దైన్య మొకింతయు ముఖమున కన్పట్టనీయనివారై నెమళ్ల గుంపులు కూయుట కలదియు, కోతులు, ఏనుగులు అనేకములతో కూడిన దగు నా చక్కని వనమున నిమ్నోన్నతములు లేక చదునుగా నున్న యేటి గట్టున కేగి యట సీత కభీష్టమగు నివాస స్థానము నేర్పఱచిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచపంచాశః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నేబదియైదవ సర్గ సమాప్తము.

—o—

# షట్పంచాశః సర్గః - ఏబదియాఱవ సర్గము

అథ రాత్ర్యాం వ్యతీతాయా మవసుప్త మనంతరమ్
ప్రబోధయామాస శనై ర్లక్ష్మణం రఘునందనః. 1

అంత రాత్రి గడవగా రాముడు తాను మేల్కొంచిన పిమ్మట నింకను కొంచెము తడవు నిదురించిన లక్ష్మణుని మెల్లగా మేల్కొలిపెను.

సౌమిత్రే! శృణు వన్యానాం వల్గు వ్యాహరతాం స్వనమ్
సంప్రతిష్ఠామహే కాలః ప్రస్థానస్య పరంతప! 2

శత్రువులను పీడించు వాడవగు లక్ష్మణా! ఇంపుగా కూయుచున్న చిలుకలు, కోకిలలు, గోరువంకలు మున్నగు నడవి లోని పక్షుల కూతల నాలకింపుము మన మిటనుండి బయలుదేర దగిన సమయమిది ఇంక పోవుదము.

స సుప్తః సమయే భ్రాత్రా లక్ష్మణః ప్రతిబోధితః
జహౌ నిద్రాం చ తంద్రీం చ ప్రసక్తం చ పథి శ్రమమ్. 3

అట్లు నిద్రించి, యన్నచే మేల్కొలుపబడిన లక్ష్మణుడు తోడనే నిద్రను, జడత్వమును, మార్గాయాసమును కూడ వీడెను.

తత ఉత్థాయ తే సర్వే స్పృష్ట్వా నద్యా శ్శివం జలమ్
పంథాన మృషిణాఽఽదిష్టం చిత్రకూటస్య తం యయుః.

అంత వారు మువ్వురును నిదురలేచి శుద్ధమగు నదీజలము తాకి, భరద్వాజముని యాదేశించిన చిత్రకూటమున కేగు మార్గముననే పోయిరి.

తత స్సంప్రస్థితః కాలే రామ స్సౌమిత్రిణా సహ
సీతాం కమలపత్రాక్షీ మిదం వచన మబ్రవీత్. 5

అంత రాముడు లక్ష్మణునితో కలిసి బయలుదేరినవాడై తామర రేకులను బోలు కన్నులు కల సీతతో నిట్లనెను.

ఆదీప్తా నివ వైదేహి! సర్వతః పుష్పితా న్నగాన్
స్వైః పుష్పైః కింశుకాన్ పశ్య మాలిన శ్శిశిరాత్యయే. 6

సీతా! వసంతకాలమున నెల్లెడల నెఱ్ఱని పూలు పూచినవై, మండుచున్నవి వోలె కన్పట్టుచు, తమ పుష్పములతోనే మాలలు దాల్చినటు లున్న మోదుగ చెట్లను చూడుము.

పశ్య భల్లాతకాన్ ఫుల్లా న్నరై రనుపసేవితాన్
ఫలపత్రై రవనతా న్నూనం శక్ష్యామి జీవితుమ్. 7

చేరరాని వగుటచే మనుష్యులకు పొందశక్యము కాక పూచిన యీ జీడిచెట్లను చూడుము. ఇవి ఆకులు, పండ్ల బరువుచే వంగి యున్నవి. ఇట్లు జీవించుటకు తగిన సాధనము లున్నవి గనుక నే నిచట జీవింప గలుగుటలో సందేహము లేదు.

పశ్య ద్రోణప్రమాణాని లంబమానాని లక్ష్మణ
మధూని మధుకారీభిః సంభృతాని నగే నగే. 8

లక్ష్మణా! తేనె టీగలచే ప్రోగుచేయబడి ప్రతివృక్షమునను నాలుగు తూముల ప్రమాణముతో వ్రేలాడుచున్న తేనె తెట్టలను చూడుము.

ఏష క్రోశతి నత్యూహ స్తం శిఖీ ప్రతికూజతి
రమణీయే వనోద్దేశే పుష్పసంస్తరసంకటే. 9

రాలిన పూవులు నేలపై దట్టముగ తివాచివలె యుండిన సుందరమగు వనప్రదేశమందు ఈ వానకోయిల కూయుచున్నది నెమలి దానికి బదులు కూత కూయుచున్నది.

మాతంగయూథానుసృతం పక్షిసంఘానునాదితమ్
చిత్రకూట మిమం పశ్య ప్రవృద్ధశిఖరం గిరిమ్. 10

ఏనుగుల గుంపుతో ననుసరింపబడినది. పక్షిసమూహములచే కిలకిలారావములతో కూడినది, ఉన్నతములైన శిఖరములు గలది అగు నీ చిత్రకూటపర్వతము చూడుము.

సమభూమితలే రమ్యే ద్రుమై ర్బహుభి రావృతే
పుణ్యే రంస్యామహే తాత ! చిత్రకూటస్య కాననే. 11

తమ్ముడా ! మిట్టపల్లములు లేక చదునైనది, సుందరమైనది, అనేక చెట్లతో నావరింపబడినది, పుణ్యప్రదమైనది అగు ఈ చిత్రకూట మందలి యడవిలో క్రీడింతము.

తత స్తౌ పాదచారేణ గచ్ఛంతౌ సహ సీతయా
రమ్య మాసేదతు శ్శైలం చిత్రకూటం మనోరమమ్ 12

అంతట నా రామలక్ష్మణులు సీతతో పాదచారులై పోవుచు సుందరము, మనస్సునకు ప్రీతి గూర్చునదగు చిత్రకూట పర్వతమును చేరిరి

తం తు పర్వత మాసాద్య నానాపక్షిగణాయుతమ్
బహుమూలఫలం రమ్యం సంపన్నసరసోదకమ్. 13

మనోజ్ఞోఽయం గిరిః సౌమ్య! నానాద్రుమలతాయుతః
బహుమూలఫలో రమ్యః స్వాజీవః ప్రతిభాతి మే. 14

మునయశ్చ మహాత్మానో వసం త్యస్మిన్ శిలోచ్చయే
అయం వాసో భవేత్తావ దత్ర సౌమ్య! రమేమహి. 15

ఇతి సీతా చ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః
అభిగమ్యాఽఽశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్. 16

అట్లు వివిధ పక్షిసమూహములతో కూడినదియు, అనేకములగు దుంపలు, పండ్లు కలదియు, సుందరమైనదియు, సమృద్ధమైనదియు, తీయని నీరు కలదగు ఆ చిత్రకూట పర్వతమును చేరినవాడై రాముడు తమ్మునితో నిట్లనెను-ఓ సౌమ్యుడా! వివిధ వృక్షములు, తీగలతో కూడినవియు, అనేక ఫలములు, దుంపలు కలదియు, సుందరమైనదియు, హృదయంగమమైన యీ కొండ సుఖముగ జీవింప యోగ్యమైనదని తలంతును. ఈ కొండపై మహాత్ములగు మునులు నివసించుచున్నారు. ఇదియే మనకు నివాసయోగ్యము. ఇచట మనము విహరింతము. అని యిట్లు సీతా రామలక్ష్మణు లా వనమందు వాల్మీకి యెదుట నంజలి ఘటించి ప్రణమిల్లిరి.

తాన్ మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్
ఆస్యతామితి చోవాచ స్వాగతం తు నివేద్య చ. 17

ధర్మ మెఱిగిన మహర్షి యానందముతో వారిని పూజించి, వారికి స్వాగతము పలికి, కూర్చుండ నియోగించెను.

తతోఽబ్రవీ న్మహాబాహు ర్లక్ష్మణం లక్ష్మణాగ్రజః
సన్నివేద్య యథాన్యాయ మాత్మాన మృషయే ప్రభుః.

లక్ష్మణాఽఽనయ దారూణి దృఢాని చ వరాణి చ
కురుష్వాఽవసథం సౌమ్య! వాసే మేఽభిరతం మనః.

అపుడు మహాభుజుడు సమర్థుడగు రాముఁడు యథాక్రమముగ తా నెవ్వరో యట కేల వచ్చెనో యా ఋషి కెఱింగించి - లక్ష్మణున కిట్లనెను—సౌమ్యుడవగు లక్ష్మణా! నీవు గట్టివి, ఉత్తమమైనవగు కొయ్యలు తెచ్చి వానితో గృహము నిర్మించుము. నా మనస్సు పర్ణశాలయం దాసక్తమైయున్నది.

తస్య తద్వచనం శ్రుత్వా సౌమిత్రి ర్వివిధాన్ ద్రుమాన్
ఆజహార తత శ్చక్రే పర్ణశాలా మరిందమః. 20

రాముని యీ వచన మాలించి, శత్రువుల నణచువాడగు లక్ష్మణు డనేకవిధములగు కొయ్యలు తెచ్చి పర్ణశాల నిర్మించెను.

తాం నిష్ఠితాం బద్ధకటాం దృష్ట్వా రామః సుదర్శనామ్
శుశ్రూషమాణ మేకాగ్ర మిదం వచన మబ్రవీత్. 21

గాలి యున్నగువానిచే కదల్పరాక గట్టిగా నిలిచినది, గోడలకు బదులుగా ఆకులు మున్నగువానిచే మూయబడినది (లేదా మూయబడిన బయటి యావరణము కలది) యై చూడముచ్చటగ నున్న పర్ణశాలను చూచి, త్రైతన కిటుపై నేమి యాజ్ఞ యిడునో

యని సావధానుడై పరిచర్యచేయుచున్న లక్ష్మణునకు రాము డిట్లనెను.

ఐణేయం మాంస మాహృత్య శాలాం యక్ష్యామహే వయం
కర్తవ్యం వాస్తుశమనం సౌమిత్రే! చిరజీవిభిః. 22

లక్ష్మణా! నల్ల యిఱ్ఱిమాంసము తెచ్చి మన మీ పర్ణశాలను (పర్ణశాలలో నా యా దిక్కులందు నివసించు దేవతలను) పూజింతుదము. దీర్ఘాయువు కోరువారు వాస్తుశాంతిని తప్పక చేయవలయును.

మృగం హత్వాఽఽనయ క్షిప్రం లక్ష్మణేహ శుభేక్షణ!
కర్తవ్య శ్శాస్త్రదృష్టో హి విధి ర్ధర్మ మనుస్మర. 23

సుందర నేత్రములు కల లక్ష్మణా! శీఘ్రమే నీవు నల్ల యిఱ్ఱిని చంపి యిటకు కొనితెమ్ము. శాస్త్రముచే నిర్ణయింపబడిన విధాన మాచరింప వలయును. ఇది ధర్మము. నీ వీ ధర్మము స్మరింపుము.

భ్రాతు ర్వచన మాజ్ఞాయ లక్ష్మణః పరవీరహా
చకార స యథోక్తం చ తం రామః పున రబ్రవీత్. 24

శత్రు వీరులను పరిమార్చువాడగు లక్ష్మణు డన్న మాట తెలిసికొని, యాతడు చెప్పిన చొప్పున ఆచరించెను. మఱల రాము డతని కిట్లనెను.

ఐణేయం శ్రపయ స్వైత చ్ఛాలాం యక్ష్యామహే వయమ్
త్వర సౌమ్య ముహూర్తోఽయం ధ్రువశ్చదివసోప్యయమ్.

ఈ నల్ల యిఱ్ఱిమాంసము వండుము. మన మీ పర్ణశాలకు పూజ చేయుదము. సౌమ్యుడా! నీ వింక త్వరపడుము. ఇది స్థిర ముహూర్తము. ఈ దినము కూడ శుభ తిథి నక్షత్రయుక్తమై స్థిరమైనది.

విశే. ఇచట 'సౌమ్యముహూర్తః' అని సమస్తపద పాఠమున నిది శుభముహూర్తము, ఈ దినము యజమానునకు స్థైర్యము కలిగించునది యని యర్థము.

స లక్ష్మణః కృష్ణమృగం హత్వా మేధ్యం ప్రతాపవాన్
అథ చిక్షేప సౌమిత్రి స్సమిద్ధే జాతవేదసి. 26

అంత ప్రతాపశాలి యగు లక్ష్మణు డొక నల్ల యిఱ్ఱిని చంపి, దాని మాంసమును ప్రజ్వలించుచున్న యగ్నిలో పడవైచి పక్వ మొనర్చెను.

తం తు పక్వం సమాజ్ఞాయ నిష్టప్తం ఛిన్నశోణితమ్
లక్ష్మణః పురుషవ్యాఘ్ర మథ రాఘవ మబ్రవీత్. 27

ఆ యిఱ్ఱి మాంసము రక్తమంతయు నిగిరి, బాగుగ కాలి, పక్వమైనదని లక్ష్మణు డెఱిగినవాడై, పురుషశ్రేష్ఠు డగు రాముని కిట్లనెను.

అయం కృష్ణ స్సమాప్తాంగః శృతః కృష్ణమృగో యథా
దేవతాం దేవసంకాశ! యజస్వ కుశలో హ్యసి. 28

ఈ నల్లయిఱ్ఱి సర్వావయవములు కలదై పక్వ మగుటచే నల్లబడి వెనుకటి నల్లని రూపునంది నల్లయిఱ్ఱివలెనే కన్పట్టు

చున్నది. దేవ సమానుడ వగు రామా! పర్ణశాలాధిదేవత నింక పూజింపుము. నీవట్లు పూజించుటలో నేర్పరివి.

రామః స్నాత్వా తు నియతో గుణవాన్ జప్యకోవిదః
సంగ్రహే ణాకరో త్సర్వా న్మంత్రాన్ సత్రావసానికాన్

గుణవంతుడు, జపించవలసియున్న మంత్రములలో కుశలు డగు రాముడు స్నాన మొనర్చి, నియమముతో వాస్తుయాగ పరిసమాప్తి కే యే మంత్రములను జపించవలెనో వానిని సంక్షేపముగ జపించి వాస్తుయాగమును సమాప్తి చేసెను.

ఇష్ట్వా దేవగణాన్ సర్వాన్ వివేశావసథం శుచిః
బభూవ చ మనోహ్లాదో రామ స్యామితతేజసః. 30

రాము డిట్లు శాలాధిదేవతల నెల్ల ఆరాధించి, పరిశుద్ధుడై యా పర్ణశాలలో ప్రవేశించెను. అంతులేని తేజముగల రాముని మనము కర్తవ్యనిర్వహణముచే పరితుష్ట మయ్యెను.

వైశ్వదేవబలిం కృత్వా రౌద్రం వైష్ణవ మేవ చ
వాస్తుసంశమనీయాని మంగళాని ప్రవర్తయన్. 31

జపం చ న్యాయతః కృత్వా స్నాత్వా నద్యాం యథావిధి
పాపసంశమనం రామ శ్చకార బలి ముత్తమమ్. 32

రాము డంత వైశ్వదేవబలి (ఇచట సర్వభూతబలిమాత్రమే. తక్కినది పితృకార్యమందే కర్తవ్యము) నాచరించి రుద్రుడు దేవతగా కల యాగము, విష్ణుదేవతాకమగు యాగము నొనర్చి, వాస్తుదోషమును పోగొట్టెడి మంగళకరములను పుణ్యాహవాచన-

శాంతి జపాదుల నొనరించి, యథావిధిగా నదిలో స్నానమొనర్చి పాపప్రధానములగు పగలుచరించునట్టివి, రాత్రించరములైనట్టి క్రూరభూతములను నశింపజేసెడి యుత్తమ బలి నాచరించెను

వేదిస్థలవిధానాని చైత్యా న్యాయతనాని చ
ఆశ్రమ స్యానురూపాణి స్థాపయామాస రాఘవః. 33

రాము డచట నెనిమిదిదిక్కులందును బలిహరణమునకు వేదికలను, గంధర్వాదుల నివాసములను (చైత్యమున గణపతి దేవాలయమని మహేశ్వరతీర్థుల వ్యా.), విష్ణువు మున్నగువారి నివాసములను, ఆశ్రమమునకు తగునట్లు చిన్నవిగా నేర్పఱచెను.

వన్యై ర్మాల్యైః ఫలై ర్మూలైః పక్వై ర్మాంసై ర్యథావిధి
అద్భి ర్జపైశ్చ వేదోక్తై ర్దర్భైశ్చ ససమిత్కుశైః 34
తౌ తర్పయిత్వా భూతాని రాఘవౌ సహ సీతయా
తదా వివిశతు శ్శాలాం సుశుభాం శుభలక్షణౌ. 35

శుభలక్షణములు గల ఆరామలక్ష్మణులు అడవిలో పూల మాలలు, పండ్లు, దుంపలు, వండిన మాంసములచేతను, జలములచేతను, వేదోక్తమంత్రజపములచేతను, దర్భలచేతను, సమిధల చేతను భూతములను తృప్తి నందించి సీతాసమేతులై సుందరమగు నా పర్ణశాలలో ప్రవేశించిరి.

తాం వృక్షపర్ణచ్ఛదనాం మనోజ్ఞాం
యథాప్రదేశం సుకృతాం నివాతామ్
వాసాయ సర్వే వివిశుః సమేతా
స్సభాం యథా దేవగణా స్సుధర్మామ్. 36

చెట్లయాకులతో కప్పబడి, 'అగ్నేయదిశ యందు వంటయిల్లుండవలెను' ఇత్యాది నియమానుగుణముగ చక్కగ నిర్మితమై, గాలితాకిడి లేక సుందరమై యొప్పుచున్న నా పర్ణశాల నా సీతా రామలక్ష్మణులు దేవసభను దేవసమూహములవోలె ప్రవేశించిరి.

అనేకనానామృగపక్షిసంకులే
 విచిత్రపుష్పస్తబకైర్ద్రుమై ర్యుతే
వనోత్తమే వ్యాళమృగానునాదితే
 తదా విజహ్రు స్సుసుఖం జితేంద్రియాః. 37

జితేంద్రియులగు నా సీతారామలక్ష్మణు లపు డనేకములు, వివిధములగు మృగములు, పక్షులతో వ్యాప్తమై, వింతగొల్పు పూలగుత్తులు కల చెట్లతో కూడి, ఏనుగులు, తక్కిన మృగముల ధ్వనులతో కూడిన శ్రేష్ఠమగు నడవిలో సుఖముగా విహరించిరి.

సురమ్య మాసాద్య తు చిత్రకూటం
 నదీం చ తాం మాల్యవతీం సుతీర్థామ్
ననంద హృష్టో మృగపక్షిజుష్టాం
 జహౌ చ దుఃఖం పురవిప్రవాసాత్. 38

రాము డట్లు మిగుల సుందరమగు చిత్రకూటమును, చక్కని జలములు కలిగి మృగములు, పక్షులచే సేవితమైన మాల్యవతీనదిని చేరి మిగుల పులకితుడై యానందించెను. పట్టణము విడచి వచ్చుట వల్ల కలిగిన దుఃఖమును వీడెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షట్పంచాశః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నేబదియాఱవ సర్గము సమాప్తము.

---

## సప్తపంచాశః సర్గః - ఏబదియేడవ సర్గము

కథయిత్వా సుదుఃఖార్తః సుమంత్రేణ చిరం సహ
రామే దక్షిణకూలస్థే జగామ స్వగృహం గుహః. 1

రాముడు గంగ దక్షిణతీరము చేరిన పిమ్మట, గుహుడు మిగుల దుఃఖితుడై రాముడు కనుమరుగగువఱకు సుమంత్రునితో చాల తడ వాతని గుణగణములే ముచ్చటించి, రాముడు కనుమాపుమేఱ దాటిపోగా నా సుమంత్రునితో గూడి తన గృహమున కేగెను.

భరద్వాజాభిగమనం ప్రయాగే చ సహాసనమ్
ఆగిరే ర్గమనం తేషాం తత్రస్థై రుపలక్షితమ్. 2

సీతారామలక్ష్మణులు భరద్వాజముని కడకేగుట, ప్రయాగ తీర్థమున భరద్వాజునితో గలసియుండుట, వారు చిత్రకూటమున కేగుట యను నీ వృత్తాంత మెల్ల నా శృంగిబేరపురమందలి చారులు తెలిసికొనిరి. (సుమంత్రుడా విషయము వారివలన నెఱింగెను.)

అనుజ్ఞాతః సుమంత్రోఽథ యోజయిత్వా హయోత్తమాన్
అయోధ్యామేవ నగరీం ప్రయయౌ గాఢదుర్మనాః. 3

అంత సుమంత్రుఁడు గుహుని యనుమతి నంది, ఉత్తమములగు గుఱ్ఱములను పూన్చిన రథమెక్కి మిగుల తల్లడిల్లిన యుల్లముతో నయోధ్యానగరమునకే పోయెను.

స వనాని సుగంధీని సరితశ్చ సరాంసి చ
పశ్య న్నతియయౌ శీఘ్రం గ్రామాణి నగరాణి చ. 4

అతడు మార్గమున (పూలతావులతో) పరిమళించు వనములను, నదులను, కొలనులను చూచుచు, శీఘ్రమే గ్రామములను, పట్టణములను గడచెను.

తతః సాయాహ్నసమయే తృతీయేఽహని సారథిః
అయోధ్యాం సమనుప్రాప్య నిరానందాం దదర్శ హ. 5

అంత నా సారథి మూడవనాటి సాయంకాలమున కయోధ్య చేరి యది యానందము తొలగి యుండుటను కాంచెను.

స శూన్యామివ నిశ్శబ్దాం దృష్ట్వా పరమదుర్మనాః
సుమంత్ర శ్చింతయామాస శోకవేగసమాహతః. 6

కచ్చి న్న సగజా సాఽశ్వా సజనా సజనాధిపా
రామసంతాపదుఃఖేన దగ్ధా శోకాగ్నినా పురీ. 7

మిగుల కలత నందిన మనస్సుకల యా సుమంత్రుఁడా నగరము నిర్జనప్రదేశమువలె నేమాత్రము సవ్వడి లేనిదగుట చూచి, దుఃఖవేగోపహతుడై—'ఈ నగరమందలి ఏనుగులు, గుఱ్ఱములు, జనులు, రాజు, ఎల్లరు రాము నెడబాయుటవలన

కలిగిన సంతాపదుఃఖపీడితులై శోకాగ్నిలో పడి దహింపబడ లేదు కదా !' యని చింతించెను.

ఇతి చింతాపర స్సూతో వాజిభిః శీఘ్రపాతిభిః
నగరద్వార మాసాద్య త్వరితః ప్రవివేశ హ. 8

అని యిట్లు చింతానిమగ్నుడైన సూతుడు, గుఱ్ఱములు వేగముగ పరుగెత్తగా నగరద్వారము చేరి, వేగమే నగరమును ప్రవేశించెను

సుమంత్ర మభియాంతం తం శతశోఽథ సహస్రశః
క్వ రామ ఇతి పృచ్ఛంతః సూత మభ్యద్రవ న్నరాః. 9

అట్లు నగరమున కేతెంచుచున్న యా సుమంత్రుని రాము డెచ్చట యని యడుగుచు వందలు, వేలుగా జను లాతని కడకు పరుగెత్తుకొని వచ్చిరి.

తేషాం శశంస గంగాయా మహ మాపృచ్ఛ్య రాఘవమ్
అనుజ్ఞాతో నివృత్తోఽస్మి ధార్మికేణ మహాత్మనా. 10

'నేను రాముని గంగాతీరమున వీడ్కొని, యా ధార్మికుడు మహాత్ము డగు నాతనిచే ననుమతింపబడినవాడనై మఱలి వచ్చితి'నని సుమంత్రుడు వారికి తెలిపెను.

తే తీర్ణా ఇతి విజ్ఞాయ బాష్పపూర్ణముఖా జనాః
అహో ధిగితి నిశ్వస్య హా! రామేతి చ చుక్రుశుః. 11

అపు డా పౌరులు రామాదులు గంగను దాటి వెడలిరని

యెఱిగి ముఖమున కన్నీరు నిండగా అయ్యో! ఇసీ! యని నిట్టూర్చి, హా రామా! యని రోదించిరి.

శుశ్రావ చ వచ స్తేషాం బృందం బృందం చ తిష్ఠతామ్
హతాః స్మ ఖలు యే నేహ పశ్యామ ఇతి రాఘవమ్. 12
దానయజ్ఞవివాహేషు సమాజేషు మహత్సు చ
న ద్రక్ష్యామః పున ర్జాతు ధార్మికం రామ మంతరా. 13
కిం సమర్థం జన స్యాస్య కిం ప్రియం కిం సుఖావహమ్
ఇతి రామేణ నగరం పితృవత్ పరిపాలితమ్. 14

జనులు గుంపులు గుంపులుగా చేరి పరస్పర మిట్లను కొనుట విననయ్యెను. మన మీ రథముపై రాముని చూడక భగ్న మనోరథుల మైతిమి. దానకాలములందు, యజ్ఞసమయములందు వివాహ సందర్భములందును, పెద్ద పెద్ద సభలు మున్నగు సమాజోత్సవములందును – మన నడుమ కలసి యుండెడి ధార్మికు డగు రాము డింక నిటుపై నెన్నడు నగపడడా? 'ఈతని కేవస్తువు క్షేమము కలిగింప జాలును? ఏది యీతనికి ప్రియము కూర్చును? ఏది యీతనికి సుఖకర'మని రాముడు నగరమందలి ప్రతి యొక్కరి యోగక్షేమము లఱయుచు తండ్రి తనయులను వలె పరిపాలించినాడు.

విశే. రాముడు సదా ప్రజలనడుమ సంచరించువాడు. ఎప్పుడైన నేదేని దాన మిచ్చుచో రాము డట కేగి సరియగు ప్రదేశమున, యోగ్యమగు కాలమున, సత్పాత్రున కాదాన మిప్పించు వాడు. అట్లే యజ్ఞములు జరుగుతావున కేగి, న్యాయార్జిత ధనముతో నా యజ్ఞము నిర్వహింపబడున ట్లొనర్చి, ఆ యా యజ్ఞ కర్మల

ననుష్ఠించుటలో సందేహములు తొలగించి, మఱచిన వానిని స్మరింపజేయువాడు. అట్లే వివాహ సందర్భములలో నుభయపక్షముల నడుమ సామరస్యము సాధించుటకు, సమ్మతి కుదురని పక్షమున వారికి వలయు ధనమిచ్చుటకును, ఏ లోపము లేక కర్మలనుష్ఠింపబడుటకును, అట్లే తక్కిన సభాదికార్యక్రమ మొడుదుడుకులు లేక చక్కగా నిర్వహించబడుటకును రాముడట కేగెడివాడు. దీని కంతకు నాతని ధార్మికతయే కారణము.

వాతాయనగతానాం చ స్త్రీణా మన్వంతరాపణమ్
రామశోకాభితప్తానాం శుశ్రావ పరిదేవనమ్. 15

సుమంత్రు డట్లు రాజవీథిలో పోవుచు, మార్గమున నిరు ప్రక్కల నంగళ్ల నడుమనుండి రాము నెడబాసి దుఃఖపీడితలై కిటికీలలో నిలిచిన స్త్రీల యేడ్పులు వినెను.

స రాజమార్గమధ్యేన సుమంత్రః పిహితాననః
యత్ర రాజా దశరథ స్తదే వోపయయౌ గృహమ్. 16

సుమంత్రు డా రాజమార్గమునడుమ జనులను చూడజాలక ముఖమునకు మాటు వేసికొని దశరథ మహారాజున్న భవనమున కేగెను.

సోఽవతీర్య రథా చ్ఛీఘ్రం రాజవేశ్మ ప్రవిశ్య చ
కక్ష్యా స్సప్తాభిచక్రామ మహాజనసమాకులాః. 17

సుమంత్రు డట రథము దిగి, రాజభవనమున ప్రవేశించి. రాజు వెడలిరాకుండుటచే చాలమంది గుమిగూడియున్న యేడు తొట్టికట్లను గడచెను.

హర్మ్యై ర్విమానైః ప్రాసాదై రవేక్ష్యాథ సమాగతమ్
హాహాకారకృతా నార్యో రామాదర్శనకర్శితాః 18

ఆసమయమున మేడల నుండి, విమానముల నుండి (భవనోపరిభాగములనుండి, ప్రాసాదముల(రాజగృహము లేదా దేవాలయముల) నుండి సుమంత్రుడు వచ్చుటగాంచి, రాముని జూడమిచే కృశింపజేయబడిన స్త్రీలు హాహాకార మొనర్చిరి.

ఆయతై ర్విమలై ర్నేత్రై రశ్రువేగపరిప్లుతైః
అన్యోఽన్య మభివీక్షంతేఽవ్యక్త మార్తతరాః స్త్రియః. 19

స్త్రీలును మిగుల దుఃఖితలై విశాలములు, నిర్మలములగు కన్నులు శోకబాష్పములతో నిండగా పరస్పరము చక్కగా చూడలేనివారైరి.

తతో దశరథస్త్రీణాం ప్రాసాదేభ్య స్తత స్తతః
రామశోకాభితప్తానాం మందం శుశ్రావ జల్పితమ్. 20

అంతట నట నట రాజభవనములనుండి దశరథుని భార్యలు రాము నెడబాయుటవలన కలిగిన దుఃఖముచే పీడింపబడి మెల్లగా మాటలాడుకొను మాట లిట్లు వినిపించెను.

సహ రామేణ నిర్యాతో వినా రామ మిహాగతః
సూతః కిన్నామ కౌసల్యాం శోచంతీం ప్రతివక్ష్యతి. 21

యథా చ మన్యే దుర్జీవ మేవం న సుకరం ధ్రువమ్
ఆచ్ఛిద్య పుత్త్రే నిర్యాతే కౌసల్యా యత్ర జీవతి. 22

సత్యరూపం తు తద్వాక్యం రాజ్ఞః స్త్రీణాం నిశామయన్,
ప్రదీప్త మివ శోకేన వివేశ సహసా గృహమ్. 23

'ఈ సుమంత్రుడు రామునితోకూడ పోయెను కాని రాముడు లేకుండగనే యొంటరిగ నిట కేతెంచినాడు. ఇతడు శోకించు చున్న కౌసల్య కేమి చెప్పగలడు ? ఇటుపై నా జీవితము దుఃఖముతో గడుపదగినదియే. కౌసల్యయు తనయుఁ డిల్లు విడచిపోగా జీవించగలుగుట సుకరము కాని పని యనుట నిక్కము' అని యా దశరథుని భార్యలు ప్రతియొక్కరు పలుకుచున్న సత్యము లగు మాటలు వినుచు సుమంత్రుడు దుఃఖముచే దహింపబడిన వాని వలె శీఘ్రముమే రాజగృహము ప్రవేశించెను.

స ప్రవిశ్యాష్టమీం కక్ష్యాం రాజానం దీన మాతురమ్
పుత్త్రశోకపరిద్యూన మపశ్యత్ పాండురే గృహే. 24

సుమంత్రు డటు లెనిమిదవ కక్ష్యను ప్రవేశించి యచట (సుధాలేపితమై) తెల్లగా ప్రకాశించు మందిరమున దీనుడై, బాధపడుచు, పుత్రశోకముచే కృశించిన రాజును చూచెను.

అభిగమ్య తమాసీనం నరేంద్ర మభివాద్య చ
సుమంత్రో రామవచనం యథోక్తం ప్రత్యవేదయత్. 25

సుమంత్రు డా దశరథుని కడకేగి, యాసనముపై నాసీనుడైన యాతనికి ప్రణమిల్లి రాముడు చెప్పిన మాటలు యథాతథముగ తెలిపెను.

స తూష్ణీమేవ తచ్ఛ్రుత్వా రాజా విభ్రాంతచేతనః
మూర్ఛితో న్యపత ద్భూమౌ రామశోకాభిపీడితః. 26

భ్రాంతినందిన మనస్సు కల రా జూరకనే యా మాటలు విని, పుత్రశోకముతో కలతనొంది మూర్ఛిల్లి నేలపై బడెను.

తతోఽంతఃపుర మావిద్ధం మూర్ఛితే పృథివీపతౌ
ఉద్ధృత్య బాహూ చుక్రోశ నృపతౌ పతితే క్షితౌ. 27

రాజు మూర్ఛిల్లగనే యంతఃపుర జన మెల్ల శోకాక్రాంతు లైరి. రాజు భూమిపై బడగనే వారు చేతులెత్తి బిగ్గరగా రోదించిరి.

సుమిత్రయా తు సహితా కౌసల్యా పతితం పతిమ్
ఉత్థాపయామాస తదా వచనం చేద మబ్రవీత్. 28

కౌసల్య సుమిత్రతో కూడినదై యపు డట్లు నేలపై బడిన పతిని లేవనెత్తి యతని కిట్లనెను.

ఇమం తస్య మహాభాగ! దూతం దుష్కరకారిణః
వనవాసా దనుప్రాప్తం కస్మా న్న ప్రతిభాషసే. 29

ఓ మహాభాగ్యశాలీ! ఎవరికిని చేయశక్యముగాని కార్యము నిర్వహించిన రాముని దూత యితడు. వనవాసమునుండి వచ్చి నాడు. నీ వేల యీతనితో మాటలాడవు?

అద్యేమ మనయం కృత్వా వ్యపత్రపసి రాఘవ!
ఉత్తిష్ఠ సుకృతం తేఽస్తు శోకే న స్యా త్సహాయతా. 30

ఓ రాఘువంశవగు రాజా! "పుత్రుని వెడలనంపుట" యను నీతిబాహ్య మగు పని చేసి యిపుడు సిగ్గుపడుచున్నావు. నీ వింక లెమ్ము. నీకు శుభ మగుగాక! శోక పరాయణుడవు కాకుము. దానివల్ల ప్రయోజనము లేదు

దేవ! యస్యా భయా ద్రామం నానుపృచ్ఛసి సారథిమ్
నేహ తిష్ఠతి కైకేయీ విస్రబ్ధం ప్రతిభాష్యతామ్. 31

ప్రభూ! నీ వెవ్వతెవలని భయముతో రాముని కుశలమును గూర్చి సుమంత్రు నడుగకుంటివో యా కైక యిట లేదు. నీవు విశ్వాసముతో (శంకలేక) మాటలాడుము.

సా తథోక్త్వా మహారాజం కౌసల్యా శోకలాలసా
ధరణ్యాం నిపపాతాశు బాష్పవిప్లుతభాషిణీ. 32

శోకముచే చపలత నందిన కౌసల్య యట్లు మహారాజునకు చెప్పి కన్నీటిచే గద్గదస్వరముతో మాటలాడుచు శీఘ్రమే నేలపై పడెను.

ఏవం విలపతీం దృష్ట్వా కౌసల్యాం పతితాం భువి
పతిం చావేక్ష్య తా స్సర్వా స్సుస్వరం రురుదుః స్త్రియః.

ఇటు లేడ్చుచు, నేలపై బడిన కౌసల్యను, పతిని చూచిన తక్కిన యంతఃపురకాంత లెల్లరు బిగ్గరగా నేడ్చిరి.

తత స్త మంతఃపురనాద ముత్థితం
సమీక్ష్య వృద్ధా స్తరుణాశ్చ మానవాః
స్త్రియశ్చ సర్వా రురుదుః సమంతతః
పురం త దాసీ త్పునరేవ సంకులమ్. 34

పిమ్మట నట్లు అంతఃపురమున నొక్కుమ్మడి చెలరేగిన యార్తనాదము విని పురమందలి ముదుసలులు, స్త్రీలు ఎల్లరును

అన్నివైపుల నుండియు రోదించిరి. మఱల నా పట్టణము రాముడ వనవాసమునకు పోయినప్పటివలె వ్యాకుల మాయెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తపంచాశః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము అదికావ్యమగు శ్రీమద్రామాయణమున అయోధ్యాకాండమందు ఏబదియేడవ సర్గము సంపూర్ణము.

---

## అష్టపంచాశః సర్గః - ఏబదియెనిమిదవ సర్గము

ప్రత్యాశ్వస్తో యదా రాజా మోహాత్ప్రత్యాగతం పునః
అథాజుహావ తం సూతం రామవృత్తాంతకారణాత్. 1

దశరథుడు కొంతవడికి తెప్పరిల్లి తోడనే యడవినుండి మఱలి వచ్చిన సూతుని, రామవృత్తాంతము తెలిసికొనుటకొఱకు పిలచెను.

అథ సూతో మహారాజం కృతాంజలి రుపస్థితః
రామమే వానుశోచంతం దుఃఖశోకసమన్వితమ్. 2

వృద్ధం పరమసంతప్తం నవగ్రహ మివ ద్విపమ్
వినిశ్శ్వసంతం ధ్యాయంత మస్వస్థ మివ కుంజరమ్. 3

అంత సూతుడు వచ్చినవాడై రామునే తలంచి దుఃఖించుచున్న వాడును, వృద్ధుడును, అప్పుడే పట్టుబడిన యేనుగువలె

మిగుల పరితాపము నందినవాడును, నిట్టూర్చుచు చింతిలుచు, వ్యాధిగ్రస్తమగు నేనుగు వలె నున్న రాజుకడ నంజలి ఘటించి నిలచెను.

రాజా తు రజసా సూతం ధ్వస్తాంగం సముపస్థితమ్
అశ్రుపూర్ణముఖం దీన ముువాచ పరమార్తవత్. 4

రాజును, ఒడలెల్ల దుమ్ము గొట్టుకొని, కన్నీటితో ముఖ మావృతము కాగా, దీనుడై చెంత నిలచిన సూతుని చూచి, మిగుల దుఃఖితుడై యిట్లనెను.

క్వను వత్స్యతి ధర్మాత్మా వృక్షమూల ముపాశ్రితః
సోఽత్యంతసుఖిత స్సూత! కి మశిష్యతి రాఘవః 5

దుఃఖ స్యానుచితో దుఃఖం సుమంత్ర! శయనోచితః
భూమిపాలాత్మజో భూమౌ శేతే కథ మనాథవత్. 6

సూతుడా! ధర్మాత్ము డగు రాముడు మిక్కిలి సుఖము లనుభవించిన వాడే. ఏ చెట్టు మొదట చేరి నివసించును? ఏ యాహారము తినును? దుఃఖ మన్న నేమో యెఱుగని వాడు, పాన్పుపై పరుండుటకు తగినవాడు రాజకుమారుడగు రాము డొక యనాథవలె భూమిపై నెట్లు నిదురించును?

యం యాంత మను యాంతి స్మ పదాతిరథకుంజరాః
స వత్స్యతి కథం రామో విజనం వన మాశ్రితః. 7

ఎవడు పోవుచుండగా నాతని వెనుక కాలినడకన బోవు

భటులు, రథములు, ఏనుగులు నడచెడివో అట్టి రాముడు నిర్జన మగు నడవిలో నెటు లుండగలడు ?

వ్యాళై ర్మృగై రాచరితం కృష్ణసర్పనిషేవితమ్
కథం కుమారౌ వైదేహ్యా సార్థం వన ముపస్థితౌ. 8

కొండచిలువలు, క్రూరమృగములు తిరుగు నట్టిది, కృష్ణసర్పముల కావాసమైనది యగు నరణ్యమునకు రామలక్ష్మణులు సీతతో గూడి యెట్లు చేరిరి ?

సుకుమార్యా తపస్విన్యా సుమంత్ర ! సహ సీతయా
రాజపుత్రౌ కథం పాదై రవరుహ్య రథా ద్గతౌ. 9

సుమంత్రుడా ! మిక్కిలి సుకుమారియు, జాలి గొల్పునది యగు సీతతో గూడి రథమెక్కి వెడలిన రాజకుమారు లా రథము దిగి కాలి నడక నెట్లు పోయిరి ?

సిద్ధార్థః ఖలు సూత ! త్వం యేన దృష్టౌ మమాత్మజౌ
వనాంతం ప్రవిశంతౌ తా వశ్వినా వివ మందరమ్. 10

సుమంత్రుడా ! అశ్వినీదేవతలు మందరగిరిని ప్రవేశించి నట్లు నా తనయు లడవిలో ప్రవేశించుచుండగా చూచిన నీవు కృతార్థుడవు.

కి మువాచ వచో రామః కిమువాచ చ లక్ష్మణః
సుమంత్ర ! వన మాసాద్య కిమువాచ చ మైథిలీ. 11

ఆసితం శయితం భుక్తం సూత! రామస్య కీర్తయ
జీవిష్యా మ్యహ మేతేన యయాతి రివ సాధుషు. 12

సుమంత్రుడా! అడవికి పోయిన తరువాత రాము డేమని నాడు? లక్ష్మణు డేమి పలికినాడు? సీత ఏమి చెప్పినది? రాము డెచట కూర్చుండెను? ఎచ్చట శయనించెను? ఏమి భుజించెను? నీ విది యెల్ల చెప్పగా యయాతి స్వర్గమునుండి సత్పురుషుల నడుమ పడి దుఃఖము వీడినట్లు నే నా వృత్తాంతము దలంచుకొని దుఃఖము వీడి జీవింతును.

విశే: యయాతి తా నొనర్చిన పుణ్యకర్మలకు ఫలముగ స్వర్గ సుఖము లనుభవించి యా పుణ్యము క్షీణించగా స్వర్గమునుండి భ్రష్టుడు కాబోవుచు దేవేంద్రుని ప్రార్థించి సత్పురుషుల నడుమ భూమిపై పడి స్వర్గభ్రంశదుఃఖము వీడెనను పౌరాణిక గాథ యిట ననుసంధేయము.

ఇతి సూతో నరేంద్రేణ చోదిత స్సజ్జమానయా
ఉవాచ వాచా రాజానం సబాష్పపరిరబ్ధయా. 13

అని యీ విధముగ రాజుచే ప్రేరితుడైన సూతుడు కన్నీటితో రుద్ధమై తొట్రుబాటు చెందిన వాక్కుతో రాజున కిట్లనెను.

అబ్రవీ న్మాం మహారాజ! ధర్మమే వానుపాలయన్
అంజలిం రాఘవః కృత్వా శిరసాఽభిప్రణమ్య చ. 14

సూత! మద్వచనా త్తస్య తాతస్య విదితాత్మనః
శిరసా వందనీయస్య వంద్యౌ పాదౌ పునః పునః. 15

ఓ మహారాజా! రాముడు ధర్మమునే పరిపాలించుచు

నంజలి ఘటించి, శిరమువంచి ప్రణమిల్లి నాకిట్లు చెప్పినాడు - 'ఓ సూతుడా! మహాత్ముడు, ఆత్మ విదు డగు నాతండ్రి, శిరము వంచి నమస్కరింప దగినవాడు. ఆయన పాదముల కభివాదము చేసితినని నీవు నా పక్షమున ప్రణామ మొనర్చుము.

సర్వ మంతఃపురం వాచ్యం సూత! మద్వచనా త్త్వయా
ఆరోగ్య మవిశేషేణ యథార్హం చాభివాదనమ్. 16

ఓ సూతుడా! నా మాటగా నంతఃపురమందలి స్త్రీల కెల్లరకు నా యారోగ్యమును వారి వారి యర్హతకు తగినట్లుగ వరుసగా నా వందనమును తెలియజేయుము.

మాతా చ మమ కౌసల్యా కుశలం చాభివాదనమ్
అప్రమాదం చ వక్తవ్యా బ్రూయాశ్చైనా మిదం వచః. 17

నీ వేమాత్రము ఏమరక నా తల్లి కౌసల్యకు నా కుశలము తెలిపి యామెకు నమస్కరించితి ననుము. ఆమె కీ మాటచెప్పుము-

ధర్మనిత్యా యథాకాల మగ్న్యగారపరా భవ
దేవి! దేవస్య పాదౌ చ దేవవ త్పరిపాలయ. 18
అభిమానం చ మానం చ త్యక్త్వా వర్తస్వ మాతృషు
అను రాజాన మార్యాం చ కైకేయీ మంబ! కారయ. 19
కుమారే భరతే వృత్తి ర్వర్తితవ్యా చ రాజవత్
అర్థజ్యేష్ఠా హి రాజానో రాజధర్మ మనుస్మర. 20

ఓ దేవీ! నీ వెల్లపుడు ధర్మము ననువర్తించుచు సమయము దప్పక యగ్నిహోత్రగృహమున కుపచరింపుము. రాజు

పాదములు దైవసమానముగ భావించి సేవింపుము. (నేను త్తమ కులమునకు చెందిన దాన నని) గర్వమును గాని, లేదా (నేను రాణులలో పెద్దదానని) నిక్కు గాని లేక గర్వ, మాన ములు వీడి తక్కిన తల్లులతో సమముగా వర్తింపుము. రాజును, కైకను గూడ సమానముగ ననువర్తింపుము. కుమారుడగు భర తుని యెడ రాజభావముతో మెలగుము. రాజులు ధనాదులచే పెద్దలు (వయస్సుచే కాదు) అని రాజధర్మము స్మరింపుము.

భరతః కుశలం వాచ్యో వాచ్యో మద్వచనేన చ
సర్వా స్వేవ యథాన్యాయం వృత్తిం వర్తస్వ మాతృషు.

భరతునకు నేను చెప్పినట్లు నా కుశల మెఱిగింపుము. అట్లే తల్లులందరి యెడల న్యాయము దప్పక వర్తిల్లు మనియు చెప్పుము.

వక్తవ్యశ్చ మహాబాహు రిక్ష్వాకుకులనందనః
పితరం యౌవరాజ్యస్థో రాజ్యస్థ మనుపాలయ. 22

అతిక్రాంతవయా రాజా మా స్మైనం వ్యవరోరుధః
కుమారరాజ్యే జీవ త్వం తస్యై వాజ్ఞాప్రవర్తనాత్. 23

మహాభుజుడు, ఇక్ష్వాకువంశము నానందింపజేయు వాడగు భరతున కిట్లు చెప్పుము – 'నీవు యౌవరాజ్యాభిషిక్తుడవై, రాజైన తండ్రి యాజ్ఞ పాలింపుము. రాజు వయసు చెల్లినవాడు. ఆయన సంకల్పమున కడ్డు నిలువకుము. నీ వాయన యాజ్ఞ చొప్పున వర్తించుచు యౌవరాజ్య భోగము లనుభవించుచు జీవింపుము.

అబ్రవీచ్చాపి మాం భూయో భృశ మశ్రూణి వర్తయన్
మాతేవ మమ మాతా తే ద్రష్టవ్యా పుత్రగర్ధినీ. 24

ఇత్యేవం మాం మహారాజ! బ్రువ న్నేవ మహాయశాః
రామో రాజీవతామ్రాక్షో భృశ మశ్రూ ణ్యవర్తయత్. 25

ఇంకను రాముడు కన్నీరుగార్చుచు 'సూతుడా! కుమారునిపై యాశపెట్టుకొనిన నాతల్లిని నీ తల్లిని వోలె చూడుము' అని చెప్పినాడు. మహారాజా! గొప్ప కీర్తిమంతుడు, తామరల వలె ఎఱ్ఱనైన కన్నులుగల రాము డిట్లు పలుకుచునే కన్నులనుండి అశ్రువులు కార్చినాడు

లక్ష్మణస్తు సుసంక్రుద్ధో నిశ్శ్వసన్ వాక్య మబ్రవీత్
కేనాయ మపరాధేన రాజపుత్త్రో వివాసితః. 26

లక్ష్మణుడు మాత్రము మిగుల కోపించి నిట్టూర్చుచు నిట్లు పలికినాడు. ఏ దోషము నుచూచి రాజకుమారుని వెడలనంపితిరి?

రాజ్ఞా తు ఖలు కైకేయ్యా లఘు త్వాశ్రిత్య శాసనమ్
కృతం కార్య మకార్యం వా వయం యేనాభిపీడితాః. 27

కైకేయి యొనర్చిన తుచ్ఛమగు శాసనముపై నాధారపడి రాజు కార్యమే కార్యము వోలె ననుష్ఠించినాడు. దానిచే మేము మిక్కిలి క్లేశముల ననుభవించినాము.

యది ప్రవ్రాజితో రామో లోభకారణకారితమ్
వరదాననిమిత్తం వా సర్వథా దుష్కృతం కృతమ్. 28

కైక తన లోభము (అన్యాయ్యముగా, జ్యేష్ఠునకు చెంద వలసిన రాజ్యముపై కోరిక యను లోభము) కారణముగా నిట్లు రాజుచే చేయించినను, లేక మున్ను తనకు రాజు వర మిచ్చినాడు కదా యని యిట్లు రాముని వెడలనంపినను అన్ని విధముల చేయగూడని యకార్యమే చేసినట్లయినది.

ఇదం తావ ద్యథాకామ మీశ్వరస్య కృతే కృతమ్
రామస్య తు పరిత్యాగే న హేతు ముపలక్షయే. 79

రాజు స్వతంత్రుడు కాన ఆయన రాముని వెడల నంపు సందర్భమున స్వేచ్ఛగా వ్యవహరించినాడు (లేదా రాజు శాస్త్రము చూడక ఈశ్వర ప్రేరణచే స్వేచ్ఛగా వ్యవహరించినాడు). ఏల యన రాముని విడచుటలో నాకు వేరొండు హేతువే కాన రాకున్నది.

అనమీక్ష్య సమారబ్ధం విరుద్ధం బుద్ధిలాఘవాత్
జనయిష్యతి సంక్రోశం రాఘవస్య వివాసనమ్. 80

అవివేకమువలన ఉచితానుచిత మాలోచింపక ప్రారంభింపబడిన సర్వలోకవిరుద్ధము, రామవివాసనరూపమగు పని దశరథునకు దుఃఖమే కలిగించును.

అహం తావ న్మహారాజే పితృత్వం నోపలక్షయే
భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః. 81

మహారాజగు దశరథుడు తండ్రిగా నాకు కనుపించుట లేదు. సోదరుడు, స్వామి, బంధువు, తండ్రి నా కన్నియు,

రాముడే. (ఇట్లు చెప్పుటచే పరమైకాంతులకు ప్రాకృతపిత్రాదు లెల్లరును పరిత్యజింపదగినవారే. భగవంతుడే నిరుపాధికు డగు తండ్రి, స్వామి, బంధువు అని చెప్పినట్లైనది).

సర్వలోకప్రియం త్యక్త్వా సర్వలోకహితే రతమ్
సర్వలోకోఽనురజ్యేత కథం త్వాఽనేన కర్మణా. 32

జను లెల్లరకు ప్రీతిపాత్రుడును, సకల జనులకు హితము కలిగించుటయం దాసక్తుడును అగు రాముని విడిన నిన్ను భరతుని వంటివాడు తప్ప సర్వజను లెట్లనురాగముతో చూతురు? (సర్వలోక నిరుపాధికబంధునగు భగవంతుని విడి సోపాధిక బంధువగు నిన్నెటులు నే నాశ్రయింతు నని భావము).

సర్వప్రజాభిరామం హి రామం ప్రవ్రాజ్య ధార్మికమ్
సర్వలోకం విరుధ్యేమం కథం రాజా భవిష్యసి. 33

ప్రజలందరకు ప్రీతిని గూర్చు ధర్మనిష్ఠుడగు రాముని వెడలనంపి, యిట్లు జనుల యభీష్టమునకు విరోధ మాచరించి నీవెట్లు రాజ వగుదువు?

జానకీ తు మహారాజ! నిశ్శ్వసంతీ మనస్వినీ
భూతోపహతచిత్తేవ విష్ఠితా విస్మితా స్థితా. 34

ఓ మహారాజా! గంభీరమగు మనస్సుకల సీత మాత్ర మటు లేమియు పలుకక నిట్టూర్చుచు భూత మావేశించినమనస్సు కలది వోలె నిశ్చలయై, విస్మయము నందినది వలె నుండెను.

అదృష్టపూర్వవ్యసనా రాజపుత్రీ యశస్వినీ
తేన దుఃఖేన రుదతీ నైవ మాం కించి దబ్రవీత్. 35

రాజపుత్రి యగుటచే మున్నెన్నడు కష్టములు చూచి యెఱుగనిది, అట్టి దుర్దశలో గూడ కైకేయి నేమాత్రము నిందింప కుండుట యను కీర్తిగలదగు సీత, తన భర్త దుఃఖమును గాంచి దురపిల్లుచు నేమియు పలుకలేదు.

ఉద్వీక్షమాణా భర్తారం ముఖేన పరిశుష్యతా
ముమోచ సహసా బాష్పం మాం ప్రయాంత ముదీక్ష్య సా.

అంత సీత కన్నీరు కనుల నించుకొన్నదై భర్తను చూచుచు, ముఖము సంతాపముచే నెండగా, నేను పోవుచుండుట గాంచి వెంటనే కన్నీరు గార్చెను.

తథైవ రామోఽశ్రుముఖః కృతాంజలిః
స్థితోఽభవ ల్లక్ష్మణబాహుపాలితః
తథైవ సీతా రుదతీ తపస్వినీ
నిరీక్షతే రాజ రథం తథైవ మామ్. 37

రాజా! అట్లే లక్ష్మణునిచే శుశ్రూష చేయబడుచున్న రాముడును ముఖమున కన్నీరు నింపుకొని, యంజలి దాల్చి, నిలచెను జాలిగొలుపునట్టి యా సీతయు నేడ్చుచు, రథమును, నన్ను చూచుచుండినది.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అష్టపంచాశః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నేబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ఏకోనషష్టితమః సర్గః - ఏబదితొమ్మిదవసర్గము

మమ త్వశ్వా నివృత్తస్య న ప్రావర్తంత వర్త్మని
ఉష్ణ మశ్రు ప్రముంచంతో రామే సంప్రస్థితే వనమ్. 1

రాము డడవికి ప్రయాణము కాగా, నయోధ్యకు మఱలిన నా గుఱ్ఱములు రామవియోగదుఃఖముతో వెచ్చని బాష్పములు విడచుచు మార్గమున సరిగా నడువకుండినవి.

ఉభాభ్యాం రాజపుత్త్రాభ్యా మథ కృత్వాఽహ మంజలిమ్
ప్రస్థితో రథ మాస్థాయ త ద్దుఃఖ మపి ధారయన్. 2

నే నంత నా రాజకుమారు లిరువుర కంజలి యొసగ్గి, యంతటి దుఃఖమును కూడ నిలుపుకొని రథమెక్కి యయోధ్యకు బయలుదేరితిని.

గుహేన సార్ధం తత్త్రైవ స్థితోఽస్మి దివసాన్ బహూన్
ఆశయా యది మాం రామః పున శ్శబ్దాపయే దితి. 3

తిరిగి రాముడు నన్ను పిలువగలడను నాశతో నేను గుహునితో నచటనే చాల దినము లుంటిని. [ఇవట వస్తుతః వృక్షరాజము మొదట నొకరోజు, భరద్వాజు నాశ్రమమున రెండవ

రోజు, యమునాతీరమున మూడవరోజు, నాల్గవనాడు చిత్రకూటప్రవేశము, ఐదవనాడు గుహుని చారులా విషయము సూతున కెరింగించుట, ఆఱవనాడు సూతు డయోధ్యకు వెడలుట. లేదా రెండవనాడు రాముడు భరద్వాజాశ్రమమునుండి చిత్రకూటమునకు పోవ దలంచుట తెలిసి చారులు మూడవనాటికి సుమంత్రున కావిషయములు తెలుపగా, నాల్గవనాడు సుమంత్రుడు ప్రయాణ మగుట. కాన నీ పద్ధతిలో సుమంత్రుడు గంగాతీరమున మూడు దినములు గడపినను 'దివసాన్ బహూన్' (చాల దినములు) అనుటలో రాము నెడబాసిన సుమంత్రున కొక్కొక్కదినము చాలాకాలము వలె తోచెనని భావము].

విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః
అపి వృక్షాః పరిమ్లానా స్సపుష్పాంకురకోరకాః. 4

మహారాజా! నీ దేశమందలి వృక్షములు సయితము (తీగెలు మున్నగునవియు) రాముని క్లేశముచే కృశించినవై పుష్పములు, మొలకలు, మొగ్గలతో గూడ (సర్వావయవములు) వాడిపోయినవి.

ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసి చ
పరిశుష్కపలాశాని వనా న్యుపవనాని చ. 5

రాముని క్లేశము దలంచి తపించిన వగుటచే నదులు, కొలను లందలి నీరెల్ల కాగిపోయినది. సదా నీరుపెట్టకుండగనే పెరిగిన కఠినాకారముగల వనములు, నిరంతరజలసేకముచే నేపుగ బెరిగిన ఉపవనములును సమానముగ ఆకు లెండినవి యైనవి.

న చ సర్పన్తి సత్త్వాని వ్యాళా న ప్రచరంతి చ
రామశోకాభిభూతం త న్నిష్కూజ మభవ ద్వనమ్. 6

జంతువు లట సంచరించుట లేదు. క్రూరమృగములు, (లేదా సదా సంచరించు స్వభావముకల యేనుగులు) తిరుగాడుట లేదు. రామశోకముచే దురపిల్లుచు అడవియెల్ల సవ్వడిలేనిదై యున్నది.

లీనపుష్కరపత్రాశ్చ నరేంద్ర! కలుషోదకాః
సంతప్తపద్మాః పద్మిన్యో లీనమీనవిహంగమాః. 7

రాజా! తామరాకులు మిక్కిలి తాపముకలవై నీటమునిగినవి. జలములు కలుషితములైనవి తామరకొలనులలో పద్మములు వాడిపోయినవి. చేపలు, నీటికాకులు మున్నగు జలపక్షులు సంచారము మానినవి.

జలజాని చ పుష్పాణి మాల్యాని స్థలజాని చ
నాద్య భా న్త్యల్పగంధీని ఫలాని చ యథాపురమ్. 8

నీట బుట్టిన తామరలు మున్నగు పూవులు, నేలపై పూచు పూవులును, పండ్లును యిపుడు చాల తక్కువ వాసన కలవై ప్రకాశింపకున్నవి.

అత్రోద్యానాని శూన్యాని ప్రలీనవిహగాని చ
న చాభిరామా నారామా న్పశ్యామి మనుజర్షభ! 9

ఈ అయోధ్యలో నుద్యానములందు పక్షిసంచారము లేక

యవి శూన్యములై కనుపించుచున్నవి. నరశ్రేష్ఠుడా! నేను సుందరములగు తోటలనే కానకున్నాను.

ప్రవిశంత మయోధ్యాం మాం న కశ్చి దభినందతి
నరా రామ మపశ్యన్తో నిశ్శ్వసంతి ముహు ర్ముహుః. 10

నే నయోధ్యను ప్రవేశించుచుండగా నొక్కడును సంతోష పడుట కానరాలేదు. నాతో రాముని చూడక జనులు మాటి మాటికి నిట్టూర్చుచున్నారు.

దేవ! రాజరథం దృష్ట్వా వినా రామ మిహాఽఽగతమ్
దుఃఖా దశ్రుముఖ స్సర్వో రాజమార్గగతో జనః. 11

ఓ దేవా! రాముడు లేకయే వెడలి వచ్చుచున్న రాజ రథము గాంచి రాజమార్గమందలి జను లెల్లరకు దుఃఖముతో ముఖమున కన్నీరు గ్రమ్మెను.

హర్మ్యై ర్విమానైః ప్రాసాదై రవేక్ష్య రథ మాగతమ్
హాహాకారకృతా నార్యో రామాదర్శనకర్శితాః. 12

ఆయతై ర్విమలై ర్నేత్రై రశ్రువేగపరిప్లుతైః
అన్యోన్య మభివీక్షంతేఽవ్యక్త మార్తతరాః స్త్రియః. 13

స్త్రీలు హర్మ్యములపై, మేడలపై, ప్రాసాదములపై నెక్కి రథము వచ్చుట కాంచి. యందు రాముని చూడక కృశించి హాహాకారములొనర్చిరి. విశాలములు, నిర్మలములు అగు కన్నుల నుండి కన్నీరు వేగముగ కారగా మిక్కిలి దుఃఖించుచు నస్పష్ట ముగ నొకరి నొకరు చూచుకొన సాగిరి.

నామిత్రాణాం న మిత్రాణా ముదాసీనజనస్య చ
అహ మార్తతయా కించి ద్విశేష ముపలక్షయే. 14

నీ శత్రువులు, మిత్రులు, ఉదాసీనులు లేదా ప్రజల శత్రువులు, మిత్రులు, ఉదాసీనులు (రామునకు శత్రువులు లేరు కనుక) అను మూడువిధముల వారిలో రాముని దలంచుకొని దుఃఖించుటలో నా కించుకయు భేదము గోచరింపలేదు.

అప్రహృష్టమనుష్యా చ దీననాగతురంగమా
ఆర్తస్వరపరిమ్లానా వినిశ్శ్వసితనిస్వనా. 15
నిరానందా మహారాజ! రామప్రవ్రాజనాతురా
కౌసల్యా పుత్రహీనేవ అయోధ్యా ప్రతిభాతి మా. 16

ఈ అయోధ్యలో జనులు సంతోషపడుటలేదు. ఏనుగులు, గుఱ్ఱములు దుఃఖించుచున్నవి. నగర మెల్ల రోదనధ్వనితో కాంతి తొలగియున్నది. ఎల్లెడల నిట్టూర్పులధ్వనులు వినిపించుచున్నవి. మహారాజా! ఆనందము తొలగి, రాముని వనవాసముచే బాధనందుచున్న యీ అయోధ్య పుత్రునెడబాసిన కౌసల్యవలె నాకు తోచుచున్నది.

సూతస్య వచనం శ్రుత్వా వాచా పరమదీనయా
బాష్పోపహతయా రాజా తం సూత మిద మబ్రవీత్. 17

సూతుని మాటలు విని యా రాజు కన్నీటిచే గద్గదికమై, దైన్యమునందిన మాటతో సూతున కిట్లనెను.

కైకేయ్యా వినియుక్తేన పాపాభిజనభావయా
మయా న మంత్రకుశలై ర్వృద్ధై స్సహ సమర్థితమ్. 18

పాపమునకు పుట్టినిల్లగు ఆలోచనగల కైకచే ప్రేరితుడనై నే నాలోచన చేయుటలో సమర్థులైన పెద్దలతో విచారింపనైతిని.

న సుహృద్భి ర్న చామాత్యై ర్మంత్రయిత్వా న నైగమైః
మయాఽ యమర్థ స్సమ్మోహాత్ స్త్రీహేతో స్సహసా కృతః

నే నీ విషయమున మిత్రులతోగాని, మంత్రులతోగాని, పురప్రముఖులతోగాని యాలోచింపక స్త్రీయందలి వ్యామోహముతో తొందరపడి యిట్లు చేసితిని.

భవితవ్యతయా నూన మిదం వా వ్యసనం మహత్
కుల స్యాస్య వినాశాయ ప్రాప్తం సూత! యదృచ్ఛయా.

సూతుడా! లేదా యీ పెద్ద క్లేశము అగపడు ఏ కారణముచే కాక నా పాపమువల్లనే, యీ కులము నశించుటకే వచ్చి యుండును.

సూత! య ద్యస్తి తే కించిన్మయా తు సుకృతం కృతమ్
త్వం ప్రాపయాఽఽశు మాం రామం
ప్రాణా స్సంత్వరయంతి మామ్. 21

సూతుడా! నీకు నే నేమైన పూర్వ ముపకారము చేసి యున్నచో నన్ను శీఘ్రమే రామునికడకు కొనిపొమ్ము నా ప్రాణములు పోబోవుచున్నవి.

య ద్యద్యాపి మ మై వాజ్ఞా నివర్తయతు రాఘవమ్
న శక్ష్యామి వినా రామం ముహూర్త మపి జీవితుమ్. 22

ఇప్పటికిని నాయాజ్ఞ చెల్లుచో రాము నిటకు మఱల్చు కొనిరమ్ము. రాముడు లేక నే నొక్క ముహూర్తమైన జీవింప జాలను.

అథవాఽపి మహాబాహు ర్గతో దూరం భవిష్యతి
మా మేవ రథ మారోప్య శీఘ్రం రామాయ దర్శయ. 23

లేదా, యిప్పటికే యాతడు చాలదూరము పోయి యుండును కావున రథమెక్కించికొని శీఘ్రమే నన్ను రామునకు చూపుము.

వృత్తదంష్ట్రో మహేష్వాసః క్వాసౌ లక్ష్మణపూర్వజః
యది జీవామి సా ధ్వేనం పశ్యేయం సీతయా సహ. 24

గుండ్రముగ మల్లెమొగ్గలవలెనున్న పలువరుస కలవాడు, పెద్ద విలుకలవాడగు ఆ రాము డెక్కడ? నేను జీవించుచో నాతనిని సీతతో గూడ చక్కగా చూతును.

లోహితాక్షం మహాబాహు మాముక్తమణికుండలమ్
రామం యది న పశ్యేయం గమిష్యామి యమక్షయమ్.

ఎఱ్ఱని కనుకొనలు కలిగినవాడును, మహాభుజుడును, మణికుండలములు దాల్చినవాడును అగు రాముని చూడనిచో నేను యమలోకమున కేగెదను.

అతో ను కిం దుఃఖతరం యోఽహ మిక్ష్వాకునందనమ్
ఇమా మవస్థా మాపన్నో నేహ పశ్యామి రాఘవమ్. 26

నే నిట్టి యవస్థ నందియుఁ, ఇక్ష్వాకు వంశ్యుల కానందము గూర్చు రాముని చూడజాలనైతినే. నా కింతకంటె నెక్కువ దుఃఖ మేమున్నది ?

హా రామ! రామానుజ! హా! హా వైదేహి! తపస్విని!
న మాం జానీత దుఃఖేన మ్రియమాణ మనాథవత్. 27

అయ్యో! రామా! లక్ష్మణా! దయనీయురాలవగు సీతా! నే నిట్లు అనాథవలె దుఃఖముతో చావనున్నానని తెలియకుంటిరే!

స తేన రాజా దుఃఖేన భృశ మర్పితచేతనః
అవగాఢ స్సుదుష్పారం శోకసాగర మబ్రవీత్. 28

రా జటులు దుఃఖముచే వ్యాప్తమైన మనస్సుకలవాడై, దరిలేని దుఃఖసముద్రమున మునిగి యిట్లనెను.

రామశోకమహాభోగ స్సీతావిరహపారగః
శ్వసితోర్మిమహావర్తో బాష్పఫేనజలావిలః. 29
బాహువిక్షేపమీనౌఘో విక్రందితమహాస్వనః
ప్రకీర్ణకేశశైవాలః కైకేయీబడబాముఖః. 30
మ మాశ్రువేగప్రభవః కుబ్జావాక్యమహాగ్రహః
వరవేలో నృశంసాయా రామప్రవ్రాజనాయతః 31
యస్మి న్బత నిమగ్నోఽహం కౌసల్యే! రాఘవం వినా
దుస్తరో జీవతా దేవి! మయాఽయం శోకసాగరః. 32

రామశోకమను గొప్ప వైపుల్యము కలది, సీత నెడబాయు టయే యొడ్డుగా కలది, నిట్టూర్పులను అలలు, సుడులు కలది, కన్నీరను నురగనీటితో కలుషితమైనది, చేతులు విదల్చుటయను చేపల సమూహములు కలది, యేడ్చుటలను గొప్ప ధ్వని కలది, విరియబోసికొనిన వెంట్రుక లను నాచుకలది, కైకయను బడబాగ్ని కలది, నా కన్నీటి వేగమువలన పుట్టినది, గూనిదాని మాటలను గొప్ప మొసళ్లుకలది, క్రూర ప్రవృత్తిగల కైకయొక్క వర మను జలవృద్ధి కలది, రాముని వెడలగొట్టుట యను నిడివిగలది యగు నీ శోక మను సముద్రమున బడితిని రాముడు లేక నేను దీనిని దాటుట నాకు శక్యము కాదు.

అశోభనం యోఽహ మిహాద్య రాఘవం
దిదృక్షమాణో న లభే సలక్ష్మణమ్
ఇతీవ రాజా విలప న్మహాయశాః
పపాత తూర్ణం శయనే స మూర్చితః. 33

నే నిపుడు రామలక్ష్మణులను చూడగోరుచు వారిని బడయ కుంటినే. ఇది యెంత యమంగళము! అనుచు మహాయశస్వి యగు నా రాజు రోదించుచు శీఘ్రమే శయనముపై బడి మూర్ఛిల్లెను.

ఇతి విలపతి పార్థివే ప్రణష్టే
కరుణతరం ద్విగుణం చ రామహేతోః
వచన మనునిశమ్య తస్య దేవీ
భయ మగమ త్పునరేవ రామమాతా. 34

అని యిట్లు రామునికొఱకై రెట్టింపుగ మిక్కిలి జాలి గొల్పు నట్లేడ్చుచు మూర్ఛిల్లగా, నాతని భార్య, రామమాతయగు కౌసల్య రాజుమాట విని (ముందు రాముని కేమగునో యని యపుడు తన భర్త కేమగునో యని) భయపడెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోనషష్టితమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమున అయోధ్యాకాండమున నేబది తొమ్మిదవసర్గము సంపూర్ణము.

---

## షష్టితమః సర్గః – అఱువదియవ సర్గము

తతో భూతోపసృష్టేవ వేపమానా పునః పునః
ధరణ్యాం గతసత్త్వేవ కౌసల్యా సూత మబ్రవీత్. 1

అపుడు కౌసల్య భూతమావేశించిన దానివలె మాటిమాటికి భూమిపైబడి పొరలుచు ప్రాణములు లేనిదివోలె తెలివి దప్పి, తెప్పరిల్లినదై సూతున కిట్లనెను.

నయ మాం యత్ర కాకుత్స్థ స్సీతా యత్ర చ లక్ష్మణః
తా న్వినా క్షణ మ ప్యత్ర జీవితుం నోత్సహే హ్యహమ్. 2

సూతుడా! నీవు నన్ను సీతారాములున్నచోటకు కొని పొమ్ము. వారు లేక నే నిచట క్షణమైన జీవింప నుత్సహింపను.

నివర్తయ రథం శీఘ్రం దండకా న్నయ మా మపి
అథ తాన్ నానుగచ్ఛామి గమిష్యామి యమక్షయమ్. 3

నివు తోడనే రథము మఱల్పుము నన్నును దండకారణ్యమునకు కొనిపొమ్ము. నేను రాముని, సీతను, లక్ష్మణుని యనుసరింపనిచో యమలోకమున కేగెదను.

బాష్పవేగోపహతయా స వాచా సజ్జమానయా
ఇద మాశ్వాసయన్ దేవీం సూతః ప్రాంజలి రబ్రవీత్. 4

అంత సూతుడా కౌసల్యకంజలి మోడ్చి కన్నీరు పెల్లుబికి వచ్చుటచే గద్గదమై వివశమైన మాటతో నామె నోదార్చుచు నిట్లనెను.

త్యజ శోకం చ మోహం చ సంభ్రమం దుఃఖజం తథా
వ్యవధూయ చ సంతాపం వనే వత్స్యతి రాఘవః. 5

(అమ్మా!) నీవు శోకమును, రామున కేమగునో యను అజ్ఞానమును, దుఃఖమువలన నేర్పడిన తొట్రుబాటును వీడుము. రాముడే సంతాపము లేక యడవిలో నివసింపగలడు.

లక్ష్మణ శ్చాపి రామస్య పాదౌ పరిచరన్ వనే
ఆరాధయతి ధర్మజ్ఞః పరలోకం జితేంద్రియః. 6

జితేంద్రియుడగు లక్ష్మణుడును, ధర్మమెఱిగిన వాడగుటచే నడవియందు రాముని పాదములకు పరిచర్య చేయుచు పరలోకమును సాధించుచున్నాడు,

విజనేఽపి వనే సీతా వాసం ప్రాప్య గృహే ష్వివ
విస్రంభం లభతేఽభీతా రామే సంన్యస్తమానసా. 7

సీత నిర్జనమగు నరణ్యమున నుండియు, రామునియందే మనస్సు లగ్నము చేసినదై యింటిలో నున్నటులే భయము తొలగి, విశ్వాసము కలిగియున్నది.

నాస్యా దైన్యం కృతం కించి త్సుసూక్ష్మ మపి లక్ష్యతే
ఉచితేవ ప్రవాసానాం వైదేహీ ప్రతిభాతి మా. 8

ఆమెలో నాకు దైన్యము కొంచెమైనను గోచరింపలేదు. సీత నాకట్టి ప్రవాసమునకు పరిచితమైనట్లుగనే యున్నది.

నగరోపవనం గత్వా యథా స్మ రమతే పురా
తథైవ రమతే సీతా నిర్జనేషు వనేష్వపి. 9

సీత వెనుక నగరమందలి యుద్యానమునం దెట్లు విహరించెడిదో, యట్లే నిర్జనారణ్యములందును క్రీడించుచున్నది.

బాలేవ రమతే సీతాఽబాలచంద్రనిభాననా
రామా రామే హ్యధీనాత్మా విజనేఽపి వనే సతీ 10

పూర్ణచంద్రుని పోలునట్టి ముఖముకల సీత నిర్జనమగు నరణ్యమందున్నను రామునియం దాసక్తమైన మనస్సుకలదై (రాముడను నుద్యానమునం దాసక్తమైన మనస్సుగలదై) క్రీడించుచున్నది.

తద్గతం హృదయం హ్యాస్యా స్తదధీనం చ జీవితమ్
అయోధ్యాఽపి భవే త్తస్యా రామహీనా తథా వనమ్. 11

ఆమె హృదయము రామునియందు లగ్నమైయున్నది. ఆమె జీవితము రాముని యధీనము. రాముడు లేని అయోధ్యయు నామె కడవియే యగును.

పథి పృచ్ఛతి వైదేహీ గ్రామాంశ్చ నగరాణి చ
గతిం దృష్ట్వా నదీనాం చ పాదపా న్వివిధా నపి. 12

మార్గమున సీత గ్రామములను, నగరములను, నదీ ప్రవాహములను, అనేక విధములగు చెట్లనుచూచి (రామునో, లక్ష్మణునో) వానినిగూర్చి యడుగును.

రామం వా లక్ష్మణం వాపి పృష్ట్వా జానాతి జానకి
అయోధ్యా క్రోశమాత్రే తు విహార మివ సంశ్రితా. 13

అయా గ్రామములు, వృక్షములు నదులను చూచి, తా నయోధ్యకు క్రోసుదూరముననే విహారమున కేగినదివోలె రామునో లక్ష్మణునో యడిగి వాని పేర్లు మున్నగువాని నడుగును.

ఇద మేవ స్మరా మ్యస్యా స్సహసై వోపజల్పితమ్
కైకేయీసంశ్రితం వాక్యం నేదానీం ప్రతిభాతి మా. 14

ధ్వంసయిత్వా తు తద్వాక్యం ప్రమాదా త్పర్యుపస్థితమ్
హ్లాదనం వచనం సూతో దేవ్యా మధుర మబ్రవీత్. 15

సీత కైకనుగూర్చి తటాలున నొకమాట చెప్పినది. దానిని స్మరింతును, (ఇచట మఱల సుమంత్రుడు యోచించి, తా నామె కైకనుగూర్చి పలికిన పలుకులు ప్రసంగించుట యుక్తముకాదని

ఇట్లు మఱచినట్లు పలుకుచున్నాడు) నా కామె ఏమి చెప్పినదో యిపుడు తోచుటలేదే. అని ఇట్లు తాను ముందు పలికిన వాక్య మును నడుమనే నిలిపివైచి కౌసల్య కానందము గూర్చు మధుర మగు నీ మాట చెప్పెను,

విశే. సుమంత్రుడు తా నయోధ్యకు నిర్గమించు సమయ మున సీత కైకనుగూర్చి పలికిన కఠినోక్తులు కౌసల్యకు ప్రియమే యగునని యెంచి యామెకు చెప్ప సమకట్టినాడు. తోడనే యామాటలు వినినచో వృద్ధులగు కౌసల్యా దశరథులకు జీవితము పై నిరాశ కలుగునని యెంచి, యవి చెప్పదగినవి కావని మఱచుట యను నెపముతో నడుమనే విరమించినాడు. కైకను నిందించు మాటయైనను కౌసల్యాదేవికి సంతాపమును కలిగించు మాట గూఢముగ యుంచదగినదే. కాని ఆవాక్య మెట్టిది? అది "యీ వాక్యమే" అనుటకు ప్రమాణ మేమైన కలదా? అన్నచో కలదు. కార్యవశముచే నొకచో బహిర్గతము చేయకున్నను, వేఱొకచో నైన కవి యట్టి వాక్యమును వెల్లడించనిచో సర్వజ్ఞునకు గూడ నది యెట్లు వ్యక్తమగును? ఇట్లిచట పొరబాటుగా నొకింత నోటినుండి వెలువడి, నిలిపివేయబడినది, వృద్ధులగు రాజ దంపతులకు సంతాపకరమైనది, కైకేయికి సంబంధించినట్టి యీ వృత్తాంతమును కవి మున్ముందు స్పష్టము చేయును. వాల్మీకి యుద్ధకాండమున సీతనుగూర్చి 'విజగర్హే ఒత్ర కైకేయీం క్రోశంతీ కురరీ యథా (ఆడులకిముకి పిట్టవలె నేడ్చుచు ఈ విషయమున కైకను నిందించెను) అనిచెప్పి ఆపైన కైకనుగూర్చి సీతా వాక్య మునే 'సకామా భవ కైకేయి హతోఽయం కులనందనః' (ఓ కైకా! కులమున కానందము కలిగించు నీతడు హతుడైగాడు. నీ కోరిక

సిద్ధించిన దానవగుము) అని యన్నటులు చెప్పినాడు ఈ సీతా వాక్యములోని అంతర్యమిది. కైకేయికి రాజ్యము లభించుట చేతనే అభీష్టము సిద్ధించుచుండగా రాముని పెడలనంపు మనియు కోరుటలోని యభిప్రాయ మేమన- రామునడవికిపంపగా నాతని యెడబాటు క్షణమైన సహింపజాలని సీత యాతని ననుసరించును. ఆమె యతిలోకసుందరి. ఆమె నెవ్వడో యపహరింపకపోడు. ఆమె యపహరింపబడగా రాముడు స్వయముగనే నశించును. అపుడు నారాజ్యము సుప్రతిష్ఠిత మగును. అట్లు కానిచో రాజ్యము లభించియు నేమాత్రము ప్రయోజనము లేదు. ఏలయన రాముని గుణగణములచే నాకర్షింపబడిన ప్రతియొక్క డాతనికి విధేయుడు కాక మానడు. కాన రామునిగూడ వినాశమునకై యడవి కంపవలెను" అని; సీతపలికిన దీనినే రాముడును అరణ్యకాండమున నిట్లు పలుకును- 'కచ్చిత్ సకామా కైకేయీ సుఖితా సా భవిష్యతి, యా న తుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ' (తన కుమారుని విషయమున దూర దృష్టి కలది కావున రాజ్యమాత్రముతో తృప్తినందని కైకేయి యిపుడు తన కోరిక తీరగా సుఖముగ నుండగలదు కదా) ఇట్లే మఱియొకచోట –'యదభిప్రేత మస్మాసు ప్రియం వరవృతం చ యత్, కైకేయ్యా స్తత్ సుసంవృత్తం క్షిప్ర మద్యైవ లక్ష్మణ (లక్ష్మణా! కైక మన విషయమున నెట్లభిప్రాయపడెనో, ఆమె కేది ప్రియమో, వరముగ నామె యేది కోరెనో యది శీఘ్రమే యిపుడామెకు లభించునది) అనియు రామవచనము. ఈ విషయ మునే సుమంత్రు డేబదితొమ్మిదవ సర్గ చివరలో నిట్లు సూచించి నాడు– జానకీ తు మహారాజ ....ముదీక్ష్య సా (34వ శ్లో. నుండి 36వ శ్లో. వఱకు) ఈ సందర్భమున ఏడ్చుట, పలుక కుండుట,

శోషించుచున్న ముఖముతో పతినిచూచుట, తిరిగి సుమంత్రుని చూచుట, కన్నీరు కార్చుటలచే సీత ముందు చెప్పబడిన విషయమునే స్మరించినది. కావుననే యామె నిశ్చలయైనది. తన భర్త ముఖము చూచుటచే తన మదిలోని విషయము చెప్పరానిదని భావము. కన్నీరుకార్చుట, సూతుని చూచుటలచే తన యత్తకీ విషయము తెలియరానిదని సూచితము. 59వ సర్గలో సీత పొరబాటున చెప్పినదని దానిని దాచినాడు. ఇచట తన పొరబాటువల్ల నోరుజారి పిదప సవరించుకొనినాడు సుమంత్రుడు.

అధ్వనా వాతవేగేన సంభ్రమేణాఽఽతపేన చ
న విగచ్ఛతి వైదేహ్యా శ్చంద్రాంశుసదృశీ ప్రభా. 16

మార్గమున సుదూరము నడచినను, గాలి వడిగా వీచుచున్నను, పులి మున్నగు క్రూరజంతువులను చూచి కలతనందినను, ఎండ తాకినను, సీతయొక్క చంద్రకిరణములను బోలు దేహకాంతి తఱుగుట లేదు.

సదృశం శతపత్రస్య పూర్ణచంద్రోపమప్రభమ్
వదనం త ద్వదాన్యాయా వైదేహ్యా న వికంపతే. 17

పద్మమునకు సాటియై, పూర్ణచంద్రుని బోలు కాంతిగల యా సుందరియగు సీత మోము తన సహజకాంతిని వీడుటలేదు.

అలక్తరసరక్తాభా వలక్తరసవర్జితౌ
అద్యాపి చరణౌ తస్యాః పద్మకోశసమప్రభౌ. 18

ఆమె పాదములు లత్తుక రంగవలె నెఱ్ఱని కాంతికలవి.

వనవాసమున వానికి లత్తుకరంగు పూయుట విడువబడినది. అయినను అవి తామరమొగ్గలతో సమానమగు కాంతి కలిగి యున్నవి.

నూపురోద్ఘుష్టహేలేవ ఖేలం గచ్ఛతి భామినీ
ఇదానీ మపి వైదేహీ తద్రాగా న్న్యస్తభూషణా. 19

ఆ సుందరి యలంకారములందలి మక్కువచే సందెలు మున్నగువానిని ధరించి, యా నూపురముల వలన నేర్పడిన ధ్వనిని అనుకరించు విలాసము కలది వలె సుందరముగ పోవు చున్నది. (లేదా రామునితో కూడి యడవిలో పోవుట యం దభిలాష వలన నూపురములు ధరింపనున్నను నూపురములతో కూడిన విలాసము కలదివలె సొంపుగ పోవుచుండెను).

గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రం వా వన మాశ్రితా
నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా. 20

రాముని బాహువు నాశ్రయించినదై మార్గమున ఏనుగునో, సింహమునో, పులినో చూచియు నేమాత్రము భయపడుట లేదు.

న శోచ్యాస్తే న చాత్మాన శ్శోచ్యో నాపి జనాధిపః
ఇదం హి చరితం లోకే ప్రతిష్ఠాస్యతి శాశ్వతమ్. 21

పితృవాక్య పరిపాలన రూపమగు ఈ చరిత్ర లోకమున సుప్రతిష్ఠితము కాగలదు కాన రామాదులను గూర్చికాని, మన లను గూర్చికాని, రాజును గూర్చిగాని శోకింపకుము.

విధూయ శోకం పరిహృష్టమానసా
మహర్షియాతే పథి సువ్యవస్థితాః
వనేరతా వన్యఫలాశనాః పితు
శ్శుభాం ప్రతిజ్ఞాం పరిపాలయంతి తే. 22

ఆ రామలక్ష్మణులు సీతాసమేతులై శోకమువీడి, హర్షముతో నిండిన మనస్సుకలవారై, మహర్షుల మార్గము నవలంబించి, అడవిలో లభించు ఫలములు తినుచు, నడవిపై మక్కువచూపుచు తండ్రియగు దశరథుని ప్రతిజ్ఞను పరిపాలించుచున్నారు.

తథాపి సూతేన సుయుక్తవాదినా
నివార్యమాణా సుతశోకకర్శితా
న చైవ దేవీ విరరామ కూజితాత్
ప్రియేతి పుత్త్రేతి చ రాఘవేతి చ. 23

ఆ విధముగ సుమంత్రు డెంతో యుక్తముగ మాటలాడుచు నామె శోకమును నిలుపజూచుచున్నను, పుత్రశోకముచే పీడింపబడిన యా కౌసల్యాదేవి 'నా ప్రియ తనయా! రాఘవా! యని యఱచుట మానదయ్యెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షష్టితమః సర్గః
ఇట్లు ఋషిప్రోక్తము ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమునం
దయోధ్యాకాండమున నఱువదియవ సర్గ సంపూర్ణము.

## ఏకషష్టితమః సర్గః - అఱువదియొకటవ సర్గము

వనం గతే ధర్మపరే రామే రమయతాం వరే
కౌసల్యా రుదతీ స్వార్తా భర్తార మిద మబ్రవీత్. 1

వరులను నానందింపజేయు వారిలో శ్రేష్ఠుడు, ధర్మతత్పరుడగు రాముడడవి కేగగా, కౌసల్య మిగుల శోకించుచు పతితో నిట్లనెను.

యద్యపి త్రిషు లోకేషు ప్రథితం తే మహ ద్యశః
సానుక్రోశో వదాన్య శ్చ ప్రియవాదీ చ రాఘవః. 2

కథం నరవరశ్రేష్ఠ ! పుత్రౌ తౌ సహ సీతయా
దుఃఖితౌ సుఖసంవృద్ధౌ వనే దుఃఖం సహిష్యతః. 3

ఓ రాజశ్రేష్ఠుడా ! నీవు దయగలవాడవని, దాతవని, ప్రియము పలుకువాడవని ముల్లోకములలో నీ విపులమగు కీర్తి ప్రసిద్ధమై యున్నను, సుఖములలో పెంచబడిన తనయులగు రామలక్ష్మణులు సీతతోకూడి దుఃఖము నందుచు నరణ్యమున నిడుమల నెట్లు సహింతురు ?

సా నూనం తరుణీ శ్యామా సుకుమారీ సుఖోచితా
కథ ముష్ణం చ శీతం చ మైథిలీ ప్రసహిష్యతే. 4

తొలి యౌవ్వనమున నున్నది, యా సుకుమారి సుఖముల కలవాటుపడినదే! ఆమె యెట్లడవిలో వేడిమికి! చలికి నెట్లు తాళగలదు ?

భుక్త్వాఽశనం విశాలాక్షీ సూపదంశాన్వితం శుభమ్
వన్యం నైవార మాహారం కథం సీతోపభోక్ష్యతే. 5

విశాలములగు కన్నులుగల సీత రుచ్యములగు వ్యంజనములతో కూడిన యాహారము తినుచుండి, యిపు డడవిలో నీవారాన్నము నెట్లు తినగలదు ?

గీతవాదిత్రనిర్ఘోషం శ్రుత్వా శుభ మనిందితా
కథం క్రవ్యాదసింహానాం శబ్దం శ్రోష్య త్యశోభనమ్. 6

అనిందితయగు నీమె మంగళకరమగు గీతవాద్యముల ధ్వనులు వినుచుండి యట క్రూరములగు సింహముల యమంగళ ధ్వనుల నెట్లు వినగలదు ?

మహేంద్రధ్వజసంకాశః క్వను శేతే మహాభుజః
భుజం పరిఘసంకాశ ముపధాయ మహాబలః. 7

ఇంద్రధ్వజమువలె యున్నతుడు, గొప్ప బాహువులు కలవాడు మహాబలుడగు గుదియవంటి తన భుజమునే తలగడగా జేసికొని యడవిలో నెచట నిద్రించుచున్నాడో.

పద్మవర్ణం సుకేశాంతం పద్మనిశ్శ్వాస ముత్తమమ్
కదా ద్రక్ష్యామి రామస్య వదనం పుష్కరేక్షణమ్. 8

తామరరేకుల వర్ణము కలవాడై, చక్కని కేశములు కలవాడై, పద్మమువలె సుగంధముకల నిశ్శ్వాసము కలవాడై, తామరలను పోలు కన్నులుగల యుత్తముడగు రాముని ముఖ మెపుడు చూతును ?

వజ్రసారమయం నూనం హృదయం మే న సంశయః
అపశ్యంత్యా న తం యద్వై ఫల తీదం సహస్రధా. 9

నా హృదయము వజ్రాయుధపు గట్టి పదార్థముతో నిండి యుండును ఇందు సందేహము లేదు. లేనిచో నా రాముని జూడక ఒది వేయి ముక్కలు గాకుండునా ?

య త్త్వయాకరుణం కర్మ వ్యపోహ్య మమ బాంధవాః
నిరస్తాః పరిధావంతి సుఖార్హాః కృపణా వనే. 10

సుఖము లనుభవింప దగిన నా బంధువులు నీచే త్రోసి పుచ్చబడి నగరమును వీడి, దీనులై యడవులలో దిరుగాడు చున్నారే. ఇది నీ దయమాలిన పని సుమా !

యది పంచదశే వర్షే రాఘవః పున రేష్యతి
జహ్యా ద్రాజ్యం చ కోశం చ భరతే నోపభుజ్యతే. 11

పదునాలుగు సంవత్సరములు గడపి రాముడు పదునైదవ సంవత్సరమున నగరమున కేతెంచినను రాజ్యమును బొక్కస మును అతడు విడిచిపెట్టును. భరతుడు వాని ననుభవించు చుండుటయే దీనికి కారణము.

భోజయంతి కిల శ్రాద్ధే కేచి త్స్వా నేవ బాంధవాన్
తతః పశ్చా త్సమీక్షంతే కృతకార్యా ద్విజర్షభాన్. 12

లోకమున కొందరు బ్రాహ్మణులు విద్య- గుణము- వయస్సులచే శ్రేష్ఠులగువారున్నను, వారికి తామీయబోవు

హెచ్చుదక్షిణ చేరగలదని, తమ బంధువులకే అది చెందవలెనని, తమవారినే శ్రాద్ధభోజనమునకు పిలతురు. వారితో శ్రాద్ధకార్యములు నిర్వర్తించుకొని, శ్రాద్ధావసానమున భోక్తల కంటె విద్యా- వయో- వృత్తులచే శ్రేష్ఠులైనవారికి ఇష్టపంక్తితో భోజనము పెట్టగోరెదరు.

తత్ర యే గుణవంత శ్చ విద్వాంస శ్చ ద్విజాతయః
న పశ్చా త్తేఽభిమన్యంతే సుధా మపి సురోపమాః. 13

అపుడు శీలవంతులు, విద్యావంతులు, దేవతలవలె పూజ్యులు అగు వృద్ధ బ్రాహ్మణులు ఇష్టపంక్తిలో భోజన మమృత తుల్యమయ్యును దాని కంగీకరింపరు.

బ్రాహ్మణే ష్వపి తృప్తేషు పశ్చా ద్భోక్తుం ద్విజర్షభాః
నాభ్యుపైతు మలం ప్రాజ్ఞా శ్శృంగచ్ఛేద మివర్షభాః. 14

మొదట భుజించినవారు బ్రాహ్మణులే అయినను, విద్యా- వయో- వృత్తములచే శ్రేష్ఠులగు బ్రాహ్మణులు ఆబోతులు తమ కొమ్ములు కోయుటను సహింపనట్లు తరువాత (ఇష్టపంక్తిలో) భుజింప నిచ్ఛగింపరు. (లేదా యాబోతు వేఱొక యెద్దు నమలిన కొనలుకల గడ్డిని తిన నిచ్ఛగింపనట్లు, శ్రేష్ఠులగు బ్రాహ్మణులును సామాన్యులగు బ్రాహ్మణులచే శ్రాద్ధకార్యములు జరుపబడిన పిమ్మట, ఇష్టపంక్తిలో తాము భుజింప నిష్టపడరు.

ఏవం కనీయసా భ్రాత్రా భుక్తం రాజ్యం విశాంపతే!
భ్రాతా జ్యేష్ఠో వరిష్ఠ శ్చ కిమర్థం నావమంస్యతే. 15

ఓ మహారాజా! ఇట్లు తన తమ్ము డనుభవించిన రాజ్యము ను, అన్నయు, శ్రేష్ఠుడగు రాము డేల నిరాకరింపడు?

న పరేణాऽహృతం భక్ష్యం వ్యాఘ్రః ఖాదితు మిచ్ఛతి
ఏవ మేత న్నరవ్యాఘ్రః పరలీఢం న మన్యతే. 16

వేఱొక జంతువు తినిన యాహారమును పులి తిన నిచ్ఛగింపనట్లు నరశ్రేష్ఠుడగు రాముడు వేఱొక డనుభవించిన సంపద నాదరింపకు.

హవి రాజ్యం పురోడాశః కుశా యూపా శ్చ ఖాదిరాః
నై తాని యాతయామాని కుర్వంతి పున రధ్వరే. 17

చరువు మున్నగు హవిస్సు, నేయి, పురోడాశము, దర్భలు, చండ్ర, మోదుగు మున్నగువానితో చేయబడిన యూపస్తంభము వీని నొక యాగమున వాడి మఱల వానినే వేఱొక యాగమున నుపయోగింపరు.

తథా హ్యాత్త మిదం రాజ్యం హృతసారాం సురా మివ
నాభిమంతు మలం రామో నష్టసోమ మి వాధ్వరమ్. 18

అట్లే ముందే యనుభవింపబడినదియు, సారాంశమెల్ల గ్రహింపబడిన మద్యమువలె, వేఱొకనిచే సోమపానము చేసిన యాగమువలెనున్న రాజ్యమును రాము డంగీకరింపజాలడు.

నై వంవిధ మసత్కారం రాఘవో మర్ష యిష్యతి
బలవానివ శార్దూలో వాలధే రవమర్శనమ్. 19

బలవంతమగు పులి తన తోక నన్యుడు తాకుట నెట్లు సహింపదో యట్లీ విధమగు నవమానము రాముడు సహింపడు.

నైతస్య సహితా లోకా భయం కుర్యు ర్మహామృధే
అధర్మం త్విహ ధర్మాత్మా లోకం ధర్మేణ యోజయేత్.

పలునాలుగు భువనములలోని దేవాసురులెల్ల రొక్కుమ్మడి కలసివచ్చినను మహాయుద్ధమున రాముని భయపెట్టలేదు. ధర్మాత్ముడగు రాము డధర్మమార్గ మవలంబించిన జనులను చక్కబరచి ధర్మమార్గమున ప్రవర్తింపజేయును.

న న్వసౌ కాంచనై ర్బాణై ర్మహావీర్యో మహాభుజః
యుగాంత ఇవ భూతాని సాగరా నపి నిర్దహేత్. 21

మహాభుజుడు, మహాబల సంపన్నుడగు రాముడు బంగారు బాణములతో యుగాంతకాలము పంచమహాభూతములను దహించునట్లు, సముద్రములను కూడ దహింపజేయగలడు సుమా!

స తాదృశ స్సింహబలో వృషభాక్షో నరర్షభః
స్వయమేవ హతః పిత్రా జలజేనాఽఽత్మజో యథా. 22

అట్లు సింహమువలె బలవంతుడు, వృషభమువలె వెడల్పయిన కన్నులు కల నరశ్రేష్ఠుడగు రాముడు, చేపచే తన బిడ్డ చంపబడినట్లు తన తండ్రి చేతనే హతుడైనాడు.

ద్విజాతిచరితో ధర్మ శ్శాస్త్రదృష్ట స్సనాతనః
యది తే ధర్మనిరతే త్వయా పుత్రే వివాసితే. 23

ధర్మ పరాయణుడగు తనయుని వెడలనంపితివే. ద్విజుల కాచరణీయము, శాస్త్రము విధించినట్టి సనాతన ధర్మము నీ కున్నదా ?

గతి రేకా పతి ర్నార్యా ద్వితీయా గతి రాత్మజః
తృతీయా జ్ఞాతయో రాజం శ్చతుర్థీ నేహ విద్యతే. 24

స్త్రీకి భర్త మొదటి దిక్కు. పుత్రుడు రెండవది. జ్ఞాతులు మూడవది. నాల్గవదగు స్వాతంత్ర్య మీలోకమున లేదు.

తత్ర త్వం చైవ మే నాస్తి రామ శ్చ వన మాశ్రితః
న వనం గంతు మిచ్ఛామి సర్వథా నిహతా త్వయా. 25

అందు నీవు నాపతి యధీనుడవు కాన నాకు లేనట్లే. రెండవ దిక్కగు రాము డడవిలో నున్నాడు. నాకు జ్ఞాతులును దూరమున నుండుటచే లేనట్లే. కాన అన్ని విధముల నీచే నాశమొనరించబడిన నేను భర్త కలదాన నగుటచే నడవికి పోవ గోరుటలేదు

హతం త్వయా రాజ్య మిదం సరాష్ట్రం
హత స్తథాఽఽత్మా సహ మంత్రిభి శ్చ
హతా సపుత్రాఽస్మి హతాశ్చ పౌరా
స్సుత శ్చ భార్యా చ తవ ప్రహృష్టౌ. 26

నీవు రాజ్యము నశింపజేసితివి. నీవును నాశము నందితివి. నీ మంత్రులు నాశము నందినారు. నేను నా తనయునితోగూడ

నాశము నందితిని. పురజనులు నశించినారు. నీ తనయుడగు భరతుడు, నీ భార్య కైకయి మాత్రము సంతోషించుచున్నారు.

ఇమాం గిరం దారుణశబ్దసంశ్రితాం
నిశమ్య రాజాఽపి ముమోహ దుఃఖితః
తత స్సశోకం ప్రవివేశ పార్థివ
స్స్వదుష్కృతం చాపి పునస్తదా స్మరన్. 27

ఘోరమగు శబ్దముతో కూడిన యా కౌసల్య మాటలు విని దుఃఖితుడైన రాజు మూర్ఛిల్లెను. మఱల తెప్పరిల్లి యా రాజు తన పాపకృత్యమును స్మరించుచు చింతాక్రాంతు డయ్యెను.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమందయోధ్యాకాండమున నఱువది యొకటవ సర్గము సంపూర్ణము.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకషష్టితమః సర్గః

---

## ద్విషష్టితమః సర్గః - అరువదిరెండవ సర్గము

ఏవం తు క్రుద్ధయా రాజా రామమాత్రా సశోకయా
శ్రావితః పరుషం వాక్యం చింతయామాస దుఃఖితః. 1

ఇట్లు శోకముతో కోపించిన రామమాతయగు కౌసల్య

పరుషములగు మాటలు పలుకగా, వానిని విని రాజు దుఃఖితుడై చింతించెను.

చింతయిత్వా స చ నృపో ముమోహ వ్యాకులేంద్రియః
అథ దీర్ఘేణ కాలేన సంజ్ఞా మాప పరంతపః. 2

శత్రువులను పీడించునట్టి ఆ రాజట్లు చింతించి యింద్రియములు కలత నొందగా మూర్ఛిల్లెను. చాల తడవున కతడు తెప్పరిల్లెను.

స సంజ్ఞా ముపలభ్యైవ దీర్ఘ ముష్ణం చ నిశ్శ్వసన్
కౌసల్యాం పార్శ్వతో దృష్ట్వా పున శ్చింతా ముపాగమత్.

ఆ రాజు తెలివి నొందుట తోడనే వెచ్చగ నిట్టూర్చుచు తన ప్రక్కనే కౌసల్యను గాంచి తన కిట్టి దుఃస్థితికి కారణమగు తన పురాకృత మేమోయని చింతాక్రాంతు డయ్యెను.

తస్య చింతయమానస్య ప్రత్యభా త్కర్మ దుష్కృతమ్
యదనేన కృతం పూర్వ మజ్ఞానా చ్ఛబ్దవేధినా. 4

అట్లు చింతించుచున్న ఆ దశరథునకు – శబ్దమునుబట్టి (లక్ష్యమును చూడకయే) కొట్టగల తనజ్ఞానముచే మున్నొనర్చిన యకృత్యము తోచెను.

అమనా స్తేన శోకేన రామశోకేన చ ప్రభుః
ద్వాభ్యామపి మహారాజ శ్శోకాభ్యా మన్వతప్యత. 5

ఆ పూర్వకృతమును తలంచుకొనుటచే కలిగిన శోకము చేతను, రాము నెడబాయుటవల్ల కలిగిన శోకము చేతను, యీ యుభయవిధ శోకముచే రాజు మిక్కిలి పరితపించెను.

దహ్యమాన స్స శోకాభ్యాం కౌసల్యా మాహ భూపతిః
వేపమానోఽంజలిం కృత్వా ప్రసాదార్థ మవాఙ్ముఖః. 6

అట్లుభయశోకములచే దహించబడుచున్న రాజు వడకుచు, కౌసల్యను ప్రసన్నను చేయుటకై యంజలి ఘటించి, తలవంచి యామె కిట్లనెను.

ప్రసాదయే త్వాం కౌసల్యే! రచితోఽయం మయాఽంజలిః
వత్సలా చానృశంసా చ త్వం హి నిత్యం పరే ష్వపి. 7

ఓ కౌసల్యా! నే నంజలి యొనర్చి నిన్ను ప్రసన్నురాల నగునట్లు చేసికొందును. నీ వెల్లపుడు శత్రువులపైగూడ దయ జూపు దానవు. మంచి మనసు కలదానవును.

భర్తా తు ఖలు నారీణాం గుణవా న్నిర్గుణోఽపి వా
ధర్మం విమృశమానానాం ప్రత్యక్షం దేవి! దైవతమ్. 8

ఓ దేవీ! భర్త గుణవంతుడే కానిమ్ము, గుణహీనుడే కానిమ్ము. ధర్మము నెఱిగిన యతివల కాతడు ప్రత్యక్ష దైవము.

సా త్వం ధర్మపరా నిత్యం దృష్టలోకపరావరా
నార్హసే విప్రియం వక్తుం దుఃఖితాఽపి సుదుఃఖితమ్. 9

నీవు నిత్యము ధర్మపరాయణవు. లోకమున జనుల ఉత్కర్షాపకర్షముల జూచినదానవు. అట్టి నీ వెంత దుఃఖము నందియు, మిక్కిలి దుఃఖితుడనగు నాతో నప్రియములు పలుక దగదు.

తద్వాక్యం కరుణం రాజ్ఞః శ్రుత్వా దీనస్య భాషితమ్
కౌసల్యా వ్యసృజ ద్బాష్పం ప్రణాళీవ నవోదకమ్. ॥

దీనుడగు రాజట్లు దయగొల్పు రీతిని మాటలాడగా వినిన కౌసల్య మేడమున్నగు వానిపైనుండి వాననీరు క్రిందపడుటకు కొయ్యమున్నగు వానితో చేయబడిన జలమార్గము వోలె జలజల కన్నీరు కార్చెను.

సా మూర్ధ్ని బద్ధ్వా రుదతీ రాజ్ఞః పద్మ మి వాంజలిమ్
సమ్భ్రమా దబ్రవీ త్త్రస్తా త్వరమాణాక్షరం వచః. ॥

ఆమె యేడ్చుచు, రాజొనర్చిన యంజలిని పద్మమునువలె పట్టుకొని తన తలపై ధరించి, ధర్మమునకు వెరచినదై తత్తర బాటుతో తొట్రుబడుచున్న నక్షరములు కల మాటలతో నిట్లనెను.

ప్రసీద శిరసా యాచే భూమౌ నిపతితాఽస్మి తే
యాచితాస్మి హతా దేవ! హంతవ్యాఽహం న హి త్వయా.

ఓ ప్రభూ! నీవు ప్రసన్నుడ వగుము. నా శిరము వంచి భూమిని తాకి ప్రణామము చేయుచున్నాను. నీచే యాచింప జేసి కొన్న దుష్టురాలను. కాన నీవు నన్ని యపరాధము తొలగు కొఱకు నన్ను ప్రహరింప దగవా? (తగుదువు).

నైషా హి సా స్త్రీ భవతి శ్లాఘనీయేన ధీమతా
ఉభయో ర్లోకయో ర్వీర! పత్యా యా సంప్రసాద్యతే. 13

ఓ వీరుడా! ఎవతె కొనియాడదగినవాడును, బుద్ధిమంతుడు అగు తన భర్తచే ప్రసన్నయగునట్లు బుజ్జగింపబడునో యామె యిహపరలోకములు రెంటిని కోల్పోవును.

జానామి ధర్మం ధర్మజ్ఞ! త్వాం జానే సత్యవాదినమ్
పుత్రశోకార్తయా తత్తు మయా కిమపి భాషితమ్. 14

ధర్మము నెఱిగిన ప్రభూ! నీవు సత్యభాషివని నే నెఱుగుదును. పుత్రశోకముచే పీడింపబడినదాననై నే నేమో పలికితిని.

శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్
శోకో నాశయతే సర్వం నాస్తి శోకసమో రిపుః. 15

శోకము ధైర్యమును చెడగొట్టును. దానివలన విద్య నశించును. సర్వమును శోకమువలన చెడును. శోకమునకు సాటియగు శత్రు విలలో లేడు.

శక్య ఆపతిత స్సోఢుం ప్రహారో రిపుహస్తతః
సోఢు మాపతిత శ్శోక స్సుసూక్ష్మోఽపి న శక్యతే. 16

శత్రువు చేతినుండి పైబడిన యాయుధ ప్రహారమును సహింపవచ్చును. శోకము కొంచెమైనను సహింప శక్యముగాదు.

వనవాసాయ రామస్య పంచరాత్రోఽద్య గణ్యతే
య శ్శోకహతహర్షాయాః పంచవర్షోపమో మమ. 17

రాముడు వనవాసమున కేగి నేటి కైదు దినములైనది. శోకముచే హర్షము నశించిన నాకు మాత్రమిది యైదు సంవత్సరములకు సమానముగ తోచుచున్నది.

తం హి చింతయమానాయాః శోకోఽయం హృది వర్ధతే
నదీనా మివ వేగేన సముద్రసలిలం మహత్. 18

నదీవేగముచే సముద్రము వృద్ధినందినట్లు తనయుని తలంచుకొనుచున్న కొలది నా మదిలో శోకము పెంపొందుచున్నది.

ఏవం హి కథయంత్యాస్తు కౌసల్యాయాః శ్శుభం వచః
మందరశ్మి రభూ త్సూర్యో రజనీ చాభ్యవర్తత. 19

కౌసల్య యిట్లు మంగళములగు మాటలు పలుకుచుండగనే సూర్యు డస్తమించెను రాత్రియు వచ్చెను.

తథా ప్రసాదితో వాక్యై ర్దేవ్యా కౌసల్యయా నృపః
శోకేన చ సమాక్రాంతో నిద్రాయా వశ మేయివాన్. 20

రాజట్లు కౌసల్యాదేవియొక్క శుభవాక్యములచే కలత దీర్చబడినవాడై, శోకమునందియు నిద్రావశు డయ్యెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ద్విషష్టితమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమునందయోధ్యాకాండమున నఱువది రెండవ సర్గము సంపూర్ణము.

—0—

## త్రిషష్టితమః సర్గః - అఱువదిమూడవ సర్గము

ప్రతిబుద్ధో ముహూర్తేన శోకోపహతచేతనః
అథ రాజా దశరథ స్స చింతా మభ్యపద్యత. 1

దశరథమహారాజు మఱల నొక్క ముహూర్తముననే మేల్కొంచి, శోకాక్రాంతమగు మనస్సు కలవాడై చింతించెను.

రామలక్ష్మణయో శ్చైవ వివాసా ద్వాసవోపమమ్
ఆవివే శోపసర్గ స్తం తమ స్సూర్య మివాఽసురమ్. 2

రామలక్ష్మణుల నడవికంపుటచే దేవేంద్రునితో సాటియగు నా దశరథుని- రాహువు సూర్యునివోలె పుత్రశోకరూపమగు నుపద్రవ మావేశించెను.

సభార్యే నిర్గతే రామే కౌసల్యాం కోసలేశ్వరః
వివక్షు రసితాపాంగాం స్మృత్వా దుష్కృత మాత్మనః. 3

రాముడు భార్యాసమేతుడై యడవికి పోగా దశరథుడు తన పాపకృత్యము దలంచికొని తన భార్య కౌసల్య కావిషయము చెప్పదలంచెను.

స రాజా రజనీం షష్ఠీం రామే ప్రవ్రాజితే వనమ్
అర్ధరాత్రే దశరథ స్సంస్మరన్ దుష్కృతం కృతమ్. 4

ఆ రాజు రాము నడవికి పంపిన నాటి కాఱవరాత్రి యర్ధ రాత్రకాలమున తాను మున్నొనర్చిన యకృత్యము స్మరించెను.

స రాజా పుత్త్రశోకార్తః స్మృత్వా దుష్కృత మాత్మనః
కౌసల్యాం పుత్త్రశోకార్తా మిదం వచన మబ్రవీత్. 5

పుత్రశోకముచే పీడితుడైన యా రాజు తన దుష్కృతమును తలచుకొని, పుత్రశోకముచే పీడింపబడుచున్న కౌసల్య కిట్లనెను.

య దాచరతి కల్యాణి! శుభం వా యదివాఽశుభమ్
తదేవ లభతే భద్రే! కర్తా కర్మజ మాత్మనః. 6

ఓ కల్యాణీ! ఒక పనిచేయు మనుజుడు, తాను చేయు పని శుభమో, అశుభమో, తదనుగుణముగ శుభమగు ఫలమునుగాని, అశుభమగు ఫలముగాని పొందును.

గురులాఘవ మర్థానా మారంభే కర్మణాం ఫలమ్
దోషం వా యో న జానాతి స బాల ఇతి హోచ్యతే. 7

ఎవడు కార్యములను చేయ సమకట్టునపుడు, ఆ పనుల ఫలములోని యెక్కువ తక్కువలుగాని, లాభనష్టములను (లేదా అందలి సుఖదుఃఖములను) గాని యెఱుగజాలడో యాతడు మూఢు డని చెప్పబడును.

కశ్చి దామ్రవణం ఛిత్వా పలాశాం శ్చ నిషించతి
పుష్పం దృష్ట్వా ఫలే గృధ్ను స్స శోచతి ఫలాగమే. 8

ఎవడు మామిడిపూవు చిన్నది కనుక అది చిన్నకాయలే కాయునని. మోదుగ పూవు పెద్దదికనుక అది పెద్దకాయలు కాయునని తలచి, మామిడిచెట్లను నఱకివైచి, మోదుగ చెట్లకు నీరు పోయునో వాడు పండ్లు వచ్చునాటికి తానెదురు చూచిన మహాఫలమును కానక దుఃఖించును.

అవిజ్ఞాయ ఫలం యో హి కర్మత్వే వానుధావతి
స శోచే త్ఫలవేళాయాం యథా కింశుక సేచకః. 9

ఎవడు ఫలమును గూర్చి యాలోచింపక పనిని మాత్ర మాచరించునో అతడు మోదుగ చెట్టునకు నీరుపెట్టిన వానివలె ఫలకాలమున శోకించును.

సోఽహ మామ్రవణం ఛిత్వా పలాశాం శ్చ న్యషేచయమ్
రామం ఫలాగమే త్యక్త్వా పశ్చా చ్ఛోచామి దుర్మతిః. 10

మామిడి తోటను నఱకి, మోదుగ తోటకు నీరుపోసి పెంచిన వానితో సమానుడనగు నేను బుద్ధిహీనుడనై రాము నభిషేకింపక యడవికి పంపి, కైకకు ప్రీతికలిగించితిని. ఇపుడు ఫలకాలమున రాముని బాసి, అతనితో నెడబాటువలన కలిగిన ఫల మనుభవించుచు దుఃఖపడుచున్నాను.

లబ్ధశబ్దేన కౌసల్యే! కుమారేణ ధనుష్మతా
కుమార శ్శబ్దవేధీతి మయా పాప మిదం కృతమ్. 11

నా కుమారదశలో నీతడు శబ్దమును బట్టి లక్ష్యమును చూడకయే కొట్టగలవాడని ప్రఖ్యాతినందిన విలుకాడనగు నేనీ పాపము చేసితిని.

త దిదం మేఽనుసంప్రాప్తం దేవి! దుఃఖంస్వయంకృతమ్
సమ్మోహా దిహ బాలేన యథా స్యా ద్భక్షితం విషమ్.

అజ్ఞానముచే బాలుడు విషము తిన్నట్లు, నేను స్వయముగ చేసికొన్న యీ పాపము మిక్కిలి తీవ్రమైన దగుటచే భావి జన్మమున గాక యీ జన్మముననే దుఃఖముగా పరిణమించినది.

యథాఽన్యః పురుషః కశ్చి త్పలాశై ర్మోహితో భవేత్
ఏవం మమాఽప్యవిజ్ఞాతం శబ్దవేధ్యమయం ఫలమ్. 13

మోదుగ పూవులను చూచి యవి పెద్దకాయ లగునని భ్రాంతి చెందినట్లు, యొకడు శబ్దవేధి వలన నాకు కలిగిన కీర్తిని చూచి, దీని ఫలము నిట్లే యుండునని భ్రాంతి నందితిని.

దే వ్యనూఢా త్వ మభవో యువరాజో భవా మ్యహమ్
తతః ప్రావృ డనుప్రాప్తా మదకామవివర్ధనీ. 14

ఓ దేవీ! నీ కప్పటికి పెండ్లికాలేదు. నేను యువరాజుగా నుంటిని (మా తండ్రి యపుడు జీవించి యున్నాడని భా). అపుడు మదమును, కామమును వృద్ధినందించు వర్షాకాలము వచ్చెను.

ఉపాస్య హి రసాన్ భౌమాం స్తప్త్వా చ జగ దంశుభిః
పరేతాచరితాం భీమాం రవి రావిశతే దిశమ్. 15

లోకమును తన కిరణములతో తపింపజేసి, భూమిపై గల నీటిని దహించినవాడై, సూర్యుడు దక్షిణదిశను ప్రవేశించెను (అపుడు దక్షిణాయనము మొదలాయెనని భా.).

ఉష్ణ మంతర్దధే సద్య స్స్నిగ్ధా దదృశిరే ఘనాః
తతో జహృషిరే సర్వే భేకసారంగబర్హిణః. 16

వేడి మటుమాయ మయ్యెను. మేఘములు దట్టముగ క్రమ్మెను. కప్పలు, లేళ్లు, నెమళ్లు అన్నియు మిగుల సంతోష మందెను.

క్లిన్నపక్షోత్తరా స్స్నాతాః కృచ్ఛ్రా దివ పతత్రిణః
వృష్టివాతావధూతాగ్రాన్ పాదపా నభిపేదిరే. 17

పక్షులు రెక్కల పైభాగములు తడియగా, స్నానము చేసిన వానివలె చాల కష్టపడి గాలి వానలచే కదల్చబడిన కొనలుగల చెట్లను చేరుకొనెను.

పతితే నాంభసా చ్ఛన్నః పతమానేన చాసకృత్
అబభౌ మత్తసారంగ స్తోయరాశి రివాచలః. 18

మత్తెక్కిన యేనుగు నిరంతరము పడుచున్న వాననీటిచే కప్పబడి యలలులేని సముద్రమువలె ప్రకాశించెను.

పాండురారుణవర్ణాని స్రోతాంసి విమలా న్యపి
సుస్రువు ర్గిరిధాతుభ్య స్సభస్మాని భుజంగవత్. 19

జలప్రవాహములు నిర్మలములైనను కొండపైనున్న ధాతువులు కారణముగా తెల్లని ధాతువులతో సంయోగము వలన తెల్లగా, ఎఱ్ఱని ధాతువులతో సంబంధము వలన యెఱ్ఱగను దావానల భస్మముతో కూడినవిగను అగుచు అనేక వర్ణములతో కూడిన పాములవలె వంకరగా స్రవించినని.

తస్మి న్నతిసుఖే కాలే ధనుష్మా నిషుమాన్ రథీ
వ్యాయామకృతసంకల్ప స్సరయూ మన్వగాం నదీమ్.

నిపానే మహిషం రాత్రౌ గజం వాఽభ్యాగతం నదీమ్
అన్యం వా శ్వాపదం కంచి జ్జిఘాంసు రజితేంద్రియః. 21

మిక్కిలి సుఖము కలిగించు ఆ సమయమున నేను ధనుర్బాణములు ధరించి రథమెక్కి వేటాడవలయునను కోరికతో సరయూనది కడ కేగితిని. జితేంద్రియుడను కాకుండుటచే నదిలో నీరు త్రాగుటకై దిగు రేవువద్ద యెనుబోతును గాని, యేనుగును గాని, వేఱొక క్రూరమృగమునుగాని నీరు త్రాగుటకు వచ్చినపుడు చంపదలంచితిని.

అథాంధకారే త్వశ్రౌషం జలే కుంభస్య పూర్యతః
అచక్షుర్విషయే ఘోషం వారణ స్యేవ నర్దతః. 22

ఆ యంధకారమున కన్నుల కేమియు కనుపించని యచట యేనుగు ఘీంకారమువలె నున్న నీటిలో కడవ ముంచినపుడు వచ్చు శబ్దము వింటిని.

తతోఽహం శర ముద్ధృత్య దీప్త మాశీవిషోపమమ్
శబ్దం ప్రతి గజప్రేప్సు రభిలక్ష్య త్వపాతయమ్. 23

అపుడు నేను ప్రకాశమానమును, సర్పమువలె నున్నదియు అగునట్టి బాణము నా యేనుగను పొంద (చంప) గోరు వాడనై, శబ్దము విన వచ్చినవైపు గురిచూచి వైచితిని.

అముంచం నిశితం బాణ మహ మాశీవిషోపమమ్
తత్ర వా గుషసి వ్యక్తా ప్రాదురాసీ ద్వనౌకసః 24
హా హేతి పతత స్తోయే బాణాభిహతమర్మణః.

నే నటులు సర్పసదృశమగు బాణమును అవైపు గురిపెట్టి వేసితిని. అపు డా ప్రాతఃకాలమున నా బాణము మర్మమున తాకిన వనవాసి యొకడు హా హా యనుచు నీటిలో పడిన శబ్దము స్పష్టముగా విన నయ్యెను.

తస్మి న్నిపతితే బాణే వా గభూ త్తత్ర మానుషీ. 25

ఆ బాణ మట్లు పడుట తోడనే మనుష్యవాక్కు విన నయ్యెను.

కథ మస్మద్విధే శస్త్రం నిపతేత్తు తపస్విని
ప్రవివిక్తాం నదీం రాత్రా వుదాహారోఽహ మాగతః 26
ఇషుణాఽభిహతః కేన కస్య వా కిం కృతం మయా?.

నా వంటి తాపసునిపై అయుధము లెట్లు పడును? నీరు తీసికొనుట కీ రాత్రి సమయమున నెవ్వరు లేనపుడు వచ్చితినే.

న న్నెవరు బాణముతో కొట్టినారు ? వారికి నే నేమి యపకారము చేసితిని ?

ఋషే ర్హి న్యస్తదండస్య వనే వన్యేన జీవతః 27
కథం ను శస్త్రేణ వధో మద్విధస్య విధీయతే.

వాఙ్మనఃకాయములతో పరహింస చేయుటను విరమించి, ఋషినై, యడవిలో లభించు కందమూలములతో జీవించు నావంటివాని నాయుధముతో వధించుట యెట్లు తగును ?

జటాభారధర స్యైవ వల్కలాజినవాససః 28
కో వధేన మ మార్థీ స్యాత్ కిం వాఽస్యాపకృతం మయా ?

జటాసమూహములు ధరించి, నారవస్త్రములు, కృష్ణాజినము దాల్చు నన్నెవ్వడు చంపగోరును ? నే నాతని కే యపకారము చేసితిని ?

ఏవం నిష్ఫల మారబ్ధం కేవలానర్థసంహితమ్ 29
న కశ్చి త్సాధు మన్యేత యథైవ గురుతల్పగమ్.

ఇట్లు చేయుటచే నే ప్రయోజనము చేకూరక యనర్థము మాత్రము వచ్చిపడును. ఈ విధముగ నన్ను కొట్టినవానిని గురువుగారి భార్యను పొందిన వానిని వలె పాపినిగా చూతురుగాని యోగ్యుడని యెవ్వడును తలంపడు.

నాహం తథాఽనుశోచామి జీవితక్షయ మాత్మనః 30
మాతరం పితరం చోభా వనుశోచామి మద్వధే.

నా జీవితము నశింపనున్నదని నేను బాధపడుటలేదు. నేను చనిపోయినచో నా తల్లిగతి, తండ్రిగతి యేమగునా యనియే బాధపడుచున్నాను.

త దేత న్మిథునం వృద్ధం చిరకాలభృతం మయా 31
మయి పంచత్వ మాపన్నే కాం వృత్తిం వ ర్తయిష్యతి.

వృద్ధులగు నీ దంపతులను (నా జననీజనకులను) చాల కాలమునుండి పోషించుచున్నాను. నేను మరణించగా వా రెట్లు బ్రతుకగలరు ?

వృద్ధౌ చ మాతాపితరా వహం చై కేషుణా హతః 32
కేన స్మ నిహతా స్సర్వే సుబాలే నాకృతాత్మనా.

ముదుసలు లగు నా తల్లిదండ్రులు, నేనును, ముప్వుర మొకే బాణముతో చంపబడితిమి. తెలివిలేక మమ్ములను జంపిన ఆ మూర్ఖు డెవడు ?

తాం గిరం కరుణాం శ్రుత్వా మమ ధర్మానుకాంక్షిణః
కరాభ్యాం సశరం చాపం వ్యథిత స్యాపత ద్భువి.

దయగొలుపు ఆ మాటలు వినగనే ధర్మమం దాసక్తిగల నేను బాధనొందితిని. నా చేతినుండి విల్లమ్ములు జారి నేలబడినవి.

త స్యాహం కరుణం శ్రుత్వా నిశి లాలపతో బహు 34
సంభ్రాంత శ్శోకవేగేన భృశ మాసం విచేతనః.

ఆ రాత్రి యట్లు జాలికలుగునట్లు మిగుల రోదించుచున్న

యాతని రోదనమును విని తత్తరపడి, మిగుల శోకమునంది నిశ్చేష్టుడ నైతిని.

తం దేశ మహ మాగమ్య దీనసత్త్వ స్సుదుర్మనాః. 35
అపశ్య మిషుణా తీరే సరయ్వా స్తాపసం హతమ్
అవకీర్ణజటాభారం ప్రవిద్ధకలశోదకమ్ 36
పాంసుశోణితదిగ్ధాంగం శయానం శల్యపీడితమ్.

అంత దీనహృదయుడనై, మిక్కిలి దుఃఖము నొందిన మనసుకల నే నా ధ్వనివచ్చిన చోటికేగి, సరయూతీరమున బాణ హతుడై జడలు చిందరవందరయై, కడవలోని నీరు చింది, దుమ్ము, నెత్తురు శరీరమున కంటుకొని. బాణము నాటుటచే బాధనొందుచున్న తాపసకుమారుని చూచితిని.

స మా ముద్వీక్ష్య నేత్రాభ్యాం త్రస్త మస్వస్థచేతసమ్ 37
ఇ త్యువాచ తతః క్రూరం దిధక్ష న్నివ తేజసా.

అపుడు భయపడిన వాడను, కలవరమునొందిన మనస్సు కలవాడనగు నన్ను తీక్ష్ణముగ చూచి, తన తేజముతో నన్ను తగులబెట్టగోరువానివలె నత డిట్లు కఠినముగ పలికెను.

కిం తవాపకృతం రాజన్ వనే నివసతా మయా 38
జిహీర్షు రంభో గుర్వర్థం య దహం తాడిత స్త్వయా.

రాజా! నా తల్లిదండ్రులకొఱకు నీటిని తెచ్చుకొనగోరిన నన్నిట్లు కొట్టుట కడవిలో నివసించు నేను నీ కేమి యపకారము చేసితిని?

ఏకేన ఖలు బాణేన మర్మ ణ్యభిహతే మయి 39
ద్వా వంధౌ నిహతౌ వృద్ధౌ మాతా జనయితా చ మే.

నీవు న న్నొకే బాణముచే మర్మస్థానమున గొట్టితివి. దీని ఫలముగ నేనే కాక గ్రుడ్డివారగు నా తల్లిదండ్రులును చంపి బడుదురు

తౌ కథం దుర్బలా వంధౌ మత్ప్రతీక్షౌ పిపాసితౌ 40
చిర మాశాకృతాం తృష్ణాం కష్టాం సంధారయిష్యతః.

నా తల్లిదండ్రులు దుర్బలులు, గ్రుడ్డివారు, దప్పికగొని నా రాక కెదురుచూచుచు, చాలకాలమునుండి యున్న దప్పికను మిగుల కష్టముతో సహించు చుందురు.

న నూనం తపసో వాఽస్తి ఫలయోగ శ్శ్రుతస్య వా 41
పితా య న్మాం న జానాతి శయానం పతితం భువి.

నే నింత తపము చేసియు, చదువు చదివియు నిష్ఫల మాయెనే. నే నిచట బాణపు దెబ్బ తిని నేల బడితినని నా తండ్రికి తెలియజేయ జాలనైతిని.

జానన్నపి చ కిం కుర్యా దశక్తి రపరిక్రమః 42
భిద్యమాన మి వాశక్త స్త్రాతు మన్యో నగో నగమ్.

నా తండ్రి యశక్తుడు, నడువలేనివాడు. గాలి ముప్పుగు వానిచే విరిగిపోవుచున్న చెట్టును వేఱొక చెట్టు రక్షింపలేనటు లాయనయు నన్ను కాపాడజాలడు.

పితు స్త్వ మేవ మే గత్వా శీఘ్ర మాచక్ష్వ రాఘవ! 43
న త్వా మనుదహేత్ క్రుద్ధో వనం వహ్ని రి వైధితః.

ఓ రాఘవుడా! నీవే శీఘ్రముగ మా తండ్రికడ కేగి యీ విషయ మెఱింగింపుము. అట్లు నీవే తెలుపగా నాత డడవిలో వృద్ధినందిన కార్చిచ్చువలె కోపముతో నిన్ను దహింపకుండును.

ఇయ మేకపదీ రాజన్ యతో మే పితు రాశ్రమః 44
తం ప్రసాదయ గత్వా త్వం న త్వాం స కుపిత శ్శపేత్.

రాజా! నా తండ్రియున్న యాశ్రమమున కిదియే దారి. నీవు పోయి యాతనిని ప్రసన్నుని చేసికొమ్ము. అపు డాయన కోపమునొంది నిన్ను శపింపకుండును.

విశల్యం కురు మాం రాజన్ మర్మ మే నిశిత శ్శరః 45
రుణద్ధి మృదు సోత్సేధం తీర మంబురయో యథా.

రాజా! నా శరీరమునుండి యీ బాణమును పెరకి వేయుము. జలవేగము ఇసుక - మట్టితోగూడి యుండుటచే మెత్తనిది, ఎత్తైనదగు తీరమును వోలె నా మర్మస్థానమును పీడించుచున్నది.

సశల్యః క్లిశ్యతే ప్రాణై ర్విశల్యో వినశిష్యతి 46
ఇతి మా మవిశ చ్చింతా తస్య శల్యాపకర్షణే.

"బాణమిట్లే గుచ్చుకొని యున్నచో నీతడు బాధపడును. దానిని పెరకివైచినచో నీతని ప్రాణములే పోవును." అని

యిట్లాతనికి గుచ్చుకొన్నబాణమును తీసి వేయువిషయమున నాకు చింత కలిగెను.

దుఃఖితస్య చ దీనస్య మమ శోకాతురస్య చ 47
లక్షయామాస హృదయే చింతాం మునిసుత స్తదా.

అపు డా మునికుమారుడు దుఃఖము నొందినవాడను, దీనుడను, శోక పీడితుడనగు నా మదిలోని చింతను గమనించెను.

తామ్యమాన స్స మాం కృచ్ఛ్రా దువాచ పరమార్తవత్.48
సీదమానో వివృత్తాంగో వేష్టమానో గతః క్షయమ్
సంస్తభ్య శోకం ధైర్యేణ స్థిరచిత్తో భవామ్యహమ్. 49
బ్రహ్మహత్యాకృతం పాపం హృదయా దపనీయతామ్
న ద్విజాతి రహం రాజన్ మాభూ త్తే మనసో వ్యథా.50
శూద్రాయా మస్మి వైశ్యేన జాతో జనపదాధిప!

అంత నా మునికుమారుడు బాధనందుచు, మిగుల నార్తితో దుఃఖపడుచు, నంగములు ముడుచుకొని దొరలుచు మరణకాలము సమీపించినవాడై, "శోకమును నిగ్రహించుకొని ధైర్యముతో స్థిరచిత్తుడ నగుచున్నాను. నీవు బాణమును నా శరీరమునుండి పెరకివేయుటతోడనే నేను మరణించిన నీకు బ్రహ్మహత్యామహాపాపము వచ్చునను శంశ నీ హృదయము నుండి తొలగించుకొమ్ము. నేను ద్విజుడను కాను. నీకావిషయమున చింత వలదు. నే నొక శూద్రస్త్రీకి వైశ్యునివలన బుట్టినవాడను'.

ఇతీవ వదతః కృచ్ఛ్రా ద్బాణాభిహతమర్మణః 51
విఘూర్ణతో విచేష్టస్య వేపమానస్య భూతలే
తస్య త్వానమ్యమానస్య తం బాణ మహ ముద్ధరమ్
స మా ముద్వీక్ష్య సంత్రస్తో జహౌ ప్రాణాంస్తపోధనః.52

బాణముచే మర్మస్థానమున కొట్టబడినవాడై క్లేశముతో నిట్లు పలుకుచు దొరలుచు, మఱల నిశ్చేష్టుడై, తిరిగి భూమిపైబడి కొంచెము వణకుచు బాధతో నవయవములు ముడుచుకొనుచున్న యాతని శరీరమునుండి నేను బాణము లాగి వైచితిని. ఆతపోధనుడును బెదరుచు నన్ను చూచుచునే ప్రాణములు విడచెను.

జలార్ద్రగాత్రం తు విలప్య కృచ్ఛ్రా
న్మర్మవ్రణం సంతత ముచ్ఛ్వసంతమ్
తత స్సరయ్వాం త మహం శయానం
సమీక్ష్య భద్రేఽస్మి భృశం విషణ్ణః. 53

ఓ శుభాంగి! నీటితో తడిసిన శరీరము కలవాడై, విరామము లేక నిట్టూర్చుచు, మర్మస్థానముం దేర్పడిన గాయము కలవాడై, సరయూ తీరమున బడియున్న నాతనిని మొదట చూచుటతోడనే మిగుల విషాదము నందితిని.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్రిషష్టితమః సర్గః
ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నఱువది మూడవ సర్గము సమాప్తము.

—o—

# చతుష్షష్టితమః సర్గః - అఱువదినాల్గవ సర్గము

వధ మప్రతిరూపం తు మహర్షే స్తస్య రాఘవః
విలప న్నేవ ధర్మాత్మా కౌసల్యాం పున రబ్రవీత్. 1

ధర్మాత్ముఁడగు దశరథుడు నడుమ నడుమ తన కుమారుని తలంచి వగచుచునే, తాను చేసినది, ఎప్పుడును చేయనట్టి దగు మహర్షివధను గూర్చి కౌసల్య కిట్లనెను.

తదజ్ఞానా న్మహ త్పాపం కృత్వాఽహం సంకులేంద్రియః
ఏక స్త్వచింతయం బుద్ధ్యా కథం ను సుకృతం భవేత్.

ఎఱుగక నట్టి ఘోరపాప మొనర్చిన వాఁడనై, కలతనొందిన యంగములు కల నే నొంటిరిగా నెట్లు చేసిన లెస్స యని యాలోచించితిని.

తత స్తం ఘట మాదాయ పూర్ణం పరమవారిణా
ఆశ్రమం త మహం ప్రాప్య యథాఖ్యాతపథం గతః. 3

పిమ్మట శ్రేష్ఠమగు జలముతో నిండిన యా కడవను తీసికొని మునికుమారుడు తెలిపిన మార్గమున పోయి యాశ్రమము చేరితిని.

త త్రాహం దుర్బలా వంధౌ వృద్ధా వపరిణాయకౌ
అపశ్యం తస్య పితరౌ లూనపక్షా వివ ద్విజౌ. 4
తన్నిమిత్తాభి రాసీనౌ కథాభి రపరిక్రమౌ
తా మాశాం మత్కృతే హీనా వుదాసీనా వనాథవత్. 5

ఆ యాశ్రమమున నేను దుర్బలులు, గ్రుడ్డివారు, పుడుసలులు, కమ్మిటునటు చెయ్యి పట్టుకొని త్రిప్పువాడు లేనివారు, రెక్కలు తెగిన పక్షులవలె నున్నవారు తమ కుమారునకు సంబంధించి మాటలాడుకొనుచు, ఇటునటు తిరుగాడలేక, నా కారణముగ నీరుతెచ్చునను ఆశచెడి (కుమారునకు సంబంధించిన యాశ చెడి) ప్రయత్నము వీడియున్న నా మునికుమారుని తల్లిదండ్రులను చూచితిని.

శోకోపహతచిత్త శ్చ భయసంత్రస్తచేతనః
తచ్చాఽఽశ్రమపదం గత్వా భూయ శ్శోక మహం గతః. 6

ముందే మునికుమారుని మరణముచే శోకించిన వాడనై, యాతని తల్లిదండ్రులను చూచుటచే భయముతో మనస్సు కలవరపడగా మఱల శోకము నందితిని.

పదశబ్దం తు మే శ్రుత్వా ముని ర్వాక్య మభాషత

నా యడుగుల సవ్వడి వినుచునే ముని యిట్లనెను.

కిం చిరాయసి మే పుత్ర! పానీయం క్షిప్ర మానయ. 7
యన్నిమిత్త మిదం తాత! సలిలే క్రీడితం త్వయా
ఉత్కంఠితా తే మాతేయం ప్రవిశ క్షిప్ర మాశ్రమమ్. 8
య ద్వ్యళీకం కృతం పుత్ర! మాత్రా తే యది వా మయా
న త న్మనసి కర్తవ్యం త్వయా తాత! తపస్వినా. 9
త్వం గతి స్త్వగతీనాం చ చక్షు స్త్వం హీనచక్షుషామ్
సమాసక్తా స్త్వయి ప్రాణాః కిం త్వం నో నాభిభాషసే. 10

నా కుమారుడా! నీ వేల జాగు చేయుచుంటివి. వెంటనే నీరు కొని తెమ్ము. నీ వేల నీటిలో క్రీడించుచుంటివి? నీ కై నీతల్లి తహతహపడుచున్నది. శీఘ్రమే యాశ్రమమును ప్రవేశింపుము. నీవు తపస్వివి గావున నీతల్లిగాని నేను గాని, నీకేమైన యప్రియ మాచరించినచో దానిని నీవు మనసులో నుంచుకొనకుము. దిక్కులేని మాకు నీవే దిక్కు (నడువజాలని మాకు నీవే నడక). కన్నులు లేని మాకు నీవే కన్ను. మా ప్రాణములు నీయందే లగ్నమైయున్నవి. నీవేల మాటలాడవు?

మని మవ్యక్తయా వాచా త మహం సజ్జమానయా
హీనవ్యంజనయా ప్రేక్ష్య భీతోఽభీత ఇవాబ్రువమ్. 11

నేనును ఆ మునిని చూచుటతోడనే భయపడి, అస్పష్టాక్షరములతో తొట్రుపాటు కలదై అస్పష్టమగువాక్యమునిట్లుచెప్పితిని.

మనసః కర్మ చేష్టాభి రభిసంస్తభ్య వాగ్బలమ్
అచచక్షే త్వహం తస్మై పుత్రవ్యసనజం భయమ్. 12

మనస్సు యొక్క కార్యమగు ఊహాపోహలు, ఇంద్రియ నియమన రూపములగు వ్యాపారములతో, తొట్రువడుచున్న నా మాటను ప్రయత్నముతో చక్కబరచికొని యా మునికి భయము కలిగించు కుమారుని మరణవార్త నిట్లు చెప్పితిని.

క్షత్త్రియోఽహం దశరథో నాహం పుత్త్రో మహాత్మనః
సజ్జనావమతం దుఃఖ మిదం ప్రాప్తం స్వకర్మజమ్. 13

నేను క్షత్రియుడను. నన్ను దశరథు డందురు. నేను

మహాత్ముడవగు నీ తనయుడగు కాను. నా పూర్వ దుష్కృతము వలన సజ్జనులు నిందించు ఈ దుఃఖమిపుడు కలిగినది.

భగవం! శ్చాపహస్తోఽహం సరయూతీర మాగతః
జిఘాంసు శ్శ్వాపదం కంచి న్నిపానే చాగతం గజమ్. 14

ఓ పూజ్యుడా! యేటి నీరు త్రాగుటకు వచ్చిన యేనుగును గాని, క్రూర జంతువునుగాని చంపగోరుచు నేను ధనుష్పాణినై సరయూతీరమున కేతెంచితిని.

తత శ్శ్రుతో మయా శబ్దో జలే కుంభస్య పూర్యతః
ద్విపోఽయ మితి మత్వాఽయం బాణే నాభిహతో మయా.

అంత నీటిలో కడవ నింపబడుచున్న శబ్దము నేను వింటిని. అది యేనుగయే యని భావించి దానిని బాణముతో కొట్టితిని.

గత్వా నద్యా స్తత స్తీర మపశ్య మిషుణా హృది
వినిర్భిన్నం గతప్రాణం శయానం భువి తాపసమ్. 16

పిమ్మట నదీతీరమునకేగి, యిచట గుండెలో బాణము నాటుటచే ప్రాణములు తొలగి భూమిపై బడిన తాపసుని చూచితిని.

భగవ! ఇచ్ఛబ్ది మాలక్ష్య మయా గజజిఘాంసునా
విసృష్టోఽంభసి నారాచ స్తేన తే నిహత స్సుతః. 17

మహాత్మా! ధ్వనిని బట్టి గురిచూచి యేనుగను చంపగోరుచు నీటిలో నేనేసిన బాణముచే నీ కుమారుడుచంపబడినాడు.

తత స్త స్యైవ వచనా దుపేత్య పరితప్యతః
స మయా సహసా బాణ ఉద్ధృతో మర్మత స్తదా. 18

పిమ్మట బాధనందుచున్న అతని కోరికతోనే నే నాతని మర్మస్థానము నుండి బాణమును వెంటనే తీసివైచితిని.

స చోద్ధృతేన బాణేన తత్రైవ స్వర్గ మాస్థితః
భవంతౌ పితరౌ శోచ న్నంధా వితి విలప్య చ. 19

అట్లు బాణమును తీసివేయగనే యతడు తల్లిదండ్రులగు మిమ్ములను గూర్చి చింతించుచు, మీరు గ్రుడ్డివారగుటచే దిక్కు లేనివా రయితిరని విలపించుచు, యటనే స్వర్గతు డయ్యెను.

అజ్ఞానా ద్భవతః పుత్త్ర స్సహసాఽభిహతో మయా
శేష మేవం గతే య త్స్యా త్తత్ప్రసీదతు మే మునిః. 20

అజ్ఞానమువలన నేను మీ కుమారుని తటాలున చంపితిని. పరిస్థితి యిటు లుండగా మిగిలిన కర్తవ్య మేమో దానిని నా విషయమున నీవు చేయదగుదువు.

స త చ్ఛ్రుత్వా వచః క్రూరం మయోక్త మఘశంసినా
నాశక త్తీవ్ర మాయాస మకర్తుం భగవా నృషిః. 21

దుఃఖకరమగు అట్టి వార్తను నేను తెలుపగా విని మహాత్ము డగు ఆ ఋషి తీవ్రమగు క్లేశమును (కోపమును) సహింపజాల డయ్యెను.

స బాష్పపూర్ణవదనో నిశ్శ్వసన్ శోకకర్శితః
మా మువాచ మహాతేజాః కృతాంజలి ముపస్థితమ్. 22

మహాతేజస్వియగు అతడు ముఖమున కన్నీరు నించి, నిట్టూర్చుచు, శోకపీడితుడై తన చెంత సాంజలి యై నిలిచిన నాతో నిట్లు పలికెను.

య ద్యేత దశుభం కర్మ న త్వం మే కథయే స్స్వయమ్
ఫలే న్మూర్ధా స్మ తే రాజన్! సద్య శ్శతసహస్రధా. 23

ఓ రాజా! ఈ యశుభ మగు పనిని నీవు స్వయముగ నాకు తెలుప కుండినచో నీతల లక్ష ముక్కలై పోయి యుండెడిది.

క్షత్త్రియేణ వధో రాజన్ వానప్రస్థే విశేషతః
జ్ఞానపూర్వం కృతః స్థానా చ్చ్యావయే దపి వజ్రిణమ్. 24

రాజా! క్షత్రియుడు తెలియక యెవనినైనను, విశేషించి వానప్రస్థుని వధించుచో నది యింద్రునైన (నా శాపముచే) పదవి నుండి తొలగించును. తెలిసి చేసినచో విశేషించి (వెను వెంటనే విలంబములేకయే) యాతని పదభ్రష్టుని చేయును.

సప్తధా తు ఫలే న్మూర్ధా మునౌ తపసి తిష్ఠతి
జ్ఞానా ద్విసృజత శ్శస్త్రం తాదృశే బ్రహ్మవాదిని. 25

తప మొనర్చుచున్న బ్రహ్మవిదుడగు మునిపై నాయుధ మును తెలిసి ప్రయోగించువాని తల యేడు వ్రయ్యలై పోవును.

అజ్ఞానా ద్ధి కృతం యస్మా దిదం తేనైవ జీవసి
అపి హ్యద్య కులం న స్యా దిక్ష్వాకూణాం కుతో భవాన్.

నీ వీ పని తెలియక చేసితివి కాన నీ విపుడు జీవించుచు న్నావు. అట్లుకాక తెలిసియే నీ వీ పని చేసి యున్నచో నీ వంశమే నశించియుండెడిది. ఇంక ని విషయము వేఱుగ చెప్పవలయునా?

నయ నౌ నృప! తం దేశ మితి మాం చాభ్యభాషత
అద్య తం ద్రష్టు మిచ్ఛావః పుత్త్రం పశ్చిమదర్శనమ్. 27

రుధిరే ణావసిక్తాంగం ప్రకీర్ణాజినవాసనమ్
శయానం భువి నిస్సంజ్ఞం ధర్మరాజవశం గతమ్. 28

రాజా ! నీ విపుడు మమ్మా ప్రదేశమునకు తీసికొనిపొమ్ము. మేము రక్తసిక్తమైన శరీరము కలవాడై, విక్షిప్తమగు జింకతోలు కలిగి, చైతన్యముడిగి నేలబడి యముని వశమును పొందిన కుమారుని యంత్య దర్శనము చేసికొందుము.

అ థాహ మేక స్తం దేశం నీత్వా తౌ భృశదుఃఖితౌ
అస్పర్శయ మహం పుత్త్రం తం మునిం సహ భార్యయా.

నే నపుడు మిక్కిలి దుఃఖించుచున్న వారి నా ప్రదేశమునకు తీసికొనిపోయి, వారు గ్రుడ్డివారగుటచే వారిచే వారి కుమారుని తాకించితిని.

తౌ పుత్త్ర మాత్మన స్స్పృష్ట్వా త మాసాద్య తపస్వినౌ
నిపేతతు శ్శరీరేఽస్య పితా చాస్యేద మబ్రవీత్. 30

ఆ ముని దంపతులు తమ కుమారుని చెంత కేగి, యాతనిని తాకి యాతని శరీరముపై పడిరి. అపు డా తండ్రి యిట్లనెను.

నాభివాదయసే మాఽద్య న చ మా మభిభాషసే
కిం ను శేషే తు భూమౌ త్వం వత్స! కిం కుపితో హ్యసి.

నాయనా! నా కేల నమస్కారము చేయవు. భూమిపై పరుండి యుంటివేల. కోపించితివా?

న త్వహం తే ప్రియః పుత్ర! మాతరం పశ్య ధార్మిక!
కిం ను నాలింగసే పుత్ర! సుకుమార! వచో వద. 32

ధార్మికుడవగు కుమారా! నేను నీ కిష్టుడను కానిచో నీ తల్లిని చూడుము. నాయనా! మ మ్మాలింగనము చేసికొనవేమి? మృదువగు మాటలు పలుకుము.

కస్య వాఽపరరాత్రేఽహం శ్రోష్యామి హృదయంగమమ్
అధీయానస్య మధురం శాస్త్రం వాఽన్య ద్విశేషతః. 33

ఇటుపై నెవ డర్ధరాత్రమున లేచి హృద్యముగ మధురస్వరముతో వేదశాస్త్రములు, తక్కిన పురాణాదులు చదువుచుండగా వినగలను?

కో మాం సంధ్యా ముపా స్యైవ స్నాత్వా హుతహుతాశనః
శ్లాఘయిష్య త్యుపాసీనః పుత్రశోకభయార్దితమ్. 34

ఎవ డిటుపై స్నాన మొనరించి, సంధ్య వార్చి, అగ్ని

హెూత్రమందు హెూమ మొనర్చి, పుత్రశోకమువలన కలిగిన భయముచే పీడితుడనగు నాకు శుశ్రూష చేయును ?

కందమూలఫలం హృత్వా కో మాం ప్రియ మి వాతిథిమ్
భోజయిష్య త్యకర్మణ్య మప్రగ్రహ మనాయకమ్. 35

ఇటుపై నెవడు కందమూల ఫలాదులు కొనివచ్చి-కర్మాను ష్ఠానము చేసికొనలేనివాడను, నీవారాదులు ప్రోగు చేసి తెచ్చు కొన లేనివాడను. కఱ్ఱబట్టి మార్గము చూపువాడు లేని వాడనగు నాకు ప్రియాతిథికి వలె భోజన మిడును ?

ఇమా మంధాం చ వృద్ధాం చ మాతరం తే తపస్వినీమ్
కథం వత్స! భరిష్యామి కృపణాం పుత్త్రగర్ధినీమ్. 36

గ్రుడ్డిది, ముదుసలిది, దీనయైనది, దుఃఖముకలది కుమా రునియం దాశగలదగు నీ తల్లినెట్లు నేను పోషింపగలను ?

తిష్ఠ మాం మా గమః పుత్త్ర! యమస్య సదనం ప్రతి
శ్వో మయా సహ గంతాసి జనన్యా చ సమేధితః. 37

కుమారా! నీ విపుడు నా చెంతనే యుండుము. రేపు నాతో నీ తల్లితో గూడి యమసదనమున కేగుము.

ఉభావపి చ శోకార్తా వనాథౌ కృపణౌ వనే
క్షిప్ర మేవ గమిష్యావ స్త్వయా హీనౌ యమక్షయమ్. 38

మే మిద్దర మీ యడవిలో శోకపీడితులము, దిక్కులేని

వారము, రక్షకుడు లేనివారము, దీనులము. నీవు లేక మేమును శీఘ్రమే యమలోకమున కేగెదము.

తతో వైవస్వతం దృష్ట్వా తం ప్రవక్ష్యామి భారతీమ్
క్షమతాం ధర్మరాజో మే బిభృయా త్పితరా వయమ్. 39

అపుడు నేను యముని చూచి ఇట్లనెదను-ఓ ధర్మరాజా! నా యీ తనయుడు తల్లిదండ్రులను పోషింపవలయును. కాన నీ కడ కీతడు విలంబముగ వచ్చుటను క్షమింపుము.

దాతు మర్హతి ధర్మాత్మా లోకపాలో మహాయశాః
ఈదృశస్య మమా క్షయ్యా మేకా మభయదక్షిణామ్. 40

ధర్మాత్ముడు, లోకపాలుడు, గొప్ప యశముకల వాడగు యము డిట్టి స్థితిగల నాకు నాశముకాని యీ ఒక్క అభయదక్షిణ నీయగలడు.

అపాపోఽసి యదా పుత్త్ర! నిహతః పాపకర్మణా
తేన సత్యేన గచ్ఛాఽఽశు యే లోకా శ్శస్త్రయోధినామ్.

పుత్రుడా! పాపకర్మ మొనర్చిన రాజెపుడు నిన్నుచంపెనో అపుడే నీ వేపాపము లేని వాడవైతివి. కావున నీవు శీఘ్రమే సత్యముచే నాయుధములతో యుద్ధముచేసి చనిపోయిన వారే యుత్తమ లోకముల కేదురో యట కేగుము.

యాంతి శూరా గతిం యాం చ సంగ్రామే ష్వనివర్తినః
హతా స్త్వభిముఖాః పుత్త్ర! గతిం తాం పరమాం వ్రజ.

శూరులై యుద్ధరంగము నుండి వెనుకకు మఱలకశత్రువుల కభిముఖులై పోరి మరణించిన వారే యుత్తమగతి నందెదరో యా యుత్తమ స్థానమునకు పొమ్ము,

యాం గతిం సగర శ్శైబ్యో దిలీపో జనమేజయః
నహుషో దుందుమారశ్చ ప్రాప్తా స్తాం గచ్ఛ పుత్రక. 43

కుమారా! సగరుడు, శిబి, దిలీపుడు, జనమేజయుడు, నహుషుడు, దుందుమారుడును పొందిరో ఆ గతిని నీవును పొందుము.

యా గతి స్సర్వసాధూనాం స్వాధ్యాయా త్తపసా చ యా
యా భూమిద స్యాహితాగ్నే రేకపత్నీవ్రతస్య చ. 44
గోసహస్రప్రదాతౄణాం యా యా గురుభృతా మపి
దేహన్యాసకృతాం యా చ తాం గతిం గచ్ఛ పుత్రక. 45

కుమారా! సత్పురుషు లెల్ల రే గతి నందెదరో, వేదాధ్యేతలు, తపస్వులే యుత్తమ గతికి పోవుదురో, భూదానము చేసిన వానికి, ఆహితాగ్నికి, ఏకపత్నీవ్రతము ననుష్ఠించువానికి, వేయి గోవులు దానమిచ్చిన వానికి గురువులను పోషించిన వానికి, పరలోకప్రాప్తి సంకల్పముతో గంగా యమునా సంగమాదులలో శరీరము చాలించిన వారి కే యుత్తమగతి ప్రాప్తించునో నీ వా గతి నందుము.

నహి త్వస్మిన్ కులే జాతో గచ్ఛ త్యకుశలాం గతిమ్
స తు యాస్యతి యేన త్వం నిహతో మమ బాంధవః. 46

తపోనిష్ఠుల మగు మా వంశమున పుట్టినవా డెవ్వరును దుర్గతిని పొందడు. నా పుత్రుడవగు నిన్ను చంపినవాడు మాత్రము దుర్గతి నందును.

ఏవం స కృపణం తత్ర పర్యదేవయ తాసకృత్
తతోఽస్మై కర్తు ముదకం ప్రవృత్త స్సహ భార్యయా. 47

అని యిట్లనేక మార్లా ముని దీనముగ నేడ్చెను. తరువాత భార్యతో కూడి యాతనికి సంస్కార మొనర్చి యుదకక్రియచేసెను.

స తు దివ్యేన రూపేణ మునిపుత్ర స్స్వకర్మభిః
స్వర్గ మధ్యారుహ క్షిప్రం శక్రేణ సహ ధర్మవిత్. 48

ధర్మమెఱిగిన యా ముని కుమారుడును తన పుణ్య కర్మల వలన దేవేంద్రునితో శీఘ్రమే స్వర్గము నధిరోహించెను.

అబభాషే చ తౌ వృద్ధౌ సహ శక్రేణ తాపసః
ఆశ్వాస్య చ ముహూర్తం తు పితరౌ వాక్య మబ్రవీత్.

దేవేంద్రసహితు డగు నా తాపసకుమారు డా వృద్ధులతో మాటలాడెను. వారి నూరడిల్ల జేసి యిట్లనెను.

స్థాన మస్మి మహత్ ప్రాప్తో భవతోః పరిచారణాత్
భవంతా వపి చ క్షిప్రం మమ మూల ముపైష్యతః. 50

మీకు శుశ్రూష చేయుటచే నేను గొప్ప స్థానము పొందితిని. మీరును వేగమే నా చెంత కేతెంచగలరు.

ఏవ ముక్త్వా తు దివ్యేన విమానేన వపుష్మతా
అరురోహ దివం క్షిప్రం మునిపుత్త్రో జితేంద్రియః 51

అని పలికి జితేంద్రియు డగు నా మునికుమారు డుత్తమ మగు దివ్య విమాన మెక్కి శీఘ్రుమే స్వర్గమున కేగెను.

స కృత్వా తూదకం తూర్ణం తాపస స్సహ భార్యయా
మా మువాచ మహాతేజాః కృతాంజలి ముపస్థితమ్. 52

మహాతేజశ్శాలి యగు నా ముని, తన భార్యతో గూడ శీఘ్రుమే యుదక క్రియ యొనర్చి, చెంత నంజలి యొగ్గి యున్న నన్ను చూచి యిట్లనెను.

అద్యైవ జహి మాం రాజన్ మరణే నాస్తి మే వ్యథా
య చ్ఛరేణైకపుత్త్రం మాం త్వ మకార్షీ రపుత్త్రకమ్. 53

రాజా ! నీ విపుడే నన్ను చంపుము, మరణించుట నాకు బాధ కాదు, నీవు బాణము విడచి ఒకే కుమారుడు కల నన్ను కుమారుడు లేని వానినిగా చేసినావు. ఇంతకంటె బాధ వేరే మున్నది ?

త్వయా తు య దవిజ్ఞానా న్నిహతో మే సుత శ్శుచిః
తేన త్వా మభిశప్స్యామి సుదుఃఖ మతిదారుణమ్. 54

నీవు తెలియక పవిత్రుడగు నా తనయుని చంపితివి (అందుచే నిన్నిపుడే భస్మము చేయుట లేదు,) కావున మిగుల దుఃఖము కలిగించు ఘోరశాప మీయబోవుచున్నాను.

పుత్రవ్యసనజం దుఃఖం యదేత న్మమ సాంప్రతమ్
ఏవం త్వం పుత్రశోకేన రాజన్ కాలం కరిష్యసి. 55

రాజా! నా కిప్పు డెట్లు పుత్రునకు కలిగిన క్లేశము కారణముగ అమరణము దుఃఖ మేర్పడినదో, నీ విట్లే పుత్రశోకముతో మరణింతువు.

అజ్ఞానాత్తు హతో యస్మాత్ క్షత్రియేణ త్వయా మునిః
తస్మా త్త్వాం నావిశ త్యాశు బ్రహ్మహత్యా నరాధిప!. 56

రాజా! క్షత్రియుడవగు నీ వజ్ఞానముచే మునిని చంపితివి కావున నీకు బ్రహ్మహత్యాదోషము కలుగదు.

త్వా మ ప్యేతాదృశో భావః క్షిప్రమేవ గమిష్యతి
జీవితాంతకరో ఘోరో దాతార మివ దక్షిణా. 57

ఇట్టి పుత్రశోక రూప మగు భావము శీఘ్రము మే (ఈ జన్మము నందే) దాతకు దక్షిణనిచ్చుట వల్ల పుణ్యము కలిగినట్లు నీకును కలుగగలదు. అది నీ జీవితము నంతము చేయును.

ఏవం శాపం మయి న్యస్య విలప్య కరుణం బహు
చితా మారోప్య దేహం త న్మిథునం స్వర్గ మభ్యయాత్.

ముని దంపతులు నా కిట్టి శాప మిచ్చి, దయగొల్పునట్లు మిక్కిలి రోదించి, చితను బెర్చికొని దానిలోపడి స్వర్గమునకేగిరి.

త దేత చ్చింతయానేన స్మృతం పాపం మయా స్వయమ్
తదా బాల్యా త్కృతం దేవి! శబ్దవేధ్యనుకర్షిణా. 59

మరణ పర్యవసాయి యగు పుత్రశోకము కలిగెనే. దీనికి మూల మేమాయని చింతించుచున్న నేను-బాల్యములో శబ్దవేధి యగు పుత్రశోకము కలిగెనే దీనికి మూల మేమా యని చింతించు చున్న నేను-బాల్యములో శబ్దవేధియగు బాణమును ముని కుమారునిపై విడచి, పిమ్మట నాతని గాయమునుండి బాణమును తీసి వైచుట యను నిది యెల్ల స్మరించితిని.

తస్యాయం కర్మణో దేవి! విపాక స్సముపస్థితః
అపథ్యై స్సహ సంభుక్తే వ్యాధి రన్నరసే యథా. 60

వ్యాధిని వృద్ధినందించు పదార్థములు కలుపుకొని తినిన యన్నము వ్యాధిని వృద్ధి నందించినట్లు, నే నానాడు చేసిన యకృత్యమునకు దుఃఖరూపమగు ఫల మేర్పడినది.

తస్మా న్మా మాగతం భద్రే! తస్యోదారస్య తద్వచః
య దహం పుత్త్రశోకేన సంత్యక్ష్యా మ్యద్య జీవితమ్. 61

దేవి! నే నిపుడు పుత్రశోకముచే మరణించబోవు చున్నాను. ఉదారుడగు (పుత్రులు లేని నాకు పుత్రులను సంపాదించుట కనుకూలమగు శాప మిచ్చుటచే) లేదా మహాత్ముడగు నా ముని యొక్క శాప రూపమగు వాక్కు నాకు వచ్చి చేరినది.

చక్షుర్భ్యాం త్వాం న పశ్యామి కౌసల్యే! సాధు మాం స్పృశ
ఇత్యుక్త్వా స రుదం స్త్రస్తో భార్యా మాహ చ భూమిపః.

ఓ కౌసల్యా! నిన్ను కన్నులతో చూడలేకున్నాను. నన్ను

నీవు చక్కగా (ప్రీతితో లేదా దయతో) తాకుము. అని యా రాజేడ్చుచు, బెదరుచు భార్య కిట్లు పలికెను.

ఏత న్మే సదృశం దేవి! య న్మయా రాఘవే కృతమ్
సదృశం తత్తు తస్యైవ యదనేన కృతం మయి. 63

రాము నరణ్యమునకు పంపుట పాపిష్ఠుడనగు నాకు తగియున్నది. అట్లే కైకేయి చెప్పగా నా యాజ్ఞ చొప్పున వనమున కేగుట రామునకు తగియున్నది. (లేదా నా యీ మరణము ముని శాపమునకు సదృశముగ నున్నది )

దుర్వృత్త మపి కః పుత్త్రం త్యజే ద్భువి విచక్షణః
కశ్చ ప్రవ్రాజ్యమానో వా నాసూయే త్పితరం సుతః. 64

ఈ లోకమున పండితు డగువా డెవ్వడును చెడునడవడి కల తనయుని గూడ విడచిపెట్టునా ? అట్లు వెడల నంపబడుచునే తనయుడు తండ్రిపై నసూయ చెందడు ?

యది మాం సంస్పృశే ద్రామ స్సకృ దద్య లభేత వా
యమక్షయ మనుప్రాప్తాః ద్రక్ష్యంతే న హి మానవాః. 65

రాము డొక్కమారు నన్ను తాకినను, నా కగపడినను నేను బ్రతుకుదును. యమలోకమున కేగిన పిమ్మట మానవులు బంధువులను చూడలేరు కదా!

చక్షుషా త్వాం న పశ్యామి స్మృతి ర్మమ విలుప్యతే
దూతా వైవస్వత స్యైతే కౌసల్యే! త్వరయంతి మామ్. 66

కౌసల్యా! కన్నులతో నిన్ను కనజాలకున్నాను. నా స్మరణ శక్తి లోపించుచున్నది. ఈ యమధర్మరాజుదూతలు నన్ను తొందర చేయుచున్నారు.

అత స్తు కిం దుఃఖతరం య దహం జీవితక్షయే
న హి పశ్యామి ధర్మజ్ఞం రామం సత్యపరాక్రమమ్. 67

నేను మరణించు సమయమున ధర్మజ్ఞుడు, అమోఘపరాక్రమము కలవాడగు రాముని చూడకున్నాను. ఇంతకన్న మిక్కిలి దుఃఖ మేమున్నది?

త స్యాదర్శనజ శ్శోక స్సుత స్యాప్రతికర్మణః
ఉచ్ఛోషయతి మే ప్రాణా న్వారి స్తోక మివాతపః. 68

ఎదురులేనట్టి పనిగల నా తనయుడగు రాముని చూడకుండుటవలన కలిగిన శోకము, కొద్ది నీటిని ఎండవోలె నా ప్రాణములను పీల్చుచున్నది.

న తే మనుష్యా దేవా స్తే యే చారుశుభకుండలమ్
ముఖం ద్రక్ష్యంతి రామస్య వర్షే పంచదశే పునః. 69

ఎవరు పదునైదవయేట చక్కగా శుభమైన కుండలములు దాల్చియున్న రాముని చూచెదరో వారు మనుష్యులు కారు, దేవతలు.

పద్మపత్రేక్షణం సుభ్రు! సుదంష్ట్రం చారునాసికమ్
ధన్యా ద్రక్ష్యంతి రామస్య తారాధిపనిభం ముఖమ్.

పద్మపత్రముల వంటి కన్నులు కలిగి, చక్కని కనుబొమలతో, సుందరమగు పలువరుసతో, తీరైన ముక్కుతో కూడి చంద్రుని బోలు రాముని ముఖమును పుణ్యము చేసికొన్నవారే చూతురు.

సదృశం శారద స్యేందోః ఫుల్లస్య కమలస్య చ
సుగంధి మమ నాథస్య ధన్యా ద్రక్ష్యంతి తన్ముఖమ్. 71

శరత్కాలమందలి చంద్రునితోడను, వికసించిన కమలముతోను సదృశమై ప్రకాశించుచు చక్కని తావి గల నా నాథుడగు రాముని ముఖ్యమును పుణ్యాత్ములే చూతురు.

నివృత్తవనవాసం త మయోధ్యాం పున రాగతమ్
ద్రక్ష్యంతి సుఖినో రామం శుక్రం మార్గగతం యథా. 72

వనవాసము ముగించి, అయోధ్యకు మరలి వచ్చిన రాముని సుఖవంతులు మార్గమందు శుక్రుని వోలె చూచెదరు.

కౌసల్యే! చిత్తమోహేన హృదయం సీదతీవ మే
వేదయే న చ సంయుక్తాన్ శబ్దస్పర్శరసా నహమ్. 73

ఓ కౌసల్యా! దుఃఖాతిశయముచే మూర్ఛవచ్చుచున్నది. శబ్దస్పర్శరసములు నా ఇంద్రియములతో సంబద్ధము లైనను, ఇంద్రియపాటవము చెడుటచే వానిని తెలిసికొన లేకున్నాను.

చిత్తనాశా ద్విపద్యంతే సర్వా ణ్యే వేంద్రియాణి మే
క్షీణస్నేహస్య దీపస్య సంసక్తా రశ్మయో యథా. 74

పిల్చివేయబడి తగ్గిపోవుచున్న దీపమునకు సంబద్ధములైన కాంతులవలె నా యింద్రియము లన్నియు మనస్సు దెబ్బతినుటచే నశించుచున్నవి.

అయ మాత్మభవ శ్శోకో మా మనాథ మచేతనమ్
సంసాదయతి వేగేన యథా కూలం నదీరయః. 75

నదీవేగ మెట్లు ఒడ్లను నశింపజేయునో అట్లు నాలో పుట్టిన శోకము దిక్కులేని వాడను, తెలివి దప్పిన వాడ నగు నన్ను నశింపజేయుచున్నది.

హా రాఘవ! మహాబాహో! హా మమాయాసనాశన!
హా పితృప్రియ! మే నాథ! హాఽద్య క్వాసి గత స్సుత!.

అయ్యో! రాముడా! మహాభుజుడా! నా బాధ తొలగించువాడా! నా కభిమతుడా! నా నాథుడా! నీ వట్లు పోయి ఎచట నుంటివయ్యా!

హా కౌసల్యే! నశిష్యామి హా సుమిత్రే! తపస్విని!
హా నృశంసే! మ మామిత్రే! కైకేయి! కులపాంసని!. 77

అయ్యో! కౌసల్యా! అయ్యో! జాలి పడదగినట్టి ఓ సుమిత్రా! ఓసీ క్రూరురాలా! నా శత్రువగు కైకా! మావంశము నాశనము చేయుదానా!

ఇతి రామస్య మాతు శ్చ సుమిత్రాయా శ్చ సన్నిధౌ
రాజా దశరథ శ్శోచన్ జీవితాంత ముపాగమత్. 78

మందలి చెట్లపై భవనములో పంజరములలో నున్న పక్షులు మేల్కొని వివిధధ్వను లొనర్చెను.

వ్యాహృతాః పుణ్యశబ్దా శ్చ వీణానాం చాపి నిస్వనాః
ఆశీ ర్గేయం చ గాథానాం పూరయామాస వేశ్మ తత్. 6

బ్రాహ్మణులు పలుకు పుణ్యపురుషులు-పుణ్యక్షేత్రములు-పుణ్యతీర్థముల సంకీర్తనములును, వీణానాదములు, దశరథుని గూర్చి వ్రాయబడిన ప్రబంధములకు సంబంధించిన ఆశీర్వాద రూపమగు గానమును, ఆ భవన మెల్ల నిండెను.

తత శ్శుచిసమాచారాః పర్యుపస్థానకోవిదాః
స్త్రీవర్షధరభూయిష్ఠా ఉపతస్థు ర్యథా పురమ్. 7

అంత పరిశుద్ధ మగు ఆచరణము కలవారును, ఆ యా సమయములకు తగినట్టి సేవ చేయుటలో కుశలులగు పరిచారకులు, అంతఃపురాధ్యక్షులగు స్త్రీలతో, నపుంసకులతో గూడి యథాపూర్వముగ రాజును సేవించిరి.

హరిచందనసంపృక్త ముదకం కాంచనై ర్ఘటైః
ఆనిన్యు స్స్నానశిక్షాజ్ఞా యథాకాలం యథావిధి. 8

స్నానవిధిలో నేర్పరులగు వారు హరిచందనముతో కలసిన జలమును బంగారుపాత్రలతో సరియగు సమయమున శాస్త్రోక్తముగ తెచ్చిరి.

మంగలాలంభనీయాని ప్రాశనీయా న్యుపస్కరాన్
ఉపనిన్యు స్తథా ప్యన్యాః కుమారీబహులాః స్త్రియః. 9

యువతు లధికముగా గల స్త్రీ సముహము తైలము, నలుగు పిండి మున్నగు మంగళరూపములగు అనులేపనములను, ("తాక దగిన గోవు మున్నగు వానిని" యని కొందరి మతము) పండ్లు తోమిన పిమ్మట పుక్కిలించుటకు కావలసిన ఓషధి విశేషము లను [లేదా గంగాది తీర్థోదకములను లేదా ప్రతిదినము చేయు పాపము లన్నియు పోవుటకును, అన్ని పనులు చేయుట కధి కారము లభించుటకును ప్రాశన చేయదగినటి గృహారాధనలో నున్న శ్రీరంగనాథస్వామి పాదారవిందములకు సమర్పించబడిన తీర్థము, తులసి మున్నగు వానిని కాని-(ఇచట ఆ తీర్థోదక మున్న పెట్టెను మాత్రమే పరిచారకులు తెచ్చుదురని గ్రహింప నగును)] అద్దము, వస్త్రములు, ఆభరణములు, పువ్వులు మన్నగు అలంకార సామగ్రిని తెచ్చిరి.

సర్వలక్షణసంపన్నం సర్వం విధివ దర్చితమ్
సర్వం సుగుణలక్ష్మీవ త్త ద్బభూ వాభిహారికమ్ 10

రాజునకు ప్రాతఃకాలముననే మంగళార్థ మే యే ద్రవ్య సముదాయము తేవలయునో అది యంతయు సర్వలక్షణ సంప న్నమై, శాస్త్రోక్తముగ బహూకృతమై, ఉత్తమ గుణవంతమై, కాంతి మంతమై యుండెను.

తత్తు సూర్యోదయం యావ త్సర్వం పరిసముత్సుకమ్
తస్థా వనుపసంప్రాప్తం కింస్వి ది త్యుపశంకితమ్. 11

ముందు చెప్పబడిన పరిజను లెల్లరు, సూర్యోదయ మగు వఱకు రాజు రాకకై ఎదురుచూచి రాజు రాకుండుటచే ఏలనో రాజు రాలేదని శంకించిరి.

అథ యాః కోసలేంద్రస్య శయనం ప్రత్యనంతరాః
తాః స్త్రియ స్తు సమాగమ్య భర్తారం ప్రత్యబోధయన్. 12

అంతట నంతఃపురమునందుండు స్త్రీలు వచ్చి రాజును ప్రబోధకాలమునకు తగిన మృదూక్తులతో మేల్కొలిపిరి.

తథా హ్యుచితవృత్తా స్తా వినయేన నయేన చ
న హ్యస్య శయనం స్పృష్ట్వా కించి దప్యుపలేభిరే. 13

నిదురించుచున్న రాజును మేల్కొలుపుట మున్నగు పనులు చేయుటకు యోగ్యతకల స్త్రీ లట్లు వినయముతో, యుక్తితో నా రాజు శయనమును తాకియు రాజులో నిద్రించువాని స్వభావ మగు ఉచ్ఛ్వాసాదులను గమనింపజాలరైరి.

తాః స్త్రియ స్స్వప్నశీలజ్ఞా శ్చేష్టాసంచలనాదిషు.

ఆ స్త్రీలు నిద్రాస్వభావ మెఱిగినవారు. వారు రాజులో హస్తములు, పాదములు కదల్చుట మున్నగు చేష్టనుగాని, గుండె మున్నగునవి కొట్టుకొనుటయను స్పందనమునుగాని, నిశ్శ్వాసాదులనుగాని చూడజాలరైరి.

తా వేపథుపరీతా శ్చ రాజ్ఞః ప్రాణేషు శంకితాః 14
ప్రతిస్రోతస్తృణాగ్రాణాం సదృశం సంచకాశిరే.

అంత నాస్త్రీలు మిగుల వణకుచు, రాజు ప్రాణముల విషయమున (రాజు జీవించుచున్నాడా యని) సందేహించినవారై, నదీప్రవాహమున కెదురుగనున్న రెల్లు మున్నగు గడ్డియొక్క కొనలవలె గడగడ వణకిరి.

అథ సంవేపమానానాం స్త్రీణాం దృష్ట్వా చ పార్థివమ్
య త్త దాశంకితం పాపం తస్య జజ్ఞే వినిశ్చయః.

రాజును చూచి వణకుచున్న యా స్త్రీలే పాపము (రాజు మరణము)ను శంకించిరో యది సత్యమని వారపుడునిశ్చయించిరి.

కౌసల్యా చ సుమిత్రా చ పుత్రశోకపరాజితే 16
ప్రసుప్తే న ప్రబుద్ధ్యేతే యథా కాలసమన్వితే.

పుత్రశోకముతో నావరింపబడిన కౌసల్యాసుమిత్ర లిరువురు మరణించినవారివలె గాఢనిద్రావశలై మేల్కొనరైరి.

నిష్ప్రభా చ వివర్ణా చ సన్నా శోకేన సన్నతా 17
న వ్యరాజత కౌసల్యా తారేవ తిమిరావృతా.

నిదురించుచున్న యా కౌసల్య కాంతి తొలగి, వెనుకటి శరీరపు రంగు మారగా, పుత్రశోకముచే కృశించి, ఉత్పాత ధూమముచే కప్పబడిన నక్షత్రమువలె ప్రకాశింపలేదు.

కౌసల్యాఽనంతరం రాజ్ఞ స్సుమిత్రా తదనంతరమ్ 18
న స్మ విభ్రాజతే దేవీ శోకాశ్రులులితాననా.

రాజు మృతుడగుటచే ప్రకాశింపకుండెను. అయన చెంతనే నిదురించిన కౌసల్యయు, అమెకు సమీపముననే నిదురించిన సుమిత్రయు శోకమువలన కారిన కన్నీటిచే కాంతిహీనమగు ముఖము కలిగి యట్లే (మృతలైనట్లు) ప్రకాశింపరైరి.

తే చ దృష్ట్వా తథా సుప్తే ఉభే దేవ్యౌ చ తం నృపమ్
సుప్త మేవోద్గతప్రాణ మంతఃపుర మదృశ్యత.

అంతఃపుర స్త్రీలట్లు నిద్రించుచున్న ఆ రాజు లిద్దరిని చూచి, పిమ్మట నిదురించుచునే మరణించిన రాజును చూచిరి.

తతః ప్రచుక్రుశు ర్దీనా స్సస్వరం తా వరాంగనాః 20
కరేణవ ఇవ వారణ్యే స్థానప్రచ్యుతయూథపాః.

అపుడా యుత్తమవనితలు దైన్యము నందినవారై, అడవిలో తమ గుంపు నెడబాసిన ఆడేనుగులవలె బిగ్గరగా నేడ్చిరి.

తాసా మాక్రందశబ్దేన సహసోద్గతచేతనే 21
కౌసల్యా చ సుమిత్రా చ త్యక్తనిద్రే బభూవతుః

వారటు లేడ్చుటవలన నేర్పడిన శబ్దముచే కౌసల్యయు, సుమిత్రయు నిద్రవీడి వెంటనే మెలకువ నందిరి.

కౌసల్యా చ సుమిత్రా చ దృష్ట్వా స్పృష్ట్వా చ పార్థివమ్
హా నాథేతి పరిక్రుశ్య పేతతు ర్ధరణీతలే.

కౌసల్యయు, సుమిత్రయు రాజును చూచి తాకి పరీక్షించి (యాతడు మరణించెనని తెలిసికొని) అయ్యో! నాథా యని యాక్రోశించి నేలపై బడిరి

సా కోసలేంద్రదుహితా వేష్టమానా మహీతలే 23
న బభ్రాజ రజోధ్వస్తా తారేవ గగనా చ్చ్యుతా.

కోసలరాజు కూతురగు ఆ కౌసల్య భూమిపైబడి దొరలుచుదుమ్మొడలి కంటుకొనగా, నాకసమునుండి నేలపైబడిన నక్షత్రమువలె ప్రకాశింపకుండెను.

నృపే శాంతగుణే జాతే కౌసల్యాం పతితాం భువి 24
అపశ్యం స్తాః స్త్రియ స్సర్వా హతాం నాగవధూ మివ.

దశరథమహారాజు శరీరచలనము, ఉష్ణత మున్నగునవి తొలగినవాడు (మరణించినవాడు) కాగా, భూమిపై బడియున్నదై చంపబడిన యాడేనుగువలెనున్న కౌసల్య నాస్త్రీలెల్లరు చూచిరి.

తత స్సర్వా నరేంద్రస్య కైకేయీప్రముఖాః స్త్రియః 25
రుదంత్య శ్శోకసంతప్తా నిపేతు ర్గతచేతనాః.

అపుడు కైకేయి మున్నగు దశరథభార్య లందఱు నేడ్చుచు శోకముచే పీడింపబడినవారై తెలివిదప్పి పడిరి.

తాభి స్స బలవా న్నాదః క్రోశంతీభి రనుద్రుతః 26
యేన స్థిరీకృతం భూయ స్తద్గృహం సమనాదయత్.

కౌసల్య మున్నగువారి రోదన ధ్వని, యనంతర మట కేతెంచిన కైకేయి మున్నగువారి రోదనధ్వనిచే వ్యాప్తమై యచట గొప్ప ప్రతిధ్వనిని పుట్టించెను.

తచ్చ సంత్రస్తసంభ్రాంతం పర్యుత్సుకజనాకులమ్ 27
సర్వత స్తుములాక్రందం పరితాపార్తబాంధవమ్
సద్యో నిపతితానందం దీనవిక్లబదర్శనమ్
బభూవ నరదేవస్య సద్మ దిష్టాంత మీయుషః. 28

రాజు మరణించగా, అంతకుముందు రాజునెపుడు చూతు మాయని యుత్కంఠగల జనులు పెక్కంద్రతో వ్యాప్తమై

యుండెడి యా రాజగృహము భయము, తొట్రుపాటు నొందిన జనులతో నిండినదియు, అంతటను పెద్ద రోదన ధ్వనికలదియు, దుఃఖమునందిన బంధువులు కలదియు, శీఘ్రమే తొలగిన యానందము కలదియు అయ్యెను. అచటనున్నవారు దైన్యముతో వివశతనంది యుండిరి.

అతీత మాజ్ఞాయ తు పార్థివర్షభం
యశస్వినం సంపరివార్య పత్న్యః
భృశం రుదంత్యః కరుణం సుదుఃఖితాః
ప్రగృహ్య బాహూ వ్యలప న్ననాథవత్. 29

గొప్ప కీర్తితో నొప్పు దశరథుని మృతునిగా తెలిసికొన్న యాతని భార్య లాతనిని చుట్టుముట్టి, పెద్దగా నేడ్చుచు దుఃఖము నొంది ఒకరి చేతులు వేరొకరు పట్టుకొని రక్షకుడు లేనివారివలె నేడ్చిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచషష్టితమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నఱువది యైదవ సర్గము సంపూర్ణము.

—0—

## షట్షష్టితమః సర్గః - అఱువదియాఱవ సర్గము

తమగ్ని మివ సంశాంత మంబుహీన మి వార్ణవమ్
హతప్రభ మివాఽఽదిత్యం స్వర్గస్థం ప్రేక్ష్య పార్థివమ్.

కౌసల్యా బాష్పపూర్ణాక్షీ వివిధం శోకకర్శితా
ఉపగృహ్య శిరో రాజ్ఞః కైకేయీం ప్రత్యభాషత. 2

అంత కౌసల్య, చల్లారిన యగ్నిహోత్రమునివలె, జలము లేని సముద్రమువలె, కాంతి తొలగిన సూర్యునివలె, మృతినొంది నిస్తేజస్కుడైన రాజును చూచి, కన్నీటితో కనులు నిండగా, మిగుల శోకించుచు, రాజుతలను తన తొడపై నిడుకొని, కైకేయి కిట్లనెను.

సకామా భవ కైకేయి! భుంక్ష్వ రాజ్య మకంటకమ్
త్యక్త్వా రాజాన మేకాగ్రా నృశంసే! దుష్టచారిణి!. 3

క్రూరాత్మవు, దుష్టురాలవగు కైకేయీ! నీ వింక కృతార్థురాలవు కమ్ము. రాజును వీడి, రాముడు లేక నిష్కంటకమగు నీ రాజ్యము ననుభవింపుము.

విహాయ మాం గతో రామో భర్తా చ స్వర్గతో మమ
విపథే సార్థహీనేవ నాహం జీవితు ముత్సహే. 4

నా తనయుడగు రాముడు నన్ను వీడిపోయెను. నా పతి మరణించెను. చెడుమార్గమున పడి, తోడిబాటసారుల సమూహమునకు దూరమైన యాడుదివోలె నే నిచట జీవింపనొల్లను.

భర్తారం తం పరిత్యజ్య కా స్త్రీ దైవత మాత్మనః
ఇచ్ఛే జ్జీవితు మన్యత్ర కైకేయ్యా స్త్యక్తధర్మణః. 5

తనధర్మము వీడిన కైక తక్క వే ఱేవనిత, తన దైవమగు భర్తను వీడి జీవింప నిచ్ఛగించును?

న లుబ్ధో బుద్ధ్యతే దోషాన్ కింపాక మివ భక్షయన్
కుబ్జానిమిత్తం కైకేయ్యా రాఘవాణాం కులం హతమ్. 6

విషమిశ్రమగు నాహారము (లేదా విషముష్టిపండు)నందలి దోషము నెఱుగజాలనట్లు లోభము కలవాడా లోభమున కెట్టి దుష్ఫలము సంభవించునో తెలియజాలడు. గూనిదాని కారణ ముగ నీ కైక రఘుకులమునే హత మొనర్చినది.

అనియోగే నియుక్తేన రాజ్ఞా రామం వివాసితమ్
సభార్యం జనక శ్శ్రుత్వా పరితప్స్య త్యహం యథా. 7

వర మిచ్చు సమయమున వరమేమో నిర్ణయింపబడ కుండుటచే నిపుడు భరతాభిషేక, రామవివాసనరూపమగువరము నిచ్చుటకై నిర్బంధింపబడిన రాజు భార్యతోగూడిన రాముని వెడలనంపెననివిని సీతతండ్రిజనకుడును నావలెపరితపించును.

న మా మనాథాం విధవాం నాద్య జానాతి ధార్మికః
రామః కమలపత్రాక్షో జీవ న్నాశ మితో గతః. 8

ఇచటనుండి పంపివేయబడుటచే జీవించియు నాశమును పొందినవాడై తామరరేకులవంటి కన్నులుకల ధార్మికుడగు

రాముడు, నన్నిపుడు రక్షకుడు లేనిదానినిగా, విధవనుగా నెఱుగడు.

విదేహరాజస్య సుతా తథా సీతా తపస్వినీ
దుఃఖ స్యానుచితా దుఃఖం వనే పర్యుద్విజిష్యతి. 9

దుఃఖము లనుభవింపదగనట్టి విదేహరాజపుత్రియగు సీతయు నట్లు దయగొల్పుచు అడవిలో దుఃఖమునొంది భయపడగలదు.

నదతాం భీమఘోషాణాం నిశాసు మృగపక్షిణామ్
నిశమ్య నూనం సంత్రస్తా రాఘవం సంశ్రయిష్యతి. 10

రాత్రులందు భయంకరమగు ధ్వనులుచేయు మృగములు, పక్షుల అఱపులు విని సీత భయపడి తప్పక రాముని సన్నిధిని జేరుకొనును.

వృద్ధశ్చ వాల్పపుత్రశ్చ వైదేహీ మనుచింతయన్
సోఽపి శోకసమావిష్టో నను త్యక్ష్యతి జీవితమ్. 11

ముదుసలి, సీతయే అయనకు పుత్రుడు, పుత్రికయు. అయన సీతనే తలంచుచు, శోకమునొంది ప్రాణములు విడుచు.

సాఽహ మద్యైవ దిష్టాంతం గమిష్యామి పతివ్రతా
ఇదం శరీర మాలింగ్య ప్రవేక్ష్యామి హుతాశనమ్. 12

పతివ్రత నగు నే నిపుడే మరణింతును. నా పతి శరీరమును కౌగలించుకొని యగ్నిలో ప్రవేశింతును.

తాం తత స్సంపరిష్వజ్య విలపంతీం తపస్వినీమ్
వ్యపనీయ సుదుఃఖార్తాం కౌసల్యాం వ్యావహారికాః 13
తైలద్రోణ్యా మథామాత్యా స్సంవేశ్య జగతీపతిమ్
రాజ్ఞ స్సర్వా ణ్యథాఽదిష్టా శ్చక్రుః కర్మా ణ్యనంతరమ్.

అంతఃపురమందు, బయట జరుగవలసిన సకల రాజ కార్యములను చక్కబెట్టుటకు నియమింపబడిన మంత్రులు (అంతఃపురమున ప్రధానోద్యోగులైన స్త్రీలని శ్రీమహేశ్వరతీర్థ వ్యాఖ్య.) ఆ విధముగ జాలిగొలుపుచు రాజును కౌగిలించుకొని రోదించుచున్న కౌసల్య నా బంధమునుండి విడిపించి, రాజు శరీరమును తైలపాత్రలో నుంచి పిమ్మట తక్కిన ప్రజాశాసనాది కార్యముల నాచరించిరి.

న తు సంకలనం రాజ్ఞో వినా పుత్రేణ మంత్రిణః
సర్వజ్ఞాః కర్తు మీషు స్తే తతో రక్షంతి భూమిపమ్. 15

ఆ మంత్రులు సకలధర్మము లెఱిగినవా రగుటచే పుత్రుడు లేక రాజునకు దహనాది సంస్కారములను చేయనిచ్ఛగింపలేరు. అందుచే వారాతని శరీరమును చెడకుండ తైలపాత్రలోనుంచి కాపాడుచుండిరి.

తైలద్రోణ్యాం తు సచివై శ్శాయితం తం నరాధిపమ్
హా మృతోఽయ మితి జ్ఞాత్వా స్త్రియ స్తాః పర్యదేవయన్.

మంత్రులు రాజు శరీరమును తైలపాత్రమందుంచగా, నపుడు రా జగపడకుండుటచే 'అయ్యో! రాజు మరణించెనే' యని యా స్త్రీలు మిక్కిలి విలపించిరి.

బాహూ నుద్యమ్య కృపణా నేత్రప్రస్రవణై ర్ముఖైః
రుదంత్య శ్శోకసంతప్తాః కృపణం పర్యదేవయన్. 17

ఆ స్త్రీలు దీనలై, చేతులెత్తి కన్నీరు కారుచున్న ముఖము లతో నేడ్చుచు శోకపీడితలై జాలిగొలుపుచు రోదించిరి.

హా మహారాజ! రామేణ సతతం ప్రియవాదినా
విహీనా స్సత్యసంధేన కిమర్థం విజహాసి నః. 18

అయ్యో! మహారాజా! ఎల్లపుడు ప్రియము పలుకువాడును, సత్యనిష్ఠుడు నగు రాముడు మాకు దూరమైనాడు. నీవును మమ్మేల విడుచుంటివి ?

కైకేయ్యా దుష్టభావాయా రాఘవేణ వియోజితాః
కథం పతిఘ్న్యా వత్స్యామ స్సమీపే విధవా వయమ్.

రాము నెడబాసి, నీవు మరణింపగా, దుష్టమగు నాలోచన కలదై, పతినే చంపిన కైక చెంత నెట్లు నివసింతుము ?

స హి నాథ స్సదాఽస్మాకం తవ చ ప్రభు రాత్మవాన్
వనం రామో గత శ్శ్రీమా న్విహాయ నృపతిశ్రియమ్. 20

మాకును, నీకును ఎల్లపుడును ప్రభువైనవాడు, ప్రశస్తమగు మనస్సుకలవాడు, శ్రీమంతు డగు రాముడు రాజ్యము వీడి యడవికేగెను గదా !

త్వయా తేన చ వీరేణ వినా వ్యసనమోహితాః
కథం వయం నివత్స్యామః కైకేయ్యా చ విదూషితాః. 21

నీవును, రాముడును లేక సంకటములలో దగులుకొని, కైకచే దూషింపబడుచు మేమెట్లు నివసింపగలము ?

యయా తు రాజా రామశ్చ లక్ష్మణశ్చ మహాబలః
సీతయా సహ సంత్యక్తా స్సాక మన్యం న హాస్యతి. 22

ఎవ్వతె మహాబలుడగు రాజును, రాముని, లక్ష్మణుని, సీతనుగూడ విడచిపెట్టినదో, ఆమె వేరెవ్వరిని విడువదు ?

తా బాష్పేణ చ సంవీతా శ్శోకేన విపులేన చ
వ్యవేష్టంత నిరానందా రాఘవస్య వరస్త్రియః. 23

దశరథుని యా శ్రేష్ఠపత్నులు కన్నీరు కనుల నించుకొని, మిగుల శోకమునంది, యానందము లేక యిటు నటు దొరలిరి.

నిశా చంద్రవిహీనేవ స్త్రీవ భర్తృవివర్జితా
పురీ నారాజ తాయోధ్యా హీనా రాజ్ఞా మహాత్మనా. 24

మహాత్ముడగు నా మహారాజులేని ఆ అయోధ్య చంద్రుడు లేని రాత్రివలె, భర్తలేని స్త్రీవలె ప్రకాశింపకుండెను.

బాష్పపర్యాకులజనా హాహాభూతకులాంగనా
శూన్యచత్వరవేశ్మాంతా న బభ్రాజ యథాపురమ్. 25

ఆ నగరము కన్నీటితో కలతనొందిన జనులు కలది, హాహాకారము లొనర్చుచున్న పురంధ్రులు కలది, నిర్జనముగ నున్న మార్గముల కూడలులు, గృహములు కలదియై వెనుకటి వోలె ప్రకాశింపలేదు.

గతే తు శోకా త్త్రిదివం నరాధిపే
మహీతలస్థాసు నృపాంగనాసు చ
నివృత్తచార స్సహసా గతో రవిః
ప్రవృత్తచారా రజనీ హ్యుపస్థితా. 26

రాజు పుత్రశోకముతో దివంగతుడు కాగా, రాజుభార్య లెల్లరు నేలఁబడి యుండగా, సూర్యుని కిరణప్రసారము తొలగెను. సూర్యాస్తమయమగుటచే చీకటు లెల్లెడల వ్యాపించి రాత్రి యయ్యెను.

ఋతే తు పుత్త్రా ద్దహనం మహీపతే
ర్న రోచయంతే సుహృద స్సమాగతాః
ఇతీవ తస్మిన్ శయనే న్యవేశయన్
విచింత్య రాజాన మచింత్యదర్శనమ్. 27

అచటకు వచ్చిన రాజుయొక్క మిత్రులు, పుత్రులు చెంతలేక రాజున కగ్నిసంస్కారాదులు చేయబడుట కిష్టపడలేదు. (దీనిచే "ఈ రాజునకు బలపరాక్రమసంపన్నులగు తనయు లుండియు దైవికముగ దూరమున నున్నారు. కాన నూరక సంస్కారము చేయక విడచుట తగదు. ఏదో విధముగ రాజునకు సంస్కారము చేయుద"మని వచ్చినవారిలో కొందరు యత్నించుట సూచితము.) ఆ కారణముచేతనే అటుపై దుర్లభమగు దర్శనము కల రాజు శరీరమును తైలద్రోణియం దుంచిరి.

గతప్రభా ద్యౌ రివ భాస్కరం వినా
వ్యపేతనక్షత్రగణేవ శర్వరీ
పురీ బభాసే రహితా మహాత్మనా
న చాస్రకంఠాఽకులమార్గచత్వరా. **28**

మహాత్ముడగు నా రాజు లేకుండుటచే నా యయోధ్య సూర్యుడు లేక కాంతి తొలగిన యాకాశమువలె, నక్షత్ర సమూహములులేని రాత్రివలె, కన్నీటిచే కలుషితమైన కంఠము కల జనులు మార్గము లందు, కూడలిప్రదేశములందును కలదై ప్రకాశింపకుండెను.

నరా శ్చ నార్య శ్చ సమేత్య సంఘశో
విగర్హమాణా భరతస్య మాతరమ్
తదా నగర్యాం నరదేవసంక్షయే
బభూవు రార్తా న చ శర్మ లేభిరే. **29**

నగరమందలి పురుషులును, స్త్రీలును గుంపులుగ చేరి కైకేయిని నిందించుచు దశరథమహారాజు మృతినందిన యా సందర్భమున దుఃఖపీడితులై సుఖము నందరైరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షట్షష్టితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమునం దయోధ్యాకాండమున నఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

—0—

## సప్తషష్టితమః సర్గః — అరువదియేడవ సర్గము

ఆక్రందితనిరానందా సాస్రకంఠజనాకులా
అయోధ్యాయా మవతతా సా వ్యతీయాయ శర్వరీ. 1

అయోధ్యలో నా రాత్రి, పెద్దగా రోదించుటలచే ఆనందములేనిది, కన్నీరు కారుటచే గద్గదములైన స్వరములుకల జనులతోవ్యాకులమైనదియునై(దుఃఖవశముచే)అతిదీర్ఘముగగడచెను.

వ్యతీతాయాం తు శర్వర్యా మాదిత్య స్యోదయే తతః
సమేత్య రాజకర్తార స్సభా మీయు ర్ద్విజాతయః. 2

అంత రాత్రి గడచి, సూర్యోదయముకాగా రాజు నభిషేకించు బ్రాహ్మణులు సభచేసిరి.

మార్కండేయోఽథ మౌద్గల్యో వామదేవ శ్చ కాశ్యపః
కాత్యాయనో గౌతమ శ్చ జాబాలి శ్చ మహాయశాః. 3

ఏతే ద్విజా స్సహామాత్యైః పృథ గ్వాచ ముదీరయన్
వసిష్ఠ మే వాభిముఖా శ్శ్రేష్ఠం రాజపురోహితమ్. 4

మార్కండేయుడు, మౌద్గల్యుడు, వామదేవుడు, కాశ్యపుడు, కాత్యాయనుడు, గౌతముడు, గొప్పకీర్తిశాలియగు జాబాలి అను నీ బ్రాహ్మణులు మంత్రులతో గూడి రాజపురోహితుడు, శ్రేష్ఠుడగు వసిష్ఠుని కడకేగి వేర్వేరుగ నిట్లు మాటలాడిరి.

అతీతా శర్వరీ దుఃఖం యా నో వర్షశతోపమా
అస్మి న్పంచత్వ మాపన్నే పుత్రశోకేన పార్థివే 5

"ఈ దశరథమహారాజు పుత్రశోకముతో మరణించగా, నూఱేండ్ల కాలమువలె అతిదీర్ఘముగ మనకుతోచిన యీ రాత్రి మిగుల దుఃఖముతో గడచినది.

స్వర్గత శ్చ మహారాజో రామ శ్చారణ్య మాశ్రితః
లక్ష్మణ శ్చాపి తేజస్వీ రామేణైవ గత స్సహ. 6

మహారాజు మరణించినాడు. రాము డడవి కేగినాడు. ప్రతాపశాలియగు లక్ష్మణుడును రామునితోడనే పోయెను.

ఉభౌ భరతశత్రుఘ్నౌ కేకయేషు పరంతపౌ
పురే రాజగృహే రమ్యే మాతామహనివేశనే. 7

శత్రువులను పీడించు భరత శత్రుఘ్ను లిరువురును కేకయ దేశమందలి రాజగృహమను పేరుగల నగరమున మాతామహుని (తాతగారి) రమ్యమైన ఇంటియందున్నారు.

ఇక్ష్వాకూణా మిహా ద్యైవ కశ్చి ద్రాజా విధీయతామ్
అరాజకం హి నో రాష్ట్రం న వినాశ మవాప్నుయాత్. 8

ఇక్ష్వాకువంశ్యులలో నొక్కని నెవ్వనినైన నిపుడే రాజుగా చేయుము. రాజులేని రాజ్యము వినాశము నొందకుండదు గదా.

నారాజకే జనపదే విద్యున్మాలీ మహాస్వనః
అభివర్షతి పర్జన్యో మహీం దివ్యేన వారిణా. 9

రాజులేని రాజ్యమున మెఱుపుల వరుసలు కల మేఘము, పెద్ద పెద్ద ఉరుములుకలదై భూమిపై దివ్యమగు (ఆకసమునుండి పడు) జలమును సమృద్ధిగా వర్షింపదు.

నారాజకే జనపదే బీజముష్టిః ప్రకీర్యతే
నారాజకే పితుః పుత్రో భార్యా వా వర్తతే వశే 10

రాజులేని రాజ్యమున, ఫలించునను విశ్వాసము లేక భూమిపై విత్తులు చల్లబడవు. రాజులేని రాజ్యమున తండ్రికి తనయుడు గాని, భర్తకు భార్యగాని, వశమందుండరు.

నారాజకే ధనం చాస్తి నాస్తి భార్యా ప్యరాజకే
ఇద మత్యాహితం చాన్య త్కుత స్సత్య మరాజకే. 11

అరాజకమగు దేశమున దొంగల భయముచే ధన మధికముగ నుండదు. బంధుత్వము లుండవు కాన భార్య యుండదు. ఇదిగాక వేఱొక భయమును కలదు. రాజులేనిచో క్రయ-విక్రయాది రూపమగు సత్యమును కలుగదు.

నారాజకే జనపదే కారయంతి సభాం నరాః
ఉద్యానాని చ రమ్యాణి హృష్టాః పుణ్యగృహాణి చ. 12

రాజులేని రాజ్యమున జనులు మనస్సులో స్వస్థతలేనివారై సభలు కూడరు. (నఱికివేయుదురని భయముతో) ఉద్యానములు నిర్మింపరు. (దుష్టుల కావాసములగునని పవిత్రములగు దేవాలయాదులను నిర్మింపరు.

నారాజకే జనపదే యజ్ఞశీలా ద్విజాతయః
సత్రా ణ్యన్వాసతే దాంతా బ్రాహ్మణా స్సంశితవ్రతాః.13

అరాజకమగు రాజ్యమున సదా యజ్ఞము లొనరించువారు, ఇంద్రియములను వశీకరించుకొన్నవారు, వేదాధ్యయన సంపన్నులు. వ్రతము లాచరించువారగు బ్రాహ్మణులు మహాయజ్ఞముల ననుష్ఠింపరు.

నారాజకే జనపదే మహాయజ్ఞేషు యజ్వనః
బ్రాహ్మణా వసుసంపూర్ణా విసృజం త్యాప్తదక్షిణాః. 14

తాము ధనికుల మని తెలియుటచే దండనము కలుగునను భయముచే) అరాజక మగు రాజ్యమున గొప్పయజ్ఞము లొనర్చుచు యాజకులగు బ్రాహ్మణులు, ధనసంపన్నులయ్యు భూరి దక్షిణ లీయరు.

నారాజకే జనపదే ప్రభూతనటనర్తకాః
ఉత్సవా శ్చ సమాజా శ్చ వర్ధంతే రాష్ట్రవర్ధనాః. 15

అరాజకమగు దేశమున నాట్యాభినయసమర్థులగు నటులు, కేవలము నర్తనముచేయుటలో సమర్థులగు నర్తకులును అధిక సంఖ్యలో పాల్గొనునట్టివి, రాష్ట్రమును వృద్ధినందించు నవియగు దేవతోత్సవములు, తీర్థయాత్రలును వర్ధిల్లవు.

నారాజకే జనపదే సిద్ధార్థా వ్యవహారిణః
కథాభి రనురజ్యంతే కథాశీలాః కథాప్రియైః. 16

అరాజకమగు దేశమున ఏదేని యొక విషయమున వివాదము కలిగినవారు (న్యాయము చేకూర్చువాడు లేమిచే లేదా లంచగొండితనము కారణముగ) సరియగు ప్రయోజనము నొందరు. లేదా క్రయవిక్రయాది వ్యవహారము చేయువారు సఫలత నొందరు. ఇతిహాస పురాణాది కథలను చెప్పునట్టివారు కథలు వినుటలో నాసక్తులగు శ్రోతలను కథలచే ననురక్తులుగ చేయజాలరు (శ్రోతల మనస్సు స్వస్థముగ నుండదు కనుక).

నారాజకే జనపదే ఉద్యానాని సమాగతాః
సాయాహ్నే క్రీడితుం యాంతి కుమార్యో హేమభూషితాః.

రాజులేని రాజ్యమున సాయంకాలములందు కన్యకాజనము (దొంగలవలని భయముచే) బంగారు నగలు ధరించి చెలులతో నుద్యానములకు పోరు.

నారాజకే జనపదే వాహనై శ్శీఘ్రగామిభిః
నరా నిర్యాంత్యరణ్యాని నారీభి స్సహ కామినః. 18

(దుర్జనులు పరాభవముచేయుదురను భయముతో) రాజులేని రాజ్యమున కాముకులగువారు వేగముగ పోవు వాహనముల నెక్కి తమ స్త్రీలతో వనముల కేగరు.

నారాజకే జనపదే ధనవంత స్సురక్షితాః
శేరతే వివృతద్వారాః కృషిగోరక్షజీవినః. 19

రాజులేని రాజ్యమున సేద్యము, గోపాలనములచే జీవించు ధనికులగు వైశ్యులు ద్వారములు తెఱచికొని నిదురించుటలేదు.

(చోరభయముచే సదా ద్వారములు మూసికొనియే సంచరించు చుందురు.)

నారాజకే జనపదే బద్ధఘంటా విషాణినః
అటంతి రాజమార్గేషు కుంజరా షష్టిహాయనాః. 20

రాజులేని రాజ్యమున గంటలు కట్టబడినవి సుందరము లగు దంతములు కలవి అగు అరువదేండ్ల వయసుగల యేనుగులు రాజమార్గములందు తిరుగవు.

నారాజకే జనపదే శరాన్ సతత మస్యతామ్
శ్రూయతే తలనిర్ఘోష ఇష్వస్త్రాణా ముపాసనే. 21

అరాజకమగు రాజ్యమున విలువిద్య నభ్యసించువారు సదా సమంత్రకములగు అస్త్రములను, అమంత్రకములగు శస్త్రములను అభ్యసించుచు విల్లు చేతబట్టి యల్లెత్రాడును చేతితో లాగగా వచ్చు ధ్వని వినిపించదు.

నారాజకే జనపదే వణిజో దూరగామినః
గచ్ఛంతి క్షేమ మధ్వానం బహుపణ్యసమాచితాః. 22

అరాజకమగు దేశమున విక్రేయవస్తువుల ననేకములను తీసికొని వాణిజ్యముకొఱకు సుదూర మేగు వ్యాపారులు మార్గమున క్షేమముగ పోవజాలరు.

నారాజకే జనపదే చర త్యేకచరో వశీ
భావయ న్నాత్మనాఽఽత్మానం యత్రసాయంగృహో మునిః.

అరాజక మగు దేశమున జితేంద్రియుడై, ఒంటరియై ఎచట సాయంకాలమగునో యచటనే యారాత్రి నివసించుచు మనస్సులో పరమాత్మను ధ్యానించునట్టి యతి దుష్టులవలనిభయముచే సంచరించుటలేదు.

నారాజకే జనపదే యోగక్షేమం ప్రవర్తతే
న చా ప్యరాజకే సేనా శత్రూ న్విషహతే యుధి. 24

అరాజక మగు దేశమున యోగక్షేమములు కలుగవు (మున్ను లభించనిది లభించుట యోగము, లభించిన దానిని కాపాడుకొనుట క్షేమము). అరాజక దేశమునందలి సేన యుద్ధమున శత్రువుల నోడింపదు.

నారాజకే జనపదే హృష్టైః పరమవాజిభిః
నరా స్సంయాంతి సహసా రథైశ్చ పరిమండితాః. 25

అరాజక మగు దేశమున జను లలంకరించుకొని, యుత్సాహముగల యుత్తమాశ్వములను, రథములనెక్కి, తలంచికొన్నప్పుడు భయములేక విహరింపజాలరు.

నారాజకే జనపదే నరా శ్శాస్త్రవిశారదాః
సంవదంతోఽవతిష్ఠంతే వనే షూపవనేషు చ. 26

అరాజకమగు దేశమున వివిధశాస్త్రములలో నిష్ణాతులైనవారు మున్యాశ్రమములందును, తోటలయందును గూరుచుండి శాస్త్రచర్చలు చేయరు.

నారాజకే జనపదే మాల్యమోదకదక్షిణాః
దేవతాభ్యర్చనార్థాయ కల్ప్యంతే నియతై ర్జనైః. 27

అరాజకమగు దేశమున జనులు విఘ్నములు కలుగునను భయముచే నియమవంతులై దేవతల నర్చించుటకు పుష్పమాలలు కుడుములు, దక్షిణల నీయ దలంపరు.

నారాజకే జనపదే చందనాగరురూషితాః
రాజపుత్రా విరాజంతే వసంత ఇవ శాఖినః. 28

రాజు లేని రాజ్యమున రాజకుమారులు చందనము, అగరువులను బూసికొని, వసంతమున వృక్షములవోలె ప్రకాశింపరు.

యథా హ్యనుదకా నద్యో యథా వాఽప్యతృణం వనమ్
అగోపాలా యథా గావ స్తథా రాష్ట్ర మరాజకమ్. 29

అరాజకమగు రాష్ట్రము నీరులేని నదులవలె, పచ్చగడ్డిలేని వనమువలె, గోపాలురులేని గోవులవలె శోభిల్లదు.

ధ్వజో రథస్య ప్రజ్ఞానం ధూమో జ్ఞానం విభావసోః
తేషాం యో నో ధ్వజో రాజా స దేవత్వ మితో గతః. 30

రథమునకు ధ్వజము, అగ్నికి ధూమము, ప్రకాశకము. అట్లు మన కెల్లరకు ధ్వజమువోలె నుండిన రాజిటనుండి వెడలి దేవత్వము నొందెను.

నారాజకే జనపదే స్వకం భవతి కస్యచిత్
మత్స్యా ఇవ నరా నిత్యం భక్షయంతి పరస్పరమ్. 31

రాజులేని దేశమున ఒకరిసొత్తని యేదియు నుండదు. నరులెల్లపుడు చేపలవలె నొకరి నొకరు భక్షింతురు.

యే హి సంభిన్నమర్యాదా నాస్తికా శ్ఛిన్నసంశయాః
తేఽపి భావాయ కల్పంతే రాజదండనిపీడితాః.

తమ తమ ధర్మము దప్పినవారును, అందువలన పూర్వము రాజుచే దండింపబడినవారగు నాస్తికులు, మఱల రాజదండము అనుభవింపవలసివచ్చునను శంకలేనివారై తమ ప్రభావము జూప ప్రయత్నింతురు.

యథా దృష్టి శ్శరీరస్య నిత్య మేవ ప్రవర్తతే
తథా నరేంద్రో రాష్ట్రస్య ప్రభవ స్సత్యధర్మయోః. 33

శరీరమునకు కన్నెటులు హితము గూర్చుచు, కీడు తొలగించుచుండునో యట్లే రాజును దేశమున సత్యమును, ధర్మమును ప్రవర్తింపజేయును.

రాజా సత్యం చ ధర్మ శ్చ రాజా కులవతాం కులమ్
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. 34

రాజే సత్యము, ధర్మము. రాజే కులీనులను తమ కులాచారమున బ్రవర్తింపజేయును. రాజే ప్రజలకు తల్లియు,తండ్రియు. రాజె ప్రజలకు హితము గూర్చువాడు.

యమో వైశ్రవణ శ్శక్రో వరుణ శ్చ మహాబలః
విశేష్యంతే నరేంద్రేణ వృత్తేన మహతా తతః. 35

రాజుయొక్క విశిష్టమగు నాచరణముచే యముని, కుబేరుని, ఇంద్రుని, మహాబలుడగు వరుణుని అతిశయించుచున్నాడు. యముడు దండించును, కుబేరుడు ధనమిచ్చును,

ఇంద్రుడు పాలించును. వరుణుడు జనులను సదాచారముచేయ నియమించును. రాజీ నాలుగు పనులు తానొక్కడే చేయుటచే నీ నలువురిలో ప్రతియొక్కరికంటె విశిష్టుడు.

అహో తమ ఇ వేదం స్యా న్న ప్రజాయేత కించన
రాజా చే న్న భవే ల్లోకే విభజన్ సాధ్వసాధునీ. 36

లోకమున మంచి, చెడులను వేర్పరచుచు పాలించు రా జనువా డొకడు లేనిచో నీ లోకము అంధకారమయ మగును. ఇది యిట్టిదని యేమియు తెలియకుండును.

జీవ త్యపి మహారాజే త వైవ వచనం వయమ్
నాతిక్రమామహే సర్వే వేలాం ప్రాప్యేవ సాగరః. 37

మహారాజు జీవించియున్నపుడు కూడ మేమెల్లరము సముద్రము చెలియలికట్టను చేరి దానిని మీఱనట్లు నీ మాట నెన్నడును అతిక్రమించలేదు.

స నః సమీక్ష్య ద్విజవర్యవృత్తం
నృపం వినా రాజ్య మరణ్యభూతమ్
కుమార మిక్ష్వాకుసుతం వదాన్యం
త్వ మేవ రాజాన మిహాభిషించ. 38

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడవగు వసిష్ఠుడా! అట్టి నీవు అరాజకత్వమువలన కలిగెడి సకల క్లేశములను సమీక్షించి, రాజులేని రాజ్య మరణ్యసదృశమగుటచే ఇక్ష్వాకువంశ్యుడు, వదాన్యుడగు నొక్కనిని రాజుగా నభిషేకింపుము అనిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తషష్టితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణ
మం దయోధ్యాకాండమున అఱువది యేడవ సర్గము
సంపూర్ణము.

—0—

## అష్టషష్టితమః సర్గః - అఱువదియెనిమిదవ సర్గము

తేషాం హి వచనం శ్రుత్వా వసిష్ఠః ప్రత్యువాచ హ
మిత్రా మాత్యగణా న్సర్వా న్బ్రాహ్మణాం స్తా నిదం వచః. 1

వారి మాటలు విని, మిత్రులగు సుమంత్రుడు మున్నగు మంత్రులు, మార్కండేయుడు మున్నగు బ్రాహ్మణులకు వసిష్ఠు డిట్లనెను.

య దసౌ మాతులకులే పురే రాజగృహే సుఖీ
భరతో వసతి భ్రాత్రా శత్రుఘ్నేన సమన్వితః. 2

త చ్ఛీఘ్రం జవనా దూతా గచ్ఛంతు త్వరితై ర్హయైః
ఆనేతుం భ్రాతరౌ వీరౌ కిం సమీక్షామహే వయమ్. 3

'రాజగృహ' మను పేరుగల పట్టణమున మేనమామ యింట శత్రుఘ్నునితోగూడి భరతుడు సుఖముగ నున్నాడు. కావున వేగముగ పోవు దూతలు వేగముకల గుఱ్ఱములనెక్కి

వీరులగు సోదరులను తీసికొనివచ్చుట కటకు పోవలయును. (రాజే భరతునకు రాజ్య మిచ్చెను కనుక) మఱల విచారింప వలసిన దేమున్నది ?

గచ్ఛం త్వితి తత స్సర్వే వసిష్ఠం వాక్య మబ్రువన్
తేషాం తద్వచనం శ్రుత్వా వసిష్ఠో వాక్య మబ్రవీత్. 4

అప్పుడందరును దూత లట్లే పోవలయునని వసిష్ఠునితో చెప్పిరి. వారి యా మాట విని వసిష్ఠు డీ విధముగ పలికెను.

ఏహి సిద్ధార్థ! విజయ! జయంతాశోక! నందన!
శ్రూయతా మితి కర్తవ్యం సర్వా నేవ బ్రవీమి వః. 5

ఓయీ సిద్ధార్థుడా! విజయుడా! జయంతుడా! అశోకుడా! నందనుడా! మీ రిప్పు డాచరింపవలసిన పనుల నెఱింగింతును. వినుడు.

పురం రాజగృహం గత్వా శీఘ్రం శీఘ్రజవై ర్హయైః
త్యక్తశోకై రిదం వాచ్య శ్శాసనా ద్భరతో మమ. 6

మీరు శీఘ్రమే వేగముగ పోవు గుఱ్ఱములపై 'రాజగృహ' పట్టణమునకేగి, శోకము వీడి, నా యాజ్ఞగా భరతున కిట్లు చెప్పుడు.

పురోహిత స్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మంత్రిణః
త్వరమాణ శ్చ నిర్యాహి కృత్య మాత్యయికం త్వయా. 7

పురోహితుడు, మంత్రు లందరు నిన్ను కుశల మడిగినారు. నీవు త్వరగా మఱలిరమ్ము. ఇచట నొక పనికి సమయము మించి పోవుచున్నది.

మా చాస్మై ప్రోషితం రామం మా చాస్మై పితరం మృతమ్
భవంత శ్శంసిషు ర్గత్వా రాఘవాణా మిమం క్షయమ్. 8

మీ రట కేగి రాము డడవి కేగె నని కాని, నీ తండ్రి మరణించెనని గాని రాఘవుల తేజస్సును తక్కువచేయు ఈ వార్తలను తెలుపకుడు.

కౌశేయాని చ వస్త్రాణి భూషణాని వరాణి చ
క్షిప్ర మాదాయ రాజ్ఞశ్చ భరతస్య చ గచ్ఛత. 9

కేకయరాజులకు, భరతునకును పట్టువస్త్రములు, శ్రేష్ఠములగు అలంకారములను శీఘ్రమే కొనిపొండు.

దత్తపథ్యశనా దూతా జగ్ము స్స్వం స్వం నివేశనమ్
కేకయాం స్తే గమిష్యంతో హయా నారుహ్య సమ్మతాన్.

ఆ దూతలు మార్గమున తినదగిన యాహారము తీసికొనినవారై వేగముచే, మార్గాయాసమును సహించుటచే యోగ్యములగ సమ్మతములైన గుఱ్ఱముల నెక్కి కేకయదేశమునకు పోబోవుచు (తమ భార్య మున్నగు వారికి తమ ప్రయాణమును గూర్చి తెలుపుటకై) తమ తమ యిండ్ల కేగిరి.

తతః ప్రాస్థానికం కృత్వా కార్యశేష మనంతరమ్
వసిష్ఠే నాభ్యనుజ్ఞాతా దూతా స్సంత్వరితా యయుః. 11

అంత నా దూతలు ప్రయాణమునకు వలయు అహారాదులను సమకూర్చుకొనుట మున్నగు మిగిలిన పని చక్కబెట్టుకొని, వసిష్ఠు ననుమతి వడసి వేగముగ వెడలిరి.

న్యంతే నాపరతాలస్య ప్రలంబ స్యోత్తరం ప్రతి
నిషేవమాణా స్తే జగ్ము ర్నదీం మధ్యేన మాలినీమ్. 12

వారు అపరతాలమను పేరుగల కొండయొక్క చరమప్రదేశమున, ప్రలంబమను పేరుగల కొండకు ఉత్తరమున, ఈ రెండు కొండలకు నడుమ మాలినీనదిని బట్టి పోయిరి. (అపరతాల పర్వత మయోధ్యకు ముందు (పడమర) దక్షిణోత్తరముగా వ్యాపించియున్నది. ప్రలంబగిరి వెనుకవైపు దక్షిణోత్తరముగా వ్యాప్తమై యున్నది. అది తూర్పుపడమర దిశలకు సాగియున్నది. కావున దూతలు తొలుత అయోధ్యనుండి పశ్చిమాభిముఖముగా వెడలినవారై, ఆ పర్వతముల నడుమ నుత్తరదిశకు తిరిగి కొంతదూరము మాలినీనదీతీరమున పోయి, పిమ్మట ప్రలంబగిరికి ఉత్తరదిశను పశ్చిమాభిముఖముగ నేగిరి).

తే హస్తినాపురే గంగాం తీర్త్వా ప్రత్యఙ్ముఖా యయుః
పాంచాలదేశ మాసాద్య మధ్యేన కురుజాంగలమ్. 13

సరాంసి చ సుపూర్ణాని నదీ శ్చ విమలోదకాః
నిరీక్షమాణా స్తే జగ్ము ర్దూతాః కార్యవశా ద్ద్రుతమ్. 14

ఆ దూతలు హస్తినాపురమున గంగను దాటి పడమటి దిక్కున పోయిరి. వారట్లు కురుదేశమందలి జాంగల దేశము మధ్యగా పోయి పాంచాలదేశము చేరి, యచట నీటితో

నిండిన కొలనులను, నిర్మలమగు నీరుకల నదులను చూచుచు కార్యవశముచే నెచ్చటను నిలువక వేగముగా నేగిరి.

తే ప్రసన్నోదకాం దివ్యాం నానావిహగసేవితామ్
ఉపాతిజగ్ము ర్వేగేన శరదండాం జనాకులామ్. 15

వారు మార్గమున నిర్మలములగు జలములు కలది, పలు విధములగు పక్షులచే సేవింపబడినది, పలువురు (స్నానము చేయు) జనులతో కూడినదగు శరదండానది కడ కేగి, దానిని దాటి వేగముగ వెడలిరి.

నికూలవృక్ష మాసాద్య దివ్యం సత్యోపయాచనమ్
అభిగమ్యాభివాద్యం తం కులింగాం ప్రావిశన్ పురీమ్.

వారు శరదండానదికి పశ్చిమతీరమం దున్నది, దేవతలచే నధిష్ఠితమైనది, సత్యమగు యాచన కలది (తన చెంత కేతెంచి ప్రార్థించువారల కోర్కె తీడేర్చునది) నమస్కరింపదగిన దగు పుణ్యవృక్షమును సమీపించి, దానికి ప్రణమిల్లి, కులింగ పట్టణము ప్రవేశించిరి.

అభికాలం తతః ప్రాప్య తే బోధిభవనాచ్చ్యుతామ్
పితృపైతామహీం పుణ్యాం తేరు రిక్షుమతీం నదీమ్. 17

అంతట వా రభికాలమను గ్రామము చేరి, అచట బోధి భవనమను పర్వతమునుండి పుట్టినది, దశరథపంశ్యులచే సేవింప బడినది, పవిత్రమైనది అగు ఇక్షుమతీనదిని దాటిరి. ('తే బోధి భవనా చ్చ్యుతామ్' కు బదులు 'తేజోభిభవనాచ్చ్యుతాః' అని

మహేశ్వరతీర్థుల పాఠము. దాని ప్రకారము 'తేజోభిభవన మః గ్రామమునుండి వెడలినవారై' అని అర్థము).

అవే క్ష్యాఞ్జలిపానాం శ్చ బ్రాహ్మణాన్ వేదపారగాన్
య యు ర్మధ్యేన బాహ్లీకాన్ సుదామానం చ పర్వతమ్.1

ఆ దూత లచట దోసెడు నీరు మాత్రమే నిత్య మాహా ముగ తీసికొనుచు తప మొనర్చు నిక్షుమతీతీర వాసులగ బ్రాహ్మణులను చూచి, యట నుండి బాహ్లీకదేశగ్రామముల నడుమనే సుదామపర్వతమున కభిముఖముగ పయనించిరి.

విష్ణోః పదం ప్రేక్షమాణా విపాశాం చాపి శాల్మలీమ్
నదీ ర్వాపీ స్తటాకాని పల్వలాని సరాంసి చ. 1

పశ్యంతో వివిధాం శ్చాపి సింహవ్యాఘ్రమృగద్విపాన్
యయుః పథాఽతిమహతా శాసనం భర్తు రీప్సవః. 2

ఆ దూతలు సుదామపర్వతముపై విష్ణుపాదచిహ్నము కలిగి పవిత్రమైన స్థానమును, చెంతనే ప్రవహించు విపాశానదిని, ఆ నదీతీరమందలి శాల్మలివృక్షమును చూచుచు, మార్గమున నదులు, దిగుడుబావులు, చెరువులు, చిన్న నీటి పట్టులు, మడు గులను చూచుచు, సింహములు, పులులు, లేళ్లు, ఏనుగులను కాంచుచు తమ స్వామి యాజ్ఞ పాలించువారై సుదూర మగు నా బాటను పట్టిపోయిరి.

తే శ్రాంతవాహనా దూతా వికృష్టేన పథా తతః
గిరివ్రజం పురవరం శీఘ్ర మాసేదు రంజసా. 12

అట్లు బహుదూరమగు మార్గమున పోవుటచే బడలిక నొందిన గుఱ్ఱములు కల యా దూత లంత గిరివ్రజ మను నుత్తమ మగు నగరమునకు శీఘ్రమే సూటిగా పోయిరి.

భర్తుః ప్రియార్థం కులరక్షణార్థం
భర్తు శ్చ వంశస్య పరిగ్రహార్థమ్
అహేడమానా స్త్వరయా స్మ దూతా
రాత్ర్యాం తు తే తత్పుర మేవ యాతాః. 22

దశరథుని ప్రియము కొఱకును (శీఘ్రమే భరతుని కొని వచ్చి, యాతనిచే తండ్రి కౌర్ధ్వదైహికక్రియలు చేయించుటచే దశరథునకు పరలోకప్రాప్తి రూపమగు ప్రియము కలుగును), ఇక్ష్వాకు వంశమును రక్షించుటకును (దశరథుని మరణముచే అనాథలగు ఇక్ష్వాకువంశ్యులను భరతుని కొనివచ్చుటచే రక్షించుటకును), ఇక్ష్వాకువంశ్యుడగు భరతుని రాజ్యమున ప్రతిష్ఠించుటకును, అదరముతో వేగిరపడుచు ఆ దూతలు చీకటిపడినను ప్రయాణముచేసి, రాత్రివేళ రాజగృహపట్టణమును చేరిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే అదికావ్యే అయోధ్యాకాండే
అష్టషష్టితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, అదికావ్యమగు శ్రీమద్రామాయణమునం దయోధ్యాకాండమున నఱువది యెనిమిదవసర్గము సంపూర్ణము.

—0—

# ఏకోనసప్తతితమః సర్గః - అఱువదితొమ్మిదవ సర్గము

యామేవ రాత్రిం తే దూతాః ప్రవిశంతి స్మ తాం పురీమ్
భరతేనాపి తాం రాత్రిం స్వప్నో దృష్టోఽయ మప్రియః.

దూత లే రాత్రి రాజగృహపట్టణమున కేగిరో, యా రాత్రియే భరతున కప్రియము కలిగించు స్వప్నము వచ్చెను.

వ్యుష్టామేవ తు తాం రాత్రిం దృష్ట్వా తం స్వప్న మప్రియమ్
పుత్త్రో రాజాధిరాజస్య సుభృశం పర్యతప్యత. 2

ఆ రాత్రి తెల్లవారుచుండగనే అప్రియమగు స్వప్నము గాంచిన ఆ రాజశ్రేష్ఠుడగు దశరథుని తనయుడైన భరతుడు మిక్కిలి యసంతృప్తుడాయెను.

తప్యమానం సమాజ్ఞాయ వయస్యాః ప్రియవాదినః
అయాసం హి వినేష్యంత స్సభాయాం చక్రిరే కథాః. 3

ప్రియోక్తు లాడెడు భరతుని చెలికాండ్రు, భరతుడు పరితాపము నొందెనని యెఱిగి యొకచో గుమిగూడి యాతని మనఃక్లేశము తొలగించుచు కథలు చెప్పిరి.

వాదయంతి తథా శాంతిం లాసయంత్యపి చాపరే
నాటకా న్యపరే ప్రాహు ర్హాస్యాని వివిధాని చ. 4

వా రాతని దుఃఖశాంతికై వీణాదులను వాయించసాగిరి. మఱికొందరు సుకుమారనృత్య మొనరింపజొచ్చిరి. మఱికొందరు

నాటకములను చెప్పిరి. ఇంకను కొందరు పలువిధములగు హాస్యోక్తులు పలికిరి.

స తై ర్మహాత్మా భరత స్సఖిభిః ప్రియవాదిభిః
గోష్ఠీహాస్యాని కుర్వద్భి ర్న ప్రాహృష్యత రాఘవః. 5

రఘువంశమున బుట్టిన మహాత్ము డగు భరతుడు ప్రియవాదులగు తన మిత్రు లట్లు సభాయోగ్యములగు హాస్యము లెంతగా చేయుచున్నను ముద మంద డాయెను.

త మబ్రవీత్ ప్రియసఖో భరతం సఖిభి ర్వృతమ్
సుహృద్భిః పర్యుపాసీనః కిం సఖే! నానుమోదసే. 6

భరతు డట్లు మిత్రులచే పరివేష్టితుడై యుండగా ఆతని ప్రీతిపాత్రుడగు మిత్రు డొక్కడు-"మిత్రమా! నీవు చెలికాంద్రతో గూడియు సంతోష పడుటలే దేల" యని యడిగెను.

ఏవం బ్రువాణం సుహృదం భరతః ప్రత్యువాచ హ
శృణు త్వం యన్నిమిత్తం మే దైన్య మేత దుపాగతమ్. 7

అని పలుకుచున్న మిత్రునకు భరతు డిట్లనెను. 'చెలికాడా! ఏ కారణముచే నా కిట్టి దైన్యము కలిగెనో తెలిపెదను. వినుము'

స్వప్నే పితర మద్రాక్షం మలినం ముక్తమూర్ధజమ్,
పతంత మద్రిశిఖరా త్కలుషే గోమయహ్రదే. 8

నేను కలలో నా తండ్రి మలినశరీరముతో, జుట్టు విరియబోసికొని కొండకొననుండి కలుషితమైన పేడమడుగులో పడుచున్నవానినిగా చూచితిని.

ప్లవమాన శ్చ మే దృష్ట స్స తస్మి న్గోమయహ్రదే
పిబ న్నంజలినా తైలం హస న్నపి ముహు ర్ముహుః. 9

నా తండ్రి యా పేడమడుగులో తేలుచు, దోసిలితో నూనె త్రాగుచు, మాటిమాటికి నవ్వుచున్నట్లు కల గంటిని.

తత స్తిలోదనం భుక్త్వా పునః పున రధశ్శిరాః
తైలే నాభ్యక్తసర్వాంగ స్తైల మే వావగాహత. 10

పిమ్మట నూవులు కలసిన యన్నము తిని మాటిమాటికి తల వంచుకొనుచు, నొడలంతయు నూనె పూసికొని నూనెలోనే మునిగెను.

స్వప్నే ఒపి సాగరం శుష్కం చంద్రం చ పతితం భువి
ఉపరుద్ధాం చ జగతీం తమసేవ సమావృతామ్. 11

ఔపవాహ్యస్య నాగస్య విషాణం శకలీకృతమ్
సహసా చాపి సంశాంతం జ్వలితం జాతవేదసమ్. 12

అవతీర్ణాం చ పృథివీం శుష్కాం శ్చ వివిధాన్ ద్రుమాన్
అహం పశ్యామి విధ్వస్తాన్ సధూమాం శ్చాపి పర్వతాన్. 13

ఇంకను ఆ స్వప్నమున సముద్ర మెండినట్లును, చంద్రుడు భూమిపై బడినట్లును, చీకట్లచేవలె జగమెల్ల నేమియు కన్పట్ట కున్నట్లును, రాజెక్కు పట్టపుటేనుగు దంతము విరిగినట్లును, ప్రజ్వలించిన యగ్ని యొక్కుమ్మడి చల్లారినట్లును, భూమి (బీటలు వారి) క్రుంగినట్లును, పలు విధములగు చెట్లెండి

నట్లును కొండలు ధ్వంసమై వానినుండి పొగలు వచ్చుచున్న ట్లును చూచితిని.

పీఠే కార్ష్ణాయసే చైనం నిషణ్ణం కృష్ణవాససమ్
ప్రహసంతి స్మ రాజానం ప్రమదాః కృష్ణపింగళాః. 14

నల్లని వస్త్రములు దాల్చి, యినుపపీటపై కూర్చున్న రాజును చూచి నలుపు-గోరోచనపు వన్నెగల స్త్రీలు నవ్వు చుండిరి

త్వరమాణ శ్చ ధర్మాత్మా రక్తమాల్యానులేపనః
రథేన ఖరయుక్తేన ప్రయాతో దక్షిణాముఖః. 15

ధర్మాత్ము డగు నారాజు ఎఱ్ఱని పూదండలు, చందనము ధరించి, త్వరపడుచు, గాడిదలతో పూన్చబడిన రథమెక్కి దక్షిణదిశగా పోయెను.

ప్రహసంతీవ రాజానం ప్రమదా రక్తవాసినీ
ప్రకర్షంతీ మయా దృష్టా రాక్షసీ వికృతాననా. 16

వికారమగు ముఖము కలదై, యెఱ్ఱని వలువ ధరించిన యొక రాక్షస స్త్రీ రాజును చూచి బిగ్గరగా నవ్వుచు, నాతని కొట్టి యీడ్చుకొనిపోవుచున్నట్లు కలగంటిని.

ఏవ మేత న్మయా దృష్ట మిమాం రాత్రిం భయావహామ్
అహం రామోఽథవా రాజా లక్ష్మణో వా మరిష్యతి. 17

ఈ ప్రకారముగ భయంకరమగు పీడకల నీ రాత్రి చూచితిని. (దీనికి ఫలముగ) నేనో, రాముడో, రాజో లేక లక్ష్మణుడో మరణించును.

నరో యానేన య స్స్వప్నే ఖరయుక్తేన యాతి హి
అచిరాత్తస్య ధూమాగ్రం చితాయాం సంప్రదృశ్యతే. 18

ఎవడు స్వప్నమున గాడిదలతో గట్టబడిన రథమెక్కి సంచరించునో, యాతని శరీర మచిరకాలముననే చితిపై దగులబడి పొగ లెగయుట కనుపించును.

ఏతన్నిమిత్తం దీనోఽహం త న్న వః ప్రతిపూజయే
శుష్యతీవ చ మే కంఠో న స్వస్థ మివ మే మనః. 19

ఈ కారణముచే నేను దీనుడనై యున్నాను. కావుననే మీ ప్రియోక్తుల నాదరింపలేనైతిని. నా గొంతు తడియారుచున్నట్లున్నది. నా మనస్సు సరిగా లేకున్నది.

న పశ్యామి భయస్థానం భయం చైవోపధారయే
భ్రష్టశ్చ స్వరయోగో మే ఛాయా చోపహతా మమ
జుగుప్స న్నివ చాఽత్మానం న చ పశ్యామి కారణమ్. 20

భయకారణము నూహింపలేకున్నాను. కాని భయవివశుడనగుచున్నాను. నా కంఠస్వరము సన్నగిలినది. నా కాంతియు తఱిగినది. నన్ను నే నసహ్యపడుచున్నటు లనిపించుచున్నది. కారణమేమో కనుపించుటలేదు.

ఇమాం హి దుస్స్వప్నగతిం నిశామ్య తా
మనేకరూపా మవితర్కితాం పురా
భయం మహ త్తద్ధృదయా న్న యాతి మే
విచింత్య రాజాన మచింత్యదర్శనమ్. 21

ఇట్లనేక రూపములు గలిగి, ముం దిట్టి యాలోచన లేకయే యేర్పడినట్టిదైన (ముందు ఆలోచన, ఆ తరువాత కల వచ్చిచో ఆ కల ఫలింపదు. ముందట్టి యాలోచన లేకయే కల వచ్చిన నది యమోఘముగ ఫలించును) యీ దుస్స్వప్నపు తీరు చూచి, ఊహింపరాని విధముగ రాజును కలలో చూచిన నాకు హృదయ మునుండి భయము తొలగకున్నది.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోనసప్తతితమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నఱువది తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

—0—

## సప్తతితమః సర్గః - డెబ్బదియవ సర్గము

భరతే బ్రువతి స్వప్నం దూతా స్తే క్లాంతవాహనాః
ప్రవి శ్యాసహ్యపరిఖం రమ్యం రాజగృహం పురమ్. 1

సమాగమ్య తు రాజ్ఞా చ రాజపుత్రేణ చార్చితాః
రాజ్ఞః పాదౌ గృహీత్వా తు త మూచు ర్భరతం వచః. 2

భరతు డట్లు తన మిత్రులకు స్వప్నవృత్తాంతము తెలుపు చుండగనే, యయోధ్యనుండి బయలుదేరిన దూతలు అలసిన గుఱ్ఱములు కలవారై, శత్రువులకు దాటరాని యగడ్తలు గల సుందరమగు రాజగృహపట్టణము ప్రవేశించి, కేకయరాజు, ఆయన తనయుఁడు యుధాజిత్తు వారి కెదురేగి సత్కరింపగా, రాజు పాదములకు ప్రణమిల్లినవారై భరతున కిట్లు పలికిరి.

పురోహిత స్త్వాం కుశలం ప్రాహ సర్వే చ మంత్రిణః
త్వరమాణ శ్చ నిర్యాహి కృత్య మాత్యయికం త్వయా. 3

పురోహితుఁడగు వసిష్ఠుడు నీ క్షేమ మడిగినాడు. మంత్రు లెల్లరును నీ కుశల మఱసినారు. నీవింక త్వరగా వెడలుము. నీ విపుడొక చేయశక్యముగాని పని చేయవలసియున్నది.

ఇమాని చ మహార్హాణి వస్త్రా ణ్యాభరణాని చ
పరిగృహ్య విశాలాక్ష! మాతులస్య చ దాపయ. 4

విశాలములైన కన్నులు కలవాడా! గొప్ప వెలగల యీ వస్త్రములను, ఆభరణములను స్వీకరించి నీ మేనమామ కిమ్ము.

అత్ర వింశతికోట్య స్తు నృపతే ర్మాతులస్య తే
దశకోట్య స్తు సంపూర్ణా స్తథైవ చ నృపాత్మజ!. 5

ఓ రాజపుత్రా! వీనిలో నిరువది కోట్ల వెలగలవి కేకయ

రాజునకును, పూర్ణముగ పదికోట్లు విలువైనవి నీ మేనమామకును ఇయ్యదగినవి.

ప్రతిగృహ్యా తు తత్సర్వం స్వనురక్త స్సుహృజ్జనే
దూతా నువాచ భరతః కామై స్సంప్రతిపూజ్య తాన్. 6

భరతుడు మహార్ఘములగు నా వస్త్రాభరణములను గ్రహించి, మేనమామ, మాతామహులయం దనురాగములో వానిని వారల కొసగి, దూతల కోరికల కనుగుణముగ వారిని సత్కరించి యిట్లనెను.

కచ్చి త్సుకుశలీ రాజా పితా దశరథో మమ।
కచ్చి చ్చారోగతా రామే లక్ష్మణే చ మహాత్మని । 7

నా తండ్రి, దశరథ మహారాజునకు కుశలమా ? మహాత్ముడగు రాముడు, లక్ష్మణుడు ఆరోగ్యముగ నున్నారా ?

ఆర్యా చ ధర్మనిరతా ధర్మజ్ఞా ధర్మదర్శినీ
అరోగా చాపి కౌసల్యా మాతా రామస్య ధీమతః. 8

పూజ్యురాలు, ధర్మానుష్ఠానమున నాసక్తిగలది, ధర్మమెఱిగినది, జనులలో ధర్మమునే (గుణమునే) చూచునది యగు రాముని తల్లి (నా పెద్దతల్లి) కౌసల్య యే రోగము లేక కుశలముగ నున్నదా ?

కచ్చి త్సుమిత్రా ధర్మజ్ఞా జననీ లక్ష్మణస్య యా
శత్రుఘ్నస్య చ వీరస్య సాఽరోగా చాపి మధ్యమా. 9

నా మధ్యమమాతయు, ధర్మ మెఱిగినదియు, లక్ష్మణునకు, వీరు డగు శత్రుఘ్నునకు తల్లియగు సుమిత్ర యారోగ్యము గలిగి యున్నదా ?

ఆత్మకామా సదా చండీ క్రోధనా ప్రాజ్ఞమానినీ
అరోగా చాపి మే మాతా కైకేయీ కి ముమాచ హ. 10

స్వప్రయోజనమం దాసక్తిగలది, తన్ను తాను చాల తెలివిగల దానినిగా తలంచుకొనునది, తీవ్ర స్వభావము కలది, కోపించు నదగు నా తల్లి కైకేయి తన బంధువులను గూర్చి యేమనినది ? (కైకేయి కొసగిన యీ విశేషణములను బట్టి భరతుడు తాను దుస్స్వప్నము చూచుట, దూతలు వచ్చుటలచే తనతల్లి కైక యే మైన యకృత్యము చేసెనా యని యూహించుటను కవి సూచించి నాడు.)

ఏవ ముక్తా స్తు తే దూతా భరతేన మహాత్మనా
ఊచు స్సంప్రశ్రయం వాక్య మిదం తం భరతం తదా.11

మహాబుద్ధిశాలి (మేనమామ యింట నుండియు అయోధ్యా వృత్తాంతము నూహింప జాలిన వాడు) యగు భరతు డిట్లు పలు కగా ఆ దూతలు (భరతునకు సందేహము కలుగకుండగ నే మాత్రము జాగు సేయక) వెంటనే వినయముతో గూడున ట్లీ వాక్యము పలికిరి.

కుశలా స్తే నరవ్యాఘ్ర! యేషాం కుశల మిచ్ఛసి
శ్రీ శ్చ త్వాం వృణుతే పద్మా యుజ్యతాం చాపి తే రథః.

ఓ నరశ్రేష్ఠుడా! నీ వెవ్వరి కుశలము కోరుచున్నావో వారెల్లరకు కుశలము (ఒక్కొక్కరి విషయము చెప్పిన సందేహమున కవకాశముండునని సామూహికకుశలము తెలుపుట). పద్మములు ధరించిన లక్ష్మి (రాజ్యలక్ష్మి) నిన్ను వరించుచున్నది. నీవు శీఘ్రమే రథము సిద్ధము చేయించుము (దూతలు నీవు రాజువు కానున్నావని భరతునకు సూచించిరి. భరతుడు దీని నమంగళము తొలగుటకై పలికిన మాటగా తలంచెను).

భరత శ్చాపి తాన్ దూతా నేవ ముక్తోఽభ్యభాషత
అపృచ్ఛేఽహం మహారాజం దూతా స్సంత్వరయంతి మామ్.

వా రట్లు చెప్పగా భరతు డిట్లనెను— 'దూతలు నన్ను తొందర చేయుచున్నారని మహారాజునకు తెలిపి సెలవు తీసికొందును.'

ఏవ ముక్త్వా తు తాన్ దూతాన్ భరతః పార్థివాత్మజః
దూతై స్సంచోదితో వాక్యం మాతామహ మువాచ హ. 14

రాజకుమారు డగు భరతు డిట్లు దూతలతో పలికి, వారిచే బ్రేరితుడై తన మాతామహుడగు కేకయరాజు కిట్లనెను.

రాజన్! పితు ర్గమిష్యామి సకాశం దూతచోదితః
పున ర ప్యహ మేష్యామి యదా మే త్వం స్మరిష్యసి. 15

రాజా! దూతలచే ప్రేరితుడనగు నేను నా తండ్రి కడకు పోయెదను. నీవు మరల నెప్పుడు నన్ను దలంతువో యప్పుడిటకు వత్తును

భరతే నైవ ముక్తస్తు నృపో మాతామహ స్తదా
త మువాచ శుభం వాక్యం శిర స్యాఘ్రాయ రాఘవమ్.

భరతు డిట్లు చెప్పగా మాతామహుడగు కేకయమహారా జపుడు మనుమని శిరము మూర్కొని యాతని కిట్లు శుభమగు మాట పలికెను.

గచ్ఛ తాతానుజానే త్వాం కైకేయీ సుప్రజా స్త్వయా
మాతరం కుశలం బ్రూయాః పితరం చ పరంతప. 17

నాయనా! నేను నిన్ననుమతించుచున్నాను. కైక నిన్ను గని మంచి కొడుకు కలదైనది. ఓ శత్రువులను పీడించువాడా! నీ తల్లికి, తండ్రికిని కుశలము తెలుపుము.

పురోహితం చ కుశలం యే చాన్యే ద్విజసత్తమాః
తౌ చ తాత! మహేష్వాసౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 18

నాయనా! పురోహితుడగు వసిష్ఠుని, తక్కిన బ్రాహ్మణ శ్రేష్ఠులను కుశల మడిగితి ననుము. మేటి విలుకాండ్రగు సోదరులైన రామలక్ష్మణులకును కుశలమని చెప్పుము.

తస్మై హస్త్యుత్తమాం శ్చిత్రా న్కంబళా నజినాని చ
అభిసత్కృత్య కైకేయో భరతాయ ధనం దదౌ. 19

కేకయమహారా జంతట భరతుని సత్కరించి యతనికి శ్రేష్ఠములగు గుఱ్ఱములను, చిత్రకంబళములను, ఉత్తమములగు తోళ్ళను, మిక్కలి ధనము నిచ్చెను.

రుక్మనిష్కసహస్రే ద్వే షోడశాశ్వశతాని చ
సత్కృత్య కైకయీపుత్త్రం కేకయో ధన మాదిశత్. 20

కేకయమహారాజు తన దౌహిత్రుని సత్కరించి రెండు బంగారు కంఠాభరణములను, పదియారువందల గుఱ్ఱములను కానుకగా నొసంగెను.

తథాఽమాత్యా నభిప్రేతా న్విశ్వాస్యాంశ్చ గుణాన్వితాన్
దదా వశ్వపతిః క్షిప్రం భరతా యానుయాయినః. 21

అంత నా యశ్వపతియగు కేకయమహారాజు అవసర మగుచో ప్రాణములనుకూడ విడువ సిద్ధపడువారును, సహాయ పడువారును, నమ్మదగినవారును, గుణవంతులును అగు సేవకు లను శీఘ్రమే భరతునకు తోడువచ్చువారినిగా పంపెను.

ఐరావతా నైంద్రశిరా న్నాగా న్వై ప్రియదర్శనాన్
ఖరా ఞ్ఛీఘ్రా న్సుసంయుక్తా న్మాతులోఽస్మై ధనం దదౌ.

అతని మేనమామ యుధాజిత్తుకూడ ఇరావత పర్వతమున బుట్టినవి, ఇంద్రశిర పర్వతమున బుట్టినవి, వేగముగలవి, పరి చితములైనవి అగు గాడిదలను, ధనము నొసంగెను.

అన్తఃపురేఽతిసంవృద్ధాన్ వ్యాఘ్రవీర్యబలాన్వితాన్
దంష్ట్రాఽఽయుధా న్మహాకాయాన్ శున శ్చోపాయనం దదౌ.

అట్లే భరతుని మేనమామ అంతఃపురముననే చక్కగా పెరిగి నవి, పులులతో సమానమగు పరాక్రమము, బలము కలవి,

కోఱ లాయుధముగా కలవగు పెద్దకుక్కలను భరతునకు కాను కగా నొసగెను.

స దత్తం కేకయేంద్రేణ ధనం త న్నాభ్యనందత
భరతః కైకయీపుత్త్రో గమనత్వరయా తదా. 24

కైకేయీతనయుఁ డగు భరతు డపుడు ప్రయాణపు తొంద రలో కేకయమహారా జొసంగిన కానుకలను చూచి సంతోషింప డాయెను.

బభూవ హ్యస్య హృదయే చింతా సుమహతీ తదా
త్వరయా చాపి దూతానాం స్వప్న స్యాపి చ దర్శనాత్.

దూతలు తన్ను తొందర చేయుట, పీడకల వచ్చుటలచే నా సమయమున భరతుని మనస్సులో మిక్కిలి చింత యేర్పడెను.

స స్వవేశ్మాభ్యతిక్రమ్య నరనాగాశ్వసంవృతమ్
ప్రపేదే సుమహ చ్ఛ్రీమాన్ రాజమార్గ మనుత్తమమ్. 26

అంత నా భరతుడు పలువురు జనులు, ఏనుగులు, గుఱ్ఱ ములతో సంకులమగు తన యింటిని గడచి, మిగుల పెద్దదై శ్రేష్ఠమగు రాజమార్గము చేరెను. (ఇచట తన యింటి ననుటచే స్వప్నవృత్తాంతము, దూతాగమనము వినిన తాత, మేనమామ భరతుడున్న యింటికే వచ్చి యాతనికి సత్కార మిచ్చిరని యూహింపనగును).

అభ్యతీత్య తతోఽపశ్య దంతఃపుర ముదారధీః
తత స్తద్భరత శ్శ్రీమా నావివే శానివారితః. 27

అంతట ప్రశస్తమైన బుద్ధిగల భరతు డా రాజమార్గము దాటి యంతఃపురము గాంచెను. పిమ్మట శ్రీమంతు డగు అత డెవ్వరిచేతను అడ్డగింపబడక ఆ యంతఃపురము ప్రవేశించెను.

స మాతామహ మాపృచ్ఛ్య మాతులం చ యుధాజితమ్
రథ మారుహ్య భరత శ్శత్రుఘ్నసహితో యయౌ. 28

అట్లు ప్రవేశించిన భరతుడు తన తాతయగు కేకయుని, మేనమామయగు యుధాజిత్తును సెలవడిగి, శత్రుఘ్నునితో గూడి రథ మెక్కి వెడలెను.

రథాన్ మండలచక్రాంశ్చ యోజయిత్వా పరశ్శతమ్
ఉష్ట్రగోఽశ్వఖరై ర్భృత్యా భరతం యాంత మన్వయుః.

భరతు డట్లు పోవుచుండగా గుండ్రనిచక్రములుకల వందలకొలది రథములను ఒంటెలు, వృషభములు, గుఱ్ఱములు, గాడిదలతో పూన్చినవారై సేవకులు వానితో భరతు ననుసరించిరి.

బలేన గుప్తో భరతో మహాత్మా
సహార్యక స్యాఽత్మసమై రమాత్యైః
ఆదాయ శత్రుఘ్న మపేతశత్రు
ర్గృహా ద్యయౌ సిద్ధ ఇ వేంద్రలోకాత్. 30

మహాధైర్యముకల భరతుడు తాతయగు కేకయరాజుయొక్క సేవకులచే గాపాడబడుచు, తన ప్రభావముతో సాటియగు ప్రభావముకల సహాయులతో గూడి, శత్రుఘ్నుని వెంటబెట్టుకొని, శత్రు

వులు లేనివాడై యింద్రలోకమునుండి సిద్ధుని (దేవతానిశేషము) వలె నా యంతఃపురమునుండి వెడలెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున డెబ్బదియవ సర్గము సమాప్తము.

---

## ఏకసప్తతితమః సర్గః - డెబ్బదియొకటవ సర్గము

స ప్రాఙ్ముఖో రాజగృహా దభినిర్యాయ రాఘవః
తత స్సుదామాం ద్యుతిమాన్ సంతీ ర్యావేక్ష్య తాం నదీమ్.

హ్లాదినీం దూరపారాం చ ప్రత్యక్స్రోతస్తరంగిణీమ్
శతద్రూ మతర చ్ఛ్రీమా న్నదీ మిక్ష్వాకునందనః. 2

రఘువంశమున బుట్టినవాడును, కాంతిమంతుడును, శ్రీమంతుడును ఇక్ష్వాకువుల నానందింపజేయువాడును, అగు భరతు డా రాజగృహమునుండి వెడలి తూర్పుదిక్కున బయ నించి, సుదామానదిని చూచి, దానిని దాటి, విశాలమగు హ్లాదినీ నదిని దాటి, పశ్చిమమువైపు ప్రసరించు ప్రవాహము, తరంగ ములు కల శతద్రువు అను నదిని దాటెను.

ఏలాధానే నదీం తీర్త్వా ప్రాప్య చాపరపర్పటాన్
శిలా మాకుర్వతీం తీర్త్వా హ్యాగ్నేయం శల్యకర్తనమ్. 3

సత్యసంధ శ్శుచి శ్శ్రీమాన్ ప్రేక్షమాణ శ్శిలావహామ్
అత్యయా త్స మహాశైలాన్ వనం చైత్రరథం ప్రతి. 4

(ఏలకులు బాగుగా లభించు) ఏలాధానమను గ్రామమున నా శతద్రూనదిని దాటి, అపర పర్పటమను గ్రామము చేరి, యొకింత విశ్రాంతి గైకొని, యటనుండి వెడలి, శిలావహయను రాళ్ళ నాకర్షించు స్వభావము కల నదిని దాటి, దాని కాగ్నేయ దిశయం దున్న శల్యకర్తన మను నగరమును చూచుచు సత్యసంధుడు, పరిశుద్ధుడు శ్రీమంతు డగు నా భరతు డచటివారి యాతి బాధలను పోగొట్టెద నని ప్రతిజ్ఞచేసి, దానిని నెఱవేర్చి చైత్రరథమునకు సాటి యగుటచే చైత్రరథమను పేరుగల వనమును చూచు వేడుకతో పెనుగొండలను దాటి పోయెను.

సరస్వతీం చ గంగాం చ యుగ్మేన ప్రతిపద్య చ
ఉత్తరం వీరమత్స్యానాం భారుండం ప్రావిశ ద్వనమ్. 5

అతడు గంగా సరస్వతీ నదుల సంగమ ప్రదేశమున కేగి, అచట వీరమత్స్యదేశములకు ఉత్తరదిశనున్న భారుండ మను వనమును ప్రవేశించెను.

వేగినీం చ కులింగాఖ్యాం హ్లాదినీం పర్వతాఽఽవృతామ్
యమునాం ప్రాప్య సంతీర్ణో బల మాశ్వాసయ త్తదా. 6

మిగుల వేగము కలదియు, అహ్లాదము గొల్పునదియు అగు కుళింగమను పేరుకల నది పర్వతములచే నావరింపబడి యుండుటచే దానిని యమునానదీసమీపమున దాటి, యెంత కలసిన తన సైన్యమునకు విశ్రాంతి నిచ్చెను.

శీతీకృత్య తు గాత్రాణి క్లాంతా నాశ్వాన్య వాజినః
తత్ర స్నాత్వా చ పీత్వా చ ప్రాయా దాదాయ చోదకమ్.

ఆ కుళింగా, యమునా సంగమ ప్రదేశమున భరతుడు ఎంత కలసిన గుఱ్ఱముల యొడళ్లపై నీరుపోసి, వాని బడలిక తీర్చి, తానును స్నాన మొనర్చి, నీరు త్రాగి, తరువాత పోవదగిన ప్రదేశము నీరులేని దగుటచే నటనే కొంత నీరు నిలుపచేసి కొనినవాడై....

రాజపుత్రో మహారణ్య మనభీక్ష్ణోప సేవితమ్
భద్రో భద్రేణ యానేన మారుతః ఖ మి వాత్యయాత్. 8

మంగళాచారయుక్తు డగు ఆ రాజకుమారుడు భద్రగజ రూపమగు ప్రయాణసాధనము నధిష్ఠించి జను లెంత మాత్రము సంచరింపనట్టి మహారణ్యమును వాయు వాకాశమును వోలె గడచి పోయెను.

భాగిరథీం దుష్ప్రతరా మంశుధానే మహానదీమ్,
ఉపాయా ద్రాఘవ స్తూర్ణం ప్రాగ్వటే విశ్రుతే పురే. 9

భరతుడు అంశుధాన నగర ప్రాంతమున దాటశక్యముగాని గంగానదిని దాటుటకై దాటదగిన స్థలముగా ప్రసిద్ధమైన ప్రాగ్వట మను పట్టణమునకు పోయెను.

స గంగాం ప్రాగ్వటే తీర్త్వా సమాయా త్కుటికోష్ఠికామ్
సబల స్తాం స తీర్త్వాఽథ సమాయా ద్ధర్మవర్ధనమ్. 10

ప్రాగ్వటపట్టణమువద్ద నా భరతుడు గంగను దాటి, కుటి కోష్ఠికయను నదికడకు వచ్చెను. ఆ నదినిదాటి యాతడు ధర్మ వర్ధనమను గ్రామమునకు పోయెను.

తోరణం దక్షిణార్ధేన జంబూప్రస్థ ముపాగమత్
వరూథం చ యయౌ రమ్యం గ్రామం దశరథాత్మజః. 11

దశరథతనయుడగు భరతు డటనుండి తోరణ గ్రామము నకు దక్షిణదిశ నున్న జంబూప్రస్థ మను గ్రామము చేరెను. అటనుండి వరూథమను గ్రామము చేరెను.

తత్ర రమ్యే వనే వాసం కృత్వాఽసౌ ప్రాఙ్ముఖో యయౌ
ఉద్యాన ముజ్జిహానాయాః ప్రియకా యత్ర పాదపాః. 12

ఆ గ్రామమునకు సమీపమున నొక రమ్యమగు వనమం దా రాత్రి గడపినవాడై, భరతు డటనుండి తూర్పుదిశగా పయ నించి కడిమిచెట్లు విస్తారముగ గల ఉజ్జిహానానగరపు టుద్యాన మునకు పోయెను.

సాలాం స్తు ప్రియకాన్ ప్రాప్య శీఘ్రా నాస్థాయ వాజినః
అనుజ్ఞా ప్యాథ భరతో వాహినీం త్వరితో యయౌ. 13

అట్లు భరతు డా కడిమిచెట్లు కల వనమును చేరి, అచట వేగముగ పోవు గుఱ్ఱములను తన రథమునకు కట్టి, సేనను వెనుక రమ్మని తెలిపి, తాను త్వరగా నేగెను.

వాసం కృత్వా సర్వతీర్థే తీర్త్వా చోత్తానికాం నదీమ్
అన్యా నదీ శ్చ వివిధాః పార్వతీయై స్తురంగమైః. 14

హస్తిపృష్ఠక మాసాద్య కుటికా మత్యవర్తత
తతార చ నరవ్యాఘ్రో లౌహిత్యే స కపీవతీమ్. 15

మార్గమున సర్వతీర్థమను గ్రామమున నొకరాత్రి వసించి, ఉత్తానికానదిని దాటి, తక్కిన అల్పజలములు కల నదులను పర్వతప్రదేశమున పుట్టిన గుఱ్ఱములు పూన్చిన రథముతో దాటి, హస్తిపృష్ఠక మను గ్రామముచేరి, యచట కుటికానదిని దాటెను. (హస్తిపృష్ఠక మనగా ఏనుగువీపు. దానిపై నెక్కి నది దాటెనని మహేశ్వర తీర్థవ్యాఖ్య.) పిమ్మట లౌహిత్యమను నగర సమీపమున నా నరశ్రేష్ఠుడగు భరతుడు కపీవతీనదిని దాటెను.

ఏకసాలే స్థాణుమతీం వినతే గోమతీం నదీమ్
కళింగనగరే చాపి ప్రాప్య సాలవనం తదా 16
భరతః క్షిప్ర మాగచ్ఛ త్సుపరిశ్రాంతవాహనః.

ఏకసాలా గ్రామమున స్థాణుమతీ నదిని, వినతమను నగరమున గోమతీనదిని దాటి భరతుడు కళింగనగర సమీపమున నున్న మద్దిచెట్ల తోటనుచేరి, గుఱ్ఱములు మిక్కిలి యలయుటచే నచట కొంచెము సమయమే విశ్రమించి, శీఘ్రమే యటనుండి వెడలెను.

వనం చ సమతీత్యాఽశు శర్వర్యా మరుణోదయే 17
అయోధ్యాం మనునా రాజ్ఞా నిర్మితాం సందదర్శ హ.

ఆ రాత్రి శీఘ్రమే యడవిని దాటి. యరుణోదయకాలమున మనుమహారాజుచే నిర్మింపబడిన అయోధ్యను దర్శించెను.

తాం పురీం పురుషవ్యాఘ్ర స్సప్తరాత్రోషితః పథి 18
అయోధ్యా మగ్రతో దృష్ట్వా సారథిం వాక్య మబ్రవీత్.

ఏడు దినములు మార్గముననే గడిపి (యెనిమిదవ దినమున మిగుల త్వరపడుచు రాత్రికూడ ప్రయాణముచేసి) ఆ అయోధ్యా నగరమును తనయెదుట కాంచిన పురుషశ్రేష్ఠుడగు భరతుడు సారథి కిట్లనెను.

ఏషా నాతిప్రతీతా మే పుణ్యోద్యానా యశస్వినీ 19
అయోధ్యా దృశ్యతే దూరా త్సారథే పాండుమృత్తికా
యజ్వభి ర్గుణసంపన్నై ర్బ్రాహ్మణై ర్వేదపారగైః 20
భూయిష్ఠ మృద్ధై రాకీర్ణా రాజర్షిపరిపాలితా.

ఓ సారథీ! పవిత్రములగు ఉద్యానములు కలదియు, గొప్ప కీర్తికలదియు, శాస్త్రోక్తముగ యాగమొనర్చినవారు, గుణవంతులు, వేదవిదులు, మిగుల ధనవంతులగు బ్రాహ్మణులతో వ్యాప్తమైనదై, రాజర్షులచే పరిపాలింపబడిన యీ అయోధ్యలో అవుపేడ మున్నగువానితో యిండ్ల ముంగిళ్లు అలుకబడక తెల్లగానున్న మట్టికలదగుటచే నిచటి జనులు సంతోషము నందుచున్నట్లు కనబడుటలేదు.

అయోధ్యాయాం పురా శబ్దః శ్రూయతే తుములో మహాన్
సమంతా న్నరనారీణాం త మద్య న శృణో మ్యహమ్.

మున్నయోధ్యలో నెల్లెడల స్త్రీ పురుషుల కలకలధ్వని చాల పెద్దగా వినిపించుచుండెడిది. కాని దాని నిపుడు విననైతిని.

ఉద్యానాని చ సాయాహ్నే క్రీడి త్వోపరతై ర్నరైః 22
సమంతా త్పరిధావద్భిః ప్రకాశంతే మమాన్యథా
తా న్య ద్యానురుదంతీవ పరిత్యక్తాని కామిభిః. 23

ఈ యయోధ్యలో నుద్యానములందు, సాయంకాలము గడచిన పిమ్మట రాత్రివేళ కాముకు లగువారు క్రీడించి, ప్రాతః కాలమున తమ యిండ్లకు పోవుచుండగా, నా యుద్యానము లింత కంటె వేఱు విధముగా శోభిల్లెడివి. ఇపు డా యుద్యానములు కాముకులు లేక రోదించుచున్నవివోలె కన్పట్టుచున్నవి.

అరణ్యభూ తేవ పురీ సారథే! ప్రతిభాతి మే.

ఓ సారథీ! అయోధ్యయంతయు నడవి యైనట్లు నా కగ పడుచున్నది.

న హ్యత్ర యానై ర్దృశ్యంతే న గజై ర్న చ వాజిభిః 24
నిర్యాంతో వాఽభియాంతో వా నరముఖ్యా యథాపురమ్.

ఇచట పట్టణములోని ప్రధానపురుషులు పల్లకి మున్నగు వాహనములపైగాని, యేనుగులపైగాని గుఱ్ఱములపైగాని యెక్కి నగరివెలుపలికిపోవుట, లేదానగరమునప్రవేశించుటకానకున్నాను.

ఉద్యానాని పురా భాంతి మత్త ప్రముదితాని చ 25
జనానాం రతిసంయోగే ష్వత్యంతగుణవంతి చ.

తా న్యేతా న్యద్య పశ్యామి నిరానందాని సర్వశః 26
ప్రస్తపర్ణై రనుపథం విక్రోశర్భి రివ ద్రుమైః.

ఇంతకు పూర్వ ముద్యానములు (పండ్లు, చిగురుటాకులు, మకరందములను సేవించుటచే పుదించిన చిలుకలు, కోయిలలు తుమ్మెదలతో గూడియుండుటచే) మత్తములును, కుదుళ్ళు చేయుట, నీరుపెట్టుటలచే చిగిర్చి) యానందము కలవియు, రతిక్రీడలకై వచ్చు యువకులకు (వివిధ పుష్పసమృద్ధితో, పొద రిండ్లతో, క్రీడాపర్వతములతో గూడి) మిగుల గుణవంతములై యుండినవి. ఆ యుద్యానములే యిపు డెల్లెడల దారిచెంత నాకులు రాల్చుచు నేడ్చుచున్నవివలెనున్న చెట్లతో ఆనందము తొల్గగి యుండుట చూచుచున్నాను.

నా ద్యాపి శ్రూయతే శబ్దో మత్తానాం మృగపక్షిణామ్. 27
సంరక్తాం మధురాం వాణీం కలం వ్యాహరతాం బహు.

ఇప్పటికిని (సూర్యోదయమైనను) తమ కిష్టములగు పండ్లు తినుటచే మత్తెక్కిన మృగములు, పక్షులయొక్క రాగయుక్తము, రమణీయము, అవ్యక్తమధురము అగు శబ్దమేదియు వినిపించ కున్నది.

చందనాగరుసంపృక్తో ధూపసమ్మూర్ఛితో౽తులః 29
ప్రవాతి పవన శ్శ్రీమా న్కిన్ను నాద్య యథాపురమ్.

చందనము, అగరువుల వాసనలతో గూడి, ధూపగంధము లతో వ్యాప్తమై రమణీయమై వీచుచుండిన యుత్తమవాయు విపుడు తొల్లిటివోలె వీవ దేల ?

భేరీమృదంగవీణానాం కోణసంఘట్టితః పునః 29
కి మద్య శబ్దో విరత స్సదా దీనగతిః పురా.

భేరులు, మద్దెలలు, వీణలను (కఱ్ఱ, చేయి, వ్రేళ్ళతో) కొట్టగా వెనక మిక్కుటముగ వినిపించుచుండిన వాద్యధ్వని యిపు డేల వినబడదు ?

అనిష్టాని చ పాపాని పశ్యామి వివిధాని చ 30
నిమిత్తా న్యమనోజ్ఞాని తేన సీదతి మే మనః.

అనిష్టమును సూచించునవి, క్రూరమైనవి, చూచినంతనే దుఃఖము కలిగించునవి యగు పలువిధములైన నక్కకూత మున్నగు దుర్నిమిత్తములను చూచుచున్నాను. ఆకారణముచే నా మనస్సు దుఃఖము నందుచున్నది.

సర్వథా కుశలం సూత! దుర్లభం మమ బంధుషు 31
తథా హ్యసతి సమ్మోహే హృదయం సీదతీవ మే.

దుఃఖకారణ మేమియు లేకున్నను నా మనస్సు కలతనందు చుటను బట్టి నా బంధువుల కెవ్వరికో కుశలము కొఱవడినదని తోచుచున్నది.

విషణ్ణః శ్రాంతహృదయ స్త్రస్త స్సంలులితేంద్రియః 32
భరతః ప్రవివేశాఽఽశు పురీ మిక్ష్వాకుపాలితామ్.

అని యిట్లు దుఃఖించుచు, కలుషితమైన మనస్సు కలిగి విచారించుచు, కలతనొందిన బాహ్యేంద్రియములు కలవాడై, భరతుడు శీఘ్రమే యిక్ష్వాకువులు పాలించు నా అయోధ్యను ప్రవేశించెను.

ద్వారేణ వైజయన్తేన ప్రావిశ చ్ఛ్రాంతవాహనః  24
ద్వార్‌స్థై రుత్థాయ విజయం పృష్ట స్తై స్సహితో యయౌ.

అట్లు భరతుడు అలసిన గుఱ్ఱములు కలవాడై, నగరమును చేరి వైజయంతమను పేరుగల నగరపశ్చిమద్వారమును ప్రవేశించెను. ద్వారపాలకు లాతని గాంచి లేచి కుశల మడుగగా వారితో కలసి లోనికేగెను.

స త్వనేకాగ్రహృదయో ద్వార్‌స్థం ప్రత్యర్చ్య తం జనమ్
సూత మశ్వపతేః కాంత మబ్రవీ త్తత్ర రాఘవః.

రాఘవుడగు భరతుడు వ్యాకులత నొందిన మనస్సు కలవాడై, యా ద్వారపాలుర నుపచారవాక్యములతో మఱల్చి, ప్రీతిపాత్రుడగు కేకయమహారాజు యొక్క సూతునితో నిట్లనెను.

కి మహం త్వరయాఽఽనీతః కారణేన వినాఽనఘ!  25
అశుభాశంకి హృదయం శీలం చ పతతీవ మే.

పాపరహితుడవగు ఓ సారథీ! ఆహ్వానకారణ మేమియు తెలుపకయే నన్నేల త్వరగా రప్పించినారు ? నా మనస్సు కీడును శంకించుచున్నది.

శ్రుతా నో యాదృశాః పూర్వం నృపతీనాం వినాశనే  26
ఆకారాం స్తా నహం సర్వా నిహ పశ్యామి సారథే!

ఓ సారథీ! పూర్వము రాజులు మరణించినపు డేయే నిమిత్తము లేర్పడునని మనము విందుమో ఆ నిమిత్తముల నన్నింటి నిచట చూచుచున్నాను.

సమ్మార్జనవిహీనాని పరుషా ణ్యుపలక్షయే 37
అసంయతకవాటాని శ్రీవిహీనాని సర్వశః
బలికర్మవిహీనాని ధూపసమ్మోదనేన చ 38
అనాశితకుటుంబాని ప్రభాహీనజనాని చ
అలక్ష్మీకాని పశ్యామి కుటుంబిభవనా న్యహమ్ 39

ఇచట గృహస్థుల భవనములు ఊడ్చుట లేక, తలుపులు మూయబడక, యెల్లెడల శోభ తఱిగి, పూజాదికములు చేయబడక సుగంధ ధూపము లేక, భోజనము లు చేయని కుటుంబములు కలిగి (ఎల్లరును దుఃఖాక్రాంతులై వంట ప్రయత్నము చేయకుండుట హేతువు), కాంతి తరిగిన జనులు కలవై, కళదప్పిన వానినిగా చూచుచున్నాను.

అపేతమాల్యశోభాని హ్యసమ్మృష్టాజిరాణి చ
దేవాగారాణి శూన్యాని న చాభాంతి యథాపురమ్. 40

ద్వారములందు పూలమాలలు కట్టబడక ఊడ్చి, శుభ్రము చేయబడని ముందు భాగములుగలవై అర్చక పరిచారకాదులు లేక దేవాలయములు వెనుకటివలె నాకు కనిపించుటలేదు.

దేవతార్చాః ప్రవిద్ధా శ్చ యజ్ఞగోష్ఠ్య స్తథావిధాః
మాల్యాపణేషు రాజంతే నాద్య పణ్యాని వా తథా. 41

దేవపూజలు లోపించినవి. యజ్ఞసభలు నిర్వహింపబడుట లేదు. పూలమ్ము అంగళ్లలో నిపుడు వెనుకటివోలె కొనుటకు పూలు కుప్పలుగ పోయబడకుండుటచే నవి ప్రకాశించుట లేదు.

దృశ్యంతే వణిజోఽప్యద్య న యథాపూర్వ మత్ర వై
ధ్యానసంవిగ్నహృదయా నష్టవ్యాపారయంత్రితాః. 42

నా కిపు డయోధ్యలో వర్తకులు కూడ చింతాక్రాంతమన స్కులై, క్రయవిక్రయరూపమగు వ్యాపారములేక సంకోచము నందినవారై వెనుకటివలె కనుపించకున్నారు.

దేవాయతనచైత్యేషు దీనాః పక్షిగణా స్తథా
మలినం చాశ్రుపూర్ణాక్షం దీనం ధ్యానపరం కృశమ్ 43
సస్త్రీపుంసం చ పశ్యామి జన ముత్కంఠితం పురే.

అయోధ్యలో దేవాలయములపై, నాల్గుమార్గముల కూడలి ప్రదేశములందలి చెట్లు మున్నగు వానిపై నివసించు పక్షులును దైన్యమునంది యున్నవి. పట్టణమందలి స్త్రీ పురుషులెల్లరు శరీర ముపై నాదరములేక మలినదేహముతో, కన్నుల నీరు నింపుకొని, దీనులై, మిగుల చింతించుచుండుట చూచుచున్నాను.

ఇ త్యేవ ముక్త్వా భరత స్సూతం తం దీనమానసః
తాన్యనిష్టా న్యయోధ్యాయాం ప్రేక్ష్య రాజగృహం యయౌ.

అని దీనమగు మనస్సు కలవాడైన భరతు డిట్లు సూతునితో పలికి, అయోధ్యలో నా యా యప్రియములు చూచుచు, రాజ భవనమున కేగెను.

తాం శూన్యశృంగాటక వేశ్మరథ్యాం
రజోఽరుణద్వారకవాటయంత్రామ్
దృష్ట్వా పురీ మింద్రపురప్రకాశాం
దుఃఖేన సంపూర్ణతరో బభూవ. 45

భరతుడు అమరావతివలె పూర్వము వెలుగొందుచుండిన అయోధ్య నాల్గుమార్గముల కూడళ్ళలో, రథమార్గములలో జనులు కానరానివై, చిమ్మట మున్నగునవి చేయబడక దుమ్ము గొట్టుకొనిన తలుపులు, ద్వారబంధములు కలదానినిగా చూచి మిగుల దుఃఖము నందెను.

బహూని పశ్యన్ మనసోఽప్రియాణి
యా న్యన్యదా నాస్య పురే బభూవుః
అవాక్ఛిరా దీనమానా న హృష్టః
పితు ర్మహాత్మా ప్రవివేశ వేశ్మ. 41

మున్నెన్నడు నగరమున కనుపించనటి మనసున కప్రియములగు ననేకములగు దృశ్యములు చూచుచు మహాత్ముడగు భరతుడు తలవంచికొని, దైన్యము నొంది, హర్షము తొలగినవాడై, యా రాజగృహమును ప్రవేశించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకసప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున డెబ్బది యొకటవ సర్గము
సంపూర్ణము.

## ద్విసప్తతితమః సర్గః - డెబ్బదిరెండవ సర్గము

అపశ్యం స్తు తత స్తత్ర పితరం పితు రాలయే,
జగామ భరతో ద్రష్టుం మాతరం మాతు రాలయే. 1

భరతు డట్లు తండ్రిగారి గృహమును ప్రవేశించి, తండ్రి యచట నగపడకుండుటచే తల్లిని చూచుటకు మాతృగృహమును ప్రవేశించెను.

అనుప్రాప్తం తు తం దృష్ట్వా కైకేయీ ప్రోషితం సుతమ్,
ఉత్పపాత తదా హృష్టా త్యక్త్వా సౌవర్ణ మాసనమ్. 2

దేశాంతర మేగిన తనయుడు మరలివచ్చుట చూచి కైక, తాను కూర్చొనిన బంగారుపీఠము వీడి యానందముతో లేచి వచ్చెను.

స ప్రవి శ్యైవ ధర్మాత్మా స్వగృహం శ్రీవివర్జితమ్,
భరతః ప్రతిజగ్రాహ జనన్యా శ్చరణౌ శుభౌ. 3

ధర్మాత్ముడగు భరతుడు శోభలేక వెలవెలబోవుచున్న తన యింట ప్రవేశించి, శుభములగు తల్లి పాదములను తాకి, ప్రణమిల్లెను.

సా తం మూర్ధ న్యుపాఘ్రాయ పరిష్వజ్య యశస్వినమ్,
అంకే భరత మారోప్య ప్రష్టుం సముపచక్రమే. 4

కైక తనయుని శిరమును మూర్కొని, అతనిని కౌగలించుకొని, తన యొడిలో కూర్చుండబెట్టుకొని యిట్లడుగసాగెను.

అద్య తే కతిచి ద్రాత్ర్యః చ్యుతస్యాఽఽర్యక వేశ్మనః,
అపి నాధ్వశ్రమ శ్శీఘ్రం రథే నాఽపతత స్తవ. 5

నాయనా! నీవు మీ తాతయిల్లు వీడి బయలుదేరి ఎన్ని దినము లైనది? రథ మెక్కి వేగముగ వచ్చిన నీకు మార్గాయాసము కలుగలేదు కదా?

ఆర్యక స్తే సుకుశలీ యుధాజి న్మాతుల స్తవ,
ప్రవాసా చ్చ సుఖం పుత్ర! సర్వం మే వక్తు మర్హసి. 6

నాయనా! పూజ్యుడగు నీ తాతయు, మేనమామయు కుశలముగ నున్నారా? నీ విటనుండి వెడలినది మొదలుకొని నీకు కుశలమా? సవిస్తరముగ తెలుపుము. అని యడిగెను.

ఏవం పృష్ట స్తు కైకేయ్యా ప్రియం పార్థివనందనః,
ఆచష్ట భరత స్సర్వం మాత్రే రాజీవలోచనః. 7

కైక యిటులు ప్రశ్నింపగా రాజకుమారుడు, కమలముల వంటి కన్నులు కలవాడగు భరతుడు తల్లికి ప్రీతినిగూర్చు ఆ విషయమంతయు ఇట్లు చెప్పెను.

అద్య మే సప్తమీ రాత్రి శ్చ్యుతస్యాఽఽర్యక వేశ్మనః,
అంబాయాః కుశలీ తాతో యుధాజి న్మాతులశ్చ మే. 8

అమ్మా! నేను తాతగారి యిల్లు విడిచి యిప్పటికి ఆరు రాత్రులు గడచినవి. ఇది యేడవరాత్రి. నీ తండ్రి కేకయునకును, నా మేనమామ యుధాజిత్తునకును కుశలమే.

యన్మే ధనం చ రత్నం చ దదౌ రాజా పరంతపః,
పరిశ్రాంతం పథ్యభవత్తతోఽహం పూర్వమాగతః. 9

శత్రువులను నశింపజేయు కేకయమహారాజు నా కిచ్చిన ధనము, రత్నములు మోసికొని వచ్చుచున్న వాహనములు (గుఱ్ఱములు మొదలగునవి) అలసియుండుటచే ఇంకను మార్గముననే యున్నవి. కావున నేను ముందుగా వచ్చితిని.

రాజవాక్యహరై ర్దూతై స్త్వర్యమాణోఽహ మాగతః,
య దహం ప్రష్టు మిచ్ఛామి తదంబా వక్తు మర్హతి. 10

రాజు పంపిన దూతలు తొందరచేయగా నేను వేగముగా వచ్చితిని. అమ్మా! నే నడుగబోవు విషయమునకు నీవు బదులిమ్ము.

శూన్యోఽయం శయనీయ స్తే పర్యంకో హేమభూషితః,
న చాయ మిక్ష్వాకుజనః ప్రహృష్టః ప్రతిభాతి మా. 11

బంగారముతో నలంకరింపబడినదై పరుండుటకు తగినట్టి నీ మంచము (పై నాతండ్రి శయనింపకుండుటచే) శూన్యముగ నున్నది. దశరథమహారాజునకు సన్నిహితులగు వా రెల్లరు సంతోషము కలవారుగా నాకు తోచకున్నది.

రాజా భవతి భూయిష్ఠ మిహాంబాయా నివేశనే,
త మహం నాద్య పశ్యామి ద్రష్టు మిచ్ఛ న్నిహాఽఽగతః 12

దశరథమహారాజు తఱచుగా నాతల్లి (వగు నీ) ఇంటనే

యుండువాడు కదా. ఆయనను చూడగోరి యిచటకు రాగా నా
కిపు డాయన కనిపించుటలేదు.

పితు ర్గ్రహీష్యే చరణౌ తం మమాఽఽఖ్యాహి పృచ్ఛతః,
ఆహోస్విదంబ! జ్యేష్ఠాయాః కౌసల్యాయా నివేశనే. 13

అమ్మా! నాతండ్రికి పాదాభివందన మొనర్తును. ఆయన
యెచట నున్నాడో తెలుపుము. ఆయన కౌసల్యాదేవి భవనమున
నున్నచో ఆ విషయమైనను తెలుపుము.

తం ప్రత్యువాచ కైకేయీ ప్రియవ ద్ఘోర మప్రియమ్,
అజానంతం ప్రజానంతీ రాజ్యలోభేన మోహితా. 14

అప్పుడు రాజవృత్తాంత మెఱుగని భరతునకు, రాజ్యలోభముచే
బుద్ధి చెడిన యా కైకేయి, కఠోరమగు అప్రియమును, ప్రియము
వలె తలంచుచున్నదై యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

యా గతి స్సర్వభూతానాం తాం గతిం తే పితా గతః,
రాజా మహాత్మా తేజస్వీ యాయజూక స్సతాం గతిః. 15

"సకలజీవులు తుద కే గతి నందెదరో, ఆగతినే మహా
త్ముడు, తేజశ్శాలి, యాగశీలుడు, సజ్జనుల కాధార మగు మహా
రాజు కూడ పొందెను" అని కైక పలికెను.

త చ్ఛ్రుత్వా భరతో వాక్యం ధర్మాభిజనవాన్ శుచిః,
పపాత సహసా భూమౌ పితృశోకబలార్దితః. 16

ధర్మాత్ముడును, పరిశుద్ధుడును అగు భరతుడు తల్లి పలికిన

ఆమాట విని తండ్రి మృతినిగూర్చి వినుటచే పెల్లుబికిన శోకవేగ ముచే పీడింపబడినవాడై తటాలున భూమిపై బడెను.

హా హతోఽస్మీతి కృపణాం దీనాం వాచ ముదీరయన్,
నిపపాత మహాబాహు ర్బాహూ విక్షిప్య వీర్యవాన్. 17

మహాభుజుడు, పరాక్రమశాలి యగు భరతుడు 'అయ్యో! హతుడ నైతి' నని దీనముగ పలుకుచు చేతులు విదిల్చి నేలబడెను.

తత శ్శోకేన సంవీతః పితు ర్మరణదుఃఖితః,
విలలాప మహాతేజా భ్రాంతాకులితచేతసః. 18

అంత గొప్పతేజస్సు కల భరతుడు శోకముచే ఆవరింప బడినవాడై, పితృమరణమునకు వగచుచు, మనసు చెదరి కలత నందగా నిట్లు విలపించెను.

ఏత త్సురుచిరం భాతి పితు ర్మే శయనం పురా,
శశి నేవామలం రాత్రౌ గగనం తోయదాత్యయే. 19

నా తండ్రి శయనించుచుండిన యీ పాన్పు పూర్వము వర్షాకాలమునకు పిమ్మట (శరదృతువునందు) చంద్రునిచే నాకాశము వలె ప్రకాశించుచుండెడిది.

త దిదం న విభా త్యద్య విహీనం తేన ధీమతా,
వ్యో మేవ శశినా హీన మప్ఛుష్క ఇవ సాగరః. 20

అట్టి యీ శయన మిపుడు ధీమంతుడగు ఈ రాజు లేనిదై చంద్రుడులేని యాకాశము వలె, నీ రెండిన సముద్రమువలె ప్రకాశించుట లేదు.

బాష్ప ముత్సృజ్య కణ్ఠేన స్వార్తః పరమపీడితః,
ఆచ్ఛాద్య వదనం శ్రీమ ద్వస్త్రేణ జయతాం వరః. 21

జయము నందువారిలో శ్రేష్ఠుడగు భరతు డిట్లేడ్చుచు కన్నీరు కార్చి, బాష్పము కంఠస్వరము నడ్డగింపగా తన సుందర మగు మోముపై వస్త్రము కప్పుకొని మిగుల దుఃఖము నందెను.

త మార్తం దేవసంకాశం సమీక్ష్య పతితం భువి,
నికృత్త మివ సాలస్య స్కంధం పరశునా వనే. 22

మత్త మాతంగసంకాశం చన్ద్రార్కసదృశం భువః,
ఉత్థాపయిత్వా శోకార్తం వచనం చేద మబ్రవీత్. 23

దేవసమానుడును, మదించిన యేనుగకు సాటియైనవాడును, తేజమున చంద్రుని, సూర్యుని పోలువాడును, దుఃఖితుడును అడవిలో గొడ్డలిచే మొదలు నఱుకబడిన మద్దిచెట్టుబోదెవలె భూమిపై బడిన తనయుని చూచి, అతనిని లేవనెత్తి యిట్లనెను.

ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే రాజపుత్ర! మహాయశః!,
త్వద్విధా న హి శోచంతి సంత స్సదసి సమ్మతాః. 24

గొప్పకీర్తిగల ఓ రాజా! (భరతుని శోకము పోగొట్టవలెనని కైక యిట్లు రాజా అని కుమారుని పిలచుట) లే లెమ్ము. ఇంకను నేలపై బడియుంటి వేల? సభలో మాన్యులగు నీ వంటివారు దుఃఖము నొందరు.

దానయజ్ఞాధికారా హి శీలశ్రుతివచోనుగా,
బుద్ధి స్తే బుద్ధిసంపన్న! ప్రభే వార్కస్య మందిరే. 25

ఓ ప్రశస్తమగు బుద్ధి కలవాడా! నీబుద్ధి (కార్యదీక్ష)దానములు, యజ్ఞములు నిర్వహింప సమర్థమైనది, మంచిన కవడి, కలది, వేదవాక్యముల ననుసరించినట్టిదియు నై సూర్యుని కాంతి తన మందిరమున నెట్లు నిశ్చలముగ ప్రకాశించునో యట్లే నిశ్చలమైనది. ('మందిరే' యనుదానికి "మందరే" యను పాఠాంతరమున – అత్యున్నతమగు మందరపర్వతమున తక్కిన పర్వతములకంటె సూర్యప్రకాశ మధికకాలము స్థిరముగ నుండునట్లు నీ బుద్ధియు నిశ్చలమైనది అని భావము).

స రుదిత్వా చిరం కాలం భూమౌ విపరివృత్య చ,
జననీం ప్రత్యువా చేదం శోకై ర్బహుభి రావృతః. 26

భరతు డట్లు చాల తడవు వగచి,భూమిపై పొరలి, యనేక విధములగు శోకములు ముప్పిరి గొనగా తల్లి కిట్లు బదులు చెప్పెను.

అభిషేక్ష్యతి రామం ను రాజా యజ్ఞం ను యక్ష్యతే,
ఇ త్యహం కృతసంకల్పో హృష్టో యాత్రా మయాసిషమ్.

నాతండ్రి రాముని రాజ్యాభిషిక్తుని చేయునని, లేదా యాగము నిర్వహించునని తలంచి నే నానందముతో నీ ప్రయాణము చేసితిని.

త దిదం హ్యన్యథాభూతం వ్యవదీర్ణం మనో మమ,
పితరం యో న పశ్యామి నిత్యం ప్రియహితే రతమ్. 28

అటిచో నిది యెల్ల తారుమారైనది. సదా నాకు ప్రియము

హితము గూర్చుటలో నాసక్తుడగు నాతండ్రిని చూడక నాగుండె బ్రద్దలైనది.

అంబ! కే నాత్యగా ద్రాజా వ్యాధినా మ య్యనాగతే,
ధన్యా రామాదయ స్సర్వే యైః పితా సంస్కృతస్స్వయమ్.

అమ్మా! నేను రాక పూర్వమే రాజే వ్యాధిచే మరణించెను ? తండ్రికి స్వయముగ చరమసంస్కారములు చేసిన రాముడు మున్నగువా రెల్లరు ధన్యులు.

న నూనం మాం మహారాజః ప్రాప్తం జానాతి కీర్తిమాన్,
ఉపజిఘ్రేద్ధి మాం మూర్ధ్ని తాత స్సన్నమ్య సత్వరమ్.

కీర్తిమంతుడగు మహారాజు నేను వచ్చినటు లెఱుగ డనుట నిశ్చయము. అట్లెఱిగియున్నచో శీఘ్రమే వచ్చి నన్ను వంచి నా శిరము మూర్కొనువాడు.

క్వ స పాణి స్సుఖస్పర్శ స్తాత స్యాక్లిష్టకర్మణః,
యేన మాం రజసా ధ్వస్త మభీక్ష్ణం పరిమార్జతి 31

నా తండ్రి తన చేతితో ఒడలిపై దుమ్ము కొట్టుకొనిన నన్ను మాటిమాటికి నిమురుచు దుమ్ము పోగొట్టువాడే. అట్టి క్లేశములు తొలగించునట్టి పనుల నాచరించు నా తండ్రియొక్క సుఖ (మృదు) స్పర్శగల ఆ చేయి యెక్కడ ?

యో మే భ్రాతా పితా బంధు ర్యస్య దాసోఽస్మి ధీమతః,
తస్య మాం శీఘ్ర మాఖ్యాహి రామ స్యాక్లిష్టకర్మణః. 32

ఎవడు నాకు సోదరుడు, బంధువును అగుచున్నాడో, ఏ

ధీమంతునకు నేను దాసుడనో, క్లేశములు తొలగించు కార్యముల నాచరించు ఆ రామునకు నా రాక శీఘ్రమే తెలియజేయుము.

పితా హి భవతి జ్యేష్ఠో ధర్మ మార్యస్య జానతః,
తస్య పాదౌ గ్రహీష్యామి స హీదానీం గతి ర్మమ. 33

ధర్మ మెఱిగిన పూజ్యుడగు పెద్దన్న తండ్రియే యగును కదా. నే నాయన పాదములు పట్టుకొందును. నా కిపు డాయనయే శరణ్యుడు.

ధర్మవి ద్ధర్మనిత్య శ్చ సత్యసంధో దృఢవ్రతః,
ఆర్యః కి మబ్రవీ ద్రాజా పితా మే సత్యవిక్రమః. 34

రాముడు ధర్మము తెలిసినవాడు, నిత్యము ధర్మ మాచరించువాడు. సత్యప్రతిజ్ఞ కలవాడు, దృఢమగు అధ్యవసాయము (నిశ్చయము) కలవాడు, సత్యమగు పరాక్రమము కలవాడు పూజ్యుడు నా తండ్రి యగు మహారాజేమని చెప్పిపోయినాడు?

పశ్చిమం సాధు సందేశ మిచ్ఛామి శ్రోతు మాత్మనః,
ఇతి పృష్టా యథాతత్త్వం కైకేయీ వాక్య మబ్రవీత్. 35

మరణసమయమున నా తండ్రి నన్ను గూర్చి యేమైన పలికిన చో దానిని తేటతెల్లముగ వినగోరుచున్నానని భరతుడు కైక నడుగగా ఆమెయు వృత్తమును జరిగినది జరిగినట్లే యీ విధముగా తెలిపెను.

రా మేతి రాజా విలపన్ హా సీతే! లక్ష్మణేతి చ,
స మహాత్మా పరం లోకం గతో గతిమతాం వరః. 36

"ఉత్కృష్టమగు గతి (ఉత్తమలోకము) నందువారిలో శ్రేష్ఠుడు, మహాత్ముడు అగు రాజు "రామా! అయ్యో సీతా! లక్ష్మణా"అని విలపించుచు పరలోకమున కేగినాడు.

ఇమాం తు పశ్చిమాం వాచం వ్యాజహార పితా తవ,
కాల ధర్మపరిక్షిప్తః పాశై రివ మహాగజః. 37

సిద్ధార్థా స్తే నరా రామ మాగతం సీతయా సహ,
లక్ష్మణం చ మహాబాహుం ద్రక్ష్యంతి పునరాగతమ్. 38

నీ తండ్రి శ్రేష్ఠమగు త్రాళ్లచే కట్టబడిన ఏనుగు వలె మృత్యువుచే నాక్రమింపబడినవాడై" సీతాసమేతుడై మరలి వచ్చిన రాముని, అట్లే తిరిగి వచ్చిన మహాభుజుడగు లక్ష్మణుని చూడగలుగువారు కృతార్థులు"అని యీ తుది పలుకులు పలికినాడు.

తచ్ఛ్రుత్వా విషణ్ణో దైవ ద్వితీయాఽప్రియశంసనాత్,
విషణ్ణవదనో భూత్వా భూయః పప్రచ్ఛ మాతరమ్. 39

పితృమరణము మొదటి అప్రియము కాగా, రాముడు దేశాంతర మేగినను రెండవ అప్రియమును కైక పలుకగా విని భరతుడు దుఃఖించెను. ముఖమున విషాద ముట్టిపడగా అతడు మరల తల్లి నిట్లు ప్రశ్నించెను.

క్వ చేదానీం స ధర్మాత్మా కౌసల్యానందవర్ధనః,
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చ సమం గతః. 40

అమ్మా! ధర్మాత్ముడును కౌసల్యాదేవి ఆనందమును

వర్ధిల్లజేయువాడును అగు భరతు డిపుడు సోదరుడగు లక్ష్మణు నితో, సీతతో గూడి యెచట కేగెను ?

తథా పృష్టా యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే,
మాతాఽస్య సుమహ ద్వాక్యం విప్రియం ప్రియశంకయా.

భరతు డట్లడుగగా అతని తల్లి యగు కైక రాముని వెడల నంపుట యను అప్రియము తన తనయునకు ప్రీతిని కలిగించునను యూహతో జరిగినది జరిగినట్లు చెప్ప మొదలిడెను.

స హి రాజసుతః పుత్త్ర! చీరవాసా మహావనమ్,
దండకా న్సహ వైదేహ్యా లక్ష్మణానుచరో గతః. 42

నాయనా! రాజకుమారు డగు రాముడు నారబట్టలు కట్టుకొని సీతతో గూడి, లక్ష్మణుడు వెంటరాగా దండకారణ్య మున కేగెను.

త చ్ఛ్రుత్వా భరత స్త్రస్తో భ్రాతు శ్చారిత్రశంకయా,
స్వస్య వంశస్య మహాత్మ్యా త్ప్రష్టుం సముపచక్రమే. 43

ఆమాట వినిన భరతుడు తన వంశమువారు దురాచారము నకు విముఖులు, సదాచారనిరతు లగుటచే ఆ గొప్పదనమును దృష్టిలో నుంచుకొని తన యన్న సదాచారమున కేమాయెనా యని భయపడి మరల నామె నిట్లడుగసాగెను.

కచ్చి న్న బ్రాహ్మణధనం హృతం రామేణ కస్యచిత్,
కచ్చి న్నాఢ్యో దరిద్రో వా తే నాపాపో విహింసితః 44

రాముడే బ్రాహ్మణుని ధనమైన అపహరింపలేదు కదా? ఏ పాప మెఱుగని ధనికుని గాని దరిద్రుని గాని పీడింప లేదు కదా?

కచ్చి న్న పరదారాన్వా రాజపుత్త్రోఽభిమన్యతే,
కస్మా త్స దండకారణ్యే భ్రూణహేవ వివాసితః. 45

ఆ రాజకుమారుడు పరభార్యలను కోరలేదు కద? వేదాధ్యయనము చేసిన వానిని చంపినవానిని వోలె రాజేల రాముని దండకారణ్యమునకు పంపినాడు?

అథాస్య చపలా మాతా త త్స్వకర్మ యథాతథమ్,
తే నైవ స్త్రీస్వభావేన వ్యాహర్తు ముపచక్రమే. 46

అంత చపలురాలగు భరతుని తల్లి కైక, స్త్రీసహజ మగు చాపలముతో తాను చేసిన పనిని జరిగినది జరిగినట్లు చెప్ప సాగెను.

ఏవ ముక్తా తు కైకేయీ భరతేన మహాత్మనా,
ఉవాచ వచనం హృష్టా మూఢా పండితమానినీ. 47

మహాత్ము డగు భరతు డిట్లు పలుకగా మూఢురాలగుటచే తన్ను పండితురాలినిగా తలంచుకొనుచు, కైకేయి సంతోషముతో నిట్లు పలికెను (45 వ శ్లోకమునకు పిమ్మట 47 వ శ్లోకము దానికి పిమ్మట 46 వ శ్లోకము ఉండదగినవని గోవిందరాజీయము.)

న బ్రాహ్మణధనం కించి ద్ధృతం రామేణ కస్యచిత్,
కశ్చి న్నాఢ్యో దరిద్రో వా తే నాపాపో విహింసితః, 48
న రామః పరదారాం శ్చ చక్షుర్భ్యామపి పశ్యతి.

రాము డే బ్రాహ్మణుని ధనమును లేశమైనను హరింప లేదు. ఏ పాప మెఱుగని ధనికునిగాని, దరిద్రుని గాని పీడింప లేదు. ఆతడు పరస్త్రీలను కన్నెత్తియైనను చూడడు.

మయా తు పుత్త్ర శ్రుత్వైవ రామ స్యై వాభిషేచనమ్,
యాచిత స్తే పితా రాజ్యం రామస్య చ వివాసనమ్.

కుమారా! రాముని పట్టాభిషేక వార్త వినగనే నేను రాజ్య మును, రాముని వివాసమును వర మిమ్మని నీ తండ్రిని కోరితిని.

స స్వవృత్తిం సమాస్థాయ పితా తే తత్తథాఽకరోత్ 50
రామ శ్చ సహ సౌమిత్రిః ప్రేషిత స్సీతయా సహ.

నీ తండ్రియు అడి తప్పకుండుట యను తన ప్రవృత్తిని కాపాడుకొని యట్లే చేసెను రాముడు, లక్ష్మణుడు సీతతో గూడి యడవికి పంపబడినారు.

త మపశ్యన్ ప్రియం పుత్రం మహీపాలో మహాయశాః,
పుత్రశోకపరిద్యూనః పంచత్వ ముపపేదివాన్.

గొప్ప కీర్తికలవాడగు మహారాజా ప్రియపుత్రుని కానక పుత్రశోకముచే పరితాపము నంది మృతినొందెను.

త్వయా త్విదానీం ధర్మజ్ఞ రాజత్వ మవలంబ్యతామ్ 52
త్వత్కృతే హి మయా సర్వ మిద మేవంవిధం కృతమ్.

ఓ రాజనీతి నెఱిగినవాడా! నీ విపుడు రాజువు కమ్ము. నీ కొఱకే నేనీ కార్యమంతయు చేసితిని.

మా శోకం మా చ సంతాపం ధైర్య మాశ్రయ పుత్రక,
త్వదధీనా హి నగరీ రాజ్యం చైత దనామయమ్. 53

కుమారా ! నీవింక శోకింపకుము. సంతాపము నందకుము. ధైర్యము వహింపుము. ఈ నగరము, నిరుపద్రవమగు ఈ రాజ్యము అంతయు నీ అధీనము.

త త్పుత్ర! శీఘ్రం విధినా విధిజ్ఞై
ర్వసిష్ఠముఖ్యై స్సహితో ద్విజేంద్రైః,
సంకాల్య రాజాన మదీనసత్త్వ
మాత్మాన ముర్వ్యా మభిషేచయస్వ. 54

నాయనా ! ఈ కారణముచే నీవు త్వరగా శాస్త్రమెఱిగిన వసిష్ఠుడు మున్నగు బ్రాహ్మణశ్రేష్ఠులతో గూడినవాఁడవై, వెనుకంజ వేయని పరాక్రమము కల రాజునకు శాస్త్రోక్తముగా సంస్కార మొనర్చి, యీ భూమికి పట్టాభిషిక్తుడవు కమ్ము అని కైక భరతు నకు చెప్పెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ద్విసప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున డెబ్బదిరెండవ సర్గము సమాప్తము.

## త్రిసప్తతితమః సర్గః - డెబ్బదిమూడవ సర్గము

శ్రుత్వా తు పితరం వృత్తం భ్రాతరౌ చ వివాసితౌ,
భరతో దుఃఖసంతప్త ఇదం వచన మబ్రవీత్. 1

తన తండ్రి గతించెనని, సోదరు లిరువు రడవి కేగిరని విని భరతుడు దుఃఖపీడితుడై తల్లి కిట్లనెను.

కిం ను కార్యం హత స్యేహ మమ రాజ్యేన శోచతః,
విహీన స్యాథ పిత్రా చ భ్రాత్రా పితృసమేన చ. 2

తండ్రిని, తండ్రితో సమాను డగు అన్నను దూరము చేసికొని దురపిల్లుచు, భాగ్యోపహతుడ నగు నాకీ రాజ్యముతో నేమి ప్రయోజనము ?

దుఃఖే మే దుఃఖ మకరో ర్వ్రణే క్షార మి వాదధాః,
రాజానం ప్రేతభావస్థం కృత్వా రామం చ తాపసమ్. 3

రాజును మృతునిగా, రాముని తాపసునిగా చేసి నీవు పుండుపై ఉప్పు రాచినట్లు నాకు దుఃఖము మీద దుఃఖము కలిగించితివి.

కులస్య త్వ మభావాయ కాళరాత్రి రివాఽఽగతా,
అంగార ముపగూహ్య స్మ పితా మే నావబుద్ధవాన్. 4

నీవు మా వంశమును సర్వనాశము చేయుటకు ప్రళయకాలపు రాత్రివలె వచ్చితివి. నా తండ్రి నిప్పును కౌగలించుకొని (నట్లు నిన్ను కౌగలించుకొని) నీ దౌష్ట్యమును ఎఱుగలేక పోయినాడు,

మృత్యు మాపాదితో రాజా త్వయా మే పాపదర్శిని।
సుఖం పరిహృతం మోహా త్కులేఽస్మిన్ కులపాంసని. 5

ఓ పాపముపై చూపుకలదానా! నీవల్లనే రాజు మరణించి నాడు. వంశము చెఱచుదానా! అజ్ఞానముతో నీ వీ వంశమున సుఖమన్నది లేకుండునట్లు చేసితివి గదే.

త్వాం ప్రాప్య హి పితా మేఽద్య సత్యసంధో మహాయశాః.
తీవ్రదుఃఖాభిసంతప్తో వృత్తో దశరథో నృపః. 6

సత్యసంధుడు, గొప్పకీర్తి కలవాడగు నా తండ్రి దశరథ మహారాజు నిన్ను పెండ్లాడి తీవ్ర దుఃఖపీడితుడై మరణించి నాడు.

వినాశితో మహారాజః పితా మే ధర్మవత్సలః,
కస్మా త్ప్రవ్రాజితో రామః కస్మా దేవ వనం గతః. 7

ధర్మముపై నాదరముకల నా తండ్రియగు మహారాజు నేల చంపితివి? రాము నేల నగరము నుండి వెడలగొట్టి యడవిపాలు చేసితివి?

కౌసల్యా చ సుమిత్రా చ పుత్రశోకాభిపీడితే,
దుష్కరం యది జీవేతాం ప్రాప్య త్వాం జననీం మమ. 8

నా తల్లివగు నిన్ను సవతినిగా పొంది కౌసల్యయు, సుమిత్రయు పుత్రశోకముతో పీడింపబడినారు. వారిటుపై జీవించుచో చాల కష్టములనంది జీవింతురు.

నను త్వార్యోఽపి ధర్మాత్మా త్వయి వృత్తి మనుత్తమామ్
వర్తతే గురువృత్తిజ్ఞో యథా మాతరి వర్తతే. 9

పూజ్యుడగు రాముడు ధర్మాత్ముడు. పెద్దలతో నెట్లు మెలగ వలెనో తెలిసినవాడు. అతడు తన తల్లి విషయమున నెట్లు ప్రవర్తించునో నీ విషయమునను మిక్కిలి ప్రశస్తముగనే మెలగు వాడు కదా?

తథా జ్యేష్ఠా హి మే మాతా కౌసల్యా దీర్ఘదర్శినీ
త్వయి ధర్మం సమాస్థాయ భగిన్యా మివ వర్తతే. 10

నా పెద్దతల్లి కౌసల్య ముందుచూపు కలది (చాల కాలమునకు పిమ్మట కలుగబోవు అనర్థమును కూడ ఊహింప జాలినది. ఆమె ధర్మమునే అవలంబించి తన తోబుట్టువును వోలె నిన్ను చూచుకొనుచున్నది కదా!

తస్యాః పుత్త్రం కృతాఽఽత్మానం చీరవల్కలవాససమ్,
ప్రస్థాప్య వనవాసాయ కథం పాపే ! న శోచసి. 11

ఓసీ పాపాత్మురాలా! అట్లు ధర్మవర్తనముకల ఆ కౌసల్య కుమారుడగు రాముని నారచీరలు ధరింపజేసి యడవిలో నివసింప బంపి దుఃఖింప వేలనే?

అపాపదర్శనం శూరం కృతాఽఽత్మానం యశస్వినమ్
ప్రవ్రాజ్య చీరవసనం కిం ను పశ్యసి కారణమ్. 12

పాపముపై దృష్టిలేనివాడు, శూరుడు, బుద్ధిమంతుడు, కీర్తిమంతుడగు రామునిచే నారవస్త్రములు ధరింపజేసి నగరము నుండి వెడలనడపిన నీ వే ప్రయోజనము నూహించితివి?

లుబ్ధాయా విదితో మన్యే న తేఽహం రాఘవం ప్రతి,
తథా హ్యనర్థో రాజ్యార్థం త్వయా నీతో మహా నయమ్. 13

నేను రాముని విషయమున నెట్లు ప్రవర్తింతునో లోభము కల నీకు తెలియదని తలంతును. అట్లు తెలియమి చేతనే నీవు నాకు రాజ్యము కట్టబెట్టవలెనని గొప్ప కీడును సంపాదించితివి.

అహం హి పురుషవ్యాఘ్రా వపశ్య న్రామలక్ష్మణౌ,
కేన శక్తిప్రభావేన రాజ్యం రక్షితు ముత్సహే. 14

నేను నా పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులను చూడక ఏ శక్తి ప్రభావముచే రాజ్యమును కాపాడ నుత్సహింతును?

తం హి నిత్యం మహారాజో బలవంతం మహాబలః,
అపాశ్రితోఽభూ ద్ధర్మాత్మా మేరు ర్మేరువనం యథా. 15

ధర్మాత్ముడు, మహాబలశాలి అగు మహారాజు కూడ మేరు పర్వతము, తనపై పెరిగిన మేరువనముపై (రక్షణవిషయమున) ఆధారపడినట్లు, బలవంతుడగు రాము నెల్లపు డాశ్రయించినాడు, (మేరు పర్వతముపై మొలచిన అడవి ఆ పర్వతముపై ఇతరులను ప్రవేశింపనీక దానిని రక్షించుటచే పర్వతమునకు రక్షకమైనట్లు, దశరథునకు రాముడు రక్షకుడై యుండెనని భావము).

సోఽహం కథ మిమం భారం మహాధుర్యసముద్ధృతమ్
దమ్యో ధుర మివాఽఽసాద్య వహేయం కేన చౌజసా. 16

ఒక పెద్ద యెద్దు మోసిన బరువు నొక కోడెదూడ వలె

పిన్ననగు నేను పెద్దవాడగు నా తండ్రి వహించిన రాజ్యభారము నే బలముచే, ఏ విధముగ మోయగలను?

అథవా మే భవే చ్ఛక్తి ర్యోగై ర్బుద్ధిబలేన వా,
సకామాం న కరిష్యామి త్వా మహం పుత్త్రగర్ధినీమ్. 17

లేక సామ, దానాది చతుర్విధోపాయమ్ములచే గాని, గ్రహణము, ధారణము మొదలైన అష్టాంగములతో కూడిన బుద్ధిబలముచే గాని నా తండ్రి పాలించిన రాజ్యమును, (రాజపుత్రుడను కాన) పరిపాలింపగల శక్తిమంతుడనైనను కుమారునకు రాజ్యము రావలయునను (నింద్యమగు) అభిలాషకల నీ కోరిక తీర్పను.

న మే వికాంక్షా జాయేత త్యక్తుం త్వాం పాపనిశ్చయామ్,
యది రామస్య నావేక్షా త్వయి స్యా న్మాతృవ త్సదా. 18

రాముడు నిన్నెల్లప్పుడు తన తల్లిని వలె చూడకుండినచో నిట్టి పాపనిశ్చయము కల నిన్ను విడచిపెట్టుటలో నాకు సంకోచమే యుండెడిదికాదు.

ఉత్పన్నా తు కథం బుద్ధి స్తే వేయం పాపదర్శిని,
సాధుచారిత్రవిభ్రష్టే! పూర్వేషాం నో విగర్హితా. 19

పాప మందే చూపుకలదానా! ఉత్తమమగు ప్రవర్తన నుండి పతనము నందినదానా! మా పూర్వు లెల్లరు నిందించెడి యిట్టి దుష్టబుద్ధి నీకెట్లు కలిగెనే ?

అస్మి న్కులే హి పూర్వేషాం జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే
అపరే భ్రాతర స్తస్మిన్ ప్రవర్తంతే సమాహితాః. 20

ఈ వంశమున పూర్వులలో జ్యేష్ఠుడే రాజ్యాభిషిక్తు డగు చుండువాడు. తక్కిన సోదరు లాతనియెడల నవహితులై మెల గెడువారు.

న హి మన్యే నృశంసే । త్వం రాజధర్మ మవేక్షసే,
గతిం వా న్వవిజానాసి రాజవృత్తస్య శాశ్వతీమ్. 21

ఓ క్రూరాత్మురాలా ! నీవు రాజధర్మము (నెఱిగియు) నాద రించుట లేదని తలంతును. లేదా సనాతనమగు రాజ సమాచార మెట్టిదో నీ వెఱుగవని భావింతును.

సతతం రాజవృత్తే హి జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే
రాజ్ఞా మేత త్సమం తత్స్యా దిక్ష్వాకూణాం విశేషతః. 22

రాజ సంప్రదాయము చూడగా, జ్యేష్ఠుడే ఎల్లపుడు పట్టాభి షిక్తుడగుట కనుపించును. రాజు లెల్లర కీ ధర్మము సమానము. విశేషించి ఆచారము తప్పని ఇక్ష్వాకువులలో నీ ధర్మమున కాదర మధికము.

తేషాం ధర్మైకరక్షాణాం కులచారిత్రశోభినామ్,
అద్య చారిత్రశౌటీర్యం త్వాం ప్రాప్య వినివర్తితమ్. 23

ఇట్లు ధర్మముచేతనే రక్షింపబడుచు, కులోచితమగు సదా చారముచే శోభిల్లుచున్న ఇక్ష్వాకువులకు తమ సదాచారవిషయ మున కలిగిన ఔన్నత్యము నీవలను వచ్చి వెనుకకు పోయినది.

త వాపి సుమహాభాగా జనేంద్రాః కులపూర్వగాః,
బుద్ధే ర్మోహః కథ మయం సంభూత స్త్వయి గర్హితః. 24

నీ వంశమునను రాజులు జ్యేష్ఠుని రాజ్యాభిషిక్తుని చేయు స్వభావము కలవారే. మఱి నీకిట్లు నిందితమగు బుద్ధిమోహ మెట్లేర్పడినది ?

న తు కామం కరిష్యామి త వాహం పాపనిశ్చయే ।
త్వయా వ్యసన మారబ్ధం జీవితాంతకరం మమ. 25

ఓ పాప నిశ్చయము కలదానా ! నేను నీయభిలాష దీర్పను. నీవు నాజీవితమునే నాశముచేసెడి యాపదను నాకు తెచ్చి పెట్టితివి.

ఏష త్విదానీ మేవాహ మప్రియార్థం త వానఘమ్,
నివర్తయిష్యామి వనా ద్భ్రాతరం స్వజనప్రియమ్. 26

నే నిపుడే, నన్ను నెపముగా చేసికొని రాజ్య మనుభవింప నెంచిన నీ కప్రియము కలుగుటకై, స్వజనుల కందరకు ప్రీతిపాత్రుడైన పాపరహితుడగు నాయన్న రాము నడవినుండి మఱల్చికొని వచ్చెదను.

నివర్తయిత్వా రామం చ త స్యాహం దీప్తతేజసః,
దాసభూతో భవిష్యామి సుస్థితే నాంతరాత్మనా. 27

రాము నట్లు మరలించుకొని వచ్చి, ప్రకాశమానమగు తేజములో నొప్పు అతనికి తిరమగు మనస్సుతో ఛత్రచామరాదులు ధరించుచు కింకరుడ నయ్యెదను.

ఇ త్యేవ ముక్త్వా భరతో మహాత్మా
ప్రియేతరై ర్వాక్యగణై స్తుదం స్తామ్,
శోకాతురశ్చాపి ననాద భూయ
స్సింహో యథా పర్వతగహ్వరస్థః. 28

మహాత్ముఁ డగు భరతుఁ డిట్లు తాను శోకపీడితుఁ డయ్యు అప్రియములగు మాటలతో తల్లిని వ్యథ నందజేయుచు పర్వత గుహలో నున్న సింహము వలె బిగ్గరగా మాటలాడెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్రిసప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున డెబ్బదిమూడవ సర్గము సంపూర్ణము.

## చతుస్సప్తతితమః సర్గః - డెబ్బదినాలుగవ సర్గము

తాం తథా గర్హయిత్వా తు మాతరం భరత స్తదా,
రోషేణ మహతాఽఽవిష్టః పున రే వాబ్రవీ ద్వచః. 1

భరతుఁ డిట్లు తన తల్లిని నిందించి, మఱల నామె యప రాధము తలంచి పెల్లుబికిన కోపముతో నిట్లు కఠినోక్తు లాడెను.

రాజ్యా ద్భ్రంశస్వ కైకేయి ! నృశంసే ! దుష్టచారిణి !
పరిత్యక్తా చ ధర్మేణ మా మృతం రుదతీ భవ. 2

క్రూరస్వభావము కలిగి, దుష్టమగు ఆచరణము కల ఓ కైకేయీ!(నీ తల్లివలె) నీవు రాజ్యభ్రష్టురాల వగుము. ధర్మము నిన్ను పరిత్యజించినది. రాజునకు నీవు ప్రాణవినాశరూపమగు నపకార మొనర్చితివి గాన మరణించిన నీ పతిని గూర్చి రోదింపకుము. లేదా నానెపముతో నీ విట్టి ప్రాణహానికరమగు పని చేసితివి కాన నీ తనయుడు చచ్చెనని తలంచి యావజ్జీవ మేడ్చుచుండుము

కిం ను తేఽదూషయ ద్రాజా రామో వా భృశధార్మికః
యయో ర్మృత్యు ర్వివాస శ్చ త్వత్కృతే తుల్య మాగతౌ.

నీ వలన రాజునకు మృత్యువు, రామున కరణ్యవాసమొకేమారుగా వచ్చిపడినవే. రాజుగాని, పరమధార్మికు డగు రాముడు కాని నీ గుణమును, నడవడిని గూర్చి యెప్పుడైన నిందించిరా ?

భ్రూణహత్యా మసి ప్రాప్తా కుల స్యాస్య వినాశనాత్
కైకేయీ ! నరకం గచ్ఛ మా చ భర్తు స్సలోకతామ్ 4

ఓ కైకేయీ! నీ విట్లు ఇక్ష్వాకువంశనాశనము కొనితెచ్చి భ్రూణహత్యతో సమానమగు పాపము చేసితివి. నీవు నరకమున కేగుము. నీ భర్త యేగిన పుణ్యలోకమున కేగకుము.

యత్త్వయా హీదృశం పాపం కృతం ఘోరేణ కర్మణా
సర్వలోకప్రియం హిత్వా మమా ప్యాపాదితం భయమ్.5

నీ విట్లు ఘోరమగు నీ యకృత్యముచే రామవివాసనము, భర్తృమరణ రూపమగు పాపము చేసి, సకలజనులకు ప్రియు

డైన రాముని విడిచిపెట్టి నాకును భయము కూర్చితివేగాని రాజ్యముకు కాదు.

త్వత్కృతే మే పితా వృత్తో రామ శ్చారణ్య మాశ్రితః,
అయశో జీవలోకే చ త్వయాఽహం ప్రతిపాదితః. 6

నీ కారణముగా నా తండ్రి మరణించెను. రాము డడవి కేగెను. భరతుడు తల్లిద్వారా అన్నను వెడలగొట్టి, రాజును చంపినాడను అపకీర్తిని నీవు నాకు సంపాదించితివి.

మాతృరూపే ! మ మామిత్రే నృశంసే ! రాజ్యకాముకే !
న తేఽహ మభిభాష్యోఽస్మి దుర్వృత్తే ! పతిఘాతిని ! 7

రాజ్యముపై మక్కువతో క్రూరస్వభావము కలిగి, దురాచారిణివై భర్తను చంపినదానా ! నీవు నాతల్లియాకృతితో నున్న శత్రువవు. నీవింక నాతో మాటలాడకుము.

కౌసల్యా చ సుమిత్రా చ యా శ్చాన్యా మమ మాతరః
దుఃఖేన మహతాఽఽవిష్టా స్త్వాం ప్రాప్య కులదూషిణీమ్.

కౌసల్య, సుమిత్ర తక్కిన నా తల్లులును, వంశమునకు కళంకము నాపాదించు నిన్ను సవతినిగా పొంది మహాదుఃఖమనుభవించుచున్నారు.

న త్వ మశ్వపతేః కన్యా ధర్మరాజస్య ధీమతః
రాక్షసీ తత్ర జాతాఽసి కులప్రధ్వంసినీ పితుః. 9

నీవు ధీమంతుడు, ధర్మము ప్రధానముగ రాజ్యపాలకుడగు

అశ్వపతి కూతురవు కావు (ఆతని వంశమునకు తగినదానవు కావు). తండ్రి వంశమును చెఱుప బుట్టినదానవు.

యత్త్వయా ధార్మికో రామో నిత్యం సత్యపరాయణః,
వనం ప్రస్థాపితో దుఃఖా త్పితా చ త్రిదివం గతః. 10

కారణ మేమనగా – నీవు ధార్మికుడు, సదా సత్యపరాయణు డగు రాము నడవికి పంపితివి. ఆ దుఃఖముతో నా తండ్రి స్వర్గమున కేగినాడు

య త్ప్రధానాఽసి త త్పాపం మయి పిత్రా వినాకృతే,
భ్రాతృభ్యాం చ పరిత్యక్తే సర్వలోకస్య చాప్రియే. 11

సకలజనులకు అసమ్మతురాలా! నీ వే పాపకార్యమునకు ప్రాధాన్య మిచ్చితివో, ఆ పాపకార్యము వలన కలిగిన పాపము తండ్రికి దూరమై, సోదరులచే విడువబడిన నాకు సంక్రమించినది.

కౌసల్యాం ధర్మసంయుక్తాం వియుక్తాం పాపనిశ్చయే!
కృత్వా కం ప్రాప్స్యసే త్వద్య లోకం నిరయగామిని!.12

పాప పరిపూర్ణమగు నిశ్చయము కలిగి నరకమున కేగుదానా! ధర్మతత్పరురాలగు కౌసల్యను పతినుండియు, తనయుని నుండియు దూరము చేసి నీ విపు డే లోకమున కేగెదవు ?

కిం నావబుద్ధ్యసే క్రూరే! నియతం బంధుసంశ్రయమ్,
జ్యేష్ఠం పితృసమం రామంకౌసల్యాయాఽఽత్మసంభవమ్.

ఓ క్రూరాత్మురాలా! కౌసల్యాతనయుడగు రాముడు, జితేం ద్రియుడని నాకు పితృసమానుడగు జ్యేష్ఠభ్రాతయని బంధువు లెల్లర కాశ్రయభూతు డని నీకు తెలియదా ?

అంగప్రత్యంగజః పుత్రో హృదయా చ్చాపి జాయతే,
తస్మా త్ప్రియతమో మాతుః ప్రియత్వాన్న తు బాంధవః.

తల్లికి తనయుడు - అంగములు (ముఖము, కంఠము, బొమ్మ, కుక్షి, చేతులు, కాళ్లు,) ప్రత్యంగము (కన్నులు, ముక్కు, వ్రేళ్లు మున్నగునవి) లనుండియు, హృదయము నుం డియును జన్మించును. అనగా పై అంగప్రత్యంగాదుల తేజము నుండి జన్మించును. కావున నతడు తల్లికి మిక్కిలి ప్రీతిపాత్రుడు. తక్కిన బంధువులు ప్రీతిపాత్రులు కాని అత్యంత ప్రీతిపాత్రులు కారు.

అన్యదా కిల ధర్మజ్ఞా సురభి స్సురసమ్మతా,
వహమానౌ దదర్శోర్వ్యాం పుత్రౌ విగతచేతసౌ. 15

ఒకానొకప్పుడు ధర్మమెఱిగినది, దేవతలచే పూజింపబడు నది యగు కామధేనువు తన పుత్రులగు (లేదా తనవంశమున పుట్టినట్టి) రెండెద్దులు భూమిపై నాగలి యీడ్చుచు మూర్ఛిల్లుట చూచెను.

తౌ వర్ధదివసే శ్రాంతౌ దృష్ట్వా పుత్రౌ మహీతలే,
రురోద పుత్రశోకేన బాష్పపర్యాకులేక్షణా. 16

ఆ ఎద్దులు మధ్యాహ్నము వఱకు భూమిపై నాగలి గిలా

లాగి యలయుట చూచి కామధేనువు పుత్రశోకముచే కన్నీరు కన్నుల నిండగా రోదింపసాగెను.

అధస్తా ద్వ్రజత స్తస్య సురరాజ్ఞో మహాత్మనః,
బిందవః పతితా గాత్రే సూక్ష్మా స్సురభిగంధినః. 17

ఆసమయమున దేవేంద్రుడా కామధేనువునకు క్రిందుగా నెటకో పోవుచుండెను. అయన శరీరముపై కామధేనువు కన్నీటి తుంపురులు సుగంధము కలవై పడెను.

ఇంద్రోఽప్యశ్రునిపాతం తం స్వగాత్రే పుణ్యగంధినమ్,
సురభిం మన్యతే దృష్ట్వా భూయసీం తాం సురేశ్వరః. 18

ఇంద్రుడును తన శరీరముపై సుగంధముకల కన్నీ రొలుకుట చూచి, అది శ్రేష్ఠమగు కామధేనువు కన్నీరని తెలిసికొనెను.

నిరీక్షమాణ శ్శక్ర స్తాం దదర్శ సురభిం స్థితామ్,
ఆకాశే విష్ఠితాం దీనాం రుదంతీం భృశదుఃఖితామ్. 19

ఇంద్రుడు వెంటనే పైకి చూచుచున్నవాడై యాకాశమున దైన్యము నొంది యేడ్చుచున్న కామధేనువును చూచెను.

తాం దృష్ట్వా శోకసంతప్తాం వజ్రపాణి ర్యశస్వినీమ్,
ఇంద్రః ప్రాంజలి రుద్విగ్న స్సురరాజోఽబ్రవీ ద్వచః. 20

అట్లు కీర్తిశాలినియగు కామధేనువు దుఃఖపీడితయగుట చూచి వజ్రాయుధము ధరించిన సురరాజగు దేవేంద్రుడు భయపడినవాడై యామెకడ చేతులు జోడించి ఇట్లనెను.

భయం కచ్చి న్న చాస్మాసు కుతశ్చి ద్విద్యతే మహత్
కుతో నిమిత్తః శోక స్తే బ్రూహి సర్వహితైషిణి !. 21

'ఎల్లరి హితము కోరుదానా ! మా కెవ్వరివల్లనైన మహా భయ మేర్పడినదా ? నీ వేల శోకించుచున్నావో తెలుపుము'

ఏవ ముక్తా తు సురభి స్సురరాజేన ధీమతా,
ప్రత్యువాచ తతో ధీరా వాక్యం వాక్యవిశారదా. 22

ధీమంతుడగు దేవేంద్రు డిట్లు పలుకగా ధైర్యస్వభావము కల ఆ కామధేనువు మాటలాడుటలో కుశలుడగు దేవేంద్రున కిట్లనెను.

శాంతం పాపం న వః కించి త్కుతశ్చి దమరాధిప !

పాపము శమించుగాక ! దేవేంద్రా ! మీ కెవ్వరికిని ఎవ్వరి వలనను భయము లేదు.

అహం తు మగ్నా శోచామి స్వపుత్రౌ విషమే స్థితౌ. 23
ఏతౌ దృష్ట్వా కృశౌ దీనౌ సూర్యరశ్మిప్రతాపితౌ,
బాధ్యమానౌ బలీవర్దౌ కర్షకేణ సురాధిప ! 24

దేవేంద్రా ! నా తనయు లిరువురు కృశించి, దీనులై, ఎండ వేడిమిచే తపించుచు కర్షకునిచే పీడింపబడుచు, సంకటమున బడియుండగా చూచి శోకించుచున్నాను.

మమ కాయాత్ప్రసూతౌ హి దుఃఖితౌ భారపీడితౌ
యౌ దృష్ట్వా పరితప్యేఽహం నాస్తి పుత్రసమః ప్రియః.

నా శరీరమునుండి పుట్టిన యీ బిడ్డలు బరువుచే పీడింప బడుచు దుఃఖము నందియున్నారు. వారిని చూచి నేను పరితపించుచున్నాను. కుమారునితో సాటియగు ప్రియమైనది లోకమున వేరొకటి లేదు.

యస్యాః పుత్రసహస్రైస్తు కృత్స్నం వ్యాప్త మిదం జగత్,
తాం దృష్ట్వా రుదతీం శక్రో న సుతా న్మన్యతే పరమ్.!6

ఏ కామధేనువు సంతానమైన వేలకొలది గోవులతో నీ లోకమెల్ల వ్యాపించియున్నదో, ఆ కామధేను వట్లు వగచుట చూచి దేవేంద్రుడు తనయుని కంటె ప్రీతిని కలిగించునది వేరొకటి లేనే లేదని తలంచెను.

సదాఽప్రతిమవృత్తాయా లోకధారణకామ్యయా,
శ్రీమత్యా గుణనిత్యాయాః స్వభావపరివేషయా. 27
యస్యాః పుత్త్రసహస్రాణి సాఽపి శోచతి కామధుక్,
కిం పునా ర్యావినా రామం కౌసల్యా వర్తయిష్యతి 28

ఎల్లపుడు సాటిలేని యుత్తమమగు నడవడి కలదియు, సమృద్ధి కలదియు, ఎడతెగని సద్గుణసంపత్తి కలదియు కోర్కెల నెల్ల తీర్చునదియు అగు కామధేనువు స్త్రీ పురుష స్వభావమగు (మైథున), వ్యాపారపరంపరచే లోక సంరక్షణముగోరి వేలకొలదిగా సంతానమును సృజించియు, తన బిడ్డలలో నిద్దరు పడుచున్న వేదన చూచి పరితపించెనే. అట్టిచో ఒకే సంతానము కల కౌసల్యాదేవి తన తనయుడు రాముడు లేక యెట్లు జీవించును ?

ఏకపుత్త్రా చ సాధ్వీ చ వివత్సేయం త్వయా కృతా,
తస్మాత్త్వం సతతం దుఃఖం ప్రేత్య చేహ చ లప్స్యసే 29

ఒకే కుమారుడు కలది, పతివ్రతయైనది అగు ఆ కౌసల్యను నీవు బిడ్డనుండి దూరముచేసినావు. కావున నీ వీలోకమునను, చచ్చినపిమ్మట పరలోకమునను కూడ నెల్లపుడు దుఃఖమునే నీ యకృత్యమునకు ఫలముగా ననుభవించెదవు లెమ్ము.

అహం హ్యపచితిం భ్రాతుః పితుశ్చ సకలా మిమామ్,
వర్ధనం యశస శ్చాపి కరిష్యామి న సంశయః. 30

నేను నా యన్నకు (రాజ్యప్రదాన మొనరించియు), నా తండ్రికి (ఔర్ధ్వదైహిక కృత్యములు నెఱవేర్చియు) సర్వవిధమైన పూజను చేసి నీవు కలిగించిన అపకీర్తిని తొలగించి సత్కీర్తిని వర్ధిల్లజేసికొనెదను.

ఆనాయయిత్వా తనయం కౌసల్యాయా మహాబలమ్,
స్వయ మేవ ప్రవేక్ష్యామి వనం మునినిషేవితమ్. 31

కౌసల్యాతనయుడు, మహాబలు డగు రాముని టకు కొని వచ్చి నెనే స్వయముగ మునులచే సేవింపబడు అరణ్యమును ప్రవేశింతును.

న హ్యహం పాపసంకల్పే ! పాపే పాపం త్వయా కృతమ్
శక్తో ధారయితుం పౌరై రశ్రుకంఠైర్ని రీక్షితః. 32

పాప సంకల్పము గల ఓపాపాత్మురాలా! పురజను లెల్లరు కన్నీరు కార్చుచు, గద్గదికమైక కంఠము కలవారై నన్ను చూచు చుండగా నీవు చేసిన పాపము నేను మోయజాలను.

సా త్వ మగ్నిం ప్రవిశ వా స్వయం వా దండకా న్విశ
రజ్జుం బధాన వా కంఠే న హి తేఽన్య త్పరాయణమ్ 33

ఈ విధముగ అకృత్యము నాచరించిన నీవు అగ్నిలో ప్రవేశింపుము. లేక స్వయముగ దండకారణ్యమున కేగుము. లేదా నీ మెడకు త్రాడు కట్టుకొని యురి పోసికొమ్ము. నీ కింతకంటె వేఱు నిష్కృతి లేదు.

అహ మ ప్యవనీం ప్రాప్తే రామే సత్యపరాక్రమే,
కృతకృత్యో భవిష్యామి విప్రవాసితకల్మషః. 34

నేనును, సత్యపరాక్రమము కల రాముడు తిరిగి యీ భూమిపై కాలిడిన పిమ్మట నా పాపము పోగొట్టుకొని కృతార్థుడ నయ్యెదను.

ఇతి నాగ ఇ వా రణ్యే తోమరాంకుశచోదితః,
పపాత భువి సంక్రుద్ధో నిశ్శ్వస న్నివ పన్నగః. 35

ఇట్లు భరతుడు అరణ్యమున మావటీనిచే తోమరము, అంకుశములతో పొడిచి ప్రేరణచేయబడిన యేనుగువలె, నిట్టూర్చుచున్న సర్పమువలె కోపించి నేలబడెను.

సంరక్తనేత్ర శ్శిథిలాంబర స్తదా
విధూతసర్వాభరణః పరంతపః,
బభూవ భూమౌ పతితో నృపాత్మజ
శ్శచీపతేః కేతు రివోత్సవక్షయే. 36

శత్రువులకు సంతాపము కలిగించు ఆ రాజకుమారుడగు

భరతుడు కోపముచే కన్నులెఱ్ఱబడగా, వస్త్రము జారుచుండగా, ఆభరణములు చిందరవందర కాగా (ఉత్సవకాలమున ఎగుర వేయబడిన) ఇంద్రధ్వజము ఉత్సవాంతమున భూమిపై బడి నట్లుగా నేలపై బడెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
చతుస్సప్తతితమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమునం దయోధ్యాకాండమున డెబ్బదినాలుగవ సర్గము సంపూర్ణము

—0—

## పంచసప్తతితమః సర్గః - డెబ్బదియైదవ సర్గము

దీర్ఘకాలా త్సముత్థాయ సంజ్ఞాం లబ్ధ్వా చ వీర్యవాన్
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం దీనా ముద్వీక్ష్య మాతరమ్.1
సోఽమాత్యమధ్యే భరతో జననీ మభ్యకుత్సయత్.

పరాక్రమశాలి యగు భరతుడు చిరకాలమునకు తెలివి నొంది లేచి, కనుల నీరు నిండగా (తన కోరిక తీరకుండుటచే) దిగులు పడుచున్న తల్లిని చూచి, (తన రాకను విని యచటకు వచ్చిన) సుమంత్రాది మంత్రులు తెలిసికొనుటకై ముఖల తల్లి నిట్లు నిందించెను.

రాజ్యం న కామయే జాతు మంత్రయే నాపి మాతరమ్. 2
అభిషేకం న జానామి యోఽభూ ద్రాజ్ఞా సమీక్షితః
విప్రకృష్టే హ్యహం దేశే శత్రుఘ్నసహితోఽవసమ్ 3

నే నెన్నడును రాజ్యము కోరలేను. రాజ్యమునకై నాతల్లితో గూఢముగ నాలోచనయు చేయలేదు. నా తండ్రి నా యభిషేకమునకై సంకల్పించుటయు నేనెఱుగను. నేను శత్రుఘ్నునితో కలసి మిగుల దూరప్రదేశమున నుంటిని కదా!

వనవాసం న జానామి రామ స్యాహం మహాత్మనః,
వివాసనం వా సౌమిత్రే స్సీతాయా శ్చ యథాఽభవత్. 4

మహాత్ముడగు రాముని వనవాసముగాని, లక్ష్మణుడు, సీత వీర లడవికి పంపబడుట గాని యెట్లు సంభవించెనో కూడ నే నెఱుగను.

తథైవ క్రోశత స్తస్య భరతస్య మహాత్మనః
కౌసల్యా శబ్ద మాజ్ఞాయ సుమిత్రా మిద మబ్రవీత్. 5

మహాత్ము డగు భరతు డట్లాక్రోశించుట విని కౌసల్య సుమిత్ర కిట్లనెను.

ఆగతః క్రూరకార్యాయాః కైకేయ్యా భరత స్సుతః,
త మహం ద్రష్టు మిచ్ఛామి భరతం దీర్ఘదర్శినమ్. 6

క్రూరమగు నీ యకృత్య మొనరించిన కైకేయి తనయుడగు భరతుడు వచ్చినాడు. అతడు దూరదర్శి. (రాము డయోధ్యనుండి

16)

వెడలుట భరతు డిష్టపడడని కౌసల్య యెఱిగి అన్నమాట ఇది)
నే నతనిని చూడగోరుచున్నాను.

ఏవ ముక్త్వా సుమిత్రాం సా వివర్ణా మలినా కృశా,
ప్రతస్థే భరతో యత్ర వేపమానా విచేతనా. 7

వన్నె మాఱి. మలినయై, దుర్బలయైన కౌసల్య సుమిత్రతో నిట్లు పలికి, వణకుచు, చొక్కి భరతు డున్న కడకు బయలు దేరెను.

స తు రామానుజ శ్చాపి శత్రుఘ్నసహిత స్తదా,
ప్రతస్థే భరతో యత్ర కౌసల్యాయా నివేశనమ్. 8

అపుడు రాముని తమ్ముడగు భరతుడును శత్రుఘ్నునితో గూడి కౌసల్యాసదనమునకు పోయెను.

తత శ్శత్రుఘ్నభరతౌ కౌసల్యాం ప్రేక్ష్య దుఃఖితౌ,
పర్యష్వజేతాం దుఃఖార్తాం పతితాం నష్టచేతనామ్ 9
రుదన్తౌ రుదతీం దుఃఖా త్సమే త్యార్యాం మనస్వినీమ్.

అంత భరతశత్రుఘ్నులు తమ పెదతల్లి కౌసల్యను చూచిరి. ఆమె దుఃఖితయై నేలబడి, సొమ్మసిల్లి యేడ్చుచుండగా మనస్వినియగు ఆమెను గాంచి యేడ్చుచు కౌగిలించుకొనిరి.

భరతం ప్రత్యువా చేదం కౌసల్యా భృశదుఃఖితా. 10

మిక్కిలి దుఃఖము నందిన కౌసల్య భరతుని చూచి యిట్లనెను.

ఇదం తే రాజ్యకామస్య రాజ్యం ప్రాప్త మకంటకమ్,
సంప్రాప్తం బత కైకేయ్యా శ్శీఘ్రం క్రూరేణ కర్మణా. 11

నాయనా! నీవు రాజ్యము కోరుచుంటివి కదా! నీ తల్లి కైక రాము నడవి కంపి నీ పట్టాభిషేకము జరుపునట్లు వరము కోరినది. క్రూరమగు పనిచే శీఘ్రమే నీకి రాజ్యము లభించినది.

ప్రస్థాప్య చీరవసనం పుత్త్రం మే వనవాసినమ్,
కైకేయీ కం గుణం తత్ర పశ్యతి క్రూరదర్శినీ. 12

కైక నాతనయునిచే నారవస్త్రములు కట్టించి, అడవి కంపి నదే! (క్రూరకార్యములందే దృష్టి నిలిపెడి యామె యేగుణము చూచి యీ పని చేసినది? (రాము నడవికి పంపకున్నను రాజ్యము లభించెడిదే కదా!)

క్షిప్రం మా మపి కైకేయీ ప్రస్థాపయితు మర్హతి,
హిరణ్యనాభో యత్రాస్తే సుతో మే సుమహాయశాః. 13

శీఘ్రమే కైక నన్నును బంగారు పన్నె (బొడ్డు) దేహము కల్గి, మహాకీర్తిశాలియగు నా తనయుడు రాము డున్న చోటకే పంపదగును.

అథవా స్వయ మేవాహం సుమిత్రానుచరా సుఖమ్
అగ్నిహోత్రం పురస్కృత్య ప్రస్థాస్యే యత్ర రాఘవమ్.

లేదా నేనే స్వయముగ సుమిత్రతో గలసి సుఖముగా దశరథుని అగ్నిహోత్రమును కళేబరమును, వెంటగొని, రాము డున్న చోటి కేగెదను. (అగ్నిహోత్రము జ్యేష్ఠభార్యాధీనము.

దశరథునకు భరతుడు తనకు మరణానంతర సంస్కారము చేయుట నిషేధించినాడు కావున రాజు కళేబరమును కూడ సంస్కారార్థమై రాముని కడకు తీసుకొని పోవుట కౌసల్య సంకల్పముగా సూచితము).

కామం వా స్వయ మే వాద్య తత్ర మాం నేతు మర్హసి,
యత్రాసౌ పురుషవ్యాఘ్రః పుత్రో మే తప్యతే తపః. 15

పురుషశ్రేష్ఠు డగు నా తనయుడు తపముచేయు తావునకు నీవైన నీ యిచ్ఛకొలది స్వయముగ నన్ను తీసికొని పో దగుదువు.

ఇదం హి తవ విస్తీర్ణం ధనధాన్య సమాచితమ్,
హస్త్యశ్వరథసంపూర్ణం రాజ్యం నిర్యాతితం తయా. 16

(నిన్నుచట విడువ నాకేమి యధికార మనెద వేమో) విస్తీర్ణమై, ధనధాన్య సంపూర్ణమై, ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో నిండియున్న ఈ రాజ్యమును కైక నీ కిప్పించినది కదా !

ఇత్యాదిబహుభి ర్వాక్యైః క్రూరై స్సంభర్త్సితోఽనఘః,
వివ్యథే భరత స్తీవ్రం వ్రణే తుద్యేవ సూచినా. 17

భరతుడు కైకపక్షమువాడను భావనతో కౌసల్య ఈ విధములగు పెక్కు కఠినోక్తు లాడగా నిర్దోషుడగు భరతుడు పుండుపై సూదితో గుచ్చినట్లుగా మిక్కిలి బాధపడెను.

పపాత చరణౌ తస్యా స్తదా సంభ్రాంతచేతనః,
విలప్య బహుధాఽసంజ్ఞో లబ్ధసంజ్ఞ స్తతః స్థితః. 18

ఆమాటలకు భరతుని మనస్సు కలతనొందెను. అతడు మిగుల నేడ్చుచు నామె పాదములపై బడి మూర్ఛిల్లెను. కొంత తడవునకు తెలివినొంది లేచెను.

ఏవం విలపమానాం తాం భరతః ప్రాంజలి స్తదా,
కౌసల్యాం ప్రత్యువా చేదం శోకై ర్బహుభి రావృతామ్.

భరతు డట్లు లేచి అనేక దుఃఖముల నొంది యేడ్చుచున్న కౌసల్యను చూచి యంజలి ఘటించి, యామె కిట్లు బలికెను.

ఆర్యే! కస్మా దజానంతం గర్హసే మా మకల్బిషమ్,
విపులాం చ మమ ప్రీతిం స్థిరాం జానాసి రాఘవే. 20

పూజ్యురాలవగు తల్లీ! అయోధ్యలోని వృత్తాంతమే యెఱుగని వాడనై ఏ పాపము చేయని నన్నేల నిందించు చున్నావు? నా యన్న రామునిపై స్థిరముగ నెలకొన్న నా భక్తిని నీ వెఱుగుదువు కదా.

కృతా శాస్త్రానుగా బుద్ధి ర్మాభూ త్తస్య కదాచన,
సత్యసంధ స్సతాం శ్రేష్ఠో యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవని యనుమతితో సత్యసంధుడు, సత్పురుషులలో శ్రేష్ఠుడు, పూజ్యుడగు రాము డడవి కేగెనో, ఆ పాపిష్ఠుడు గురువుచెంత శాస్త్రానుసారము నేర్చిన బుద్ధి నశించునుగాక! (నేను నా యన్న రాముని వనవాసమున కనుమతించియున్నచో నేను గురువుల చెంత నేర్చిన శ్రుతిస్మృతిజ్ఞానము నశించుగాక. ఇటుపైన కూడ సామాన్యరూపముగ భరతుడు పలికిన మాటలకు భరతపరములుగనే అర్థము గ్రహింపవలయును. ఇచట భరతుని

శపథము నెపముగ తీసికొని వాల్మీకి ధర్మవిశేషములు తెలుపు చుండుట గమనార్హము) (సత్పురుషుల కపచార మొనర్చిన శాస్త్రజ్ఞానము నశించునని ఈశ్లోకమున సూచితము).

ప్రేష్యం పాపీయసాం యాతు సూర్యం చ ప్రతి మేహతు
హంతు పాదేన గాం సుప్తాం యస్యార్యోఽనుమతే గతః.

ఎవడు రాము డడవికి పోవ నంగీకరించెనో అతడు పాపిష్ఠులకు సేవచేసినవాడును, సూర్యున కెదురుగ మలమూత్రములు విడచిన వాడును, నిదురించుచున్న యావును కాలితో తన్నిన వాడును అగుగాక (దీనిచే పాపులను సేవించరా దనియు, సూర్యున కభిముఖముగ మూత్రపురీషములు విసర్జింపరా దనియు, ఆవును కాలితో తన్నరా దనియు ఇది యెల్ల పాపమనియు సూచితము. నిదురించిన ఆవును కాలితో తన్నరా దనుటచే - నిరపరాధముగ కాక యొకప్పుడు గోవు తన్ను పొడువ వచ్చినచో ఆత్మరక్షణకు కట్టెతో దానిని కొట్టుట మున్నగునది దోషము కాదని భావము )

కారయిత్వా మహత్కర్మ భర్తా భృత్య మనర్థకమ్,
అధర్మో యోఽస్య సోఽస్యాస్తు యస్యార్యోనుమతే గతః.

ఎవడు రాము డడవికి పోవ సమ్మతించెనో వాడు - తన సేవకునిచే పెద్దపని చేయించుకొని యాతనికి ప్రతిఫలమును ఈయని యజమాని (లేక సేవకునిచే మహాపాపకరమగు పని చేయించిన యజమాని అని మహేశ్వర తీర్థీయ వ్యాఖ్య) ఏ యధర్మము నందునో దానిని పొందును గాక. దీనిచే పని చేయించు

కొని తగు ప్రతిఫల మీయకుండుట లేదా అనర్థము కలిగించు పనిని సేవకులచే చేయించుట యధర్మ మని సూచితము.)

పరిపాలయమానస్య రాజ్ఞో తాభూని పుత్త్రవత్ ।
తత స్తం ద్రుహ్యతాం పాపం యస్యార్యోఽనుమతే గతః.

ఎవడు రాము డడవికి పోవ సమ్మతించెనో వాడు సకల జీవులను తన బిడ్డలవలె పాలించుచున్న రాజునకు ద్రోహము చేసినవా డెట్టిపాపము నందునో దానిని పొందునుగాక. (ధార్మికుడగు రాజునకు ద్రోహముచేయుట మహాదోషమని యిచట సూచితము.)

బలిషడ్భాగ ముద్ధృత్య నృప స్యారక్షతః ప్రజాః,
అధర్మో యోఽస్య సోఽ స్యాస్తు యస్యార్యోఽనుమతే గతః.

ప్రజల పంటలో (ఆదాయములో) నాఱవ పాలు కప్పముగ గ్రహించియు, వారిని రక్షింపని రాజే యధర్మము పాలగునో రాము డడవికి పోవుటకు సమ్మతించిన వా డట్టి యధర్మమాచరించినవా డగునుగాక (రాజు ఆదాయమున నాఱవపాలు మాత్రమే పన్ను గ్రహింపవలెనని, ఆ ధనమును ప్రజాహితమునకు వినియోగించి, ప్రజలను కాపాడవలెనని అట్లు చేయకుండుట మహాదోషమని సూచితము

సంశ్రుత్య చ తపస్విభ్య స్సత్రే వై యజ్ఞదక్షిణామ్,
తాం విప్రలపతాం పాపం యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవడు రాము డడవి కేగుటను సమ్మతించెనో యతడు యాగమున వ్రతోపవాసశీలు రగు ఋత్విజులకు యజ్ఞదక్షిణ

నిత్తునని ప్రతిజ్ఞచేసి యాగాంతమున నట్టియ నంగీకరింప లేదని విరుద్ధముగ పలుకు యజమాని ఏ పాపము నందునో దానిని పొందుగాక! (యజ్ఞమున దక్షిణ చాల ప్రధానము. దక్షిణ లేని యజ్ఞము నిరర్థకము. వాగ్దానము చేసి ఋత్విజులకు దక్షిణ నీయక నేనట్టిత్తునని చెప్పలేదనుట మహాదోషమని యిచట సూచితము.)

హస్త్యశ్వరథసంబాధే యుద్ధే శస్త్రసమాకులే,
మా స్మ కార్షీత్సతాం ధర్మం యస్యార్యోఽనుమతే గతః.

ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో నిండి, అన్నివైపుల నుండి ఆయుధములు వచ్చిపడుచుండగా శూరులగువారి ధర్మమగు 'వెన్నిచ్చి పరుగెత్తకుండుట'ను మఱచి పారిపోవువాని కే పాపము కలుగునో రాము డడవి కేగుటకు సమ్మతించినవాని కట్టి పాపము కలుగును గాక! (యుద్ధమున ప్రాణము మొడ్డి పోరాడుట వీరధర్మము. యుద్ధక్షేత్రము వీడి పారిపోవుట పాపమని సూచితము)

ఉపదిష్టం సుసూక్ష్మార్థం శాస్త్రం యత్నేన ధీమతా,
స నాశయతు దుష్టాత్మా యస్యార్యోఽనుమతే గతః.

ధీమంతుడగు గురువు మిక్కిలి ప్రయత్నముతో తన కుపదేశించిన పరలోక సాధకమగు రహస్యార్థముతో కూడిన వేదాంతాది విశిష్టమగు శాస్త్రవిషయమును విస్మరించిన వాని కెట్టి పాపము కలుగునో, రాము డడవికేగ సమ్మతించిన వాని కట్టి పాపము కలుగుగాక! (గుర్వనుగ్రహముచే లభించిన మహారహ

స్యములగు ఉపదేశములను మఱచుట పాపమని యిచట సూచితము.)

మా చ తం వ్యూఢబాహ్వంసం చంద్రార్కసమతేజసమ్,
ద్రాక్షీ ద్రాజ్యస్థ మాసీనం యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవడు రాము డడవికి పోవ సమ్మతించెనో వాడు బలిసిన భుజములు, మూపు కలిగి, సూర్యచంద్రులకు సాటియై తేజముతో విరాజిల్లుచు, రాజ్యము నొంది, సింహాసనాసీనుడైన రాముని దర్శన భాగ్యము నందకుండుగాక! (దీనిచే నపుడు పాపులకు రామదర్శన భాగ్యము కలిగెడిది కాదని సూచితము).

పాయసం కృసరం ఛాగం వృథా సోఽశ్నాతు నిర్ఘృణః,
గురూంశ్చా ప్యవజానాతు యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవడు రాము డడవికి పోవుట నంగీకరించెనో వాడు పాయసము, నువ్వులు కలిపిన యాహారమును, మేకమాంసము ఇచట 'మేక' అన్నది ఉపలక్షణము. ఏ మాంసమైనను అని గ్రహింపనగును) ను దేవతలకు - పితరులకు - అతిథులకు నివేదింపక వ్యర్థముగా దయ లేక తానే భుజించువాడును, లేచుట, ప్రణమిల్లుట చేయక గురువుల నవమానించువాడును ఏ పాపము నందునో ఆ పాపము నందును గాక! (దీనిచే దేవతలు - పితరులు - అతిథులకు నివేదింపక ఆహారము తినుటయు, గురువులను చూచి లేచి నిలుచుట, ప్రణమిల్లుట మున్నగు నాదరము చూపక యవమానించుటయు పాపమని సూచితము.)

గాశ్చ స్పృశతు పాదేన గురూన్ పరివదే త్స్వయమ్,
మిత్రే ద్రుహ్యేత సోఽత్యంతం యస్యార్యోఽనుమతే గతః.

రాము డడవి కేగుటను సమ్మతించిన వాడు - పాదముతో గోవును తాకినవాడు (వెనుక-పాదముతో తన్నుట చెప్పబడినది. ఇచట పాదముతో తాకినను మహాదోషమని చెప్పబడినది), గురువులను నిందించువాడు, మిత్రులకు ద్రోహము చేయువాడే పాపము నందునో యట్టి పాపము నందును. గోవును పాదముతో తాకుట, గురునింద, మిత్రద్రోహము మహాపాపము లని యిచట సూచితము )

విశ్వాసా త్కథితం కించి త్పరివాదం మిథః క్వచిత్,
వివృణోతు స దుష్టాత్మా యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవడు రాము డడవి కేగుట కంగీకరించెనో వాడు - విశ్వాసముతో రహస్యముగ తన చెలికాడు తనకు చెప్పిన యితరుని దోషము నా యితరునకు తెలియజేసిన దుష్టాత్ము డే పాపము నందునో దానిని పొందును. (విశ్వాసఘాతుకత్వము మహాపాపమని భావము )

అకర్తా హ్యకృతజ్ఞ శ్చ త్యక్తాత్మా నిరపత్రపః,
లోకే భవతు విద్వేష్యో యస్యాఽఽర్యోఽనుమతే గతః.౩౩

ఎవడు రాము డడవి కేగ నియ్యకొనెనో అతడు - తన కుపకారము చేసిన వానికి వలయునపుడు ప్రత్యుపకారము చేయక కృతజ్ఞత లేనివా డే పాపమును పొందునో, సజ్జనులచే విడువబడిన వాడయ్యు తన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనక లజ్జ నొందక తిరుగు నట్టివాడును ఏ యే పాపము నందుదురో ఆ పాపము నందును. (ప్రత్యుపకారము చేయకుండుట, కృతజ్ఞత లేకుండుట యను నిది మహాపాపమనియు, తనపాపమునకు

ప్రాయశ్చిత్తము చేసికొనకుండుటయు మహాపాపమనియు నిట సూచితము.)

(త్యక్తాత్మా అను పదమునకు ఉరి మున్నగువానిచే ఆత్మహత్య చేసికొన్నవాడని మహేశ్వరతీర్థీయము.)

పుత్త్రదారై శ్చ భృత్యై శ్చ స్వగృహే పరివారితః,
స ఏకో మృష్ట మశ్నాతు యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవడు రాముడడవి కేగుటను సమ్మతించెనో వాడు-తన ఇంట ఆలుబిడ్డలు, సేవకులు తుచ్ఛమగు ఆహారము తినగా వారి యెదుట తానొక్కడే ఉత్తమమగు అహారము భుజించు గృహస్థుడే పాపము నొందునో ఆ పాపము నందును. (ఇతరులకు పెట్టక లేదా ఆలుబిడ్డలకు అందనీయక తానొక్కడు వారి యెదుటనే శ్రేష్ఠమగు ఆహారము తినుట మహాపాపమని సూచితము.)

అప్రాప్య సదృశాన్ దారా ననపత్యః ప్రమీయతామ్
అనవాప్య క్రియాం ధర్మ్యాం యస్యార్యోనుమతే గతః.

రాముడడవి కేగుటను ఎవ్వడంగీకరించునో అతడు ఉత్తమవంశమున పుట్టిన యోగ్యురాలగు భార్యను బడయక, అగ్నిహోత్రాది ధార్మిక క్రియల ననుష్ఠింపలేక, సంతానము పొందక ఉభయలోక సుఖములకు దూరమగుగాక! (దీనిచే నుత్తముల కనకారము చేయుటచే ఇహ - పర (లోక) సౌఖ్యముల నందడని సూచితము).

మా ఽఽత్మన స్సంతతిం ద్రాక్షీ త్స్వేషు దారేషు దుఃఖితః
అయు స్సమగ్ర మప్రాప్య యస్యాఽఽర్యోనుమతే గతః.

రాము డడవి కేగుటను సమ్మతించినవాడు తన ధర్మ పత్నియందు సంతానము నొందక, దుఃఖితుడై పూర్ణాయుష్కుడు కాకయే మరణించును (ఇది పై శ్లోకమునకే వివరణ శోకము, దీనిచే ఋణములను తీర్చుకొనక బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించుట నిషిద్ధ మగుచున్నది. సంసార విరక్తి కలుగని వానికి బ్రహ్మచర్యము నుండియే సన్న్యసించుట నిషిద్ధము కాని విరక్తుడైన వాని కీ నిషేధము వర్తింపదు అని తలంపరాదు. ఎవ్వనికి, భార్య లభింపదో అట్టి వాని విషయముననే 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్' (బ్రహ్మచర్యమునుండియే సన్న్యసింపవలెను) అని నియమము. [ఇచటను సజ్జనులకు కీడొనర్చిన, స్వభార్యయందు సత్సంతానము లభింపదనియు. అయువు క్షీణించుననియు సూచితము]

రాజస్త్రీబాలవృద్ధానాం వధే యత్పాప ముచ్యతే
భృత్యత్యాగే చ యత్పాపం తత్పాపం ప్రతిపద్యతామ్.

రాము డడవి కేగుటను సమ్మతించినవాడు – రాజును, గాని, స్త్రీనిగాని, బాలుని గాని, వృద్ధుని గాని చంపినవాడు, భృత్యులను పోషింపక వారిని విడచివైచినవాడు ఏ పాపము నందునో అట్టి పాపమునే పొందును (దీనిచే రాజును గాని, స్త్రీనిగాని, బాలునిగాని, వృద్ధునిగాని చంపుట, సేవకుని పోషింపక విడచిపెట్టుట మహాపాపములని సూచితము.)

లాక్షయా మధుమాంసేన లోహేన చ విషేణ చ,
సదైవ బిభృయా ద్భృత్యా న్యస్యాఽఽర్యోఽనుమతే గతః.

రాముని వన గమనము ననుమతించినవాడు - లక్క, మద్యము, మాంసము, లోహము, విషము వీనిని అమ్మి దాని వలన వచ్చు లాభముతో భృత్యులను పోషించువాని కెట్టి పాపము కలుగునో యట్టి పాపము నందును. (దీనిచే లక్క, మద్యము మున్నగు వాని నమ్ముట మహాపాపమని సూచితము).

సంగ్రామే సముపోఢే స్మ శత్రుపక్షభయంకరే,
పలాయమానో వధ్యేత యస్యాఽఽర్యోనుమతే గతః 39

రాము డడవి కేగుట నంగీకరించినవాడు - యుద్ధక్షేత్రమున శత్రుపక్షము భయంకరముగ విజృంభించగా భీతిల్లి పారి పోవుచు చంపబడును.

కపాలపాణిః పృథివీ మటతాం చీరసంవృతః,
భిక్షమాణో యథోన్మత్తో యస్యాఽఽర్యోనుమతే గతః. 40

రాము డడవికి పోవుట నామోదించినవాడు - పునుక చేబూని మలినవస్త్రము దాల్చి, పిచ్చి యెక్కిన వానివలె భూమిపై నెల్లెడల భిక్షాటన చేయుగాక ! (దీనిచే కపాలము చేత ధరించి, జీర్ణవస్త్రములు దాల్చి బిచ్చ మెత్తుకొనుట మహదోషమని సూచితము. (దీనిచే తక్కినమతములవారు శైవమతమున ప్రవేశించుట నిందింపబడు చున్నదని గోవిందరాజీయ వ్యాఖ్య.)

పానే ప్రసక్తో భవతు స్త్రీ ష్వక్షేషు చ నిత్యశః,
కామక్రోధాభిభూత స్తు యస్యాఽఽర్యోఽనుమతే గతః.41

ఎవడు రాము డడవికి పోవ ననుమతించెనో యతడు కామక్రోధములకు వశపడి, ఎల్లపుడు సురాపానమునందు, స్త్రీ సంగమమునందు, జూదమునందు తగుల్కొనినవా డగును గాక. (దీనిచే కామక్రోధపరవశుడై సురా, స్త్రీ, ద్యూతములలో తగుల్కొనుట మహాపాప మని సూచితము.)

మా స్మ ధర్మే మనో భూయా దధర్మం స నిషేవతామ్,
అపాత్రవర్షీ భవతు యస్యాఽఽర్యోఽనుమతే గతః. 42

రాముడు వనమున కేగుటను సమ్మతించినవాని మనస్సు ధర్మమున లగ్నము గాకుండుగాక. అత డధర్మము నాచరించుగాక. అయోగ్యున కధికధన మిచ్చును గాక (దీనిచే ధర్మము పై మనస్సు పెట్టక అధర్మ మాచరించుట, అయోగ్యులకు దానము చేయుట మహాపాపమని సూచితము).

సంచితా స్యస్య విత్తాని వివిధాని సహస్రశః,
దస్యుభి ర్విప్రలుప్యంతాం యస్యాఽఽర్యోఽనుమతే గతః.

ఎవడు రాముని వనగమనమునకు సమ్మతించెనో, అతడు కూడబెట్టిన వేలకొలదిగా గల వివిధ ధనములను చోరు లపహరింతురు గాక! (దీనిచే సజ్జనులకు కీడుచేయుటచే ధనము దొంగల పాలగునని సూచితము)

ఉభే సంధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే,
తచ్చ పాపం భవే త్తస్య యస్యాఽఽర్యోఽనుమతే గతః. 44

ఎవని యంగీకారముతో రాము డడవికి వెడలెనో యతడు సూర్యోదయ సూర్యాస్తమయ కాలములలో నిదురించువాని కే

పాపము కలుగునో యట్టి పాపము పొందునుగాక (సంధ్యాసమ యములందు నిద్రించుట మహాపాప మని దీనిచే సూచితము).

యు దగ్నిదాయకే పాపం య త్పాపం గురుతల్పగే,
మిత్రద్రోహే చ యత్పాపం త త్పాతం ప్రతిపద్యతామ్.48

ఇండ్లు తగుల బెట్టినవాడును, గురుభార్యను పొందిన వాడును, మిత్రునకు ద్రోహము చేసిన వాడును పొందునట్టి పాప మును రాము డడవికి పోవ సమ్మతించినవాడు పొందును గాక ! (ఇళ్లు కాల్చువాడు, గురుభార్యను కూడినవాడు, మిత్ర ద్రోహి మహాపాపులని భావము.)

దేవతానాం పితౄణాం చ మాతాపిత్రో స్తథైవ చ,
మా స్మ కార్షీత్స శుశ్రూషాం యస్యాఽఽర్యోఽనుమతే గతః.

రాము డడవికి పంప సమ్మతించినవాడు - దేవతలకు, పితరులకు, జీవించియున్న తల్లిదండ్రులకు శుశ్రూష చేయని వా డగుగాక, (ఆజ్యము, చరువు, పశువు, పురోడాశము మున్నగు వానితో అగ్నికార్య మొనర్చి దేవతలను సంతోషపెట్టుట దేవ శుశ్రూష అమావాస్యాదులు, మాతాపితరుల మరణ తిథులు మున్నగు సందర్భములందు నూవులు మున్నగు వానితో పితరుల నారాధించుట పితృశుశ్రూష. జీవించియున్న తల్లిని, తండ్రిని సేవించుట మాతాపితృశుశ్రూష. ఈ శుశ్రూష చేయకుండుట మహాపాపమని ఇందు సూచితము.)

సతాం లోకా త్సతాం కీర్త్యాః సంజుష్టా త్కర్మణ స్తథా,
భ్రశ్యతు క్షిప్ర మద్యైవ యస్యాఽఽర్యోఽనుమతే గతః.47

ఎవడు రాము డడవికి పోవుటను సమ్మతించెనో అతడు సత్పురుష సమూహముచే, సజ్జనుల పొగడ్తలచే, సజ్జను లాచరించు కర్మలచే శీఘ్రముగ నిష్కృతి విడువబడుగాక! (దీనిచే సజ్జనులకు కీడొనరించు వారిని సజ్జనులు విడచి పుత్తురని, అతనిని శ్లాఘింపరని, సత్కార్యముల నెల్ల నాచరింపవలెనని సూచితము.)

అపాస్య మాతృశుశ్రూషా మనర్థే సోఽవతిష్ఠతామ్
దీర్ఘబాహు ర్మహావక్షా యస్యాఽఽర్యోఽమతే గతః 48

ఎవ డాజానుబాహుడును, విశాలమగు వక్షము కలవాడను అగు రాము నడవి కేగ సమ్మతించెనో, యతడు తల్లిని సేవింపక యధర్మమున పడుగాక! (ముం దొక మారు మాతృశుశ్రూష పేర్కొనబడినది. అయినను మఱల పేర్కొనుట మాతృశుశ్రూష చేయకుండుటచే మిగుల ప్రత్యవాయ మేర్పడునని, మాతృసేవ నిత్య కర్తవ్యమని సూచించుటకే. తల్లి పతితయైనను తనయుడా మెకు శుశ్రూష చేయవలెనని స్మృతులు విధించుచున్నవి.)

బహుపుత్త్రో దరిద్ర శ్చ జ్వరరోగసమన్వితః
స భూయా త్సతతక్లేశీ యస్యాఽఽర్యోఽనుమతే గతః 49

ఎవడు రాము డడవికి పోవ సమ్మతించెనో వాడు పెక్కండ్రు తనయులను కని, దరిద్రుడై, జ్వరము, రోగములతో కూడి, సదా క్లేశముల పొందగును. (సజ్జనాపచారమున కిది యెల్ల ఫలమని సూచితము.

ఆశా మాశంసమానానాం దీనానా మూర్ధ్వచక్షుషామ్.
అర్థినాం వితథాం కుర్యా ద్యస్యాఽఽర్యోఽనుమతే గతః.

రాము డడవికి పంపుటను సమ్మతించినవాడు, దీనులై, స్తోత్రము చేయుచు, ఉన్నతపీఠముపై కూర్చుండిన దాతను కనులు పైకెత్తి చూచుచున్న యాచకుల యాశ నడియాస పాలు చేసినవా డగును (యాచకులకు కాశ కలిగించి వారిని విఫల మనోరథులను చేయుట మహాపాప మని భావము.)

మాయయా రమతాం నిత్యం పరుషః పిశునోఽశుచిః,
రాజ్ఞో భీత స్త్వధర్మాత్మా యస్యాఽఽర్యోఽనుమతే గతః.

రాము నడవి కంపుట కెవడు సమ్మతించెనో వాడు నిత్యము అధార్మికుడు, కఠినుడు, కుటిలుడు నై, అశుచియై రాజు వలని భయపడుచు మోసముతో ప్రొద్దుపుచ్చుచుండుగాక !

ఋతుస్నాతాం సతీం భార్యా మృతుకాలానురోధినీమ్,
అతివర్తేత దుష్టాత్మా యస్యాఽఽర్యోఽనుమతే గతః. 52

ఎవడు రామవనగమనమునకు సమ్మతించెనో యతడు పతివ్రత యగు భార్య ఋతుస్నాతయై, తనకు సన్నిహితముగ నుండగా నామెను విడనాడిన వా డగుగాక ! (ఋతుస్నాతయగు ధర్మపత్ని తన చెంతనుండగా నామెను చేరదీయకుండుట మహాపాప మని సూచితము).

ధర్మదారా న్పరిత్యజ్య పరదారా న్నిషేవతామ్,
త్యక్తధర్మరతి ర్మూఢో యస్యాఽఽర్యోఽనుమతే గతః 53

రాము నడవి కంపుటను సమ్మతించిన వాడు ధర్మపత్నిని వీడి పరస్త్రీని పొందినవాడును, ధర్మమునం దాసక్తి తొలగినవా

డును, మూఢుడును అగుగాక ! (దీనిచే ధర్మపత్నీత్యాగ మొనర్చి పరస్త్రీని పొందుట మహాపాప మని సూచితము).

విప్రలుప్తప్రజాతస్య దుష్కృతం బ్రాహ్మణస్య యత్,
తదేతత్ ప్రతిపద్యేత యస్యాఽఽర్యోఽనుమతే గతః. 54

ఎవడు రాముని అడవికి పంప సమ్మతించెనో అతడు బిడ్డలు నశించిన బ్రాహ్మణునకు కలుగు దోషము నందుగాక.

పానీయదూషకే పాపం తథైవ విషదాయకే,
యత్తదేకస్స లభతాం యస్యాఽఽర్యోఽనుమతే గతః. 55

రాముడు అడవికి పోవుటను సమ్మతించినవాడు - ఎల్లరు త్రాగు నీటిని కలుషితము చేసినవాడును, విషము పెట్టిన వాడును వీరిరువురును కలసి యే పాపమును పొందుదురో ఆ పాపమును తా నొక్కడే పొందును. త్రాగునీటిని పాడుచేయువాడు, అన్నములో విషము కలిపి పెట్టినవాడు మహాపాతకము నందుదు రని సూచితము).

బ్రాహ్మణాయోద్యతాం పూజాం విహంతు కలుషేంద్రియః,
బాలవత్సాం చ గాం దోగ్ధుం యస్యార్యోఽఽనుమతే గతః.

ఎవడు రాముని వనవాసమునకు సమ్మతించెనో వాడు బ్రాహ్మణుని కై నిశ్చితమైన పూజను చెడగొట్టినవాడును, ఈనిన పది దినములలోపలనే ఆవుపాలు పిదుకువాడును అగుగాక ! (దీనిచే బ్రాహ్మణపూజానిరోధము, ఆవు ఈనినది మొదలు పది ములలోపు పాలు పిదుకుటయు మహాపాపమని సూచితము).

తృష్ణార్తం సతి పానీయే విప్రలంభేన యోజయేత్,
లభేత తస్య యత్పాపం యస్యాఽఽర్యోఽ నుమతే గతః.

ఎవడు రాముని వనగమనమునకు సమ్మతించెనో వాడు తన యింటి త్రాగుటకు నీరున్నను దప్పిక గొన్న వానికి నూయ మాటలు చెప్పి, జలమీయని వాడే పాపము నొందునో, ఆ పాపము నందుగాక! (దప్పికగొన్న వానికి జలమీయకుండుట మహాపాపమని సూచితము.)

భక్త్యా వివదమానేషు మార్గ మాశ్రిత్య పశ్యతః,
తస్య పాపేన యుజ్యేత యస్యాఽఽర్యోఽనుమతే గతః. 58

ఎవడు రామువనవాసమునకు సమ్మతించెనో వాడు – ఇరువురు వాద ప్రతివాదములు చేసికొనుచుండగా నడుమ తానేగి యందొకని పక్షము వహించి యాతనికి జయోపాయము తెలుపు వాడే దోషము నందునో దానిని పొందుగాక! (వాది ప్రతివాదులలో నొకని పక్షము వహించి రెండవ వాని విజయమునకుపాయము తా నెఱిగియు పక్షపాతబుద్ధితో దానిని తెలుపక యూరకుండువాని పాపమును పొందును అని మహేశ్వర తీర్థులు.)

విహీనాం పతిపుత్రాభ్యాం కౌసల్యాం పార్థివాత్మజః,
ఏవ మాశ్వాసయ న్నేవ దుఃఖార్తో నిపపాత హ. 59

రాజపుత్రుడగు భరతు డిట్లు పతిని కోల్పోయి, తనయునకు దూరమైన కౌసల్య నూరడించుచునే దుఃఖపీడితుడై నేల బడెను.

తథా తు శపథైః కష్టైః శ్శపమాన మచేతనమ్,
భరతం శోకసంతప్తం కౌసల్యా వాక్య మబ్రవీత్. 60

అట్లు కఠోరములగు శపథములు చేసి, శోకపీడితుడై యున్న భరతునకు కౌసల్య యిట్లనెను.

మమ దుఃఖ మిదం పుత్ర ! భూయ స్సముపజాయతే,
శపథై శ్శపమానో హి ప్రాణా నుపరుణత్సి మే. 61

నాయనా ! నీ విట్లు శపథములు చేయుటచే నాకు మఱల దుఃఖము కలుగుచున్నది. నీ శపథములచే నా ప్రాణములు కొట్టుమిట్టాడుచున్నవి (లేదా నీ శపథములు నా ప్రాణములను నిలుపుచున్నవి. నాకూరట కలిగించినవి అని భావము).

దిష్ట్యా న చలితో ధర్మా దాత్మా తే సహలక్ష్మణః,
వత్స ! సత్యప్రతిజ్ఞో మే సతాం లోకా నవాప్స్యసి. 62

నాయనా ! భాగ్యవశముచే నీ మనస్సు జ్యేష్ఠు ననుసరించుట యను ధర్మము నుండి చెదరకున్నది. నాకొఱకు లక్ష్మణుని వలె నీవును సత్యప్రతిజ్ఞ కలవాడవైతివి. కాన సజ్జనులకు లభించు నుత్తమ లోకములను బడసెదవు.

ఇత్యుక్త్వా చాంక మానీయ భరతం భ్రాతృవత్సలమ్,
పరిష్వజ్య మహాబాహుం రురోద భృశదుఃఖితా. 63

కౌసల్య ఇట్లు పలికి, యన్నయందనురాగముకల భరతుని తన తొడపై కూర్చుండ బెట్టుకొని, కౌగలించుకొని మిగుల దుఃఖితయై యేడ్చెను

ఏవం విలపమానస్య దుఃఖార్తస్య మహాత్మనః,
మోహా చ్ఛ శోకసంరోధా ద్బభూవ లుళితం మనః. 64

దుఃఖ పీడితుడై వివిధశపథములు చేయుచు నేడ్చుచున్న మహాత్ముడగు భరతునకు - తెలివి దప్పుటచేతను, శోకమువల్ల కలిగిన అవరోధము చేతను మనస్సు మిగుల కలతపడెను.

లాలప్యమానస్య విచేతనస్య
ప్రణష్టబుద్ధేః పతితస్య భూమౌ,
ముహు ర్ముహు ర్నిశ్శ్వసతశ్చ ఘర్మం
సా తస్య శోకేన జగామ రాత్రిః. 65

భరతు డిట్లధికముగ మాటలాడుచు, తెలివి దప్పి, బుద్ధి చెడి భూమిపై బడి, మాటిమాటికి నిట్టూర్చుచుండగనే ఆ రాత్రి యెల్ల గడచెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పఞ్చసప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

## షట్సప్తతితమః సర్గః - డెబ్బదియాఱవ సర్గము

త మేవం శోకసన్తప్తం భరతం కైకయీసుతమ్,
ఉవాచ వదతాం శ్రేష్ఠో వసిష్ఠ శ్శ్రేష్ఠవా గృషిః. 1

మాటలాడు వారిలో నుత్తముడగు వసిష్ఠుడట్లు శోకసం తప్తుడగు భరతునకిట్లు శ్రేష్ఠములగు మాటలు పలికెను.

అలం శోకేన భద్రం తే రాజపుత్ర మహాయశః ।
ప్రాప్తకాలం నరపతేః కురు సంయాన ముత్తమమ్. 2

మహాకీర్తిశాలివగు ఓ రాజపుత్రా! నీవింక శోకింపకుము. నీకు శుభమగు గాక. దశరథమహారాజునకు స్వర్గము లభించుటకు చేయవలసిన యుత్తరక్రియల నాచరింపుము.

వసిష్ఠస్య వచః శ్రుత్వా భరతో ధారణాం గతః ।
ప్రేతకార్యాణి సర్వాణి కారయామాస ధర్మవిత్. 3

ధర్మ మెఱిగిన భరతుడు వసిష్ఠుని మాటలు విని, ధైర్యము నొందినవాడై ప్రేతకార్యముల నెల్ల ననుష్ఠించెను.

ఉద్ధృతం తైలసంరోధాత్ స తు భూమౌ నివేశితమ్ ।
ఆపీతవర్ణవదనం ప్రసుప్తమివ భూపతిమ్. 4

సంవేశ్య శయనే చాగ్ర్యే నానారత్నపరిష్కృతే ।
తతో దశరథం పుత్రో విలలాప సుదుఃఖితః. 5

దశరథుని శవము తైలపాత్రనుండి తేవనెత్తి, (నూనెను తుడుచుటకై) నేలపై నుంచబడెను. నూనె తుడువగా పసుపు వర్ణము కలిగి, నిద్రించుచున్న వానివలె నున్న రాజును శ్రేష్ఠమై వివిధరత్నములచే నలంకృతమైన పాన్పుపై పరుండబెట్టి కుమారుడగు భరతుడు మిగుల దుఃఖముతో విలపించెను.

కిం తే వ్యవసితం రాజన్ ప్రోషితే మయ్యనాగతే,
వివాస్య రామం ధర్మజ్ఞం లక్ష్మణం చ మహాబలమ్. 6

రాజా ! నేను దేశాంతర మేగి మరలివచ్చులోపలనే, ధర్మము నెఱిగిన రాముని, మహాబలు డగు లక్ష్మణుని అడవికి పంపి నీవేల నిట్లు స్వర్గమున కేగితివి ?

క్వ యాస్యసి మహారాజ ! హిత్వేమం దుఃఖితం జనమ్,
హీనం పురుషసింహేన రామే ణాక్లిష్టకర్మణా. 7

అందఱికిని ఆనందము కలిగించు పనుల నాచరించు పురుష శ్రేష్ఠు డగు రాముడు లేక దుఃఖితులమైన మమ్ము వీడి నీ వెచట కేగెదవు ?

యోగక్షేమం తు తే రాజన్ ! కోఽస్మి న్కల్పయితా పురే,
త్వయి ప్రయాతే స్వ స్తాత ! రామే చ వన మాశ్రితే. 8

తండ్రీ ! నీవు స్వర్గమునకు పోతివి. అన్న రాము డరణ్యమునే నివాసముగ చేసికొనెను. ఈ స్థితిలో నీ యా అయోధ్యా నగరమునకు యోగక్షేమము లరయువా రెవ్వరు ?

విధవా పృథివీ రాజన్ ! త్వయా హీనా న రాజతే,
హీనచంద్రేవ రజనీ నగరీ ప్రతిభాతి మా. 9

రాజా ! నీవు లేని యీ భూమి విధవయై ప్రకాశింపకున్నది. ఈ అయోధ్యాపురియు నాకు చంద్రుడులేని రాత్రివలె తోచుచున్నది.

ఏవం విలపమానం తం భరతం దీనమానసమ్,
అబ్రవీ ద్వచనం భూయో వసిష్ఠ స్తు మహామునిః. 10

ఇట్లు దీనమగు మనస్సు కలవాడై యేడ్చుచున్న భరతునకు వసిష్ఠమహాముని మఱల నిట్లు చెప్పెను.

ప్రేతకార్యాణి యా న్యస్య కర్తవ్యాని విశాంపతేః,
తా న్యవ్యగ్రం మహాబాహో క్రియంతా మవిచారితమ్. 11

ఓ మహాభుజుడా ! రాజున కిపుడే యే ప్రేతకార్యములాచరింప వలెనో వానిని, తక్కిన యాలోచనలు విడచి, యేమఱుపాటు లేక నిర్వహింపుము.

తథేతి భరతో వాక్యం వసిష్ఠ స్యాభిపూజ్య తత్,
ఋత్విక్పురోహితాచార్యాం స్త్వరయామాస సర్వశః. 12

భరతు "తట్లే" యని వసిష్ఠుని మాటను పాటించి, ఋత్విజులను, పురోహితులను, ఆచార్యులను అందఱను కార్యాయత్తులు కండని తొందరపెట్టెను. [విశే. యజ్ఞముచేయుటకు వరింపబడినవారు ఋత్విజులు. ముందుగా హితకార్యతత్పరులై శాంతిక పౌష్టికాది క్రియలు చేయించువారు పురోహితులు, వసిష్ఠకామదేవాదు లాచార్యులు.]

యే త్వగ్నయో నరేంద్రస్య చాగ్న్యగారా ద్బహిష్కృతాః,
ఋత్విగ్భి ర్యాజకై శ్చైవ తే౽హ్రియంత యథావిధి. 13

గృహమునందు రాజు శవ ముండుటచే ఋత్విజులు ఉపద్రష్టలును అగ్నిగృహమునుండి గార్హపత్యము మున్నగు మూడగ్నులను బయటకు తెచ్చిరి.

శిబికాయా మథాఽఽరోప్య రాజానం గతచేతసమ్,
బాష్పకంఠా విమనస స్తమూహుః పరిచారకాః. 14

అంతట పరిచారకులు మరణించిన రాజును పల్లకిలో నుంచి, మనసు చెడి, బాష్పము కంఠమును నిరోధింపగా, (శ్మశానమునకు) మోసికొని పోయిరి.

హిరణ్యం చ సువర్ణం చ వాసాంసి వివిధాని చ,
ప్రకిరంతో జనా మార్గం నృపతే రగ్రతో యయుః. 15

అపుడు జనులు వెండితో, బంగారముతో చేయబడిన పూలను, పలువిధములగు వస్త్రములను ఆ మార్గమున చల్లుచు రాజునకు ముందు నడచిరి.

చందనాగరునిర్యాసాన్ సరళం పద్మకం తథా,
దేవదారూణి చాఽఽహృత్య క్షేపయంతి తథాఽపరే. 16

కొందరు చందనము, అగరువులతో చేయబడిన ధూపద్రవ్యములను, గుగ్గిలమును, సరళమను ధూపద్రవ్యమును, పద్మకమను పరిమళించు నొక కాష్ఠమును, దేవదారువులను మఱికొందరు తక్కిన సుగంధద్రవ్యవిశేషములను చల్లుచుండిరి.

గంధానుచ్చావచాం శ్చాన్యాం స్తత్ర గత్వాఽథ భూమిపమ్,
తత స్సంవేశయామాసు శ్చితామధ్యే త మృత్విజః. 17

అంతట చితిని సిద్ధముచేసి, దాని చెంతకుపోయి, ఋత్విజులు రాజు శవము నా చితిపై పరుండబెట్టిరి.

తథా హుతాశనం దత్త్వా జేపు స్తస్య త మృత్విజః,
జగుశ్చ తే యథాశాస్త్రం తత్ర సామాని సామగాః. 18

అపుడు ఋత్విజులు భరతునిచే రాజునకు త్రేతాగ్ని నిప్పించి, ఆయనకు ఉత్తమగతి కలుగుటకు పితృమేధసంబంధమైన మంత్రవిశేషములను జపము చేసిరి. ఉద్గాత మున్నగు సామగానము చేయు వేదవిదులు శాస్త్రానుసారముగ నచట సామగాన మొనర్చిరి.

శిబికాభి శ్చ యానై శ్చ యథార్హం తస్య యోషితః,
నగరా న్నిర్యయు స్తత్ర వృద్ధైః పరివృతా స్తదా. 19

అపు డా రాజు భార్యలు తెల్లని వృద్ధ పరిచారకులు రక్షకులై పరివేష్టింపగా పల్లకి మున్నగు తమకు తగిన ప్రయాణసాధనముల నెక్కి పట్టణము వెలువడి యాశ్మశాన భూమికడ కేగిరి.

ప్రసవ్యం చాపి తం చక్రు ఋత్విజోఽగ్నిచితం నృపమ్,
స్త్రియ శ్చ శోకసంతప్తాః కౌసల్యాప్రముఖా స్తదా. 20

అపుడు ఋత్విజులును, శోకపీడితలగు కౌసల్య మున్నగు రాణులును, భరతుడును పలుయాగముల నాచరించి యగ్నిచయనము చేసినట్టి యా రాజునకు ప్రదక్షిణమును, అప్రదక్షిణమును చేసిరి.

విశే. ఈ ప్రదక్షిణము, అప్రదక్షిణమును ప్రేత వాహనముపై నుండగనే అగ్నిసంస్కారమునకు పూర్వము చేయవలసి యుండును. ఇచట కవి యీక్రమముననే చెప్పవలెనని తలంప లేదు. కాన వారగ్నిదాహమునకు ముందే ప్రదక్షిణాప్రదక్షిణము

లొనరించియుందురు లేదా అగ్నిదాహానంతరము ప్రదక్షిణము లాచరించుట యచటిదేశాచారమైనను కావచ్చును.

> క్రౌంచీనా మివ నారీణాం నినాద స్తత్ర శుశ్రువే,
> ఆర్తానాం కరుణం కాలే క్రోశంతీనాం సహస్రశః. 21

అచట నా దుఃఖసముదయమున దుఃఖపీడితలైన స్త్రీలు జాలి గొలుపుచు ఆడుక్రౌంచపక్షులవలె రోదనము చేయుధ్వని వినబడెను.

> తతో రుదంత్యో వివశా విలప్య చ పునః పునః,
> యానేభ్య స్సరయూతీర మవతేరు ర్వరాంగనాః. 22

అంతట ఆ శ్రేష్ఠకాంతలు మిక్కిలి రోదించి, పరవశలై, మాటి మాటికి విలపించి, వాహనముల నెక్కి సరయూనదీతీరమునకు వచ్చి దిగిరి.

> కృత్వోదకం తే భరతేన సార్ధం
> నృపాంగనా మంత్రిపురోహితా శ్చ,
> పురీం ప్రవి శ్యాశ్రుపరీతనేత్రా
> భూమౌ దశాహం వ్యనయంత దుఃఖమ్. 23

ఆ రాజకాంతలు, మంత్రులు, పురోహితులును భరతునితో కూడి యచట రాజున కుదకక్రియ జరిపి, యటనుండి పట్టణమును ప్రవేశించి, కన్నుల నీరు నిండగా భూమిపైనే శయనించుచు పది దినములు ఆశౌచము గడపిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షట్సప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున డెబ్బదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## సప్తసప్తతితమః సర్గః - డెబ్బదియేడవ సర్గము

తతో దశాహేఽతిగతే కృతశౌచో నృపాత్మజః,
ద్వాదశేఽహని సంప్రాప్తే శ్రాద్ధకర్మా ణ్యకారయత్. 1

అంతట పదిదినములు గడువగా, పదునొకండవ దినమున రాజకుమారుడగు భరతుడు పుణ్యాహవాచనాదులచే పరిశుద్ధుడై, పండ్రెండవ దినమున మాసిక – సపిండీకరణశ్రాద్ధము లాచరించెను.

బ్రాహ్మణేభ్యో దదౌ రత్నం ధన మన్నం చ పుష్కలమ్,
వాసాంసి చ మహార్హాణి రత్నాని వివిధాని చ. 2

మఱియు నా సందర్భమున బ్రాహ్మణులకు రత్నములు, ధనము, విరివిగా అన్నము, అమూల్యవస్త్రములు, వివిధ శ్రేష్ఠ వస్తువులను దానమిచ్చెను.

బాస్తికం బహుశుక్లం చ గా శ్చాపి శతశ స్తదా,
దాసీదాసం చ యానం చ వేశ్మాని సుమహాంతి చ 3
బ్రాహ్మణేభ్యో దదౌ పుత్రో రాజ్ఞ స్త స్యౌర్ధ్వదైహికమ్,

మఱియు మేకల సమూహములను, అధికముగ వెండిని, వందలకొలది ఆవులను, దాసదాసీజనమును, వాహనములను, పెద్ద పెద్ద యిండ్లను, భరతుడు తన తండ్రి పరలోకక్రియ నుద్దేశించి దానము చేసెను.

తతః ప్రభాతసమయే దివసేఽథ త్రయోదశే, 4
విలలాప మహాబాహు ర్భరత శ్శోకమూర్ఛితః,
శబ్దాపిహితకంఠ స్తు శోధనార్థ ముపాగతః. 5

అంతట పదమూడవనాటి యుదయమున మహాభుజుడగు భరతుడు అస్థిసంచయనమునకై, దహనముచేసిన చోటికి వచ్చి దుఃఖవివశుడై బిగ్గఱగా నేడ్చెను.

చితామూలే పితు ర్వాక్య మిద మాహ సుదుఃఖితః,

పిమ్మట మిక్కిలి దుఃఖముతో తండ్రి చితివద్ద నతని నుద్దేశించి యిట్లనెను.

తాత ! యస్మి న్నిసృష్టోఽహం త్వయా భ్రాతరి రాఘవే, 6
తస్మి న్వనం ప్రవ్రజితే శూన్యే త్యక్తోఽస్మ్యహం త్వయా

తండ్రీ ! నీవు న న్నే యన్న యగు రాముని కప్పగించితివో, అతడు అడవికి పోయెను. నీవు న న్ని యాలంబనములేని చోట విడచితివి.

యస్యా గతి రనాథాయాః పుత్త్రః ప్రవ్రాజితో వనమ్, 7
తా మంబాం తాత ! కౌసల్యాం త్యక్త్వా త్వం క్వగతో నృప

మహారాజవగు ఓ తండ్రీ ! అనాథయగు కౌసల్యకు గతియైన రాము నడవికి పంపితివి. ఇపు డామెను విడి నీ వెచటకు పోయితివి ?

దృష్ట్వా భస్మారుణం తచ్చ దగ్ధాస్థి స్థానమండలమ్, 8
పితు శ్శరీరనిర్వాణం నిష్టన న్విషసాద సః.

ఎఱ్ఱగా, బాగుగా కాలుటచే ఎఱ్ఱని బూడిద కలది, తగుల బడిన ఎముకల గూడు కలది యగు తండ్రి శరీరమును కాల్చిన చితిని గాంచి రోదన మొనర్చుచు దుఃఖితు డయ్యెను.

స తు దృష్ట్వా రుదన్ దీనః పపాత ధరణీతలే, 9
ఉత్థాప్యమాన శ్శక్రస్య యంత్రధ్వజ ఇవ చ్యుతః.

భరతు డట్లు చితిని చూచి రోదించుచు దీనుడై, త్రాళ్లచే (కప్పితో) పైకి లాగబడుచున్న యింద్రధ్వజము త్రాడు జారుటచే నేలపై బడినటులు భూమిపై బడెను. (యంత్రపుత్రాడు జారి పడుటచే, ఇంద్రధ్వజము పడినట్లు రాజపతనముచే భరతుడును పడెనని భావము.)

అభిపేతు స్తత స్సర్వే త స్యామాత్యా శ్శుచివ్రతమ్. 10
అంతకాలే నిపతితం యయాతి మృషయో యథా.

అపు డా పరిశుద్ధమగు నియమముగల భరతునిజాతు లెల్లరు పుణ్యక్షయముచే పడిన యయాతిని, అతని దౌహిత్రులగు ఋషులవోలె లేవనెత్త వచ్చిరి.

శత్రుఘ్నశ్చాపి భరతం దృష్ట్వా శోకపరిప్లుతమ్, 11
విసంజ్ఞో న్యపతద్భూమౌ భూమిపాల మనుస్మరన్

శత్రుఘ్నుడును భరతు డిట్లు దుఃఖితుడై నేలబడుట చూచి (అంతవఱకు ధైర్యము నిలుపుకొని యుండెను కాని భరతుడు నేలబడుట చూడగనే యాతని ధైర్యము సడలెను). తండ్రిని తలంచుచు తెలివితప్పి నేల బడెను.

ఉన్మత్త ఇవ నిశ్చేతా విలలాప సుదుఃఖితః, 12
స్మృత్వా పితు ర్గుణాంగాని తాని తాని తథా తథా.

అతడపుడు తమ కాయా సమయములలో ఇష్టములగు వస్తువుల నొసగి లాలించిన తమ తండ్రియొక్క చేతులు మున్నగు అంగములను, ఆతని గుణములను స్మరించి, పిచ్చివానివలె మైమఱచి దుఃఖముతో రోదించెను

మన్థరాప్రభవ స్తీవ్రః కైకేయీగ్రాహసంకులః, 13
వరదానమయోఽక్షోభ్యోఽమజ్జయ చ్ఛోకసాగరః.

మంథర వలన పుట్టినది, కైకేయి యను మొసలితో కూడినది, వరమిచ్చుట యను నీరు కలది, లోతై, కలచివేయ రానిదగు దుఃఖసాగరమున మేము మునిగినాము.

సుకుమారం చ బాలం చ సతతం లాలితం త్వయా 14
క్వ తాత! భరతం హిత్వా విలపంతం గతో భవాన్.

తండ్రీ! నీవు సదా లాలించు – సుకుమారుడు, బాలుడు యేడ్చుచున్నవాడగు భరతుని వీడి యెచటకు పోయితివి ?

నను భోజ్యేషు పానేషు వస్త్రే ష్వాభరణేషు చ, 15
ప్రవారయసి న స్సర్వాం స్తన్నః కోఽన్యః కరిష్యతి.

తండ్రీ! భోజ్యపదార్థములయందును, పానీయముల యందును, వస్త్రములందును, ఆభరణములందును మీ కేవేవి యిష్టమో తీసికొండని బలవంతముగా మమ్ము లాలించుచు మేమే వానిని తీసికొనునట్లు చేసెడివాడవే! ఇప్పు డెవ్వరు మాకిట్లు చేయుదురు ?

అవదారణకాలే తు పృథివీ నావదీర్యతే, 16
యా విహీనా త్వయా రాజ్ఞా ధర్మజ్ఞేన మహాత్మనా.

ధర్మ మెఱిగినవాడవు, మహాత్ముడవగు నీవంటి మహారాజును కోల్పోయిన భూమి స్వయముగనే బ్రద్దలు కావలసినది. అట్టి సమయముననే బ్రద్దలుకాని ఈభూమి ప్రళయకాలమున గూడ పగిలిపోదు

పితరి స్వర్గ మాపన్నే రామే చారణ్య మాశ్రితే, 17
కిం మే జీవితసామర్థ్యం ప్రవేక్ష్యామి హుతాశనమ్.

నా తండ్రి మరణింపగా, రాము డరణ్యమున కేగగా నాకు జీవించు శక్తి యెక్కడిది ? నేనింక నగ్నిలో ప్రవేశింతును.

హీనో భ్రాత్రా చ పిత్రా చ శూన్యా మిక్ష్వాకుపాలితామ్, 18
అయోధ్యాం న ప్రవేక్ష్యామి ప్రవేక్ష్యామి తపోవనమ్.

నా యన్న చెంత లేక, తండ్రిని కోల్పోయి, యిక్ష్వాకు వంశ్యులచే పాలింపబడిన ఈ శూన్యమగు అయోధ్యలో ప్రవేశింపను. తపోవనమున కేగెదను.

తయో ర్విలపితం శ్రుత్వా వ్యసనం చాన్వవేక్ష్య తత్, 19
భృశ మార్తతరా భూయ స్సర్వ ఏ వానుగామినః.

భరతశత్రుఘ్ను లట్లు విలపించగా విని, వారికి కలిగిన సంకటమును చూచి, అనుచరు లెల్లరు మఱల మిగుల దుఃఖి తు లైరి.

తతో విషణ్ణౌ విశ్రాంతౌ శత్రుఘ్నభరతా వుభౌ, 20
ధరణ్యాం సంవ్యవేష్టితాం భగ్నశృంగా వివర్షభౌ.

అంత భరతశత్రుఘ్ను లిరువురు దుఃఖితులై మిక్కుని అల సినవారై కొమ్ములు విఱిగిన యెద్దుల వలె భూమిపై బడి పొరలిరి.

తతః ప్రకృతిమా న్వైద్యః పితు రేషాం పురోహితః, 21
వసిష్ఠో భరతం వాక్య ముత్థాప్య త మువాచ హ.

అంతట ప్రశస్తముగు స్వభావము కలవాడును, సర్వజ్ఞుడును రామాదుల తండ్రియగు దశరథునకు పురోహితు డగు వసిష్ఠుడు భరతుని లేవనెత్తి యతని కిట్లనెను.

త్రయోదశోఽ యం దివసః పితు ర్వృత్తస్య తే విభో 22
సావశేషాస్థినిచయే కి మిహ త్వం విలంబసే.

ప్రభూ! నీ తండ్రికి సంస్కార మొనర్చి నేటికి పదుమూ డవ దినము. ఇంక మిగిలియున్న అస్థిసంచయన కర్మ మొనర్పక విలంబ మేల చేసెదవు ?

త్రీణి ద్వంద్వాని భూతేషు ప్రవృత్తా న్యవిశేషతః. 23
తేషు చాపరిహార్యేషు నైవం భవితు మర్హసి.

ఆకలిదప్పులు, శోకమోహములు, జరామృత్యువులను మూడు జంటలు ప్రాణు లెల్లరకును సమానములు. అవి త్రోసి పుచ్చరాని నగుచుంతగా నీ విట్లు శోకింపదగవు.

సుమంత్రశ్చాపి శత్రుఘ్న ముత్థా ప్యాభిప్రసాద్య చ, 24
శ్రావయామాస తత్త్వజ్ఞ స్సర్వభూతభవాభవమ్.

తత్త్వ మెఱిగిన సుమంత్రుడును, శత్రుఘ్నుని లేవనెత్తి, యాతని మనస్సును సమాధానపఱచి, ప్రాణులన్నింటికి పుట్టుట గిట్టుట యనునది యనివార్యమని, వానిని దలంచి చింతింప పనిలేదని యుపదేశమును వినిపించెను.

ఉత్థితౌ చ నరవ్యాఘ్రౌ ప్రకాశేతే యశస్వినౌ, 25
వర్షాతపపరిక్లిన్నౌ పృథ గింద్రధ్వజా వివ.

వసిష్ఠసుమంత్రుల యుపదేశముచే నూరటజెందిన పురుష శ్రేష్ఠులు కీర్తిశాలు రగు భరతశత్రుఘ్నులు లేచి నిలచినవారై ఎండవానలచే కాంతి తఱిగిన వేఱ్వేరు ఇంద్రధ్వజములవోలె ప్రకాశించిరి.

సాశ్రూణి పరిమృద్నంతౌ రక్తాక్షౌ దీనభాషిణౌ 26
అమాత్యా స్త్వరయంతి స్మ తనయౌ చాపరాః క్రియాః.

మంత్రు - లట్లు కన్నీరు తుడుచుకొనుచు, ఎఱ్ఱబారిన కన్నులు కలవారై, దైన్యముతో మాటలాడుచున్న భరతశత్రుఘ్న

లను తక్కిన అస్థిసంచయనాది క్రియల నాచరించుటకు తొందర చేసిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తసప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం
దయోధ్యా కాండమున డెబ్బదియేడవ సర్గము సమాప్తము.

---

## అష్టసప్తతితమః సర్గః — డెబ్బదియెనిమిదవ సర్గము

అథ యాత్రాం సమీహంతం శత్రుఘ్నో లక్ష్మణానుజః,
భరతం శోకసంతప్త మిదం వచన మబ్రవీత్. 1

అట్లు అపరక్రియలు నెఱవేర్చి గృహమునకు మఱలివచ్చిన పిమ్మట రాముని చెంతకు పోవ దలంచుచున్న శోకపీడితుడగు భరతునకు శత్రుఘ్నుడిట్లనెను.

గతి ర్య స్సర్వభూతానాం దుఃఖే కిం పున రాత్మనః,
స రామ స్సత్త్వసంపన్నః స్త్రియా ప్రవ్రాజితో వనమ్. 2

ఎవడు ప్రతిప్రాణికిని దుఃఖముకలిగినపుడు దిక్కై యున్నాడో అట్టి రాముడు తనకు, తనవారికి దుఃఖము కలిగిన గతి యగునని వేఱుగా చెప్పవలసిన పని లేదు. అట్టి మహాబల సంపన్నుడగు రాము డొక్క అబలచే నడవికి పంపబడినాడు. (ఇది మిక్కలి చిత్ర మని భావము.)

బలవా న్వీర్యసంపన్నో లక్ష్మణో నామ యోఒప్యసౌ,
కిం న మోచయతే రామం కృత్వా స్మ పితృనిగ్రహమ్. 3

(రాముడు తండ్రికి లోబడినవాడు కాన అతడేమి చేయ నను కొందమా) బల పరాక్రమ సంపన్ను డగు లక్ష్మణు డనువా డొక డున్నాడు కదా! అత డేల తండ్రిని బంధించియైన రాముని విడిపించలేదు ? (ఇది వేరొక విచిత్రము !)

పూర్వ మేవ తు నిగ్రాహ్య స్సమవేక్ష్య నయానయౌ
ఉత్పథం య స్సమారూఢో రాజా నార్యా వశం గతః. 4

రాజగు దశరథు డొక స్త్రీకి వశుడై పెడదారి పట్టినపుడు, న్యాయాన్యాయములు పరిశీలించి యాతనిని ముందే బంధించ వలసియుండెను.

ఇతి సంభాషమాణే తు శత్రుఘ్నే లక్ష్మణానుజే,
ప్రాగ్ద్వారేఽభూ త్తదా కుబ్జా సర్వాభరణభూషితా. 5

ఇట్లు లక్ష్మణుని తమ్ముడగు శత్రుఘ్నుడు పలుకుచుండ గనే, (తన కభిమత మగు భరతాభిషేకమున కెదురుచూచుచు దైవికముగ నట కేతెంచిన గూనిది సకలాభరణములు దాల్చి తూర్పువాకిలి కడ్డకు వచ్చి నిలచెను.

లిప్తా చందనసారేణ రాజవస్త్రాణి బిభ్రతీ
వివిధం వివిధై స్తై స్తై ర్భూషణై శ్చ విభూషితా. 6

ఒడలికి చందనము పూసికొని, రాజవస్త్రములు ధరించి,

పలువిధములగు భూషణములను వివిధరీతులలో ధరించి కుబ్జ తూర్పుద్వారమున నిలచెను.

మేఖలాదామభి శ్చిత్రై రన్యై శ్చ శుభభూషణైః,
బభాసే బహుభి ర్బద్ధా రజ్జుబద్ధేవ వానరీ. 7

ఆమె విచిత్రములగు మొలత్రాళ్లు కట్టుకొని, తక్కిన యనేక సుందరాభరణములు దాల్చినదై, త్రాళ్లతో కట్టబడిన కోతివలె ప్రకాశించెను.

తాం సమీక్ష్య తదా ద్వాఃస్థా స్సుభృశం పాపకారిణీమ్,
గృహీత్వాఽకరుణాం కుబ్జాం శత్రుఘ్నాయ న్యవేదయన్.

దయమాలి, మిక్కిలి పాపకృత్యము నొనరించు నా గూని దానిని చూచిన ద్వారపాలకు లామెను పట్టి, శత్రుఘ్నున కిట్లు చెప్పిరి.

యస్యాః కృతే వనే రామో న్యస్తదేహ శ్చ వః పితా,
సేయం పాపా నృశంసా చ తస్యాః కురు యథామతి. 9

ఎవ్వతె కారణముగ రాము డడవి కేగెనో, మీ తండ్రియు మరణించెనో అట్టి పాపవతి, క్రూరాత్మురాలగు నీమెకు తగిన దండము నీకు తోచిన విధముగ చేయుము.

శత్రుఘ్న శ్చ తదాజ్ఞాయ వచనం భృశదుఃఖితః
అంతఃపురచరా న్సర్వా నిత్యువాచ ధృతవ్రతః. 10

శత్రుఘ్నుడు వారి మాటలు విని మిక్కిలి దుఃఖించి, కృతనిశ్చయుడై అంతఃపురజను లెల్లర కిట్లనెను.

తీవ్ర ముత్పాదితం దుఃఖం భ్రాతౄణాం మే తథా పితుః
యయా సేయం నృశంసస్య కర్మణః ఫల మశ్నుతామ్. 11

నా సోదరులకు, తండ్రికిని ఈమె తీవ్రమగు దుఃఖము కలిగించినది. కావున యీామె తాను చేసిన క్రూరకర్మమునకు ఫల మనుభవించుగాక.

ఏవ ముక్త్వా తు తేనాఽఽశు సఖీజనసమావృతా,
గృహీతా బలవ త్కుబ్జా సా త ద్గృహ మనాదయత్. 12

శత్రుఘ్ను డిట్లు పలికి, చెలుల నడుమ నిలచిన కుబ్జను గట్టిగా పట్టుకొనెను. ఆమెయు ఇల్లు ప్రతిధ్వనించునటు లేడ్చెను.

తత స్సుభృశసంతప్త స్తస్యా స్సర్వ స్సఖీజనః
క్రుద్ధ మాజ్ఞాయ శత్రుఘ్నం విపలాయత సర్వశః. 13

అపు డామె చెలు లెల్లరు మిక్కిలి పరితపించుచు, శత్రుఘ్నుడు కోపించుట చూచి యన్నివైపులకు పరుగెత్తిరి.

అమంత్రయత కృత్స్న శ్చ తస్యా స్సర్వసఖీజనః,
యథాఽయం సముపక్రాన్తో నిశ్శేషా న్నః కరిష్యతి. 14
సానుక్రోశాం వదాన్యాం చ ధర్మజ్ఞాం చ యశస్వినీమ్,
కౌసల్యాం శరణం యామ సా హి నోఽస్తు ధ్రువా గతిః.

ఆ గూనివాని చెలు లెల్లరు పరస్పరము పిలిచికొని యొక్కచో జేరి – 'ఈ శత్రుఘ్ను డిట్లు తీవ్రమగు నిర్ణయము గైకొనినాడు. అతడు మనలో నొక్కరిని కూడ బ్రదుకనీయడు. మనము – దయావతి, మంచిమాటలాడునది, కీర్తిమతి యగు

కౌసల్యాదేవిని శరణువేడుదము. ఆమెయే మనకు గట్టి దిక్కు' అని యాలోచించిరి.

స చ రోషేణ తామ్రాక్ష శ్శత్రుఘ్న శ్శత్రుతాపనః,
విచకర్ష తదా కుబ్జాం క్రోశంతీం ధరణీతలే. 16

శత్రువులకు సంతాపము కలిగించువాడగు శత్రుఘ్ను డపుడు రోషముచే కన్నులెఱ్ఱబడగా అఱచుచున్న యా గూని దానిని భూమిపై బడవైచి యీడ్చెను.

తస్యా హ్యాకృష్యమాణాయా మంథరాయా స్తత స్తతః,
చిత్రం బహువిధం భాండం పృథివ్యాం తద్వ్యశీర్యత. 17

అట్లు శత్రుఘ్నునిచే నిటు నటు ఈడ్చికొని పోబడుచున్న కుబ్జ ధరించిన చిత్రవర్ణములుకల యాభరణములన్నియు భూమిపై వెదజల్లబడెను.

తేన భాండేన సంస్తీర్ణం శ్రీమ ద్రాజనివేశనమ్,
అశోభత తదా భూయ శ్శారదం గగనం యథా. 18

అట్లు చిందర వందరగా నంతటను వ్యాపించిన యాభరణములచే కాంతివంత మయిన ఆ రాజగృహము ప్రకాశమానము లగు నక్షత్రములు కల శరత్కాలమందలి యాకాశమువలె శోభిల్లెను.

స బలీ బలవ త్క్రోధా ద్గృహీత్వా పురుషర్షభః,
కైకేయీ మభినిర్భర్త్స్య బభాషే పరుషం వచః. 19

బలవంతుడగు నా పురుషశ్రేష్ఠు డట్లు కుబ్జను బలవంత ముగా నీడ్చుకొని వచ్చి (యామెను విడిపింప వచ్చిన) కైకను ధిక్కరించుచు పరుషముగ మాటలాడెను.

తై ర్వాక్యైః పరుషై ర్దుఃఖైః కైకేయీ భృశదుఃఖితా,
శత్రుఘ్నభయసంత్రస్తా పుత్రం శరణ మాగతా. 20

దుఃఖము కలిగించు నా పరుషోక్తులచే మిక్కిలి దుఃఖము నందిన కైకేయి శత్రుఘ్నుని చూచి భీతిల్లినదై, కుమారుడగు భరతుని శరణు జొచ్చెను.

తాం ప్రేక్ష్య భరతః క్రుద్ధం శత్రుఘ్న మిద మబ్రవీత్
అవధ్యా స్సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతా మితి. 21

అట్లు తన కడకు వచ్చిన కైకను చూచిన భరతుడు కోపించిన శత్రుఘ్నునితో నిట్లనెను "స్త్రీల నెవ్వరును చంపరాదు. కాన నామెను క్షమింపుము.

హన్యా మహ మిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీమ్,
యది మాం ధార్మికో రామో నా సూయే న్మాతృఘాతుకమ్.

పాపవతి, దుష్టాచరణము కలదగు ఈ కైకను నేనే చంపి యుందునాడను. కాని ధార్మికుడగు రాముడు 'తల్లిని చంపిన వా'డని నన్ను నిందించును. కాన నే నట్లు చేయనైతిని.

ఇమా మపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః,
త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్.

ఇక నీ గూనిదానిని కూడ మనము చంపినామని రాముడు తెలిసికొనెనేని, స్త్రీవధ చేసితిమని ధర్మాత్ము డగు నాతడు నిశ్చయముగ మనతో మాటలాడడు."

భరతస్య వచ శ్శ్రుత్వా శత్రుఘ్నో లక్ష్మణానుజః,
న్యవర్తత తతో రోషా త్తాం ముమోచ చ మంథరామ్. 24

లక్ష్మణుని తమ్ముడగు శత్రుఘ్నుడు భరతుని పలుకు లాలించి, తన రోషము చాలించి, మంథరను విడచిపుచ్చెను.

సా పాదమూలే కైకేయ్యా మంథరా నిపపాత హ,
నిశ్శ్వసంతీ సుదుఃఖార్తా కృపణం విలలాప చ. 25

అపుడు మంథర కైక పాదములపై బడి, నిట్టూర్చుచు, మిగుల దుఃఖపీడితయై జాలికలుగునటు లేడ్చెను.

శత్రుఘ్నవిక్షేపవిమూఢసంజ్ఞాం
సమీక్ష్య కుబ్జాం భరతస్య మాతా,
శనై స్సమాశ్వాసయ దార్తరూపాం
క్రౌంచీం విలగ్నా మివ వీక్షమాణామ్. 26

శత్రుఘ్నుడు పట్టి విదల్చుటచే తెలివి దప్పి, ఆర్తయై వలలో చిక్కుపడిన యాడు క్రౌంచపక్షివలె దిక్కులు చూచుచున్న యా కుబ్జను, భరతుని తల్లి కైక మెల్లగా నోదార్చెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అష్టసప్తతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున డెబ్బదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ఏకోనాశీతితమః సర్గః — డెబ్బదితొమ్మిదవ సర్గము

తతః ప్రభాతసమయే దివసే చ చతుర్దశే,
సమేత్య రాజకర్తారో భరతం వాక్య మబ్రువన్. 1

అంత పదునాల్గవనాడు వేకువనే రాజ్యాభిషేకము చేయించుటకు నియమితులైన వారెల్లరు కలసి వచ్చి భరతున కిట్లనిరి.

గతో దశరథ స్స్వర్గం యో నో గురుతరో గురుః,
రామం ప్రవ్రాజ్య వై జ్యేష్ఠం లక్ష్మణం చ మహాబలమ్. 2

మనకు పరమగురువగు దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడగు రాముని, మహాబలశాలియగు లక్ష్మణుని అడవికి పంపి, తాను మరణించినాడు

త్వ మద్య భవ నో రాజా రాజపుత్ర! మహాయశః,
సంగత్యా నాపరాధ్నోతి రాజ్యమేత దనాయకమ్. 3

గొప్ప కీర్తికల ఓ రాజపుత్రా! నీ విప్పుడు మాకు రాజువగుము. ఈ రాజ్య మిప్పటివఱకు నాయకుడు లేని దయ్యు దైవయోగముచే నిందలి ప్రజ లొకరొకరికి ద్రోహము చేసికొనక అపరాధములు చేయకున్నారు.

అభిషేచనికం సర్వ మిద మాదాయ రాఘవ,
ప్రతీక్షతే త్వాం స్వజనః శ్రేణయ శ్చ నృపాత్మజ!. 4

ఓ రాఘవుడ వగు రాజకుమారా! అమాత్యాదులు, పౌరులును అభిషేకమునకు వలయు సకలసామగ్రిని తీసికొనివచ్చి నీకై ఎదురుచూచుచున్నారు.

రాజ్యం గృహాణ భరత పితృపైతామహం ధ్రువమ్,
అభిషేచయ చాత్మానం పాహి చాస్మా న్నరర్షభ!. 5

ఓ నరశ్రేష్ఠుడ వగు భరతుడా! నీ తండ్రితాతలనుండి వంశపరంపరాగతమైనది, కలతలు లేక స్థిరమైన దగు ఈ రాజ్యమును స్వీకరింపుము. నీ వభిషిక్తుడవై మమ్ము పాలింపుము.

అభిషేచనికం భాండం కృత్వా సర్వం ప్రదక్షిణమ్,
భరత స్తం జనం సర్వ మిత్యువాచ ధృతవ్రతః. 6

ఉత్తమనియమము కలవాడగు భరతుడు అభిషేకమునకై తేబడిన శుభవస్తుసముదాయమునకు ప్రదక్షిణము చేసి, తన్ను పట్టాభిషిక్తుని కమ్మని కోరిన వారల కెల్లరకును ఇట్లనెను.

జ్యేష్ఠస్య రాజతా నిత్య ముచితా హి కులస్య నః,
నైవం భవంతో మాం వక్తు మర్హంతి కుశలా జనాః. 7

మీరు బుద్ధికుశలురు, మా వంశమున జ్యేష్ఠుడు రాజగుటయే యుచితమని మీకు తెలియును. మీరే యిట్లు నన్ను రాజవు కమ్మనుట తగదు.

రామః పూర్వో హి నో భ్రాతా భవిష్యతి మహీపతిః
అహం త్వరణ్యే వత్స్యామి వర్షాణి నవ పంచ చ. 8

మా అన్న రాముడు మహారాజు కాగలడు. నే నాయన ప్రతినిధిగా పదునాలుగేండ్లు అడవిలో నివసింతును.

యుజ్యతాం మహతీ సేనా చతురంగమహాబలా,
ఆనయిష్యా మ్యహం జ్యేష్ఠం భ్రాతరం రాఘవం వనాత్. 9

రథ – గజ – తురగ పదాతి రూపమై విస్తారమగు చతురంగబల మిపుడే అయత్తము చేయబడుగాక. మా యన్న రాముని నడవినుండి యిటకు కొని వత్తును.

అభిషేచనికం చైవ సర్వ మేత దుపస్కృతమ్,
పురస్కృత్య గమిష్యామి రామహేతో ర్వనం ప్రతి. 10

అభిషేకము కొఱకు తీసికొని వచ్చిన యీ సకలోపకరణములను ముందిడుకొని రామాభిషేకముకొఱకై యడవి కేగెదను.

తత్రైవ తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతమ్,
ఆనేష్యామి తు వై రామం హవ్యవాహ మివాధ్వరాత్. 11

ఆ యడవిలోనే నరశ్రేష్ఠు డగు రాముని పట్టాభిషిక్తుని చేసి, ఆవిధముగ పూజితుడైన యతనిని యజ్ఞమునుండి అగ్నిని వలె తీసికొనివత్తును.

న సకామాం కరిష్యామి స్వా మిమాం మాతృగన్ధినీమ్,
వనే వత్స్యా మ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి 12

కేవలము పేరునకు తల్లియైన ఈ కైక కోరికను తీర్పను. దుర్గమమగు అరణ్యమున నేను నివసింతును. రాముడు రాజు కాగలడు

క్రియతాం శిల్పిభిః పంథా స్సమాని విషమాణి చ,
రక్షిణ శ్చానుసంయాంతు పథి దుర్గవిచారకాః. 13

ఎత్తు పల్లములుగా నున్న నేలను శిల్పులు చదును చేసి మార్గ మేర్పఱచుదురుగాక ! మార్గమున దుర్గమప్రదేశములలో దారిచూపి నడిపించు రక్షకులు మా వెంట రావలెను.

ఏవం సంభాషమాణం తం రామహేతో ర్నృపాత్మజమ్,
ప్రత్యువాచ జన స్సర్వ శ్శ్రీమ ద్వాక్య మనుత్తమమ్. 14

రాముని పట్టాభిషేకమును కోరుచు నిట్లు పలుకుచున్న యీ రాజకుమారు డగు భరతునకు జను లెల్లరు శ్రీమంతము. ఉత్తమమగు ఈ వాక్యము పలికిరి.

ఏవం తే భాషమాణస్య పద్మా శ్రీ రుపతిష్ఠతామ్,
యస్త్వం జ్యేష్ఠే నృపసుతే పృథివీం దాతు మిచ్ఛసి. 15

జ్యేష్ఠు డగు రాజకుమారుడు రామునకు రాజ్య మీయ దలంచుచు ఇట్లు ధర్మయుక్తముగ మాటలాడుచున్న నీచెంత పద్మనివాసిని యగు లక్ష్మి సదా స్థిరముగ నుండుగాక !

అనుత్తమం తద్వచనం నృపాత్మజ
ప్రభాషితం సంశ్రవణే నిశమ్య చ,
ప్రహర్షజా స్తం ప్రతి బాష్పబిందవో
నిపేతు రార్యాననేత్రసంభవాః. 16

రాముని కొనివత్తునని ప్రతిజ్ఞ చేయుచు, నట్లు పలుకు చున్న భరతుని మాటలు వినిన ఆర్యులగు జనుల కనులనుండి యానందబాష్పములు రాలెను.

ఊచు స్తే వచన మిదం నిశమ్య హృష్టా
స్సామాత్యా స్సపరిషదో వియాతశోకాః,
పంథానం నరవర! భక్తిమాన్ జనశ్చ
వ్యాదిష్ట స్తవ వచనా చ్చ శిల్పివర్గః. 17

భరతుని మాట విని యానందించిన మంత్రులు, సభ్యులతో గూడిన పెద్దలు శోకము వీడి 'యో పురుషశ్రేష్ఠుడా! నీ యాజ్ఞగా రాజభక్తులగు రక్షకభటులు మార్గమునం దుండునట్లు, శిల్పులు మార్గము సరిచేయునట్లును ఆజ్ఞాపించబడినా'రని యతనికి తెలిపిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోనాశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమందయోధ్యాకాండమున డెబ్బదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## అశీతితమః సర్గః - ఎనుబదవ సర్గము

అథ భూమిప్రదేశజ్ఞా స్సూత్రకర్మవిశారదాః,
స్వకర్మాభిరతా శ్శూరా ఖనకా యంత్రకా స్తథా. 1

కర్మాంతికాః స్థపతయః పురుషా యంత్రకోవిదాః
తథా వర్ధకయ శ్చైవ మార్గిణో వృక్షతక్షకాః. 2

కూపకారా స్సుధాకారా వంశకర్మకృత స్తథా
సమర్థా యే చ ద్రష్టారః పురత స్తే ప్రతస్థిరే. 3

అంతట ఎత్తు పల్లము లెచట నున్నవో ఆయా భూప్రదేశముల నెఱిగిన వారును (లేదా వివిధ ప్రదేశములు తెలిసిన వారు), జలము లేని తావులలో లోతైన దిగుడుబావులు, నూతుల నుండి నీరు తోడుటకు పలయు త్రాళ్ళు చేయువారును (లేదా సొరివారును), మార్గ రక్షణము మున్నగు తమ పనులయందు దవ హితులైన సొరంగములు త్రవ్వువారు, పెద్ద పెద్ద కాల్వలు మున్నగువానిని దాటుటకు కొయ్యలతో యంత్రములు చేయు వారును, తమ కీయబడిన పనిని చక్కగా చేయువారు, శిల్పులును, అధ్యక్షులగు రాజపురుషులును, పడవ తెడ్లు మున్నగు యంత్రములు చేయుటలో సమర్థులును, మార్గమును సరిగా చేయువారును, మార్గమును నిరోధించు చెట్లను నఱకువారును, బావులు త్రవ్వువాడును, సున్నము పూయువారును, వెదుళ్ళతో పనిచేయు మేదరివాండ్రును, తక్కిన కార్యములు చేయుటలో సమర్థులును, ముందీ ప్రదేశములు చూచియున్నవారగు మార్గప్రదర్శకులును ముందు బయలుదేరిరి.

స తు హర్షా త్త ముద్దేశం జనౌఘో విపులః ప్రయాన్,
అశోభత మహావేగ స్సముద్ర ఇవ పర్వణి. 4

ఆ విస్తృత జనసమూహము రాముని చూడవలె నను కుతూ

హాలములో నత డున్న ప్రదేశమున కేగుచు పర్వకాలమున (పూర్ణిమ లందు) గొప్పవడిగల సముద్రము వలె ప్రకాశించెను.

తే స్వవారం సమాస్థాయ వర్త్మకర్మణి కోవిదాః,
కరణై ర్వివిధోపేతైః పురస్తా త్సంప్రతస్థిరే. 5

ఆ మార్గము చక్కబెట్టుటలో నేర్పరులగు వారు, మార్గమును బాగుచేయుటలో వంతులు వేసికొని, నానావిధములగు తవ్వుగోల, తట్ట మున్నగు ఉపకరణములతో ముందు నడచిరి.

లతావల్లీ శ్చ గుల్మాం శ్చ స్థాణూ నశ్మన ఏవ చ,
జనా స్తే చక్రిరే మార్గం ఛిందన్తో వివిధాన్ ద్రుమాన్. 6

వారు మార్గమున కడ్డముగా నున్న కొమ్మలను, తీగలను, పొదలను, ఎండిన మోడులను, రాళ్లను, పలువిధములగు చెట్లను నఱకి మార్గము చేసిరి,

అవృక్షేషు చ దేశేషు కేచి ద్వృక్షా నరోపయన్,
కేచిత్కుఠారై ష్టంకై శ్చ దాత్రై శ్ఛిందన్ క్వచి త్క్వచిత్.

కొందరు చెట్లులేని ప్రదేశములలో చెట్లు నాటిరి. మరి కొందరు గొడ్డళ్ళతో, పారలతో, అంపములతో నటనట మార్గమున కడ్డుపడిన చెట్లను నఱకిరి.

అపరే వీరణస్తంభాన్ బలినో బలవత్తరాః
విధమంతి స్మ దుర్గాణి స్థలాని చ తత స్తతః. 8

అందు బలవంతులగు కొందఱు, బాగుగ పాదుకొనిన గడ్డి దుబ్బులను కాల్చివైచి, చొఱరాని ప్రదేశములను చదునైన ప్రదేశములుగా చేసిరి.

అపరేஉపూరయన్ కూపాన్ పాంసుభి శ్వభ్రమాయతమ్
నిమ్నభాగాం స్తథా కేచి త్సమాం శ్చక్రు స్సమంతతః. 9

మఱికొందఱు మార్గమందలి బావులను, లోతైన గోతులను మట్టితో పూడ్చిరి. కొందరు పల్లపు ప్రదేశములను చదునుచేసిరి.

బబంధు ర్బంధనీయాం శ్చ క్షోద్యా న్సంచుక్షుదు స్తదా
బిభిదు ర్భేదనీయాం శ్చ తాం స్తా న్దేశా న్నరా స్తదా. 10

ఆ జనులా మార్గమున సైన్యము దాటుటకు అవసరమైనచోట్ల వంతెనలు వేసిరి. పొడిచేయవగిన రాతిప్రదేశములలోని రాళ్లను చూర్ణము చేసిరి. అధికముగా నీరు నిలచిన చెఱువుల కట్టలు త్రెంచి జలము విడచిరి.

అచిరేణైవ కాలేన పరివాహా న్బహూదకాన్
చక్రు ర్బహువిధాకారాన్ సాగరప్రతిమా న్బహూన్. 11

అల్పకాలము లోనే చిన్న ప్రవాహములకు కట్టలు కట్టి అధికజలములు కలవి, వివిధాకారములు కలవి, సముద్రములవంటివగు పెక్కు ప్రవాహములను చేసిరి. (లేదా చిన్నప్రవాహములకు అడ్డుకట్టలు కట్టి ప్రవాహము విస్తరించి సముద్రమువలె కాగా దానికట నట మెట్లు కట్టి రేవుల నేర్పఱచిరి.)

నిర్జలేషు చ దేశేషు ఖానయామాసు రుత్తమాన్
ఉదపానా న్బహువిధా న్వేదికాపరిమండితాన్. 12

జలరహిత ప్రదేశములలో వారు పలువిధములగు ఉత్తమములైన బావులు త్రవ్వి, వాని ప్రక్క జలపానము చేయువారొకింత విశ్రమించుటకు వేదికలతో బావుల నలంకరించిరి.

సుధాకుట్టిమతలః ప్రపుష్పితమహీరుహః
మత్తోద్ఘుష్టద్విజగణః పతాకాభి రలంకృతః. 13

చందనోదకసంసిక్తో నానాకుసుమభూషితః
బహ్వశోభత సేనాయాః పంథాః స్సురపథోపమః. 14

ఆ సేన పోవు మార్గము సున్నము పూయబడి గట్టిచేయబడెను. మార్గపు ఇరు ప్రక్కల నున్న చెట్లు విరియబూసి యుండెను. పక్షులు మదించి కిలకిలధ్వానములు చేయుచుండెను. చందనజలము మార్గమున చల్లబడియుండెను. వివిధపుష్పములు చల్లుటచే మార్గ మలంకృతమై యుండెను. ఇట్లా సేనామార్గము దేవమార్గమునకు సాటియై మిగుల శోభిల్లెను.

ఆజ్ఞాప్యాథ యథాఽఽజ్ఞప్తియుక్తా స్తేఽధికృతా నరాః
రమణీయేషు దేశేషు బహుస్వాదుఫలేషు చ. 15

యో నివేశ స్త్వభిప్రేతో భరతస్య మహాత్మనః
భూయ స్తం శోభయామాసు ర్భూషాభి ర్భూషణోపమమ్.

అట్లు మార్గములు, శిబిరములు నిర్మించు కార్యమున నియుక్తులైన రాజపురుషు లెల్లరు కలసి సావధానులై రుచ్యములగు పం డ్లనేకములు కలిగి, సుందరమై మహాత్ముడగు భరతున కభిమతమైన ప్రదేశమున శిబిర నిర్మాణముచేయుటకు భృత్యుల కాజ్ఞాపించి, సహజసుందరముగ నున్న ఆ శిబిరమును చాందినీ, బంగారు కలశములు, జెండాలు మున్నగు వివిధాలంకరణములతో తీర్చిదిద్దిరి.

నక్షత్రేషు ప్రశస్తేషు ముహూర్తేషు చ తద్విదః
నివేశాన్ స్థాపయామాసు ర్భరతస్య మహాత్మనః. 17

వాస్తు శాస్త్రము నెఱిగిన పండితులు, ఉత్తమ నక్షత్రము నందు, ప్రశస్తమగు ముహూర్తములో భరతుని విడిదికై నివాస ముల నేర్పఱచిరి.

బహుపాంసుచయా శ్చాపి పరిఖాపరివారితాః
తత్రేంద్రకీలప్రతిమాః ప్రతోళీవరశోభితాః. 18

ప్రాసాదమాలావితతా స్సౌధప్రాకారసంవృతాః
పతాకాశోభితా స్సర్వే సునిర్మితమహాపథాః. 19

విసర్పద్భి రివాఽఽకాశే విటంకాగ్రవిమానకైః
సముచ్ఛ్రితై ర్నివేశా స్తే బభు శ్శక్రపురోపమాః. 20

అట్లు భరతుని నివాసములకై వివిధప్రదేశములలో దారి పొడవున ఆ శిబిరములు మెత్తని యిసుక నేలలతో, చుట్టును అగడ్తలతో కూడి, యింద్రకీల పర్వతములవలె నొప్పుచుండెను. సుందర మార్గములతోడను, రాజపుత్రుల నివాసములతోడను, దేవాలయములతోడను, సున్నము చేయబడిన ప్రాకారములతో డను, ఎగురవేయబడిన జండాలతోను అవి దేవేంద్రుని అమరా వతిని పోలుచుండెను

జాహ్నవీం తు సమాసాద్య వివిధద్రుమకాననామ్
శీతలామలపానీయాం మహామీనసమాకులామ్. 21

అంతట వారు అనేక వృక్షములు అడవులతో సుందరమై,

చల్లని స్వచ్ఛజలపూరితమై గండుచేపలచే కల్లోలితమైన గంగా నదిని చేరిరి.

స చంద్రతారాగణమండితం యథా
నభః క్షపాయాం మమలం విరాజతే
నరేంద్రమార్గ స్స తథా వ్యరాజత
క్రమేణ రమ్య శ్శుభశిల్పినిర్మితః. 22

రాత్రి సమయమున మబ్బులు, మంచు లేక చంద్రుడు, నక్షత్రసమూహములతోనిండిన యాకాశ మెట్లు ప్రకాశించునో అట్లే ఉత్తములగు పనివారిచే నిర్మింపబడిన యా రాజమార్గము కూడ విరాజిల్లెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున ఎనుబదవసర్గము సంపూర్ణము.

---

## ఏకాశీతితమః సర్గః - ఎనుబదియొకటవ సర్గము

తతో నాందీముఖీం రాత్రిం భరతం సూతమాగధాః
తుష్టువు ర్వాగ్విశేషజ్ఞా స్స్తవై ర్మంగళసంహితైః. 1

అంతట రాజును, రాజపుత్రులను ఎట్లు స్తోత్రము చేయవలయునో చక్కగా నెఱిగిన సూతులు, మాగధులు రాముని తీసి

కొనివచ్చుట యను అభ్యుదయముతో ప్రారంభమైన యా రాత్రి భరతుని మంగళశబ్దముతో కూడిన స్తోత్రములతో పొగడిరి.

సువర్ణకోణాభిహతః ప్రాణదద్ యామదుందుభిః
దధ్ము శ్శంఖాంశ్చ శతశో నాదాం శ్చోచ్చావచస్వరాన్. 2

జాము పరిసమాప్తమగుటను సూచించెడి భేరి, బంగారు దంతముచే వాయింపబడినదై పెద్దగా మ్రోగెను. శంఖములను వందలకొలదిగా నూదిరి. కాహళాది వివిధవాద్యములు మంద్ర మధ్యమ – తారరూపములగు స్వరములతో మ్రోగెను.

స తూర్యఘోష స్సుమహాన్ దివ మాపూరయ న్నివ
భరతం శోకసంతప్తం భూయ శ్శోకై రరంధ్రయత్. 3

ఆ వాద్యముల ధ్వని మిక్కిలి యధికమై, యాకాశము నిండి, దుఃఖపీడితుడగు భరతునకు మిక్కిలి శోకము కలుగజేసెను.

తతః ప్రబుద్ధో భరత స్తం ఘోషం సన్నివర్త్య చ
నాహం రాజేతి చా ప్యుక్త్వా శత్రుఘ్న మిద మబ్రవీత్. 4

అప్పుడు భరతు డా ధ్వనికి మేల్కొంచి, యా వాద్యములు మ్రోగించవలదని వారించి 'నేను రాజును కా'నని వారికి తెలిపి శత్రుఘ్నున కిట్లనెను.

పశ్య శత్రుఘ్న ! కైకేయ్యా లోక స్యాపకృతం మహత్
విసృజ్య మయి దుఃఖాని రాజా దశరథో గతః. 5

శత్రుఘ్నుడా ! కైకేయి కారణముగ సూతమాగధాది జను

లెట్లనుచిత కార్యములు చేయుచున్నారో చూచుము. దశరథమహా రాజు దుఃఖములను నాపై బడవైచి గతించినాడు.

తస్యైషా ధర్మరాజస్య ధర్మమూలా మహాత్మనః
పరిభ్రమతి రాజ్యశ్రీ ర్నౌ రివాకర్ణికా జలే. 6

ధర్మమూర్తి యగు దశరథమహారాజుయొక్క ఈ రాజ్య లక్ష్మికి - రాజునకు పిమ్మట జ్యేష్ఠపుత్రుడు రాజగుట యను ధర్మమే మూలాధారము. అట్టి యీ రాజ్యలక్ష్మి యిపుడు చుక్కానిపట్టు వాడు లేని నావవలె నల్లాడుచున్నది.

యో హి న స్సుమహా న్నాథ స్సోఽపి ప్రవ్రాజితో వనమ్
అనయా ధర్మ ముత్సృజ్య మాత్రా మే రాఘవ స్స్వయమ్

ఎవడు మన కందఱకును నాథుడో అట్టి మహాత్ముడగు రాముని నా తల్లియగు కైకేయి ధర్మము విడి యడవి కంపినది.

ఇ త్యేవం భరతం ప్రేక్ష్య విలపంత మచేతనమ్
కృపణం రురుదు స్సర్వా స్సస్వరం యోషిత స్తదా. 8

భరతు డిట్లు విలపించుచు తెలివి దప్పగా, నతనిఁ జూచి స్త్రీలెల్లరును దీనులై బిగ్గఱగా నేడ్చిరి.

తథా తస్మి న్విలపతి వసిష్ఠో రాజధర్మవిత్
సభా మిక్ష్వాకునాథస్య ప్రవివేశ మహాయశాః, 9

భరతు డట్లేడ్చుచుండగా, మహాకీర్తిశాలియు, రాజధర్మ మెఱిగినవాడును అగు వసిష్ఠుడు సభలో ప్రవేశించెను.

శాతకుంభమయీం రమ్యాం మణిరత్నసమాకులామ్
సుధర్మా మివ ధర్మాత్మా సగణః ప్రత్యపద్యత. 10

ధర్మాత్ము డగు ఆ వసిష్ఠుడు శిష్యులతో కలసి, సువర్ణమయమై, సుందరమై, మణులతో రత్నములతో కూడినదైన సభలో ప్రవేశించెను.

స కాంచనమయం పీఠం సుఖాస్తరణసంవృతమ్
అధ్యాస్త సర్వవేదజ్ఞో దూతా ననుశశాస చ. 11

సర్వవేదముల నెఱిగిన ఆ వసిష్ఠుడు, సుఖము కలిగించు మెత్తని పఱుపుతో కప్పబడిన బంగారు పీఠముపై కూరుచుండి, దూతల కిట్లాజ్ఞాపించెను.

బ్రాహ్మణాన్ క్షత్రియా న్వైశ్యా నమాత్యా న్గణవల్లభాన్
క్షిప్ర మానయ తావ్యగ్రాః కృత్య మాత్యయికం హి నః 12
సరాజభృత్యం శత్రుఘ్నం భరతం చ యశస్వినమ్
యుధాజితం సుమంత్రం చ యే చ తత్ర హితా జనాః. 13

"నాకిపు డొక కష్టసాధ్యమగు పని యున్నది. మీరు జాగు చేయక శీఘ్రమే బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, మంత్రులను, గణాధ్యక్షులను, రాజాంతరంగభృత్యులతో కూడిన శత్రుఘ్నుని, కీర్తిమంతు డగు భరతుని, యుధాజిత్తును, సుమంత్రుని, తక్కిన హితుల నెల్లరును తీసికొనిరండు" అని వసిష్ఠుడు దూతల కాజ్ఞాపించెను.

తతో హలహలాశబ్దో మహా న్సముదపద్యత
రథై రశ్వై ర్గజై శ్చాపి జనానా ముపగచ్ఛతామ్. 14

పిమ్మట రథములను, గుఱ్ఱములను, ఏనుగులను ఎక్కి వచ్చెడి జనుల పెద్ద కలకల శబ్దము వినవచ్చెను.

తతో భరత మాయాంతం శతక్రతు మివామరాః
ప్రత్యనంద న్ప్రకృతయో యథా దశరథం తథా. 15

అపుడు సభ కేతెంచుచున్న భరతుని దేవేంద్రుని దేవతలు వోలె పురజను లెల్లరు దశరథుని కొనియాడినట్లే మిక్కిలి నుతించిరి.

హ్రద ఇవ తిమినాగసంవృతః
స్తిమితజలో మణిశంఖశర్కరః
దశరథసుతశోభితా సభా
సదశరథేవ బభౌ యథా పురా. 6

పెద్ద చేపలతో, నీటియేనుగులతో కూడి, కదలని జలములు కలిగి, మణులు, శంఖములు, మెత్తని యిసుకతో కూడినదైన మడుగు వలె, భరతునితో శోభిల్లిన యా సభ దశరథునితో కూడిన వెనుకటిసభ వలెనే ప్రకాశించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే ఏకాశీతితమ స్సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణ మం దయోధ్యాకాండమున ఎనుబదియొకటవ సర్గము సమాప్తము.

## ద్వ్యశీతితమః సర్గః — ఎనుబదిరెండవ సర్గము

తా మార్యగణసంపూర్ణాం భరతః ప్రగ్రహాం సభామ్
దదర్శ బుద్ధిసంపన్నః పూర్ణచంద్రో నిశా మివ. 1

బుద్ధిమంతు డగు భరతుడు వసిష్ఠుడు-మున్నగు పలువురు పూజనీయులతో గూడిన యా సభను-శుక్రుడు, బృహస్పతి మున్నగు నత్తమ గ్రహములతో కూడిన రాత్రిని పూర్ణచంద్రుడు వోలె నిండుగా చూచెను.

అసనాని యథాన్యాయ మార్యాణాం విశతాం తదా
వస్త్రాంగరాగప్రభయా ద్యోతితా సా సభోత్తమా. 2

అప్పుడు పూజ్యులైన సభ్యులు తమ తమ యోగ్యతలకు తగిన అసనములపై కూర్చుండగా వారు ధరించిన వస్త్రములు, చందనాదుల కాంతిచే ఆ శ్రేష్ఠమగు సభ ప్రకాశించెను.

సా విద్వజ్జనసంపూర్ణా సభా సురుచిరా తదా
అదృశ్యత ఘనాపాయే పూర్ణచంద్రేవ శర్వరీ. 3

పండితజనముతో నిండి మనోహరముగనున్న అ సభ, అపుడు-వర్షాకాలము గడువగా పూర్ణచంద్రునితో కూడిన రాత్రి వలె ప్రకాశించెను.

రాజ్ఞస్తు ప్రకృతీ స్సర్వా స్సమగ్రాః ప్రేక్ష్య ధర్మవిత్
ఇదం పురోహితో వాక్యం భరతం మృదు చాబ్రవీత్. 4

ధర్మ మెఱిగిన పురోహితుడగు వసిష్ఠుడు, రాజు

పాలనలో నున్న సభాగతులగు ప్రజల నందఱ నొక్కమారు చూచి, భరతున కిట్లు మృదువాక్యము పలికెను.

తాత! రాజా దశరథ స్స్వర్గతో ధర్మ మాచరన్
ధనధాన్యవతీం స్ఫీతాం ప్రదాయ పృథివీం తవ. 5

నాయనా! సత్యపరిపాలన మను ధర్మము నాచరించుచు నీ తండ్రి యగు దశరథమహారాజు ధనధాన్యసమృద్ధమైన భూమిని నీ కొసగి స్వర్గస్థుడైనాడు.

రామ స్తథా సత్యధృతి స్సతాం ధర్మ మనుస్మరన్
నాజహా త్పితు రాదేశం శశీ జ్యోత్స్నా మి వోదితః. 6

సత్యమందు ప్రీతిగల రాముడు తండ్రివలెనే తానును, తండ్రి యాజ్ఞకు లోబడినట్టి సజ్జనులకు ధర్మమగు పితృవచన పరిపాలనమును తలంచుచు, ఉదయించిన చంద్రుడు వెన్నెలను విడువనట్లు తండ్రి యాజ్ఞ విడలేదు.

విశే. 'జీవతో ర్వాక్యకరణాత్, ప్రత్యబ్దం భూరిభోజనాత్, గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా. జీవించినంత కాలము తల్లిదండ్రుల మాట పాటించుట, వారిమరణానంతరము శ్రాద్ధవిధి నొనర్చి భూరిభోజన మిడుట, గయాక్షేత్రమున పిండ ప్రదానము చేయుట అను నీ మూటిచే పుత్రుడు నిజముగా పుత్రు డగును.

పిత్రా భ్రాత్రా చ తే దత్తం రాజ్యం నిహతకంటకమ్
తద్భుంక్ష్వ ముదితామాత్యః క్షిప్రమే వాభిషేచయ. 7

నీతండ్రి, నీయన్న శత్రువులు లేకుండునట్లు చేసి నీ కొస

గిన యీ రాజ్యము ననుభవింపుము. మంత్రులను ప్రసన్నుల నొనరించుము శీఘ్రమే అభిషిక్తుడ వగుము

ఉదీచ్యా శ్చ ప్రతీచ్యా శ్చ దాక్షిణాత్యా శ్చ కేవలాః
కోట్యాపరాంతా స్సాముద్రా రత్నా న్యభిహరంతు తే 8

ఉత్తరదేశముల రాజులును, పశ్చిమ దిశయందలి రాజులును, దక్షిణదిశయందలి రాజులును, (తూర్పుదిక్కునందలి రాజులును,) సింహాసనాధికారములేని అపరాంతదేశపు యవనులును, నీకు కోట్లకొలది రత్నములు కానుకగా సమర్పింతురు గాక !

త చ్ఛ్రుత్వా భరతో వాక్యం శోకే నాభిపరిప్లుతః
జగామ మనసా రామం ధర్మజ్ఞో ధర్మకాంక్షయా. 9

వంశానుగతమగు జ్యేష్ఠు నభిషేకించుట యను ధర్మ మెఱిగిన భరతు డా మాట విని దుఃఖమున మునిగినవాడై, జ్యేష్ఠు ననుసరించుట యను ధర్మమునపై మక్కువతో రాముని మదిలో తలంచెను.

స బాష్పకలయా వాచా కలహంసస్వరో యువా
విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్. 10

కలహంస స్వరమును పోలు కంఠధ్వని కల యువకుడగు ఆ భరతుడు వసిష్ఠుని యుపదేశమందలి యధర్మమును తలంచి, రాముని స్మరించి కన్నీటిచే మాట తడబడగా సభనడుమనే విలపించి, పురోహితు డిట్లహితము చెప్పుటను నిందించెను.

విశే : వసిష్ఠుని యుపదేశము కాలానుగుణమే కాని హితము కాదు. 'ఎవ్వరైనను నియమము తప్పిన దానిని రహస్యముగ తెలుపవలెనే కాని పలువురిలో కాదు'. భరతునకీ విషయము తెలియును. అయినను మిక్కిలి క్రూరమైన అధర్మము నాచరింపు మనినాడే యని దుఃఖపరవశుడై భరతుడు సభ యని యైన తలంపక వసిష్ఠుని నిందించినాడు.

చరితబ్రహ్మచర్యస్య విద్యాస్నాతస్య ధీమతః
ధర్మే ప్రయతమానస్య కో రాజ్యం మద్విధో హరేత్. ౧౧

యథావిధిగ గురుకులవాసము చేసి, వేదాధ్యయన మొనర్చి స్నాతుడై, వేదార్థము నెఱిగి, అందు తెలుపబడిన ధర్మముల నాచరించు వాడగు నా యన్న రాజ్యమును, శాస్త్రమునకు వశుడై వర్తించు నావంటివా డెట్లపహరించును.

కథం దశరథాజ్జాతో భవే ద్రాజ్యాపహారకః
రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మి హార్హసి. ౧౨

దశరథునకు పుట్టినవా డెట్లు తన యన్న రాజ్యమునే యపహరించును. ? ఈ రాజ్యము, నేనును రామునకే చెందువారమే. నీ విట ధర్మము చెప్పవలయును.

విశే : నా తండ్రి దశరథుడు రామునితో విరహము కలుగుట తోడనే మరణించినాడు. నే నాతనికి పుట్టినవాడను. రాముడు విడచిన రాజ్యమును పరిగ్రహింతునా ? నా స్వరూపమును బట్టి యాలోచించినను నాకు రాజ్యాధికారము లేదు. నేను రాముని వాడను, రాజ్యము రామునిది. కాన నేను, రాజ్యమును పరతంత్రత గలవారము. అట్టిచో నేను రాజ్యమును కోరుటయా?

అపుడు రాజ్యమే నన్నేల కోరదు ? నీవిచట ధర్మము తెలుప వలెను. లోకమున తండ్రిని బంధించి రాజులైన వా రున్నారు. నే నట్టివాడ నని తలంపకుము. నీ విచట పాలించువాడు-పాలింపబడువాడు అను నీ యిరువురి నడుమకల ధర్మమును తెలుపవలయును. నేనును - రాజ్యమును రాముని వారమై రామశేషత్వము నొందియుండగా నందొకరు వేరొకరిని రక్షించు టెట్లు ? అట్లు నేను రాజ్యమును రక్షించుట కుదురుచో రాజ్య మేల నన్ను రక్షింపరాదు ? రత్నము, దానిని దాచుపెట్టె ఈ రెండును ఒకే యజమానివి కదా. అట్టిచో పెట్టె రత్నమును రక్షించుట లేదా ? అందువేమో అచట పెట్టె తాళముచెవితో తాళమువేయుట మున్నగు పనిద్వారా రత్నమును రక్షించుటకు యజమానిచే నియమింపబడలేదు. రత్నము యజమాని యొక్కడే ధరింపదగిన దయ్యును ధరించు నవసరములేని సందర్భములలో నాతడుదానిని పెట్టెలో పెట్టినట్లు, రాజ్యమును రాముడే పాలింపదగినవాడైనను, అట్లు పాలించు మని మేమెంతగా ప్రార్థించినను, ఇది తగిన సమయము కాదు కనుక దాని నాతడు నాయధీనమున నుంచుచో, నాతడిచ్చిన శక్తితో రామపరతంత్రుడనై, పెట్టెవలె నతడు వచ్చువఱకు దానిని రక్షించువాడనే కాన రాముని మఱల్చు ప్రయత్నమే యన్నివిధముల కరణీయము. వరములు పొందుట చేతను, బలాత్కారముచేతను రాజ్యముపై కలిగిన నాది యను భావము మొదట రాముని చెంతకేగి పోగొట్టుకొన వలసియున్న దని భావము.

జ్యేష్ఠః శ్రేష్ఠశ్చ ధర్మాత్మా దిలీపనహుషోపమః
లబ్ధు మర్హతి కాకుత్స్థో రాజ్యం దశరథో యథా. 18

జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు, ధర్మనిష్ఠుడు, దిలీపనహుషులకు సాటియగు రాముడు దశరథుని వలె రాజ్యమును పొంద దగినవాడు.

అనార్యజుష్ట మస్వర్గ్యం కుర్యాం పాప మహం యది
ఇక్ష్వాకూణా మహం లోకే భవేయం కులపాంసనః. 14

అయోగ్యులు చేపట్టునది, స్వర్గమునకు నిరోధకమైనదగు ఈ పాపమును నే నాచరించుచో ఇక్ష్వాకుకులమునకే కళంకము నాపాదించిన వాడ నయ్యెదను.

యద్ధి మాత్రా కృతం పాపం నాహం త దపి రోచయే
ఇహస్థో వనదుర్గస్థం నమస్యామి కృతాంజలిః. 15

నా తల్లి చేసిన పాపము కూడ నా కంగీకార్యము కాదు. నే నిచట నుండియే దుర్గమమగు నడవిలోనున్న రామునకు దోసిలి యొగ్గి నమస్కరింతును.

రామ మే వానుగచ్ఛామి రాజా స ద్విపదాం వరః
త్రయాణా మపి లోకానాం రాజ్య మర్హతి రాఘవః. 16

నేను రామునే యనుసరింతును. పురుషశ్రేష్ఠు డగు అతడే రాజు. రాముడు ముల్లోకముల రాజ్యమును పాలింప యోగ్యుడు.

తద్వాక్యం ధర్మసంయుక్తం శ్రుత్వా సర్వే సభాసదః
హర్షా న్ముముచు రశ్రూణి రామే నిహితచేతసః. 17

సభలోని సభ్యులందఱు ధర్మయుక్తమగు భరతుని వాక్యము విని, రామునియందు మనసు నిలిపినవారై ఆనందబాష్పములు విడచిరి.

యది త్వార్యం న శక్ష్యామి వినివర్తయితుం వనాత్
వనే తత్రైవ వత్స్యామి యథాఽఽర్యో లక్ష్మణ స్తథా. 18

పూజ్యుడగు నా యన్న నడవినుండి మఱలింపజాలనిచో, పూజ్యుడగు లక్ష్మణుని వలె నేనును ఆ యడవిలోనే నివసింతును.

సర్వోపాయం తు వర్తిష్యే వినివర్తయితుం బలాత్
సమక్ష మార్యమిశ్రాణాం సాధూనాం గుణవర్తినామ్ 19

సజ్జనులు, గుణవర్తనులగు ఈ సభ్యుల సమక్షముననే వివిధోపాయములతో రాము నెట్లయినను మఱలించుకొనిరా బ్రయత్నింతును.

విష్టికర్మాన్తికా స్సర్వే మార్గశోధకరక్షకాః
ప్రస్థాపితా మయా పూర్వం యాత్రాఽపి మమ రోచతే. 20

నేను ముందే వెట్టికి వచ్చినవారిని, పనియైన పిమ్మట కూలి సొమ్ము పుచ్చుకొనువారిని మార్గమును చక్కజేసి కాపాడుటకై నియోగించియే యున్నాను. నాకిపుడు రాముని కడకు పోవలెనని యున్నది.

ఏవ ముక్త్వా తు ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః
సమీపస్థ మువా చేదం సుమన్త్రం మన్త్రకోవిదమ్. 21

అన్నపై అనురాగముకల ధర్మాత్ము డగు భరతు డిట్లు పలికి, చెంతనే యున్నవాడును, ఆలోచనచేయుటలో నిపుణుడును అగు సుమంత్రున కిట్లనెను.

తూర్ణ ముత్థాయ గచ్ఛ త్వం సుమంత్ర! మమ శాసనాత్
యాత్రా మాజ్ఞాపయ క్షిప్రం బలం చైవ సమానయ. 22

'ఓ సుమంత్రుడా! నా యాజ్ఞగా నీ విపుడే పోయి, ప్రయాణము కావలెనని చెప్పి, సైన్యమును తోడ్కొని రమ్ము.'

ఏవముక్త స్సుమంత్రస్తు భరతేన మహాత్మనా
హృష్ట స్తదాఽఽదిశ త్సర్వం యథాసందిష్ట మిష్టవత్. 23

మహాత్ము డగు భరతు డిట్లు చెప్పగా సుమంత్రుడు సంతోషముతో తన కభీష్టమగు నా యాదేశము నట్లే సైన్యమునకు తెలిపెను.

తాః ప్రహృష్టాః ప్రకృతయో బలాధ్యక్షా బలస్య చ
శ్రుత్వా యాత్రాం సమాజ్ఞప్తాం రాఘవస్య నివర్తనే. 24

రాముని మరలఁ దెచ్చుటకు అజ్ఞాపించబడిన ప్రయాణవార్తను విని ప్రజలు, సైన్యాధ్యక్షులును మిగుల సంతోషము నందిరి

తతో యోధాంగనా స్సర్వా భర్తౄన్సర్వా న్గృహే గృహే
యాత్రాగమన మాజ్ఞాయ త్వరయన్తి స్మ హర్షితాః. 25

పిమ్మట ప్రతి ఇంటను సైనికుల భార్య లందఱును రాముని వద్దకు ప్రయాణమునుగూర్చి తెలిసికొని, సంతోషముతో తమ తమ పతులను ప్రయాణమునకై త్వరపెట్టిరి.

తే హయై ర్గోరథై శ్శీఘ్రైః స్యందనైశ్చ మహాజవైః
సహ యోధై ర్బలాధ్యక్షా బలం సర్వ మచోదయన్. 26

అంత సైన్యాధ్యక్షులు - గుఱ్ఱములు, శీఘ్రముగ నేగు ఎడ్ల బండ్లు, వేగముగ బోవు రథములు, యోధులతో సైన్యమంతయు సిద్ధమగునట్లు ఆజ్ఞ లిడిరి.

సజ్జం తు తద్బలం దృష్ట్వా భరతో గురుసన్నిధౌ
రథం మే త్వరయస్వేతి సుమంత్రం పార్శ్వతోఽబ్రవీత్.

సైన్య మట్లు సమాయత్త మగుట చూచి భరతుడు గురువగు వసిష్ఠుని (యనుమతికై) చెంతనే తన ప్రక్కనున్న సుమంత్రునితో 'శీఘ్రమే నా రథము తె'మ్మని తెలిపెను.

భరతస్య తు తస్యాజ్ఞాం ప్రతిగృహ్య చ హర్షితః
రథం గృహీత్వా ప్రయయౌ యుక్తం పరమవాజిభిః 2

సుమంత్రుడా భరతుని యాజ్ఞ గైకొని, సంతోషముతో శ్రేష్ఠములగు గుఱ్ఱములను పూన్చిన రథమును వేగముగా కొని తెచ్చెను.

స రాఘవ స్సత్యధృతిః ప్రతాపవాన్
బ్రువన్ సుయుక్తం దృఢసత్యవిక్రమః
గురుం మహారణ్యగతం యశస్వినం
ప్రసాదయిష్యన్ భరతోఽబ్రవీ త్తదా. 20

అంత రఘువంశ సంజాతుడు, సడలని ధైర్యము కలవాడు, పరాక్రమశాలి యగు భరతు డట్లు యుక్తములగు మాటలు పలుకుచు, మహారణ్యమున నున్న యన్న యగు రాముని ప్రసన్నుని చేసికొనబోవుచు సుమంత్రున కిట్లనెను.

తూర్ణం సముత్థాయ సుమంత్ర! గచ్ఛ
బలస్య యోగాయ బలప్రధానాన్
ఆనేతు మిచ్ఛామి హి తం వనస్థం
ప్రసాద్య రామం జగతో హితాయ. 30

ఓ సుమంత్రుడా! నీవు శీఘ్రమే లేచి సైన్యాధ్యక్షుల కడ కేగి సేన నాయత్తము చేయుడని చెప్పుము. లోకమునకు మేలు కలుగుటకై, యడవిలో నున్న రాముని ప్రసన్నుని చేసికొని తీసికొని రా గోరుచున్నాను.

స సూతపుత్రో భరతేన సమ్య
గాజ్ఞాపిత స్సంపరిపూర్ణకామః
శశాస సర్వాన్ ప్రకృతిప్రధానాన్
బలస్య ముఖ్యాంశ్చ సుహృజ్జనం చ. 31

సుమంత్రు డట్లు భరతునిచే చక్కగా నాజ్ఞాపించబడినవాడై, తనకోరిక నన్నియు తీరి యానందించినవాడై, జనులలో ప్రధానులకు, సేవలో ముఖ్యులకు, మిత్రులకును భరతుని యాజ్ఞ తెలిపెను.

తత స్సముత్థాయ కులే కులే తే
రాజన్యవైశ్యా వృషలా శ్చ విప్రాః
అయూయుజ న్నుష్ట్రఖరా న్రథాంశ్చ
నాగాన్ హయాంశ్చైవ కులప్రసూతాన్. 32

అంత ఇంటింటి నుండియు బ్రాహ్మణులు, క్షత్రియులు,

వైశ్యులు, శూద్రులును, ఒంటెలు, గాడిదలు, రథములు, ఏనుగులు, గుఱ్ఱములను ఎక్కి ప్రయాణమైరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే ద్వ్యశీతితమ స్సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమందయోధ్యాకాండమున ఎనుబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## త్ర్యశీతితమః సర్గః — ఎనుబదిమూడవసర్గము

తత స్సముత్థితః కాల్య మాస్థాయ స్యందనోత్తమమ్
ప్రయయౌ భరత శ్శీఘ్రం రామదర్శనకాంక్షయా. 1

అంత భరతుడు వేకువనే లేచి యుత్తమమగు రథము నెక్కి రాముని చూడవలయునను కోరికతో వెడలెను.

అగ్రతః ప్రయయు స్తస్య సర్వే మంత్రిపురోధసః
అధిరుహ్య హయై ర్యుక్తాన్ రథాన్ సూర్యరథోపమాన్. 2

మంత్రులు, పురోహితులును సూర్యుని రథమునకు సాటియగు రథము నెక్కి యాతనికి ముందుగా పోయిరి.

నవనాగసహస్రాణి కల్పితాని యథావిధి
అన్వయు ర్భరతం యాంత మిక్ష్వాకుకులనందనమ్. 3

అటు పోవుచున్న ఇక్ష్వాకుకులము నానందింపజేయు

భరతునానతిచే అయోధ్యలోని యేనుగులలో తొమ్మిదివేలు మాత్ర మాతని ననుసరించినవి.

షష్టి రథసహస్రాణి ధన్వినో వివిధాయుధాః
అన్వయు ర్భరతం యాంతం రాజపుత్రం యశస్వినమ్. 4

మిక్కిలి కీర్తిమంతుడు, రాజకుమారు డగు భరతు డట్లు పోవుచుండగా నఱువదివేల రథములు, వివిధాయుధములు ధరించిన విలుకాండ్రగు యోధులును వెంబడించి పోయిరి.

శతం సహస్రా ణ్యశ్వానాం సమారూఢాని రాఘవమ్
అన్వయు ర్భరతం యాంతం సత్యసన్ధం జితేన్ద్రియమ్. 5

సత్యసంధుడు, జితేంద్రియుడు అగు భరతు డట్లు పోవుచుండగా లక్షమంది గుఱ్ఱపురౌతు లా రాఘవు ననుసరించిరి.

కైకేయీ చ సుమిత్రా చ కౌసల్యా చ యశస్వినీ
రామానయనసంహృష్టా యయు ర్యానేన భాస్వతా. 6

కైకేయి, సుమిత్ర, మహాకీర్తిమతి యగు కౌసల్య రాముని తీసికొనివచ్చు సంతోషముతో ప్రకాశమానములగు నుత్తమ వాహనముల నెక్కి వెడలిరి. (అందఱికంటె ముందు కైక వెడలుట పశ్చాత్తాపముతో పీడింపబడుటవలన.)

ప్రయాతా శ్చార్యసంఘాతా రామం ద్రష్టుం సలక్ష్మణమ్
త స్యైవ చ కథా శ్చిత్రాః కుర్వాణా హృష్టమానసాః. 7

పూజనీయులగు జనులును గుంపులు గుంపులుగా కూడి, లక్ష్మణసమేతుడగు రాముని చూచుటకై, యాతనికి సంబంధించిన

మాటలనే చెప్పుకొనుచు, ఆనందము నొందిన మనసుతో బయలు దేరిరి.

> మేఘశ్యామం మహాబాహుం స్థిరసత్త్వం దృఢవ్రతమ్
> కదా ద్రక్ష్యామహే రామం జగత శ్శోకనాశనమ్. 8
>
> దృష్ట ఏవ హి న శ్శోక మపనేష్యతి రాఘవః
> తమ స్సర్వస్య లోకస్య సముద్య న్నివ భాస్కరః. 9
>
> ఇత్యేవం కథయంత స్తే సంప్రహృష్టాః కథా శ్శుభాః
> పరిష్వజానా శ్చాన్యోన్యం యయు ర్నాగరికా జనాః. 10

మేఘమువలె నల్లనివాడు (దర్శనమాత్రముచేతనే సర్వ సంతాపములను పోగొట్టువాడు), గొప్ప బాహువులు కలవాడు, స్థిరమగు పట్టుదల కలవాడు, (స్థిర చిత్తం అను పాఠాంతరమున ఆశ్రితులు ప్రతికూలముగ నాచరించినను మార్పునొందని మనస్సు కలవా డని యర్థము), ఆశ్రితరక్షణ దీక్షనుండి ఏ మాత్రమూ చలించని వాడును, లోకమందలి జనులెల్లరకు శోకము పోగొట్టువాడగు రాము నెపుడు చూతుము సూర్యు డుదయించుచునే -- లోకమంతట నెలకొని యున్న అంధకారమును పార ద్రోలినట్లు, రాముడు దర్శనమాత్రముననే మా శోకమును పోగొట్టును. అని ఇట్లు రామునకు సంబంధించిన కథలు చెప్పుకొనుచు, ఒండొరులను కౌగలించుకొనుచు ఆ పట్టణవాసులు రాముని దర్శింప నేగిరి.

> యే చ తత్రాపరే సర్వే సమ్మతా యే చ నైగమాః
> రామం ప్రతి యయు ర్హృష్టా స్సర్వాః ప్రకృతయ స్తథా.

అయోధ్యానగరమందలి రాముని కభిమతులైన వారు, వణిజులు (వ్యాపారులు) సకలజనులు రాముని కడ కానందముతో నేగిరి.

మణికారా శ్చ యే కేచి త్కుమ్భకారా శ్చ శోభనాః
సూత్రకర్మకృత శ్చైవ యే చ శస్త్రోపజీవినః. 12
మాయూరకాః క్రాకచికా రోచకా వేధకా స్తథా
దన్తకారా స్సుధాకారా స్తథా గంధోపజీవినః 13
సువర్ణకారాః ప్రఖ్యాతా స్తథా కంబళధావకాః
స్నాపకోచ్ఛాదకా వైద్యా ధూపకా శ్శౌండికా స్తథా. 14
రజకా స్తున్నవాయాశ్చ గ్రామఘోషమహత్తరాః
శైలూషా శ్చ సహ స్త్రీభి ర్యయుః కైవర్తకా స్తథా. 15
సమాహితా వేదవిదో బ్రాహ్మణా వృత్తసమ్మతాః
గోరథై ర్భరతం యాన్త మనుజగ్ము స్సహస్రశః. 16

పద్మరాగాది మణులను సంస్కరించువారు, తమ పనిని నిర్వహించుటలో సమర్థులగు కుమ్మరులు, సాలెవారు, ఆయుధములు చేయువారు, నెమలిపించములతో గొడుగులు, విసనకఱ్ఱలు, చేయువారు రంపపు పనివారు, వస్తువులకు మెఱుగు పెట్టువారు, కొయ్యకు, రత్నాదులకు రంధ్రములు చేయువారు, దంతములతో బొమ్మలు, పీటలు, పల్లకీ మున్నగువానిని చేయువారు, గోడలకు సున్నము వేయువారు, చందనము, కస్తూరి మున్నగు సుగంధ ద్రవ్యములమ్మువారు, ప్రసిద్ధులగు కంసాలులు, కంబళ్ళను శుభ్రము చేయువారు, తలయంటి స్నానము చేయించువారు, ఒడలు మర్దించు

వారు, వైద్యులు, ఇండ్లలో మంచివాసనగల ధూపములు వేయువారు, మద్యము చేయువారు, చాకలివారు, సూదితో కుట్టుపని చేయువారు, గ్రామములు, గొల్లపల్లెలలో ప్రధానులు, స్త్రీలతో నాటములలో వేషమువేయువారు (లేదా స్త్రీలపై ఆధారపడి బ్రతుకువారు, చేపల బట్టువారు, వీరందఱును బయలుదేరి పోయిరి. యోగులు, వేదవేత్తలు, సదాచారపరులగు బ్రాహ్మణులు వేలకొలదిగా ఎద్దుబండ్లనెక్కి రాముని కడ కేగుచున్న భరతు ననుసరించిరి.

సువేషా శ్శుద్ధవసనా స్తామ్రమృష్టానులేపనాః
సర్వే తే వివిధై ర్యానై శ్శనై ర్భరత మన్వయుః. 17

వారందఱట్లు చక్కని వేషములు ధరించి, పరిశుద్ధ వస్త్రములు దాల్చి, గోరోచన కుంకుమాది సంబంధముచే ఎఱ్ఱనైన చందనమును శరీరమున కలదికొని, వివిధవాహనముల నెక్కి భరతు ననుసరించిరి.

ప్రహృష్టముదితా సేనా సాఽన్వయాత్ కైకయీసుతమ్
భ్రాతు రానయనే యాంతం భరతం భ్రాతృవత్సలమ్. 18

సైనికులును సంతోషమునందిన మనస్సు, ఆసంతోషమును వ్యక్తముచేయు గగుర్పాటు కలిగినవారై అన్నయందనురక్తుడు, అన్నను తీసికొని రావలెనని పోవుచున్నవాడగు భరతు ననుసరించిరి.

తే గత్వా దూర మధ్వానం రథయానాశ్వకుంజరైః
సమాసేదు స్తతో గంగాం శృంగిబేరపురం ప్రతి. 19

వా రట్లు రథములు, గుఱ్ఱములు, ఏనుగులు తక్కిన వాహ
నముల నెక్కి సుదూరమార్గము గడచి శృంగిబేర పురప్రాంత
మున గంగానదిని చేరిరి.

యత్ర రామసఖో వీరో గుహో జ్ఞాతిగణై ర్వృతః
నివస త్యప్రమాదేన దేశం తం పరిపాలయన్. 20

ఎచట రాముని మిత్రుడు, వీరుడు, అగు గుహుడు తన జ్ఞాతు
లతోగూడి యేమఱుపాటులేక యా రాజ్యమును పరిపాలించు
చుండెనో (ఆ శృంగిబేరపురమునకు వా రెల్లరు పోయిరి.)

ఉపేత్య తీరం గంగాయా శ్చక్రవాకై రలంకృతమ్
వ్యవాతిష్ఠత సా సేనా భరత స్యానుయాయినీ. 21

అట్లు భరతు ననుసరించి వెడలిన ఆసేన, చక్రవాక పక్షు
లతో అలంకరింపబడియున్న గంగానదీతీరము జేరి విడిసెను.

నిరీ క్ష్యానుగతాం సేనాం తాం చ గంగాం శివోదకామ్
భరత స్సచివా న్సర్వా నబ్రవీ ద్వాక్యకోవిదః. 22

నాటికి ప్రయాణోత్సాహము లేని సైన్యమును పవిత్రజల
ములుకల గంగానదిని చూచి మాటలాడుటలో నేర్పరియగు భర
తుడు మంత్రుల కెల్లరకు నిట్లనెను.

నివేశయత మే సైన్య మభిప్రాయేణ సర్వతః
విశ్రాన్తాః ప్రతరిష్యామ శ్శ్వ ఇదానీ మిమాం నదీమ్. 23

మంత్రులారా! నా సైన్యమును వారి వారి యిచ్చకొలది

ఎల్లెడల విడియునట్లు చేయుడు. నే డిట విశ్రమించి రే పీ నదిని దాటుదము.

దాతుం చ తావ దిచ్ఛామి స్వర్గతస్య మహీపతేః
ఔర్ధ్వదేహనిమిత్తార్థ మవతీర్యోదకం నదీమ్. 24

స్వర్గస్థుడైన నా తండ్రి దశరథున కూర్ధ్వదేహసౌఖ్యము కలుగుటకై నే నీ నదిలోనికి దిగి గంగాజలములతో తర్పణ మీయ దలంచుచున్నాను.

త స్యైవం బ్రువతోఽమాత్యా స్తథే త్యుక్త్వా సమాహితాః
న్యవేశయం స్తాం ఛందేన స్వేన స్వేన పృథ క్పృథక్. 25

భరతు డిట్లు చెప్పుచుండగా మంత్రు లట్లే యని పలికి, ఆ సైనికులను వారి వారి ఇష్టము ననుసరించి వేర్వేఱుచోట్ల విడియ జేసిరి.

నివేశ్య గంగా మను తాం మహానదీం
చమూం విధానైః పరిబర్హ శోభినీమ్
ఉవాస రామస్య తదా మహాత్మనో
విచింతయానో భరతో నివర్తనమ్. 26

భరతు డట్లు తన సేనను, సైనికుల జాతివ్యవస్థ ననుస రించి పలు విభాగములుగా డేరాలలో విడియజేసి, తాను మహాత్ముడగు రాము నయోధ్యకు మఱలించుకొనివచ్చు విష యము నాలోచించుచు అచట నివసించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్ర్యశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణ మం దయోధ్యాకాండమున ఎనుబదిమూడవ సర్గము సంపూర్ణము.

---

## చతురశీతితమః సర్గః - ఎనుబదినాల్గవ సర్గము

తతో నివిష్టాం ధ్వజినీం గంగా మన్వాశ్రితాం నదీమ్
నిషాదరాజో దృష్ట్వైవ జ్ఞాతీన్ సంత్వరితోఽబ్రవీత్. 1

అపుడు గంగాతీరమును చేరి యచట విడిసిన సేనను చూచిన నిషాదరాజగు గుహుడు తోడనే తన జ్ఞాతుల కిట్లనెను.

మహతీయ మిత స్సేనా సాగరాభా ప్రదృశ్యతే
నా స్యాన్త మధిగచ్ఛామి మనసాఽపి విచిన్తయన్. 2

ఈ శృంగిబేరపురమున నిలచిన యీ సేన చాల పెద్దది యగుటచే సముద్రమువలె కనుపించుచున్నది. మదిలో నెంత యాలోచించియు దీని తుదయెచ్చట నున్నదో తెలియజాలకున్నాను.

యథా తు ఖలు దుర్బుద్ధి ర్భరత స్స్వయ మాగతః
స ఏష హి మహాకాయః కోవిదారధ్వజో రథే. 3

ఇక్ష్వాకుకులక్రమాగతము, పెద్దదియగు కోవిదారధ్వజ మిదే రథముపై కనుపించుచున్నది. దుష్టబుద్ధియగు భరతుడే స్వయముగ వచ్చుచున్నా డనుట నిశ్చయము.

బంధయిష్యతి వా దాశా నథవాఽస్మా న్వధిష్యతి
అథ దాశరథిం రామం పిత్రా రాజ్యా ద్వివాసితమ్. 4

సంపన్నాం శ్రియ మన్విచ్ఛం స్తస్య రాజ్ఞ స్సుదుర్లభామ్
భరతః కైకయీపుత్త్రో హన్తుం సమధిగచ్ఛతి. 5

దాసులమగు మనల నితడు బంధింపవచ్చును లేదా చంప వచ్చును. కైకేయీ పుత్రుడగు (కైకేయీ పుత్రు డనుటచే తల్లి స్వభావమే యీతనిదని గుహుని యూహ) భరతుడు రాజ్యార్హు డగు రామునకు దుర్లభమై, జారిపోని రాజ్యసంపదను పొంద గోరుచు, తన తండ్రిచే రాజ్యమునుండి వెడలగొట్టబడిన దశరథ రాముని (ఇట్లనుటచే జ్ఞాతిత్వము సూచితము) చంప వచ్చు చున్నాడు.

భర్తా చైవ సఖా చైవ రామో దాశరథి ర్మమ
త స్యార్థకామా స్సన్నద్ధా గంగాఽనూపే ప్రతిష్ఠత 6

దశరథతనయు డగు రాముడు నాకు ప్రభువు, మిత్రు డును. ఆయన ప్రయోజనమునే కాంక్షించుచు మీరు గంగాతీర మున సిద్ధముగా నుండుడు.

తిష్ఠన్తు సర్వే దాశా శ్చ గంగా మన్వాశ్రితా నదీమ్
బలయుక్తా నదీరక్షా మాంసమూలఫలాశనాః. 7

మనవా రందఱును సైన్యసమేతులై గంగాతీరమును చేరి, నది దాటు రేవును కాపాడుచు, మాంసములు, దుంపలు, పండ్లు (చెంతనే పడవలలో నిడుకొని) తినుచు ఇచటనే యుందురు.

నావాం శతానాం పంచానాం కైవర్తానాం శతం శతమ్
సన్నద్ధానాం తథా యూనాం తిష్ఠంత్వి త్యభ్యచోదయత్.

అయిదు వందల నావలలో నొక్కొక్కదానిలో నూఱుగురు చొప్పున యుద్ధసన్నద్ధులు, యువకులగు జెస్త లుందురు.

యదాఽదుష్టస్తు భరతో రామ స్యేహ భవిష్యతి
సేయం స్వస్తిమతీ సేనా గంగా మద్య తరిష్యతి. 9

భరతుడు రాముని విషయమున దుష్టుడు కాకుండుచో, అతని ఈ సెన క్షేమముగ గంగను దాటును (లేనిచో సైనికులను చంపవలెనని భావము.)

ఇ త్యుక్త్వోపాయనం గృహ్య మత్స్యమాంసమధూని చ
అభిచక్రామ భరతం నిషాదాధిపతి ర్గుహః. 10

నిషాదరాజగు గుహు డిట్లు పలికి చేపలు, మృగమాంసము, తేనెలను కానుకగా తీసికొని భరతున కెదు రేగెను.

త మాయాన్తం తు సంప్రేక్ష్య సూతపుత్త్రః ప్రతాపవాన్
భరతా యాచచక్షేఽథ వినయజ్ఞో వినీతవత్. 11

అపుడు ప్రతాపశాలియు, వినయ మెఱిగినవాడును అగు సుమంత్రుడు గుహుడు వచ్చుచుండుట చూచి, వినయముతో భరతున కా విషయ మెఱిగించెను.

ఏష జ్ఞాతిసహస్రేణ స్థపతిః పరివారితః
కుశలో దండకారణ్యే వృద్ధో భ్రాతు శ్చ తే సఖా. 12

తస్మా త్పశ్యతు కాకుత్స్థ! త్వాం నిషాదాధిపో గుహః
అసంశయం విజానీతే యత్ర తౌ రామలక్ష్మణౌ. 13

ఈ గుహుడు నిషాదరాజు. వేలకొలది బంధువర్గ మీతని నంటిపెట్టుకొని యుండును. ఇతడు దండకారణ్యమం దెల్లెడల సంచరింప సమర్థుడు, వృద్ధుడు. విశేషించి నీయన్నకు మిత్రుడు. కావున నీ వీ గుహునకు దర్శన మొసగుము. రామలక్ష్మణులు లెచట నున్నదియు నితడు తప్పక ఎఱిగియుండును.

ఏత త్తు వచనం శ్రుత్వా సుమన్త్రా ద్భరత శ్శుభమ్
ఉవాచ వచనం శీఘ్రం గుహః పశ్యతు మా మితి. 14

సుమంత్రుడు పలికిన ఈ శుభకరమగు మాట విని భరతుడు 'శీఘ్రమే గుహుడు నన్ను చూచుగాక' అని సుమంత్రునితో పలికెను.

లబ్ధ్వాఽభ్యనుజ్ఞాం సంహృష్టో జ్ఞాతిభిః పరివారితః
ఆగమ్య భరతం ప్రహ్వో గుహో వచన మబ్రవీత్. 15

గుహు డట్లనుమతింపబడినవాడై బంధువులతో కూడి యానందముతో భరతుని కడ కేగి, ప్రణామము చేసి ఇట్లనెను.

నిష్కుట శ్చైవ దేశోఽయం వంచితా శ్చాపి తే వయమ్
నివేదయామ స్తే సర్వే స్వకే దాసకులే వస. 16

నా యీ దేశమంతయు నీ ఇంటి పెరటి తోటగా తలంపుము. నీ రాక ముందు తెలియక వంచితుల మైతిమి. నీ దాసుల ఇల్లని భావించి వీనిట నుండవలెనని ప్రార్థించుచున్నాము.

అస్తి మూలం ఫలం చైవ నిషాదై స్సముపాహృతమ్
ఆర్ద్రం చ మాంసం శుష్కంచ వన్యంచోచ్చావచం మహత్

ఆశంసే స్వాశితా సేనా వత్స్యతీమాం విభావరీమ్
అర్చితో వివిధైః కామై శ్శ్వ స్ససైన్యో గమిష్యతి. 18

అడవిలో లభించు దుంపలు, పండ్లు, ఎండుమాంసము, పచ్చిమాంసము పండ్లు పలువిధమగు నివ్వరిధాన్యము మా కడ నున్నవి. సైన్యము వానిని చక్కగా భుజించి, యీ రాత్రి ఇచట నుండగలదు. మేము కోరిన సపర్యలను స్వీకరించి, రేపు సైన్యముతో పోవచ్చును 'అనెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
చతురశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమునం దయోధ్యాకాండమున ఎనుబదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## పంచాశీతితమః సర్గః – ఎనుబదియైదవ సర్గము

ఏవ ముక్తస్తు భరతో నిషాదాధిపతిం గుహమ్
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో వాక్యం హేత్వర్థసంహితమ్. 1

నిషాదరాజగు గుహు డిట్లు చెప్పగా, మహాబుద్ధిశాలియగు భరతు డిట్లు సప్రయోజనమగు వాక్యము పలికెను.

ఊర్జితః ఖలు తే కామం కృతో మమ గురో స్సఖే!
యో మే త్వ మీదృశీం సేనా మేకోఽభ్యర్చితు మిచ్ఛసి.

నా యన్న రామునకు మిత్రుడ వగు ఓ గుహుడా! నీ విట్లపారమగు నా సైన్యమున కొక్కడవే యాతిథ్య మీయగోరు చుంటివే. అట్టి యభివృద్ధినందిన అతిథ్యమీయవలెనను నీ కోరిక నెఱవేఱినట్లే. (నీ యాదరణము చేతనే మా కాతిథ్యము లభించిన ట్లైనదని భావము).

ఇ త్యుక్త్వా తు మహాతేజా గుహం వచన ముత్తమమ్
అబ్రవీ ద్భరత శ్శ్రీమా న్నిషాదాధిపతిం పునః. 3

మహాతేజుడు, శ్రీమంతుడగు భరతు డిట్లు గుహునకు లెస్సగా పలికి, మఱల నాతని కిట్లనెను.

కతరేణ గమిష్యామి భరద్వాజాశ్రమం గుహ!
గహనోఽయం భృశం దేశో గంగాఽనూపో దురత్యయః. 4

ఓ గుహుడా! ఈ జలప్రాయమగు గంగా ప్రాంతము మిగుల ప్రవేశింపరానిది, దాటరానిదియు, నేను భరద్వాజాశ్రమమున కే మార్గమును బట్టి పోవలెనో తెలుపుము.

తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం గుహో గహనగోచరః. 5

ధీమంతుడు రాజపుత్రుడగు భరతుని యా వచనము విని యడవులలో తిరుగువాడగు గుహుడు చేతులు మొగిడ్చి ఇట్లనెను.

దాశా స్త్వాఽనుగమిష్యన్తి ధనిన స్సుసమాహితాః
అహం చానుగమిష్యామి రాజపుత్త్ర! మహాయశః. 6

మహాకీర్తిశాలివగు ఓ రాజపుత్రా! ధనుష్పాణులై, మిగుల సావధానులై ఈ బెస్తవాండ్రు నీ వెంట వత్తురు. నేనును నీ వెనుక వత్తును.

కచ్చి న్న దుష్టో వ్రజసి రామ స్యాక్లిష్టకర్మణః
ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే. 7

ఎవ్వరికిని కష్టము కలిగింపని రాముని విషయమున దుష్టభావము లేకయే పోవుచుంటివా! నీ యీ పెద్ద సైన్యము నాకు సందేహము కలిగించుచున్నది.

త మేవ మభిభాషన్త మాకాశ ఇవ నిర్మలః
భరత శ్శ్లక్ష్ణయా వాచా గుహం వచన మబ్రవీత్. 8

తనతో ఇట్లు మాటలాడుచున్న గుహునకు — ఆకాశము వలె నిర్మలుడగు భరతుడు కోపములేకయే ఇట్లనెను.

విశే. 'ఆకాశమువలె నిర్మలుడు' అనుటచే గుహుని శంక కతనిలో అవకాశమే లేదని చెప్పిన ట్లైనది. ఆకాశమున బురద పూయ పూనుకొన్నను అది దాని కంటదు. కాని పూయదలచిన వాని చేయిమాత్రము మలినమగును. లేనిదోషము తమపై నారోపించినపుడు కోపము కలుగుట సహజము. కాని భరతునకే మాత్రము కోపము కలుగలేదు. గుహు డట్లు భ్రాంతి చెందుట సైన్యమును చూచియే కనుక.

మాభూ త్స కాలో యత్కష్టం న మాం శంకితు మర్హసి
రాఘవ స్స హి మే భ్రాతా జ్యేష్ఠః పితృసమో మతః .9

తం నివర్తయితుం యామి కాకుత్స్థం వనవాసినమ్
బుద్ధి రన్యా న తే కార్యా గుహ! సత్యం బ్రవీమి తే. 10

ఏ కాలమందు నీ వాశంకించిన కష్టము కలుగునో ఆ (కలి) కాలము కలుగకుండుగాక. నీవు నన్ను శంకింప వలదు. రాముడు నా జ్యేష్ఠభ్రాత. తండ్రితో సమానుడు. వనవాసియగు ఆ కాకుత్స్థుని మఱలించుకొని పోవుట కిట్లు పోవు చుంటిని. గుహుడా! నీవు వేఱుగ నాలోచింపకుము. నీకు నేను సత్యము చెప్పుచున్నాను.

స తు సంహృష్టవదన శ్శ్రుత్వా భరతభాషితమ్
పున రే వాబ్రవీ ద్వాక్యం భరతం ప్రతి హర్షితః .11

భరతుని మాటలు వినిన గుహుని ముఖము హర్షముతో విస్ఫారెను. తిరిగి అతడు సంతోషముతో భరతున కిట్లనెను.

ధన్య స్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీతలే
అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తుమి హేచ్ఛసి.

ఓ భరతుడా! నీవు నిజముగ ధన్యుడవు. అప్రయత్నముగ చేసి కంది వచ్చిన రాజ్యమును గూడ నీ విపుడు విడువ నిచ్ఛగించుచున్నావే. ఈ లోకమునం దెక్కడను నీతో సమానుని కానను.

శాశ్వతీ ఖలు తే కీర్తి ర్లోకా ననుచరిష్యతి
య స్త్వం కృచ్ఛ్రగతం రామం ప్రత్యానయితు మిచ్ఛసి.

నీవు కష్టములపాలైన రాముని తీసికొని రా గోరుచున్నావు. కావున నీకీర్తి యన్నిలోకములలో శాశ్వతముగ వ్యాపించియుండ గలదు.

ఏవం సంభాషమాణస్య గుహస్య భరతం తదా
బభౌ నష్టప్రభ స్సూర్యో రజనీ చాభ్యవర్తత. 14

గుహుడు భరతునితో నిట్లు మాట్లాడుచుండగనే సూర్య కాంత తఱుగ జొచ్చెను. రాత్రి సమయ మాయెను.

సన్నివేశ్య స తాం సేనాం గుహేన పరితోషితః
శత్రుఘ్నేన సహ శ్రీమాన్ శయనం సముపాగమత్. 15

అపుడు భరతుడు సేన నాయా ప్రదేశములలో విశ్రమింప నియమించి, గుహుడు తనకు సంతోషము కలిగింపగా, తిరిగి శత్రుఘ్నుడు, తానును శయనము చేరిరి.

రామచిన్తామయ శ్శోకో భరతస్య మహాత్మనః
ఉపస్థితో హ్యనర్హస్య ధర్మప్రేక్షస్య తాదృశః. 16

భరతుడు ఆజన్మము ఐశ్వర్యవంతు డగుటచే శోకింప దగనివాడును, శోకమునకు మూలమగు పాపము లేనివాడును, మహాధీరుడును అయినను, వాక్కులకు, మనస్సునకు గూడ గోచరముకాక యపరిమితమైన రామనిమిత్తకమగు శోక మతనికి కలిగెను.

అంతర్దాహేన దహన స్సంతాపయతి రాఘవమ్
వనదాహాభిసంతప్తం గూఢోఽగ్నిరివ పాదపమ్. 17

చుట్టును కల అడవి తగులబడుటచే ఆవేడిచే ఎండిన చెట్టును తొఱ్ఱలో గూఢముగ నున్న అగ్నివలె, చింతాగ్నిచే పరితప్తుడైన భరతుని శోకాగ్ని దహించెను.

ప్రసృత స్సర్వగాత్రేభ్య స్స్వేదం శోకాగ్నిసంభవమ్
యథా సూర్యాంశుసంతప్తో హిమవాన్ ప్రసృతో హిమమ్.

సూర్యకిరణములచే సంతప్తుడై హిమవంతుడు మంచునీటిని కార్చినట్లు భరతుడు తన సర్వావయవములనుండియు చెమటను కార్చెను.

ధ్యాననిర్దరశైలేన వినిశ్శ్వసితధాతునా
దైన్యపాదపసంఘేన శోకాయాసాధిశృంగిణా. 19

ప్రమోహానన్తసత్త్వేన సన్తాపౌషధివేణునా
ఆక్రాంతో దుఃఖశైలేన మహతా కైకయీసుతః. 20

భరతుడు రామవిషయకనిరంతరధ్యానమే సెలయేరు లుగా కలది, నిశ్శ్వాసములే ధాతువులుగా కలవియు, ఇంద్రియములు తమ తమ విషయములందు ప్రవర్తింపకుండుట అను దైన్యమే వృక్షములుగా కలదియు, శోకము, ఆయాసము మున్నగునవియే శిఖరములుగా కలదియు, ప్రమోహములే అసంఖ్యాకమృగములుగా కలది, సంతాపములే ఓషధులు, వెదుళ్లుగా కలవి అగు గొప్ప దుఃఖమను కొండచే నాక్రమింపబడినవాడయ్యెను (కొండవలె గొప్పదగు దుఃఖమును పొందెను).

వినిశ్శ్వసన్వై భృశదుర్మనా స్తతః
ప్రమూఢసంజ్ఞః పరమాపదం గతః

శమం న లేభే హృదయజ్వరార్దితో
నరర్షభో యూథహతో యథర్షభః. 21

పురుషశ్రేష్ఠుఁడగు భరతుఁడట్లు అత్యధికమగు రామవిషయకచింతచే నిట్టూర్చుచు, హృదయము చాలా కలతనొందగా, తెలివి తప్పి, మహాపద నంది తన గుంపుతప్పిన వృషభమువలె మనోవ్యథతో దురపిల్లుచు నూరట జెందకుండెను.

గుహేన సార్ధం భరత స్సమాగతో
మహానుభావ స్సజన స్సమాహితః
సుదుర్మనా స్తం భరతం తదా పునః
గుహ స్సమాశ్వాసయ దగ్రజం ప్రతి. 22

అట్లు మహానుభావుడు, సపరివారుడు, ఏకాగ్రచిత్తుడు అగు భరతుని గుహుడు వచ్చి కలసికొనెను. అతడును భరతుని బాధ చూచి అంతకంటె మిక్కుటమగు మనోవ్యథను పొంది, భరతుని అన్నయగు రాముని గూర్చిన మాటలతో ఊరడిల్లజేసెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచాశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున ఎనుబదియైదవ సర్గము సంపూర్ణము.

# షడశీతితమః సర్గః - ఎనుబదియాఱవ సర్గము

ఆచచక్షే౾థ సద్భావం లక్ష్మణస్య మహాత్మనః,
భరతా యాప్రమేయాయ గుహో గహనగోచరః. 1

అట్లు భరతు నోదార్చి, అడవిలో తిరుగువాడగు గుహుడు మహామహిమకల భరతునితో మహాత్ముడగు లక్ష్మణుని(కి రాముని యందలి) భక్తిభావము నిట్లు వివరించెను.

తం జాగ్రతం గుణై ర్యుక్తం శరచాపాసిధారిణమ్
భ్రాతృగు ప్త్యర్థ మత్యన్త మహం లక్ష్మణ మబ్రువమ్. 2

తన యన్న రక్షణలో నత్యంత జాగురూకుడును, విల్లమ్ములు, కత్తి ధరించిన వాడును, భ్రాతృభక్తి మున్నగు గుణములతో కూడినవాడగు లక్ష్మణునకు నేనిట్లు చెప్పితిని.

ఇయం తాత ! సుఖా శయ్యా త్వదర్థ ముపకల్పితా,
ప్రత్యాశ్వసిహి శేష్వాస్యాం సుఖం రాఘవనందన ! 3

రఘువంశమునకు సమృద్ధిని కూర్చు లక్ష్మణా ! నీ కొఱకై యీ శయనము సిద్ధచేయబడినది. దీనిపై నీవు సుఖముగ విశ్రమించి శయనింపుము.

ఉచితో౾యం జన స్సర్వో దుఃఖానాం త్వం సుఖోచితః
ధర్మాత్మం ! స్తస్య గుప్త్యర్థం జాగరిష్యామహే వయమ్. 4

ధర్మాత్ముడవగు లక్ష్మణా ! మే మందఱము దుఃఖముల కలవాటు పడినవారమే. నీవు సుఖముల కలవాటు పడినవాడవు. కావున మేము రాముని రక్షణమున జాగరూకులమై యుండెదము.

న హి రామా త్ప్రియతరో మమాస్తి భువి కశ్చన
మోత్సుకోఽభూ ర్జ్రపి మ్యేత ద ప్యసత్యం త వాగ్రతః. 5

నా కీ భూమిపై రామునికంటె ప్రీతిపాత్రుడు వేఱొకడు లేడు. నీ వీ రాత్రి రాముని రక్షింపవలెనని యుత్కంఠ చూప పనిలేదు. నీ ఎదుట ఈ విషయమును గూర్చి నే నసత్యము పలుకుదునా ?

అస్య ప్రసాదా దాశంసే లోకేఽస్మి న్సుమహ ద్యశః
ధర్మావాప్తిం చ విపులా మర్థావాప్తిం చ కేవలామ్. 6

రాముని యనుగ్రహముననే నే నీ లోకమున(మహాభాగవతుడ నను) గొప్ప కీర్తిని ప్రతిబంధరహితమై మోక్షపర్యంతమగు ధర్మప్రాప్తిని, స్వర్గాది పురుషార్థప్రాప్తిని కోరుచున్నాను

సోఽహం ప్రియసఖం రామం శయానం సహ సీతయా
రక్షిష్యామి ధనుష్పాణి స్సర్వైః స్వై ర్జ్ఞాతిభి స్సహ. 7

కావున అట్టి నేను నా బంధుజను లందరితో కలసి, విల్లు చేత బట్టి సీతతో కలసి శయనించుచున్న రాముని రక్షింతును.

నహి మేఽవిదితం కించి ద్వనేఽస్మిం శ్చరత స్సదా,
చతురంగం హ్యపి బలం ప్రసహేమ వయం యుధి: 8

నే నీ యడవిలోనే యెల్లపుడు తిరుగువాడను కావున నాకిచట తెలియనిది లేదు. మేము యుద్ధమున చతురంగబలమును కూడ సహింపగలము.

ఏవ మస్మాభి రుక్తేన లక్ష్మణేన మహాత్మనా,
అనునీతా వయం సర్వే ధర్మ మే వానుపశ్యతా. 9

మహాత్ము డగు లక్ష్మణునకు మే మిట్లు చెప్పగా, ధర్మ మందే చూపుకలవాడగు అతడు మంచిమాటలతో మా కిట్లు చెప్పెను.

కథం దాశరథౌ భూమౌ శయానే సహ సీతయా,
శక్యా నిద్రా మయా లబ్ధుం జీవితం వా సుఖాని వా. 10

దశరథమహారాజ తనయుడగు రాముడు సీతతో గూడి నేలపై శయనించుచుండగా నాకు ప్రాణములు నిలుచుటే కష్టమే. నిద్రించు టెట్లు ? మఱి సుఖించు టెట్లు ?

యో న దేవాసురై స్సర్వై శ్శక్యః ప్రసహితుం యుధి,
తం పశ్య గుహ! సంవిష్టం తృణేషు సహ సీతయా! 11

గుహుడా ! యుద్ధమున దేవాసురు లెల్లరు ఏకమై దండెత్తి వచ్చినను ఎవని నెదిరించి నిలువజాలరో ఆ రాముడు సీతతో గూడి పచ్చిక నేలపై పరుండి యున్నాడు. చూడుము.

మహతా తపసా లబ్ధో వివిధై శ్చ పరిశ్రమైః,
ఏకో దశరథ స్యైష పుత్త్రః స్సదృశలక్షణః. 12

ఉపవాసాది మహాతపముచే, యజ్ఞాది వివిధ పరిశ్రమలచే దశరథునకు కలిగిన సంతానములో రాముడే ముఖ్యుడు, లక్షణములచే తండ్రికి తగిన తనయుడును.

అస్మిన్ ప్రవ్రాజితే రాజా న చిరం వర్తయిష్యతి,
విధవా మేదినీ నూనం క్షిప్ర మేవ భవిష్యతి. 13

రాముడు వనమున కేగగా దశరథుడు చిరకాలము జీవింపడు. శీఘ్రముగా భూమి రాజులేక విధవ కాగలదు. ఇది నిశ్చయము.

విలప్య సుమహానాదం శ్రమే ణోపరతాః స్త్రియః,
నిర్ఘోషోపరతం తాత ! మన్యే రాజనివేశనమ్. 14

రాము డడవి కేగగా నంతఃపుర స్త్రీ లెల్లరు బిగ్గరగా నేడ్చి యేడ్చి యలసి యూరకుండియుందురు. రాజగృహమంతయు నొక్క పెద్ద రోదనధ్వనులతో మాఱుమ్రోగి, నిశ్శబ్దమై యుండును

కౌసల్యా చైవ రాజా చ తథైవ జననీ మమ,
నాశంసే యది జీవేయు స్సర్వే తే శర్వరీ మిమామ్. 15

కౌసల్యదేవి, మహారాజు, నాతల్లి జీవింపరు. అట్లు జీవించిరని ఈ రాత్రి మాత్రము జీవింతురేమో, కాని అటుపైని జీవింపరు.

జీవే దపి హి మే మాతా శత్రుఘ్న స్యాన్వవేక్షయా,
దుఃఖితా యా తు కౌసల్యా వీరసూ ర్వినశిష్యతి. 16

శత్రుఘ్నుని చూచుకొనుచు నాతల్లి సుమిత్ర జీవించిన జీవింపవచ్చును. కాని దుఃఖము నొందిన వీరమాత కౌసల్య మాత్రము నశించును.

అతిక్రాంత మతిక్రాంత మనవాప్య మనోరథమ్,
రాజ్యే రామ మనిక్షిప్య పితా మే వినశిష్యతి. 17

సమయము మించిపోయినది, మించిపోయినది. తన చిర మనోరథమునెఱవేరక రాముని రాజ్యాభిషిక్తుని చేయకయే నా తండ్రి మరణించును.

సిద్ధార్థాః పితరం వృత్తం తస్మి న్కాలే హ్యుపస్థితే,
ప్రేతకార్యేషు సర్వేషు సంస్కరిష్యంతి భూమిపమ్. 18

మా తండ్రి మహారాజు మృతినందగా, ఆ సమయమున ప్రేత సంస్కారము లన్నియు చేయగలుగు భరత శత్రుఘ్నులు కృతార్థులు.

రమ్యచత్వరసంస్థానాం సువిభక్తమహాపథామ్,
హర్మ్యప్రాసాదసంపన్నాం సర్వరత్నవిభూషితామ్. 19

గజాశ్వరథసంబాధాం తూర్యనాదవినాదితామ్,
సర్వకల్యాణసంపూర్ణాం హృష్టపుష్టజనాకులామ్. 20

ఆరామోద్యానసంపూర్ణాం సమాజోత్సవశాలినీమ్,
సుఖితా విచరిష్యంతి రాజధానీం పితు ర్మమ. 21

సుందరములైన నాల్గుమార్గముల కూడలులు కలదియు, చక్కగా నేర్పరుపబడిన రాజమార్గములు కలదియు, ధనికభవనములు, దేవాలయములు కలదియు, అన్ని రత్నములతో నలంకరింపబడినదియు, ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో క్రిక్కిరిసినదియు, వివిధవాద్యముల మ్రోతలు కలదియు, సకల శుభము

లకు నెలవైనదియు, హర్షాతిరేకముతో పుష్టినొందిన జనులు కల దియు, ఉపవనములతో రాజోద్యానములతో నిండినదియు, ఉత్సవసమూహములతో నొప్పునది యగు నా తండ్రి రాజధానిలో సుఖపడుయోగము కలవారు విహరింతురు.

అపి సత్యప్రతిజ్ఞేన సార్ధం కుశలినా వయమ్,
నివృత్తే సమయే హ్యస్మిన్ సుఖితాః ప్రవిశేమ హి. 22

పదునాలుగు సంవత్సరముల వనవాస ప్రతిజ్ఞను తీర్చు కొని, క్షేమముగ నున్న రామునితో గడువుముగియగనే అయో ధ్యను ప్రవేశింతుమా ?

పరిదేవయమానస్య త స్యైవం సుమహాత్మనః,
తిష్ఠతో రాజపుత్త్రస్య శర్వరీ సాఽత్యవర్తత 23

మహాత్ముడు రాజపుత్రుడగు లక్ష్మణు డిట్లు విలపించు చునే యుండగా నా రాత్రి గడచిపోయెను.

ప్రభాతే విమలే సూర్యే కారయిత్వా జటా ఉభౌ,
అస్మిన్ భాగీరథీతీరే సుఖం సంతారితౌ మయా. 24

అంత తెల్లవారి సూర్యు డుదయింపగా, రామ లక్ష్మణులు ఈ గంగాతీరముననే జడలు ధరించిరి. వారిని నేను సుఖముగా నది దాటించితిని.

జటాధరౌ తౌ ద్రుమచీరవాససౌ
మహాబలౌ కుంజరయూథపోపమౌ,
వరేషుచాపాసిధరౌ పరంతపౌ
వ్యపేక్షమాణౌ సహ సీతయా గతౌ. 25

మహాబలశాలులు, శ్రేష్ఠములగు ఏనుగులను పోలినవారు, శత్రువులను తపింపజేయువారు అగు నా రామలక్ష్మణు లట్లు జటాధారులై, నారవస్త్రములు దాల్చి, శ్రేష్ఠములగు విల్లమ్ములు, కత్తులు ధరించి, అన్ని వైపుల నవహితులై చూచుచు సీతాసమేతులై పోయిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షడశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున ఎనుబదియాఱవ సర్గము సంపూర్ణము

---

## సప్తాశీతితమః సర్గః — ఎనుబదియేడవ సర్గము

గుహస్య వచనం శ్రుత్వా భరతో భృశ మప్రియమ్,
ధ్యానం జగామ తత్రైవ యత్ర తచ్ఛ్రుత మప్రియమ్. 1

ఏ క్షణమున భరతుడు గుహుని వలన "రామలక్ష్మణులు జడలు ధరించి పోయిరని" తనకు మిక్కిలి అప్రియమగు మాట వినెనో, అప్పుడే తన యభిలషిత కార్యమున సంకట మేర్పడె నని చింతాక్రాంతు డయ్యెను.

సుకుమారో మహాసత్త్వ స్సింహస్కన్ధో మహాభుజః,
పుండరీకవిశాలాక్ష స్తరుణః ప్రియదర్శనః. 2
ప్రత్యాశ్వస్య ముహూర్తం తు కాలం పరమదుర్మనాః,
పపాత సహసా తోత్త్రై ర్హృతివిద్ధ ఇవ ద్విపః. 3

సుకుమారుడు, మహాబలుడు, సింహపు మూపు వంటి మూపు కలవాడు పొడవైన భుజములు కలవాడు, కమలముల వలె విశాలములగు కన్నులు కలవాడు, యౌవనమునందున్న వాడు, చూచువారికి కన్నులపండువగు వాడగు భరతు డట్లు మిగుల కలత నంది, యిఁకింత యూరడిల్లి, తిరిగి యా బాధ సహింపలేక అంకుశముచే పొడువబడిన యేనుగువలె నొక్కుమ్మడి నేలపై బడెను.

తదవస్థం తు భరతం శత్రుఘ్నోఽనంతరస్థితః,
పరిష్వజ్య రురోదోచ్చై ర్విసంజ్ఞ శ్శోకకర్శితః. 4

అట్టి దురవస్థనొందిన భరతు నాతని ప్రక్కనే యున్న శత్రుఘ్నుడు కౌగలించుకొని బిగ్గఱగా నేడ్చి దుఃఖముచే పీడితుడై తెలివిదప్పెను.

తత స్సర్వా స్సమాపేతు ర్మాతరో భరతస్య తాః,
ఉపవాసకృశా దీనా భర్తృవ్యసనకర్శితాః. 5

అపుడు భర్తృమరణముచే క్రుక్కి దైన్యము నొంది. ఉపవాసముచే చిక్కిన తల్లులందరు భరతుని చెంత చేరిరి.

తాశ్చ తం పతితం భూమౌ రుదంత్యః పర్యవారయన్,
కౌసల్యా త్వనుసృత్యైనం దుర్మనాః పరిషస్వజే. 6

వారట్లు నేలపై బడిన భరతుని చుట్టును చేరి, యేడ్వసాగిరి. కౌసల్య భరతుని చెంతచేరి మనస్సు కలత నొందగా, నతనిని కౌగలించుకొనెను.

వత్సలా స్వం యథా వత్స ముపగూహ్య తపస్వినీ,
పరిపప్రచ్ఛ భరతం రుదంతీ శోకలాలసా. 7

శోచనీయస్థితి కల కౌసల్యయు భరతుని తన కన్నబిడ్డను వోలె కౌగలించుకొని యేడ్చుచు శోకపరవశయై యిట్లనెను.

పుత్ర! వ్యాధి ర్న తే కచ్చి చ్ఛరీరం పరిబాధతే,
అద్య రాజకుల స్యాస్య త్వదధీనం హి జీవితమ్. 8

త్వాం దృష్ట్వా పుత్ర! జీవామి రామే సభ్రాతృకే గతే,
వృత్తే దశరథే రాజ్ఞి నాథ ఏక స్త్వ మద్య నః. 9

నాయనా! వ్యాధి యేదేని నీ శరీరమును బాధించుట లేదు కదా? ఈనాడు రాజకులమంతయు నిన్ను చూచుకొనియే జీవించుచున్నది. నాయనా! రాముడు లక్ష్మణునితో కలసి యడవికి పోగా నేను నిన్ను చూచుకొనియే జీవించుచున్నాను. దశరథ మహారాజు మరణింపగా నీ వొక్కడవే మా కిపుడు దిక్కు.

కచ్చి న్ను లక్ష్మణే పుత్ర! శ్రుతం తే కించి దప్రియమ్,
పుత్రే వాఽప్యేకపుత్రాయా స్సహ భార్యే వనం గతే. 10

నీ కెవ్వ రైనను లక్ష్మణుని గూర్చిగాని, ఏకపుత్రనగు నా కుమారుడు సతీసమేతుడై అడవికేగిన రాముని గూర్చిగాని అప్రియము వినిపించిరా యేమి?

స ముహూర్తం సమాశ్వస్య రుద న్నేవ మహాయశాః,
కౌసల్యాం పరిసాంత్వ్యేదం గుహం వచన మబ్రవీత్. 11

మహాకీర్తిశాలియగు భరతు డట్లేడ్చుచునే యొకింత యూరడిల్లి, కౌసల్య నోదార్చి గుహున కిట్లనెను.

భ్రాతా మే క్వావస ద్రాత్రౌ క్వ సీతా క్వచ లక్ష్మణః,
అస్వప చ్ఛయనే కస్మిన్ కిం భుక్త్వా గుహ! శంస మే. 12

ఓ గుహుడా ! రాత్రి మా యన్న ఎచట నివసించెను ? సీత ఎచట నుండెను ? లక్ష్మణు డెచట రాత్రి గడిపెను ? వారే పాన్పుపై పరుండిరో నాకు చెప్పుము.

సోఽబ్రవీ ద్భరతం హృష్టో నిషాదాధిపతి ర్గుహః,
యద్విధం ప్రతిపేదే చ రామే ప్రియహితేఽతిథౌ. 13

గుహు డంతట రామువృత్తాంతమును చెప్ప అవకాశము కలిగెనని సంతోషించినవాడై, తనకు ప్రియుడు, హితు డగు రాము డతిథియై తన కడ కేతెంచగా తా నే యుపచార మొనరించెనో చెప్పెను.

అన్న ముచ్చావచం భక్షాః ఫలాని వివిధాని చ,
రామా యాభ్యవహారార్థం బహు చోపహృతం మయా. 14

నేను బహువిధమగు అన్నము, నానావిధములగు భక్ష్యములు, ఫలములు రాముని భోజనమునకై తెచ్చితిని.

త త్సర్వం ప్రత్యనుజ్ఞాసీ ద్రామ స్సత్యపరాక్రమః,
న తు తత్ప్రత్యగృహ్ణా త్స క్షత్రధర్మ మనుస్మరన్. 15

అమోఘపరాక్రమముగల రాముడు వాని నన్నింటిని నీవే తీసికొమ్మని నన్ననుమతించెను. క్షత్రియధర్మమును స్మరించుచు వాని నాతడు తీసికొనలేదు. (దానము క్షత్రియ ధర్మము కాని స్వీకరించుట కాదు. ఒకవేళ పరిగ్రహించినను ఋషులనుండి మాత్రమే రాముడు గ్రహించును.)

న హ్యస్మాభిః ప్రతిగ్రాహ్యం సఖే! దేయం తు సర్వదా,
ఇతి తేన వయం రాజ! న్ననునీతా మహాత్మనా. 16

రాజా ! ఆ మహాత్ముడు నాతో "మిత్రుడా ! ఎల్లప్పుడును మే మీయవలసిన వారమే కాని, స్వీకరింపదగినవారము కాము". అని మమ్ము సమాధాన పఱచెను.

విశే. రాముడు గుహు నననుయించుటకు కారణమిది. గుహుడు స్వామిభక్తులలో శ్రేష్ఠుడు కాన అతడిచ్చిన ఫలాదులు భక్తిపూతములే కావున శబరి యిచ్చిన ఫలములవలె, విదురునింట భోజనమువలె పరమభాగవతు డిచ్చిన వగుటచే స్వీకార్యములే యైనను, తనకు ప్రియతములైన తండ్రి, తల్లులు మున్నగు వా రనేకుల నెడబాసినందున మనస్సు కలతపడి, పుణ్యనదీతీరమున ఉపవాసము చేయ నెంచి, రాముడు గుహుడిచ్చిన వానిని స్వీకరింపలేదు. ఈ విషయము గుహుడును ఎఱుగును.

లక్ష్మణేన సమానీతం పీత్వా వారి మహాయశాః,
ఔపవాస్యం తదాఽకార్షీ ద్రాఘవ స్సహ సీతయా. 17

మహాకీర్తిశాలి యగు రాముడు లక్ష్మణుడు తెచ్చిన నీరు త్రాగి భార్యతో గూడ ఉపవాసము చేసెను.

తత స్తు జలశేషేణ లక్ష్మణోఽప్యకరో త్తదా,
వాగ్యతా స్తే త్రయ స్సంధ్యాం సముపాసత సంహితాః. 18

అపుడు మిగిలిన నీరు త్రావి లక్ష్మణుడును ఉపవసించెను. వారు మువ్వురును మౌనమవలంబించి యేకాగ్రతతో సంధ్యోపాసన మాచరించిరి.

విశే. (అయోధ్యాకాండ 50వసర్గ 48-49 శ్లోకములు చూడుడు) వెనుక 50వసర్గలో రాముడు మొదట సాయంసంధ్య నుపాసించి, తరువాత జలము త్రాగెనని చెప్పి, తిరిగి దానినే మరల చెప్పి ఈ సందర్భములో క్రమము తప్పి ముందు నీరు త్రాగెను. తరువాత సంధ్యావందనము చేసె నను టెట్లు ? అనగా సత్యమే. 50 సర్గలో చెప్పినదే సరియైన క్రమము. ఇచట గుహు డిచ్చిన అహారమును రాముడు వల దనినాడే ? అయన ఏ అహా రము స్వీకరించెనని ఆంకాక్ష కలుగగా దానికి సమాధానముగ లక్ష్మణుడు తెచ్చిన జలములు త్రాగెనని మొదటచెప్పినేకాని ఇచట క్రమము వివక్షితము కాలేదు. సరియే. ముువ్వురును సంధ్యావందన మాచరించు టెట్లు? సీత సంధ్య నుపాసించుట కుద రదు కదా అన్నచో ఆమెకును సంధ్యాకాలమున ధ్యానము, జపము మున్నగునవి చేయదగినవే.

సౌమిత్రిస్తు తతః పశ్చా దకరో త్స్వాస్తరం శుభమ్,
స్వయ మానీయ బర్హీంషి క్షిప్రం రాఘవకారణాత్. 19

లక్ష్మణు డట్లు నీరు త్రాగి, శీఘ్రమే రాముని కొఱకై దర్భలు స్వయముగ తెచ్చి, వానితో చక్కని శయనమును నిర్మించెను.

తస్మిన్ సమావిశ ద్రామ స్స్వాస్తరే సహ సీతయా,
ప్రక్షాళ్య చ తయోః పాదా వపచక్రామ లక్ష్మణః. 20

ఆ పాన్పుపై రాముడు సీతతో కలసి యుపవిష్టు డయ్యెను. లక్ష్మణుడు (గంగాతీరమున సంచరించుటచే బురదగొట్టుకొనిన) వారి పాదములు కడిగి యచట నుండి వెడలిపోయెను. (ఇచట

లక్ష్మణుడు రాముని పాదములు స్వయముగ కడిగెను. సీతాదేవి యట్లు కడుగుకొనుటకు నీరు తెచ్చి ఇచ్చెనని భావము.)

ఏత త్తదింగుదీమూల మిద మేవ చ తత్తృణమ్,
యస్మి న్రామశ్చ సీతా చ రాత్రిం తాం శయితా వుభౌ. 21

ఇదియే గారచెట్టు మొదలు. ఇదియే వారి పాన్పు కుపయోగించిన దర్భగడ్డి. ఇచటనే రామలక్ష్మణు లా రాత్రి నిదురించిరి.

నియమ్య పృష్ఠే తు తలాంగుళిత్రవాన్
శరై స్సుపూర్ణా విషుధీ పరంతపః,
మహ ద్ధను స్సజ్య ముపోహ్య లక్ష్మణో
నిశా మతిష్ఠ త్పరితోఽ స్య కేవలమ్. 22

శత్రువులను పీడించువాడగు లక్ష్మణుడు అల్లెత్రాటి దెబ్బ శరీరమునకు తాకకుండునట్లు అత్తెమును, హస్తకవచమును, ధరించి, వెనుక మూపునకు బాణములతో నిండిన రెండమ్ముల పొదులు కట్టుకొని, నారి సంధించిన పెద్ద విల్లు చేతబట్టి శయనముపై నిదురింపక (సీతారాముల కన్నివైపులనుండి రక్షణము కొఱకు) ప్రదక్షిణముగ నిచట తిరుగ సాగెను.

తత స్త్వహం చోత్తమచాపబాణధృత్
స్థితోఽభవం తత్ర స యత్ర లక్ష్మణః,
అతంద్రిభిర్ జ్ఞాతిభి రాత్తకార్ముకై
ర్మహేంద్రకల్పం పరిపాలయం స్తదా. 23

అపుడు నేనును ఉత్తమమగు వింటిని, బాణములను

ధరించి, విండ్లు ధరించిన మా బంధువులతో కూడి మహేంద్ర సమానుడగు రాముని కాపాడుచు లక్ష్మణుడున్న చోటనే నిలిచితిని.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తాశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున ఎనుబదియేడవ సర్గము సమాప్తము.

---

## అష్టాశీతితమః సర్గః - ఎనుబదియెనిమిదవ సర్గము

తచ్ఛ్రుత్వా నిపుణం సర్వం భరత స్సహ మంత్రిభిః,
ఇంగుదీమూల మాగమ్య రామశయ్యా ముపేక్ష్య తామ్. 1

అబ్రవీ జ్జననీ స్సర్వా ఇహ తేన మహాత్మనా,
శర్వరీ శయితా భూమా విద మస్య విమర్దితమ్. 2

భరతు డట్లు పలికినది శ్రద్ధగా విని, మంత్రులతో గూడి యా గార చెట్టు మొదలు చేరి, యచట రాముని దర్భశయ్యను చూచి తల్లు లెల్లర కిట్లు చెప్పెను – 'అమ్మ! ఇచటనే మహాత్ముడగు రాము డా రాత్రి శయనించినాడు. ఈప్రదేశ మాతడు శయనించుటచే నలిగియున్నది.

మహాభాగకులీనేన మహాభాగేన ధీమతా,
జాతో దశరథే నోర్వ్యాం న రామ స్స్వప్తు మర్హతి. 3

మహాభాగ్యవంతుడగు ఇక్ష్వాకువంశమున బుట్టినవాడును మహాభాగ్యవంతుడును ధీమంతుడును అగు దశరథమహారాజు నకు జన్మించిన రాముడు భూమిపై నిదురింపదగడు.

అజినోత్తరసంస్తీర్ణే వరాస్తరణసంచయే,
శయిత్వా పురుషవ్యాఘ్రః కథం శేతే మహీతలే. 4

మెత్తని జింకతోలు పైన పఱుపబడిన శ్రేష్ఠములైన పఱుపులపై నిదురించిన నరశ్రేష్ఠుడగు రాము డెట్లు భూమిపై శయించును.

ప్రాసాదాగ్రవిమానేషు వలభీషు చ సర్వదా,
హైమరాజత భౌమేషు వరాస్తరణశాలిషు. 5

పుష్పసంచయచిత్రేషు చందనాగరుగంధిషు,
పాండురాభ్రప్రకాశేషు శుకసంఘరుతేషు చ. 6

ప్రాసాదవరవర్యేషు శీతవత్సు సుగంధిషు,
ఉషిత్వా మేరుకల్పేషు కృతకాంచనభిత్తిషు. 7

గీతవాదిత్రనిర్ఘోషై ర్వరాభరణనిస్వనైః,
మృదంగవరశబ్దై శ్చ సతతం ప్రతిబోధితః. 8

వందిభి ర్వందితః కాలే బహుభి స్సూతమాగధైః,
గాథాభి రనురూపాభి స్స్తుతిభి శ్చ పరంతపః. 9 9

శత్రువులను తపింపజేయునట్టి రాముడు విమానముల వలె నున్న రాజభవనముల పై భాగములందును, కూటాగారము లందును, బంగారముతో, వెండితో నిర్మించబడిన భూతలములు

కలవియు, శ్రేష్ఠములగు చిత్రకంబళములు పఱచబడినవియు, వివిధవర్ణములుకల పూవు లనేకము లలంకరింపబడినవియు, చందనము, అగరువుల ధూపముల సుగంధము కలవియు, తెల్లని మేఘముల వలె ప్రకాశించునవియు, చిలుకలగుంపుల ధ్వనులు కలవియు, ఉత్తమ రాజభవనములతో నెల్ల శ్రేష్ఠమైన వియు, చల్లదనము కలవియు, కర్పూరాదుల గంధము కలవియు, అగు మహాభవనములలో నిదురించి, పాటలు, వాని ననుసరించిన వీణాదిధ్వనులతో, పరిచారికలు చేతులకు, పాదములకు ధరించిన కంకణములు, నూపురములూ మున్నగు యాభరణముల శింజారవములతో, మద్దెలల విశేషధ్వనులతో ఎల్లపుడు మేల్కొలుపబడినవాడై, ప్రాతఃకాలమున వందులచే, సూతులచే, మాగధులచే అనుగుణములగు గద్య విశేషములతో, స్తోత్రప్రబంధములలో నుతింపబడినవాడే.

అశ్రద్ధేయ మిదం లోకే న సత్యం ప్రతిభాతి మా,
ముహ్యతే ఖలు మే భావ స్స్వప్నోఽయ మితి మే మతిః.

రాము డిట్లు తృణశయనముపై శయనించుట నాకు నమ్మదగిన మాటగా తోచదు. నాకిది సత్య మనిపించుటలేదు. నా హృదయము తెలివి దప్పెనా ఏమి ? ఇది అంతయు కలయేమో అనిపించుచున్నది.

న నూనం దైవతం కించి త్కాలేన బలవత్తరమ్,
యత్ర దాశరథీ రామో భూమా వేవ శయీత సః. 11

నిశ్చయముగ దైవము కాలముకంటె బలవత్తరము కాదు.

ఎల యన దశరథమహారాజ పుత్రుడగు రాముడును ఈ కాలమున భూమిమీదనే శయనింపవలసివచ్చెను కదా.

విదేహరాజస్య సుతా సీతా చ ప్రియదర్శనా,
దయితా శయితా భూమౌ స్నుషా దశరథస్య చ. 12

విదేహరాజు కూతురు, కన్నుల పండువగా నొప్పునట్టిది, రామునకు ప్రాణములకన్న ప్రీతిపాత్రురాలు, దశరథమహారాజు కోడలగు సీతయు నేలపై పరుండెనే.

ఇయం శయ్యా మమ భ్రాతు రిదం హి పరివర్తితమ్,
స్థండిలే కఠినే సర్వం గాత్రై ర్విమృదితం తృణమ్. 13

ఇచట నా యన్న శయనించెను. ఇచట దొరలెను. ఈ కఠినమైన నేలపై నున్న ఈ దర్భలన్నియు రాముని దొరలుటచే నలిగియున్నవి.

మన్యే సాభరణా సుప్తా సీతాఽస్మి న్ఛయనోత్తమే,
తత్ర తత్ర హి దృశ్యంతే సక్తాః కనకబిందవః. 14

ఈ యుత్తమశయనముపైననే సీత శ్రమవశముచే తన యాభరణములు తీయకయే పరుండెనని తలంతును. ఏలయన అట నట ఈ పాన్పుపై బంగారు పొడి రాలి అగుపడుచున్నది.

ఉత్తరీయ మిహాఽఽసక్తం సువ్యక్తం సీతయా తదా,
తథా హ్యేతే ప్రకాశంతే సక్తాః కౌశేయతంతవః 15

ఆమె శయనించినపు డామె చీరపైకొంగు ఇచట తగిలియుండును. కావుననే అట నట పట్టుదారములు తగులుకొని ప్రకాశించుచున్నవి.

మన్యే భర్తు స్సుఖా శయ్యా యేన బాలా తపస్వినీ,
సుకుమారీ సతీ దుఃఖం న విజానాతి మైథిలీ 16

భర్త పాన్పు ఎట్టిదైనను (కఠినమైనను, మృదులమైనను) పతివ్రత కది సుఖమునే కలిగించునని తలంతును. ఏల యన సుకుమారియు, పతివ్రతయు అగు సీత ఈ శయనముపై శయనించియు దుఃఖము నెఱుగకున్నది.

హా హన్తాఽస్మి నృశంసోఽహం యత్సభార్యః కృతే మమ,
ఈదృశీం రాఘవ శ్శయ్యా మధిశేతే హ్యనాథవత్. 17

అయ్యో! నే నెంత క్రూరుడను! నావలన కదా పత్నీ సహితుడగు రాముడు దిక్కులేనివానివలె నిట్టి (కఠిన) శయ్యపై శయనించుచున్నాడు.

సార్వభౌమకులే జాత స్సర్వలోకస్య సమ్మతః,
సర్వలోకప్రియ స్త్యక్త్వా రాజ్యం సుఖ మనుత్తమమ్. 18
కథ మిందీవరశ్యామో రక్తాక్షః ప్రియదర్శనః,
సుఖభాగీ న దుఃఖార్హ శ్శయితో భువి రాఘవః. 19

రాముడు సార్వభౌములగు రాజుల వంశమున బుట్టినవాడు. ప్రజల కెల్లరకు అనుకూలుడు, ప్రీతిపాత్రుడు. నల్ల కలువ వంటి శరీరచ్ఛాయ కలవాడు, ఎఱ్ఱని కన్నులు కలవాడు, చూచువారి కానందము గూర్చువాడు, సుఖములు పొందదగినవాడు, దుఃఖము లనుభవింపదగడు. అట్టి యన్న రాఘవుడు సర్వోత్తమములగు సుఖముల కాలవాలమైన రాజ్యము విడి యెట్లు నేలపై శయనించెను ?

ధన్యః ఖలు మహాభాగో లక్ష్మణ శ్శుభలక్షణః,
భ్రాతరం విషమే కాలే యో రామ మనువర్తతే. 20

మహాభాగ్యశాలి, శుభలక్షణయుక్తు డగు లక్ష్మణుడు కష్ట కాలమున అన్నయగు రాము ననుసరించుచున్నాడు అతడు నిజముగా ధన్యుడు.

సిద్ధార్థా ఖలు వైదేహీ పతిం యాఽనుగతా వనమ్,
వయం సంశయితా స్సర్వే హీనా స్తేన మహాత్మనా. 21

భర్తను వెంబడించి యడవి కేగిన సీతాదేవి కృతార్థురాలు. మహాత్ముడగు రాము నెడబాసిన మేమందఱము - మా సేవ నత డంగీకరించునో లేదో యని సందేహాత్ములమై యున్నాము.

అకర్ణధారా పృథివీ శూన్యేవ ప్రతిభాతి మా,
గతే దశరథే స్వర్గం రామే చారణ్య మాశ్రితే. 22

దశరథ మహారాజు స్వర్గస్థుడై, రాము డడవికి పోగా రక్షకుడగు ప్రధానపురుషుడు లేని యీ భూమి నాకు శూన్యముగా తోచుచున్నది.

న చ ప్రార్థయతే కశ్చి న్మనసాపి వసుంధరామ్,
వనేఽపి వసత స్తస్య బాహువీర్యాభిరక్షితామ్. 23

రాము డడవిలోనే నివసించుచున్నను, అతని భుజబలముచే కాపాడబడిన యీ పుడమి నే సామంతుడును మనస్సులో నైనను కోరుటలేదు.

శూన్యసంవరణారక్షా మయంత్రితహయద్విపామ్,
అపావృతపురద్వారాం రాజధానీ మరక్షితామ్. 24

అప్రహృష్టబలాం న్యూనాం విషమస్థా మనావృతామ్,
శత్రవో నాభిమన్యంతే భక్ష్యా న్విషకృతా నివ. 25

ఇపు డయోధ్యలో ప్రాకారములకు కావలివాండ్రు లేరు. గుఱ్ఱములు, ఏనుగులను సంరక్షించు రౌతులు వానిని కట్టివేయుట లేదు. నగరద్వారములు తెఱువబడియున్నవి. రాజధానిలో తగు రక్షణ సన్నాహమే లేదు. సైన్యము సంతోషము లేనిదైయున్నది. నగర మన్ని యెడల కొఱవడి, క్లేశములో జిక్కి, బాహ్యరక్షకులు లేనిదైయున్నది. ఇట్లన్ని విధములుగ శత్రువుల కయోధ్య సులభ సాధ్య మయినను, శత్రురాజు లీ నగరమును విషము కలిపిన పిండివంటను వలె కబళింప నుద్యమించుటలేదు

అద్య ప్రభృతి భూమౌ తు శయిష్యేఽహం తృణేషు వా,
ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్. 26

తస్యార్థ ముత్తరం కాలం నివత్స్యామి సుఖం వనే,
తం ప్రతిశ్రవ మాముచ్య నాస్య మిథ్యా భవిష్యతి. 27

నే నిటుపై పండ్లు, దుంపలు తినుచు, జడలు, నారబట్టలు ధరించి నేలపైననో, గడ్డిపైననో శయనించెదను. రాము డిప్పటి వఱ కనుభవించిన వనవాసకాలము గడువగా, తక్కిన సమయమున నే నాతనికి బదులుగా నడవిలో సుఖముగ గడపెదను. అన్న నాతని ప్రతిజ్ఞనుండి విడిపింతును. నే నిట్లు చేయుటచే ఆయన ప్రతిజ్ఞ అసత్యము కానేఱదు.

వసంతం భ్రాతు రర్థాయ శత్రుఘ్నో మాఽనువత్స్యతి,
లక్ష్మణేన సహ త్వార్యో హ్యయోధ్యాం పాలయిష్యతి. 28

నా యన్నకై నే నడవిలో నుండగా శత్రుఘ్నుఁడు నన్నను సరించును. పూజ్యుఁడగు రాముఁడు లక్ష్మణునితో గూడి యయోధ్యను పరిపాలించును.

అభిషేక్ష్యంతి కాకుత్స్థ మయోధ్యాయాం ద్విజాతయః,
అపి మే దేవతాః కుర్యు రిమం సత్యం మనోరథమ్. 29

అయోధ్యలో బ్రాహ్మణులు రాముని రాజ్యమునం దభిషేకింతురు. దేవత లీ కోరికను సఫలము చేయుదురా!

ప్రసాద్యమాన శ్శిరసా మయా స్వయం
బహుప్రకారం యది నాభిపత్స్యతే,
తతోఽనువత్స్యామి చిరాయ రాఘవం
వనే వస న్నార్హతి మా ముపేక్షితుమ్. 30

నేను శిరము వంచికొని యనేకరీతుల నా యన్నను ప్రసన్నుని జేసికొన ప్రయత్నింతును. అప్పటికిని అత డంగీకరింపకున్నచో చిరకాలము నే నతనినే యంటిపెట్టుకొని యడవిలో నివసింతును. రాముడు నన్నుపేక్షించుట యుక్తముగాదు అని విలపించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అష్టాశీతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమందయోధ్యాకాండమున ఎనుబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

## ఏకోననవతితమః సర్గః - ఎనుబదితొమ్మిదవ సర్గము

వ్యుష్య రాత్రిం తు తత్రైవ గంగాకూలే స రాఘవః,
భరతః కాల్య ముత్థాయ శత్రుఘ్న మిద మబ్రవీత్. 1

రఘువంశసంభూతు డగు భరతు డా రాత్రి గంగాతీర ముననే నివసించి, వేకువనే లేచి శత్రుఘ్నున కిట్లనెను.

శత్రుఘ్నోత్తిష్ఠ కిం శేషే నిషాదాధిపతిం గుహమ్,
శీఘ్ర మానయ భద్రం తే తారయిష్యతి వాహినీమ్. 2

శత్రుఘ్నా! లెమ్ము. ఇంకను నిదురించుచుంటి వేల? శీఘ్రమే నిషాదరాజగు గుహుని రావింపుము. నీకు శుభమగు గాక! గుహు డీ సేనను నది దాటింపగలడు.

జాగర్మి నాహం స్వపిమి తమేవార్యం విచింతయన్,
ఇత్యేవ మబ్రవీ ద్భ్రాత్రా శత్రుఘ్నోఽపి ప్రచోదితః. 3

శత్రుఘ్నుడును భరతునిచే నట్లు ప్రేరితుడై 'అన్నా! ఆర్యు డగు రాముని మదిలో దలంచుచు నేను జాగరమే చేయుచుంటిని కాని నిదురించుట లేదు'

ఇతి సంవదతో రేవ మన్యోన్యం నరసింహయోః,
ఆగమ్య ప్రాంజలిః కాలే గుహో భరత మబ్రవీత్. 4

అని యిట్లు నరశ్రేష్ఠు లిరువురు సంభాషించుచుండగా, గుహుడు తగు సమయమున వచ్చి, ప్రణామ మొనర్చి భరతున కిట్లనెను.

కచ్చి త్సుఖం నదీతీరేఽవాత్సీః కాకుత్స్థ ! శర్వరీమ్,
కచ్చి త్తే సహసైన్యస్య తావ త్సర్వ మనామయమ్. 5

ఓ కాకుత్స్థుడా ! నదీతీరమున రాత్రి సుఖముగ నుంటివా? నీకును నీ సైన్యమునకును కుశలమే కదా !

గుహస్య వచనం శ్రుత్వా త త్తు స్నేహా దుదీరితమ్,
రామ స్యానువశో వాక్యం భరతోఽపీద మబ్రవీత్. 6

రామాయత్తు డగు భరతుడును ప్రీతితో గుహుడు పలికిన వచన మాలించి యతని కిట్లనెను.

సుఖా న శ్శర్వరీ రాజన్ ! పూజితా శ్చాపి తే వయమ్,
గంగాం తు నౌభి ర్బహ్వీభి ర్దాశా స్సంతారయంతు నః.7

నిషాదరాజా ! రాత్రి మా కిచట సుఖముగ గడచినది. నీవును మమ్ము సత్కరించితివి. ఇటుపై మీ దాసులు మమ్ము పలు నావల పైనెక్కించి యీ నది దాటింపవలెను.

తతో గుహ స్సంత్వరితం శ్రుత్వా భరతశాసనమ్,
ప్రతి ప్రవిశ్య నగరం తం జ్ఞాతిజన మబ్రవీత్. 8

భరతు నాజ్ఞ విని, గుహుడు వెంటనే తన నగరమును ప్రవేశించి తన బంధువుల కిట్లనెను.

ఉత్తిష్ఠత ప్రబుధ్యధ్వం భద్ర మస్తు చ వ స్సదా,
నావ స్సమనుకర్షధ్వం తారయిష్యామ వాహినీమ్. 9

మేల్కొనుడు. లెండు. మీ కెల్లపుడు శుభ మగుగాక ! పడ

వలను లాగికొనిరండు. భరతుడు మున్నుగువారిని నది దాటించుదుము.

తే తథోక్తా స్సముత్థాయ త్వరితా రాజశాసనాత్,
పంచనావాం శతా న్యాశు సమానిన్యు స్సమంతతః. 10

గుహు డట్లు వారికి చెప్పగా, రాజశాసనము ననుసరించి వారు వేగిరపడుచు అన్నివైపులనుండి ఐదువందల పడవలను లాగికొని వచ్చిరి.

అన్యా స్స్వస్తికవిజ్ఞేయా మహాఘంటాధరా వరాః,
శోభమానాః పతాకాభి ర్యుక్తవాహాః స్సుసంహతాః. 11

అట్లు తెచ్చిన ఐదువందల చిన్నపడవలు కాక, స్వస్తిక మను రచనావిశేషముతోడ (రెండు పెద్ద పడవలు జంటగా చేసినపుడు) నాల్గు కోణములలో పెద్దగంటలు కట్టబడినవై, రాజార్హము లగుటచే బంగారపు పూతతో శోభిల్లుచు, కొయ్యతో నావలకు గోడలు నిర్మించి, కిటికీలు పెట్టుటచే పెనుగాలి ప్రసరింపక ఉచితముగ మాత్రమే గాలి వీచుట కలవి, బాగుగా యినుపచీలతో బిగియగొట్టబడిన దృఢముగనున్న పెద్ద పడవలు కూడ తెచ్చిరి.

తత స్స్వస్తికవిజ్ఞేయాం పాండుకంబళసంవృతామ్,
సనందిఘోషాం కల్యాణీం గుహో నావ ముపాహరత్.
తా మారురోహ భరత శ్శత్రుఘ్న శ్చ మహాబలః.

అనంతరము స్వస్తికరచనావిశిష్టములగు పెద్దనావల నడుమ తెల్లని కంబళితో కప్పబడిన తల (క్రింది) ప్రదేశము

కలిగి, హర్షజనకములగు కింకిణి మున్నగువాని గణగణ శబ్ద ముతో కూడినదైన, సుందరమగు నావను గుహుడు స్వయముగ తెచ్చెను. భరతుడును, మహాబలుడగు శత్రుఘ్నుడును ఆ నావ నెక్కిరి.

కౌసల్యా చ సుమిత్రా చ యా శ్చాన్యా రాజయోషితః.13
పురోహిత శ్చ తత్పూర్వం గురవో బ్రాహ్మణా శ్చ యే,
అనంతరం రాజదారా స్తథైవ శకటాపణాః. 14

మొదట పురోహితుడు, గురువులు, బ్రాహ్మణులు వా వెనుక కౌసల్య మున్నగు రాణులు, వారి వాహనములు, వివిధ పదార్థములును వేతొక స్వస్తిక రచనా విశిష్టమగు నావపై ఎక్కింప జేయబడిరి.

ఆవాస మాదీపయతాం తీర్థం చాప్యవగాహతామ్,
భాండాని చాదదానానాం ఘోష స్త్రిదివ మస్పృశత్.15

తాము నివసించిన ప్రదేశమును తగులబెట్టు వారి యొక్కయు, పడవలపై నెక్కుటకు రేవులో దిగుచున్నవారి యొక్కయు కలకలము మిన్ను ముట్టెను.

పతాకిన్య స్తు తా నావ స్స్వయం దాశై రధిష్ఠితాః,
వహంత్యో జన మారూఢం తదా సంపేతు రాశుగాః. 16

చెంబడివారు పడవలనెక్కి, తెరచాప లెత్తిరి. జను లా పడవలలో కూర్చుండిరి. అవు డా పడవ లనాయాసముగ శీఘ్రమే పోయినవి.

నారీణా మభిపూర్ణా స్తు కాశ్చి త్కాశ్చి చ్చ వాజినామ్,
కాశ్చి దత్ర వహంతి స్మ యానయుగ్యం మహాధనమ్. 17

నావలలో కొన్ని స్త్రీలతో, మఱికొన్ని పడవలు అమూల్య ములగు రథశకటాదులను, ఎద్దులు, కంచరగాడిదలవంటి బరువు లాగు జంతువులను తీసికొనిపోయెను.

తా స్స్మ గత్వా పరం తీర మవరోప్య చ తం జనమ్,
నివృత్తాః కాండచిత్రాణి క్రియంతే దాశబంధుభిః 18

చెంబడినారటు లా జనులను పడవలపై నది కవ్వలిగట్టు నకు తీసికొనిపోయి, యచట దింపి, వెనుకకు మఱలి పడవలలో బరువు లేకుండుటచే తేలికగనున్న ఆ పడవలను విచిత్రముగ నడుప సాగిరి.

స వైజయంతా స్తు గజా గజారోహప్రచోదితాః,
తరంత స్స్మ ప్రకాశంతే సధ్వజా ఇవ పర్వతాః. 19

రాజగృహములతో కూడిన ఏనుగులు, మావటీంద్రచే పురి గొల్పబడినవై నదిదాటుచు నడచుచున్న పర్వతముల వలె ప్రకా శించినవి. (రాజులు ఏనుగులపై చిన్న గృహములు కట్టించి, వానిపై కూరుచుండి ప్రయాణముచేయుదురు. కావున అట్టి గృహ ములతో కూడిన ఏనుగులు పోవుచుండగా పర్వతములు నడచు చున్నట్లు లుండెను. ఇచట ధ్వజ గతౌ అను ధాతువును బట్టి సధ్వజాం అనగా పోవుచున్న అని అర్థము గోవిందరాజీయమున చెప్పబడినది).

నావ స్త్వారురుహు శ్చాన్యే ప్లవై స్తేరు స్తథా పరే,
అన్యే కుంభఘటై స్తేరు రన్యే తేరు శ్చ బాహుభిః. 20

నదిని-కొందరు నావలనెక్కియు, మఱికొందరు తెప్పలపై గూర్చుండియు, ఇంకను కొందరు ఏనుగుల కుంభస్థలములపై నెక్కియు, మఱికొందరు చేతులతో నీదియు దాటిరి.

సా పుణ్యా ధ్వజినీ గంగా ద్దాశై స్సంతారితా స్వయమ్,
మైత్రే ముహూర్తే ప్రయయౌ ప్రయాగవన ముత్తమమ్. 21

గంగా జలస్పర్శచే పవిత్రమైన యా సేన చెంబడివారిచే దాటింప బడినదై, మైత్ర మను ముహూర్త మందు శ్రేష్ఠమగు ప్రయాగవనము చేరెను.

విశే. ముహూర్తమన 2 ఘడియలు. దినమునకు 15 ముహూర్తములు. అందు మూడవ ముహూర్తము మైత్ర మనబడును.

ఆశ్వాసయిత్వా చ చమూం మహాత్మా
నివేశయిత్వా చ యథోపజోషమ్,
ద్రష్టుం భరద్వాజ మృషిప్రవర్య
మృత్విగ్వృత స్సన్ భరతః ప్రతస్థే. 22

అంత మహాత్ము డగు భరతుడు తాను ప్రయాణమున నలసియు, ఏ శ్రమయు లేనివారివలె సైన్యము నూరడిల్లజేసి, యథాసుఖముగ వారిని విడియజేసి, వసిష్ఠాది ఋత్విజులతో గూడి ఋషిశ్రేష్ఠు డగు భరద్వాజ ని దర్శింప వెడలెను.

స బ్రాహ్మణస్యాఽశ్రమ మభ్యుపేత్య
మహాత్మనో దేవపురోహితస్య,

దదర్శ రమ్యోటజవృక్షషండం
మహద్వనం విప్రవరస్య రమ్యమ్. 23

భరతుడచట వేదవిదుడును, మహాజ్ఞానముకలవాడును, (బృహస్పతి కుమారుడగుటచే) దేవపురోహితుడును, విప్రశ్రేష్ఠుడగు భరద్వాజుని సుందరములగు పర్ణశాలలు, చెట్లగుంపులు కల చక్కని మహావనమును చూచెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోననవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమందయోధ్యాకాండమున ఎనుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## నవతితమః సర్గః - తొంబదవ సర్గము

భరద్వాజాశ్రమం దృష్ట్వా క్రోశా దేవ నరర్షభః,
బలం సర్వ మవస్థాప్య జగామ సహ మంత్రిభిః. 1

పద్భ్యా మేవ హి ధర్మజ్ఞో న్యస్తశస్త్రపరిచ్ఛదః,
వసానో వాససీ క్షౌమే పురోధాయ పురోధసమ్. 2

ధర్మ మెఱిగినవాడును, నరశ్రేష్ఠుడును అగు భరతుడు భరద్వాజు నాశ్రమమును చూచి, క్రోసుదూరమునకు ముందే సైన్యమును నిలిపివైచి, ఆయుధములు, ఆభరణములు విడిచి, రెండు పట్టువస్త్రములు కట్టుకొని, పురోహితుని ముందిడుకొని మంత్రిసమేతుడై కాలినడకనే యట కేగెను.

తత స్సందర్శనే తస్య భరద్వాజస్య రాఘవః,
మంత్రిణ స్తా నవస్థాప్య జగా మానుపురోహితమ్. 3

భరతు డట్లాశ్రమమున ప్రవేశించి, భరద్వాజుని దూర మున నుండి చూచుటతోడనే మంత్రుల నటనే నిలిపి, పురోహితుడు ముందు నడువగా తా నాతని వెనుకనే ముని కడ కేగెను.

వసిష్ఠమథ దృష్ట్వైవ భరద్వాజో మహాతపాః,
సంచచాలాఽఽసనా త్తూర్ణం శిష్యా నర్ఘ్యమితి బ్రువన్. 4

అంత వసిష్ఠుని చూచినదే తడవుగా మహాతపస్వి యగు భరద్వాజుడు - శిష్యుల కర్ఘ్యము తెచ్చుట కాజ్ఞాపించుచునే యాసనమునుండి లేచి నిలచెను

సమాగమ్య వసిష్ఠేన భరతే నాభివాదితః,
అబుద్ధ్యత మహాతేజా స్సుతం దశరథస్య తమ్ 5

మహాతేజశ్శాలియగు భరద్వాజుడును వసిష్ఠుని కలసికొని, భరతుడు తనకు ప్రణమిల్లగా, వసిష్ఠునితో వచ్చిన వాడగు టచే నతనిని దశరథతనయు డగు భరతునిగా నెఱింగెను.

తాభ్యా మర్ఘ్యం చ పాద్యం చ దత్త్వా పశ్చా త్ఫలాని చ,
ఆనుపూర్వ్యా చ్చ ధర్మజ్ఞః పప్రచ్ఛ కుశలం కులే. 6

ధర్మజ్ఞు డగు భరద్వాజముని మొదట వసిష్ఠునకు, తరువాత భరతునకును అర్ఘ్యము, పాద్యముల నొసగి, ఫలముల నిచ్చి, వసిష్ఠుని, భరతుని-కుటుంబకుశల మడిగెను.

అయోధ్యాయాం బలే కోశే మిత్రే ష్వపి చ మంత్రిషు,
జానన్ దశరథం వృత్తం న రాజాన ముదాహరత్.

ఆ ముని అయోధ్యానగరవాసులకు, సైన్యమునకు, కోగారమునకు, మిత్రులకు, మంత్రులకును కుశల మడిగెన దశరథుని మరణవార్త నెఱిగియుండుటచే, నతని విషయము ప్రకలేదు.

వసిష్ఠో భరత శ్చైనం పప్రచ్ఛతు రనామయమ్.
శరీరేఽగ్నిషు వృక్షేషు శిష్యేషు మృగపక్షిషు.

అనంతరము వసిష్ఠుడు, భరతుడును భరద్వాజమహర్షి శరీరారోగ్యమును గూర్చియు, అగ్నులను గూర్చియు, వనస్పతులను గూర్చియు, శిష్యులను గూర్చియు, ఆశ్రమమందలి పశుపక్షాదులను గూర్చియు కుశల మడిగిరి.

త థేతి త త్ప్రతిజ్ఞాయ భరద్వాజో మహాతపాః,
భరతం ప్రత్యువాచ చేదం రాఘవస్నేహబంధనాత్. 9

మహాతపస్వి యగు భరద్వాజు డెల్లరకు కుశలమే యని పలికి, రామునిపై తనకు కల ప్రీతికొలది భరతున కిట్లనెను.

కిమి హాగమనే కార్యం తవ రాజ్యం ప్రశాసతః,
ఏత దాచక్ష్వ మే సర్వం నహి మే శుద్ధ్యతే మనః. 10

నీవు రాజ్యము పరిపాలించుచుంటివి కదా. ఇట కేల వచ్చితివి ? నా కీవిషయ మంతయు తెలుపుము. నీ విషయమున నా మనస్సు శుద్ధముగ లేకున్నది. (నీయందు విశ్వాసము లేనిదై యున్నది).

సుషువే య మమిత్రఘ్నం కౌసల్యాऽऽనందవర్ధనమ్,
భ్రాత్రా సహ సభార్యో య శ్చిరం ప్రవ్రాజితో వనమ్. 11

నియుక్తః స్త్రీనియుక్తేన పిత్రా యోऽసౌ మహాయశాః,
వనవాసీ భ వే తీహ సమాః కిల చతుర్దశ. 12

కచ్చి న్న త స్యాపాపస్య పాపం కర్తు మి హేచ్ఛసి,
అకంటకం భోక్తుమనా రాజ్యం త స్యానుజస్య చ. 13

శత్రువులను నాశ మొందించువాడును, మిత్రుల కానందము పెంపొందింపజేయువాడు అగు ఏ తనయుని కౌసల్యాదేవి కనెనో, భార్యతో, తమ్మునితో నెవ డడవికి పంపబడెనో, ఏ మహాయశస్వి తన సవతితల్లి కైకేయిచే ప్రేరితుడైన తండ్రిచే పదునాలుగు సంవత్సరము లడవిలో నివసింపుమని పంపబడెనో, అట్టి పాపరహితుడగు రాముని విషయమునను, తమ్ముడగు లక్ష్మణుని విషయమునను - నీ రాజ్యము శత్రురహితము కావలెనను తలంపుతో పాప మాచరించుటకు (వారిరువురిని చంపుటకు) నీ విచ్ఛగించుట లేదు కదా ?

ఏవ ముక్తో భరద్వాజం భరతః ప్రత్యువాచ హ,
పర్యశ్రునయనో దుఃఖా ద్వాచా సంసజ్జమానయా. 14

భరద్వాజు డిట్లు పలుకగా భరతుని కన్నులు అశ్రుపూర్ణము లయ్యెను. అతడు దుఃఖముతో మాటలు తడబడగా నిట్లు బదులు పలికెను.

హతోऽస్మి యది మా మేవం భగవా నపి మన్యతే,
మత్తో న దోష మాశంకే నైవం మా మనుశాధి హి. 15

భూత భవిష్యద్వర్తమానముల నెఱిగిన మహాత్ముడవు. నీ వే నన్నిట్లు తలంచుచో నేను హతుడ నైతిని. (నేను దోషిని కాను కనుక) నావల్ల నే దోషమును నే నూహించుట లేదు కావున నీవు నన్నిట్లు కర్ణకఠోరముగ పలుకదగదు.

న చైత దిష్టం మాతా మే య దవోచ న్మదంతరే,
నాహ మేతేన తుష్ట శ్చ న తద్వచన మాదదే. 16

(నీ తల్లి చేసిన దోషము నీ దోషమే యనెదవేమో), నేను చెంతలేనపుడు నాతల్లి పలికిన మాటలు నా కభిమతములు కావు. ఆమె వరములచే నేను సంతోషింపలేదు. ఆమె మాట నాదరింపను.

అహం తు తం నరవ్యాఘ్ర ముపయాతః ప్రసాదకః,
ప్రతినేతు మయోధ్యాం చ పాదౌ త స్యాభివందితుమ్. 17

నే నా పురుషశ్రేష్ఠు డగు రాముని ప్రసన్నుని చేసికొని అయోధ్యకు కొనిపోవుటకును, ఆయన పాదములకు ప్రణమిల్లుటకు వచ్చితిని.

త్వం మా మేవం గతం మత్వా ప్రసాదం కర్తు మర్హసి,
శంస మే భగవ! న్రామః క్వ సంప్రతి మహీపతిః. 18

కావున నీవు నన్నీ యభిప్రాయముతో వచ్చిన వానినిగా తెలిసికొని యనుగ్రహింపదగుదువు. ఓ పూజ్యుడా! భూపతి యగు రాము డిపు డెచట నున్నాడో తెలుపుము.

వసిష్ఠాదిభి ర్ఋత్విగ్భి ర్యాచితో భగవాం స్తతః,
ఉవాచ తం భరద్వాజః ప్రసాదా ద్భరతం వచః. 19

అంత వసిష్ఠుడు మున్నగువారు కూడ భరతునిపై ప్రసన్నుడవు కమ్మని భరద్వాజుని ప్రార్థింపగా, ప్రసన్నుడై యతడు భరతున కిట్లనెను.

త్వ య్యేత త్పురుషవ్యాఘ్ర! యుక్తం రాఘవవంశజే,
గురువృత్తి ర్దమ శ్చైవ సాధూనాం చానుయాయితా. 20

ఓ పురుషశ్రేష్ఠుడా! రఘువంశమున పుట్టిన నీకు జ్యేష్ఠానువర్తనము, ఇంద్రియనిగ్రహము, (రాజ్యకాంక్ష లేకుండుట) సజ్జనచిత్తానువర్తన మను నీ గుణము లనుగుణముగనే యున్నవి.

జానే చైత న్మనఃస్థం తే దృఢీకరణ మ స్త్వితి,
అపృచ్ఛం త్వాం తథాఽత్యర్థం కీర్తిం సమభివర్ధయన్.21

నీ మదిలోని భావము నే నెఱుగుదును. అయినను దానిని మఱింత దృఢమొనరించుటకు, నీ పెద్దన్నను నీ వనుసరించుట వలని కీర్తిని మిగుల పెంపొందించుచు నట్లడిగితిని.

జానే చ రామం ధర్మజ్ఞం ససీతం సహ లక్ష్మణమ్,
అసౌ వసతి తే భ్రాతా చిత్రకూటే మహాగిరౌ. 22

ధర్మ మెఱిగిన రాముడు సీతాలక్ష్మణసమేతుడై ఇపుడెచట నున్నాడో నే నెఱుగుదును. నీ అన్న చిత్రకూటమను మహాపర్వతముపై నివసించుచున్నాడు.

శ్వస్తు గంతాసి తం దేశం వ సాద్య సహ మంత్రిభిః,
ఏతన్మే కురు సుప్రాజ్ఞ! కామం కామార్థకోవిద! 23

రేపు నీ వా ప్రదేశమునకు పోవచ్చును. నేడు మంత్రు

లతో నీ విచటనే యుండుము. ఓ మహాబుద్ధిశాలీ! కోరిన కోరికలను దీర్చుటలో సమర్థుడా! నా యీ యభీష్టము నెఱవేర్పుము" అనెను.

తత స్తథే త్యేవ ముదారదర్శనః
ప్రతీతరూపో భరతో౽బ్రవీ ద్వచః,
చకార బుద్ధిం చ తదా తదాశ్రమే
నిశానివాసాయ నరాధిపాత్మజః. 24

అంత ఉదారమగు దృష్టికల రాజకుమారుడు తన స్వరూప స్వభావములచే ప్రసిద్ధమగు కీర్తికలవాడగు భరతుడు, అట్లే యని పలికి, భరద్వాజు నాశ్రమమున నా రాత్రి నివసింప నిశ్చయించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే అదికావ్యే అయోధ్యాకాండే
నవతితమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, అదికావ్య మగు శ్రీమద్రామాయణమునందయోధ్యాకాండమున తొంబదియవ సర్గము సంపూర్ణము.

—0—

## ఏకనవతితమః సర్గః – తొంబదియొకటవ సర్గము

కృతబుద్ధిం నివాసాయ తత్త్రైవ స మని స్తదా,
భరతం కైకయీపుత్త్రం మాతిథ్యేన న్యమంత్రయత్. 1

ఆముని, యటులు తన యాశ్రమముననే నివసింప నిశ్చ యించిన కైకేయీతనయుడగు భరతుని, భోజన పర్యంత మగు నతిథిసత్కారము స్వీకరింప ప్రార్థించెను.

అబ్రవీ ద్భరత స్త్వేనం "న న్విదం భవతా కృతమ్,
పాద్య మర్ఘ్యం తథాఽఽతిథ్యం వనే యదుపపద్యతే. 2

అపుడు భరతు డిట్లనెను - మునీ! ఈ వనమున లభించు ఫల మూలాదితాపసాహారముచే - నీ వాతిథ్య మొసగితివి కదా! (నేను దానిచేతనే తృప్తుడ నైతి నని భావము)

అ థోవాచ భరద్వాజో భరతం ప్రహస న్నివ,
జానే త్వాం ప్రీతిసంయుక్తం తుష్యే స్త్వం యేన కేనచిత్.

దానికి భరద్వాజుడు నవ్వుచు భరతున కిట్లనెను- నీకు నాపై ప్రీతి కలదని నే నెఱుగుదును. నీ వెంత సామాన్యపు సత్కారముచే గూడ సంతోషము నందెదవు.

సేనాయా స్తు త వైతస్యాః కర్తు మిచ్ఛామి భోజనమ్.
మమ ప్రీతి ర్యథారూపా త్వ మర్హో మనుజర్షభ! 4

నీ యీ సైన్యమం దెల్లరకును నేను భోజన మీయ దలంచు చున్నాను. ఓ నరశ్రేష్ఠా! నీవు నా ప్రీతి కనుగుణముగ నంగీక రింపదగుదువు.

కిమర్థం చాపి నిక్షిప్య దూరే బల మిహాగతః,
కస్మా న్నే హోపయాతోఽసి సబలః పురుషర్షభ! 5

పురుషశ్రేష్ఠుడా ! నీవేల సైన్యమును దూరముననే నిలిపి వచ్చితివి ? సైన్యముతో కూడి యిట కేల రావైతివి ?

భరతః ప్రత్యువాచ చేదం ప్రాంజలి స్తం తపోధనమ్,
ససైన్యో నోపయాతోఽస్మి భగవన్ ! భగవద్భయాత్. 6

అంత భరతుడా తపోధనుడగు భరద్వాజునకు కేలుమోడ్చి యిట్లు బదులిడెను – 'ఓ మహాత్మా ! నీవాశ్రమకృత్యముల కంతరాయము కలుగునని కోపింతువని సైన్యముతో రానైతిని.

రాజ్ఞా చ భగవ న్నిత్యం రాజపుత్త్రేణ వా సదా,
యత్నతః పరిహర్తవ్యా విషయేషు తపస్వినః. 7

ఓ భగవంతుడగు మునీ ! రాజుగాని, రాజపుత్రుడుగాని సైన్యముతో – మునులుండు తావులకు పోరాదు. అట్లుపోకుండుటకు మిగుల ప్రయత్నపడవలయును.

వాజిముఖ్యా మనుష్యా శ్చ మత్తాశ్చ వరవారణాః,
ప్రచ్ఛాద్య భగవన్!భూమిం మహతీ మనుయాంతి మామ్.

ఓ భగవంతుడా ! ఉత్తమాశ్వములు, మనుజులు, మదించిన శ్రేష్ఠములగు ఏనుగులుకల, నాసేన భూమిపై విస్తృతమగు ప్రదేశము నాక్రమించి న న్ననుసరించుచున్నది.

తే వృక్షా నుదకం భూమి మాశ్రమే షూటజాం స్తథా,
న హింస్యు రితి తే నాహ మేక ఏవ సమాగతః. 9

ఆ గుల్మములు మున్నగునవి ఆశ్రమము లందలి చెట్లను,

సీటిని, నేలను, పర్ణశాలలను హింసింపకుందురు గాక యని తలంచి నే నొక్కడనే వచ్చితిని అనెను

> ఆనీయతా మిత స్సేనే త్యాజ్ఞప్తః పరమర్షిణా,
> తత స్స చక్రే భరత స్సేనాయా స్సముపాగమమ్ 10

'సేనను రప్పింపు' మని మహర్షి యాజ్ఞాపించగా, భరతుడు సేన నటకు రప్పించెను.

> అగ్నిశాలాం ప్రవి శ్యాథ పీత్వాఽపః పరిమృజ్య చ,
> ఆతిథ్యస్య క్రియా హేతో ర్విశ్వకర్మాణ మాహ్వయత్ 11

అంతట భరద్వాజుడు పవిత్రత కొఱ కగ్నిగృహమున కేగి, మూడు మాఱు లాచమనము చేసి, రెండుమాఱులు పెదవులు తుడుచుకొని, అతిథుల కాతిథ్య మిచ్చుటకై విశ్వకర్మ నాహ్వాన మంత్రముతో నిట్లాహ్వానించెను.

> ఆహ్వయే విశ్వకర్మాణ మహం త్వష్టార మేవ చ,
> ఆతిథ్యం కర్తు మిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. 12

సర్వశిల్పకర్తయగు విశ్వకర్మను, శీఘ్రముమే గృహాది నిర్మాణము చేయు త్వష్టను నే నాహ్వానించుచున్నాను. నే నతిథుల కాతిథ్య మీయగోరుచున్నాను. ఇందులకు తగు గృహాది నిర్మాణము చేయవలయును.

> ఆహ్వయే లోకపాలాం స్త్రీన్ దేవాం శ్చక్రముఖాం స్తథా,
> ఆతిథ్యం కర్తు మిచ్ఛామి తత్ర మే సంవిధీయతామ్. 13

దేవేంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరు డను నలు

గురు లోకపాలుర నాహ్వానించుచున్నాను. నేను చేయదలచిన యాతిథ్యమునకై వారు తగు సంవిధానము (అహారాదికము) కలిగించవలయును.

ప్రాక్స్రోతస శ్చ యా నద్యః ప్రత్యక్స్రోతస ఏవ చ,
పృథివ్యా మంతరిక్షే చ సమాయాం త్వద్య సర్వశః. 14

భూమియందును, అంతరిక్షమందును తూర్పుదిక్కుగా, పశ్చిమదిశగా ప్రవహించు నదు లన్నియు నిప్పుడే యొక్కమ్మడిగ రావలయును.

అన్యా స్స్రవంతు మైరేయం సురా మన్యా స్సునిష్ఠితామ్,
అపరా శ్చోదకం శీత మిక్షుకాండరసోపమమ్. 15

వానిలో కొన్ని నదులు మిరాదేశపు (ఖర్జూరములనుండి తీయు) మద్యమును, మఱికొన్ని నదులు గౌడి, పౌష్టి, మాధ్వి యని త్రివిధమగు సురను, ఇంకను కొన్ని చెఱకురసమువలె తీయనైన చల్లని నీటిని ఈయవలయును.

అహ్వాయే దేవగన్ధర్వా న్విశ్వావసుహాహాహుహూన్,
త థై వాప్సరసో దేవీ ర్గన్ధర్వీ శ్చాపి సర్వశః 16

అట్లే హాహాహూహూ మున్నగు దేవగంధర్వులను, దేవజాతికి, గంధర్వజాతికి చెందిన రెండువిధములగు అప్సరలను ఎల్లర నాహ్వానించుచున్నాను

ఘృతాచీ మథ విశ్వాచీం మిశ్రకేశీ మలంబుసామ్,
నాగదంతాం చ హేమాం చ హిమా మద్రికృతస్థలామ్. 17

అట్లే ఘృతాచి, విశ్వాచి, మిశ్రకేశి, అలంబుస నాగదంత, హేమ, హిమ, అద్రికృతస్థల అను నీ ప్రధానాప్సరల నాహ్వానించుచున్నాను

శక్రం యా శ్చోపతిష్ఠంతి బ్రహ్మాణం యా శ్చ యోషితః,
సర్వా స్తుంబురుణా సార్థ మాహ్వాయే సపరిచ్ఛదాః. 18

దేవేంద్రుని సేవించుచుండు రంభ, ఊర్వశి, మేనక మున్నగు నప్సరలను, బ్రహ్మను సేవించు ఐదువందల యప్సరలను అందఱను తుంబురుని నృత్తగీతాదులకు కావలసిన యుపకరణములతో రావలసినదిగా నాహ్వానించుచున్నాను.

వనం కురుషు య ద్దివ్యం వాసోభూషణపత్రవత్,
దివ్యనారీఫలం శశ్వ త్తత్కౌబేర మిహైతు చ. 19

వస్త్రములు, ఆభరణములు ఆకులుగా కలది. దేవకాంతలే పండ్లుగా కలది, ఉత్తరకురుదేశమం దున్నది యగు కుబేరు చిత్రరథమను ఉద్యానము శీఘ్రమే యిటకు రావలెనని కుబేరు నాహ్వానించుచున్నాను.

ఇహ మే భగవాన్ సోమో విధత్తా మన్న ముత్తమమ్,
భక్ష్యం భోజ్యంచ చోష్యంచ లేహ్యంచ వివిధం బహు. 20

మాహాత్మ్యముగల చంద్రు డిచట శ్రేష్ఠమగు - భక్ష్యము (పిండివంట) భోజ్యము (అన్నము మొ.) చోష్యము (పులుసు మొ.) లేహ్యము (రసాయనాది) అను చతుర్విధాన్నమును విరివిగా, పలుప్రకారముగా కల్పించవలెనని యతని నాహ్వానించుచున్నాను.

విచిత్రాణి చ మాల్యాని పాదపప్రచ్యుతాని చ,
సురాదీని చ పేయాని మాంసాని వివిధాని చ. 21

చెట్లనుండి రాలిపడిన పూలతో అల్లిన మాలలు, సుర మున్నగు పానీయములు, వివిధమాంసములను, చంద్రు డొసంగు గాక !

ఏవం సమాధినా యుక్త స్తేజసాఽప్రతిమేన చ
శీక్షాస్వరసమాయుక్తం తపసా చాబ్రవీ న్మునిః. 22

ఇట్లు యోగబలముచేతను, అహారము తీసికొనక శరీర మును కృశింపజేయుట యను తపముతోడను, తనయాహ్వానమును మన్నించి రాకున్నచో దండింప సమర్థమగు తేజముతోడను కూడి నట్టి యా భరద్వాజమహర్షి శిక్షాశాస్త్రమున జెప్పబడిన యుచ్చా రణ విధి ననుసరించి సస్వరముగ పైవారి నెల్లర నాహ్వానించెను.

మనసా ధ్యాయత స్తస్య ప్రాఙ్ముఖస్య కృతాంజలేః,
అజగ్ము స్తాని సర్వాణి దైవతాని పృథ క్పృథక్. 23

తూర్పుదిశకు తిరిగి, అంజలి దాల్చి, మనసులో నా యా దేవతల నామహర్షి తలంచుచుండగనే ఆ దేవత లెల్లరు వేర్వే రుగా నట కేతెంచిరి.

మలయం దర్దురం చైవ తత స్స్వేదనుదోఽనిలః,
ఉపస్పృశ్య వవౌ యుక్త్యా సుప్రియాత్మా సుఖ శ్శివః. 24

అంతట చందనవృక్షముల కావాసమైెల మలయపర్వ తము, దాని చెంత నున్న దర్దురమను పర్వతమును తాకుచు

మిగుల ప్రియస్వభావముకలది, సుఖము కలిగించునది, చల్లని దగు వాయువు స్పర్శచే చెమటను పోగొట్టుచు వీచెను.

తతోఽభ్యవర్తంత ఘనా దివ్యాః కుసుమవృష్టయః,
దివ్యదున్దుభిఘోషశ్చ దిక్షు సర్వాసు శుశ్రువే. 25

అంతట నాకసమునుండి యెడతెగక పూలవానలు కురిసెను. దిక్కు లన్నింటను దేవదుందుభుల ధ్వనులు వినిపించెను.

ప్రవవు శ్చోత్తమా వాతా ననృతు శ్చాప్సరోగణాః,
జగు శ్చ దేవగన్ధర్వా వీణాః ప్రముముచు స్స్వరాన్. 26

సుఖము గూర్చు మందానిలములు వీచినవి. అచ్చరలు నాట్యము చేసిరి. దేవతలు, గంధర్వులు పాడిరి. వీణలు స్వరములు పలికినవి.

స శబ్దో ద్యాం చ భూమిం చ ప్రాణినాం శ్రవణాని చ,
వివేశోచ్చారితః శ్లక్ష్ణ స్సమో లయగుణాన్వితః. 27

ఆ శబ్ద ముచ్చరింపబడగనే కోమలమై, శ్రుతిసమమై, లయతో గూడినదై భూమ్యాకాశములను, సకలప్రాణుల శ్రవణేంద్రియములను ప్రవేశించెను.

తస్మి న్నుపరతే శబ్దే దివ్యే శ్రోత్రసుఖే నృణామ్,
దదర్శ భారతం సైన్యం విధానం విశ్వకర్మణః. 28

జనుల వీనుల కింపైన యా దివ్యమగు ధ్వని యాగగా, భరతుని సేన విశ్వకర్మ నిర్మాణకౌశలమును కాంచెను.

బభూవ హి సమా భూమి స్సమన్తా త్పంచయోజనా,
శాద్వలై ర్బహుభి శ్ఛన్నా నీల వైడూర్యసన్నిభైః. 29

నాల్గు వైపులను ఐదు యోజనముల మేఱకు భూమి సమ మయ్యెను. నీలమణి, వైడూర్యములు పరచినట్లు మిక్కుటమగు పచ్చిక బీడు దట్టముగ నేలపై నేర్పడెను.

తస్మి న్బిల్వాః కపిత్థా శ్చ పనసా బీజపూరకాః,
అమలక్యో బభూవు శ్చ చూతా శ్చ ఫలభూషణాః. 30

ఆ ప్రదేశమున మారేడులు, వెలగచెట్లు, పనసచెట్లు, మాదీఫలపు చెట్లు, ఉసిరిక చెట్లు, మామిడిచెట్లును పండ్లతో నొప్పుచు నేర్పడెను.

ఉత్తరేభ్యః కురుభ్య శ్చ వనం దివ్యోపభోగవత్,
ఆజగామ నదీ దివ్యా తీరజై ర్బహుభి ర్వృతా. 31

ఉత్తరకురుదేశమునుండి దివ్యములగు భోగముల కాలవాలమగు చైత్రరథమను కుబేరుని యుద్యానమును, తీరమందనేక వృక్షములతో వివిధనదులును వచ్చెను.

చతుశ్శాలాని శుభ్రాణి శాలా శ్చ గజవాజినామ్,
హర్మ్యప్రాసాదసమ్బాధా స్తోరణాని శుభాని చ. 32

అట్లే నిర్మలములగు నాలుగు గదుల యిండ్లును, గజశాలలు, గుఱ్ఱపుసాలలును, శ్రేష్ఠములగు భవనములును, తోరణమాలలును (లేదా బహిర్ద్వారములును) ఏర్పడెను.

సితమేఘనిభం చాపి రాజవేశ్మ సుతోరణమ్,
దివ్యమాల్యకృతాకారం దివ్యగన్ధసముత్థితమ్. 33
చతురశ్ర మసమ్బాధం శయనాసనయానవత్,
దివ్యై స్సర్వరసై ర్యుక్తం దివ్యభోజనవస్త్రవత్. 34
ఉపకల్పితసర్వాన్నం ధౌతనిర్మలభాజనమ్.

అందొక రాజభవన మావిర్భవించెను. అది తెల్లని పూతతో తెల్లని మేఘమువలె నొప్పుచు, చక్కని తోరణములతో నలంకరింపబడి యుండెను. సుందరములగు పూలమాలలతో నలంకృతమై, ఉత్తమ సుగంధ ద్రవ్యములు చల్లబడియుండెను. విశాలముగ నలుచదరముగ నుండి, పాన్పులు, ఆసనములు వాహనములు కలిగియుండెను. అందు అన్నిరుచులతో కూడిన దివ్యభోజనములు, వస్త్రము లుండెను. అందన్ని విధముల యన్నములు సిద్ధముగ నుండెను. పాత్రలు చక్కగా శుభ్రముచేయుటచే మెఱయుచుండెను.

క్లృప్తసర్వాసనం శ్రీమ త్స్వాస్తీర్ణశయనోత్తమమ్. 35
ప్రవివేశ మహాబాహు రనుజ్ఞాతో మహర్షిణా,
వేశ్మ త ద్రత్నసంపూర్ణం భరతః కైకయీసుతః. 36

కైకేయీతనయుడు మహాభుజుడగు భరతుడు మహర్షియనుమతింపగా, కల్పింపబడిన సకలపీఠములు కలదియు, ఉత్తమములగు పఱుపులు పాన్పులపై పఱచబడినదియు, రత్నములతో నిండినదియు అగు నా యింట ప్రవేశించెను.

అనుజగ్ము శ్చ తం సర్వే మంత్రిణ స్సపురోహితాః,
బభూవుశ్చ ముదా యుక్తా దృష్ట్వా తం వేశ్మసంవిధిమ్.

పురోహితులు, మంత్రులు మున్నగువా రెల్లరు భరతు నను సరించి యా భవనమును ప్రవేశించి, యా భవన సంవిధానమును చూచి మోదము జెందిరి

తత్ర రాజాసనం దివ్యం వ్యంజనం ఛత్ర మేవ చ,
భరతో మంత్రిభి స్సార్ధ మభ్యవర్తత రాజవత్. 38

అచట నున్న దివ్యమగు సింహాసనమునకు చామరము లను, తెల్ల గొడుగునకు భరతుడు మంత్రులతో గూడి రాజు(ము) నకు వోలె ప్రదక్షిణ మాచరించెను.

ఆసనం పూజయామాస రామా యాభిప్రణమ్య చ,
వాలవ్యజన మాదాయ న్యషీద త్సచివాసనే. 39

రాము డచట సింహాసనముపై కూర్చుండి యున్నటులు భావించి, యతనిని పూజించి, ప్రణమిల్లి, చామరము దాల్చి మంత్రులు కూరుచుండు అసనముపై కూర్చుండెను.

అనుపూర్వ్యా న్నిషేదు శ్చ సర్వే మంత్రిపురోహితాః,
తత స్సేనాపతిః పశ్చా త్ప్రశాస్తా చ నిషేదతుః. 40

భరతుని తరువాత పురోహితుడు, పిమ్మట మంత్రులు, ఆపైన సేనాపతి, అటుపై శిబిరపాలకుడు అను నీ క్రమము ననుసరించి వారచట కూర్చొనిరి.

తత స్తత్ర ముహూర్తేన నద్యః పాయసకర్దమాః,
ఉపాతిష్ఠంత భరతం భరద్వాజస్య శాసనాత్. 41

ఏమ్మట నచట భరద్వాజు నాజ్ఞచే పాయసమే బురదగా కల నదులు (పాయసముతో నిండినవి) భరతుని చెంత ప్రవహించుచు నతనిని సేవించినవి.

తాసా ముభయతః కూలం పాండుమృత్తిక లేపనాః,
రమ్యా శ్చావసథా దివ్యా బ్రహ్మణ స్తు ప్రసాదజాః. 42

ఆనదుల యుభయతీరములందును భరద్వాజుని యనుగ్రహముచే సుధాలేపితములై సుందరములైన దివ్యగృహము లేర్పడెను.

తే నైవ చ ముహూర్తేన దివ్యాఽఽభరణభూషితాః,
ఆగు ర్వింశతిసాహస్రా బ్రహ్మణా ప్రహితాః స్త్రియః. 43

ఆ క్షణముననే బ్రహ్మచే పంపబడిన యిరువదివేల స్త్రీలు దివ్యాభరణములు దాల్చి యట కేతెంచిరి.

సువర్ణమణిముక్తేన ప్రవాళేన చ శోభితాః,
ఆగు ర్వింశతిసాహస్రాః కుబేరప్రహితాః స్త్రియః. 44

అట్లే కుబేరుడు పంపిన యిరువదివేల స్త్రీలు బంగారము, మణులు, ముత్యములు, పగడముల నలంకరించుకొని యచోటకు వచ్చిరి.

యాభి ర్గృహీతః పురుష స్సోన్మాద ఇవ లక్ష్యతే,
ఆగు ర్వింశతిసాహస్రా నన్దనా దప్సరోగణాః. 45

కుబేరుడు పంపగా నందనవనమునుండి వచ్చిన అప్సరలెవ్వనినైన యాలింగనము చేయుచో, నతడు మైమఱచి యున్మ

త్తుని వలె సంచరించును. అట్టి యా సుందరాంగన లిఖువదివే లట కేతెంచిరి.

నారద స్తుమ్బురు ర్గోపః ప్రవరా స్సూర్యవర్చసః,
ఏతే గన్ధర్వరాజానో భరత స్యాగ్రతో జగుః. 46

నారదుడు (ఈయన బ్రహ్మ పుత్రుడు కాక ఒక గంధర్వుడు), తుంబురుడు, గోపుడను శ్రేష్ఠులగు గంధర్వరాజులు సూర్యునివలె తేజముతో వెలుగుచు భరతుని యెదుట పాడిరి.

అలమ్బుసా మిశ్రకేశీ పుండరీకాఽథ వామనా,
ఉపానృత్యం స్తు భరతం భరద్వాజస్య శాసనాత్. 47

అలంబుస, మిశ్రకేశి, పుండరీక, వామన యను నప్సరసలు భరద్వాజు నాజ్ఞచే భరతుని యెదుట మిగుల నాడిరి. (ఇచట భరద్వాజుని యాజ్ఞచె నచ్చర లాడి రనుటచే భరద్వాజుడు భరతునకు రామునియం దెట్టి యభిప్రాయ మున్నదో యాతిథ్యమను నెపముచే పరీక్షించెనని సూచితము).

యాని మాల్యాని దేవేషు యాని చైత్రరథే వనే,
ప్రయాగే తా న్యదృశ్యన్త భరద్వాజస్య తేజసా. 48

దేవతల యుద్యానములగు నందనాదులయం దే యే పూలమాలలు కలవో, కుబేరుని చిత్రరథవనమం దే పుష్పమాలిక లున్నవో యవి యన్నియు భరద్వాజుని ప్రభావముచే ప్రయాగకడ నున్న భరద్వాజాశ్రమ వనవృక్షములం దగపడెను.

బిల్వా మార్దంగికా ఆసన్ శమ్యా గ్రాహా విభీతకాః,
అశ్వత్థా నర్తకా శ్చాస న్భరద్వాజస్య తేజసా. 49

భరద్వాజుని యాజ్ఞచే మారేడుచెట్లు మద్దెలలు వాయించెను. తాండ్రచెట్లు తాళము వేసెను. రావిచెట్లు నాట్యమాడెను.

తత స్సరళతాలా శ్చ తిలకా నక్తమాలకాః,
ప్రహృష్టా స్తత్ర సమ్పేతుః కుబ్జా భూత్వాఽథ వామనాః 50

పిమ్మట సరళవృక్షములను, తాడిచెట్లును, తిలకవృక్షములును, గానుగ చెట్లును, గూనివి, పొట్టివియునైయుండ మిగుల హర్షముతో తిరుగసాగెను.

శింశుపామలకీజమ్బ్వ యా శ్చాన్యాః కాననేషు తాః,
మాలతీ మల్లికా జాతి ర్యా శ్చాన్యాః కాననే లతాః. 51
ప్రమదా విగ్రహం కృత్వా భరద్వాజాశ్రమేఽవసన్,
సురాం స్సురాపాః పిబత పాయసం చ బుభుక్షితాః. 52
మాంసాని చ సుమేధ్యాని భక్ష్యంతాం యావ దిచ్ఛథ.

శింశుప, అమలకము ,(ఉసిరి) నేరేడు తక్కిన వనవృక్షములును, మాలతి, మల్లె, జాజి మఱియు తక్కిన వనలతలును, స్త్రీరూపములు దాల్చి భరద్వాజాశ్రమమందు భరతసైనికులతో సారాయిత్రాగువారు యథేచ్ఛగ సారాయి త్రాగుడు. ఆకలిగొన్నవారట్లే పాయసము తినుడు. పరిశుద్ధ మాంసములను తినుడు.

ఉచ్ఛాద్య స్నాపయంతి స్మ నదీతీరేషు వల్గుషు. 53
అ ప్యేక మేకం పురుషం ప్రమదా స్సప్త చాష్ట చ,
సంవాహన్త్య స్సమాపేతు ర్నార్యో రుచిరలోచనాః. 54
పరిమృజ్య తథాఽన్యోన్యం పాయయంతి వరాంగనాః,

సుందరనదీతీరములం దేడెనమం(డ్రు స్త్రీలు కలసి యొక్కొక్క పురుషునికి నలుగులు పెట్టి, స్నానములు చేయించిరి. అందమైన కన్నులుగల యంగనలు పురుషుల పాదములు పిసుకుచు, వారి యొడలిపై తడిని గడ్డతో తుడిచి వారిచే మద్యము త్రాగించిరి.

హయాన్ గజాన్ ఖరా నుష్ట్రాం స్తథైవ సురభే స్సుతాన్. 56
అభోజయ న్వాహనపా స్తేషాం భోజ్యం యథావిధి.

భరద్వాజుని ప్రభావముచే నేర్పడిన వాహనపాలకులు, గుఱ్ఱములకును, ఏనుగులకును, గాడిదలకును, ఒంటెలకును, యెద్దులకును విధిప్రకారము వానివానికి వలయు నాహారము లొసంగిరి.

ఇక్షూ న్మధు చ లాజాం శ్చ భోజయంతి స్మ వాహనాన్,
ఇక్ష్వాకువరయోధానాం చోదయంతో మహాబలాః.

ఋషిప్రభావముచే నేర్పడిన మహాబలులగు వాహనపాలురు ఇక్ష్వాకువంశ్యుడగు భరతుని యోధుల గుఱ్ఱములు మున్నగు వాహనములను చెఱకులు, తేనె కలసిన పేలాలు తినుటకై ప్రోత్సహించుచు, తినిపించిరి.

నాశ్వబంధోఽశ్వ మాజానా న్న గజం కుంజరగ్రహ 57
మత్తప్రమత్తముదితా చమూ స్సా తత్ర సంబభౌ.

అప్పుడచట సైన్యమంతయు మత్తెక్కించు పదార్థములను సేవించి, మైమఱచి యుత్సాహముతో నుండెను. అందుచే గుఱ్ఱ

వుహాడు తన గుఱ్ఱమును కాని, మావటీడు తన యేనుగునుగాని గుర్తింపలేకుండెను.

తర్పితా స్సర్వకామై స్తే రక్తచందనరూషితాః, 58
అప్సరోగణసంయుక్తా స్సైన్యా వాచ ముదైరయన్.

ఆయోధు లన్నికోర్కెలు తీర్చి తృప్తినందించబడినవారై, మొదలికి రక్తచందన మలము కొని. అచ్చరల సమూహములతో గూడి యిట్లు పలికిరి.

నై వాయోధ్యాం గమిష్యామో న గమిష్యామ దండకాన్.59
కుశలం భరత స్యాస్తు రామ స్యాస్తు తథా సుఖమ్,
ఇతి పాదాతయోధా శ్చ హస్త్యశ్వారోహబన్ధకాః. 60
అనాథా స్తం విధిం లబ్ధ్వా వాచ మేతా ముదైరయన్.

"మే మింక నయోధ్యకుగాని, దండకారణ్యమునకుగాని పోనే పోము. భరతునకు కుశలమగుగాక ! రామునకు సుఖ మగుగాక!" అని కాల్బలమువారు, గుఱ్ఱపువారు. ఏనుగులవారు, వానిని కట్టుట మున్నగు పనిచేయువారును ఆ సత్కారము బడసి, స్వతంత్రులై యిట్లు పలికిరి.

సంప్రహృష్టా వినేదు స్తే నరా స్తత్ర సహస్రశః, 61
భరత స్యానుయాతార స్స్వర్గోఽయ మితి చాబ్రువన్.

అచట వేలకొలది భరతుని యనుచరు లట్లు ఇది స్వర్గ మిది స్వర్గమని పలుకుచు, హర్షమునొంది గర్జింపసాగిరి.

నృత్యంతి స్మ హసంతి స్మ గాయంతి స్మ చ సైనికాః, 62
సమస్తా త్పరిధావంతి మాల్యోపేతా స్సహస్రశః.

వేలకొలదిగా నా సైనికులు మాలలు దాల్చి కొందరు నాట్యము చేయసాగిరి. కొందరు నవ్వజొచ్చిరి. మఱికొంద ఱిటు నటు పరువెత్తిరి.

తతో భుక్త్వాం తేషాం తదన్న మమృతోపమమ్, 63
దివ్యా నుద్వీక్ష్య భక్ష్యాం స్తా నభవ ద్భక్షణే మతిః.

భక్ష్యములు మిక్కిలి రసవంతములుగా నుండుటచే, నప్పటికే యొకమారు భుజించిన వారైనను, అమృతోపమమగు అన్నమును, దివ్యములగు భక్ష్యములను చూచిన యా సైనికులకు మఱల వానిని తినవలెనని బుద్ధి పుట్టెను.

ప్రేష్యా శ్చేట్య శ్చ వధ్వశ్చ బలస్థా శ్చ సహస్రశః 64
బభూవు స్తే భృశం దృష్టా స్సర్వే చాహతవాససః.

ఆ సేనయందలి పరిచారికలు, దాసీలు, యోధుల భార్యలు అగు సేనలోని వేలాది స్త్రీలు క్రొత్తయుడుపులు దాల్చి గర్వించి యుండిరి.

కుఞ్జరా శ్చ ఖరోష్ట్రా శ్చ గోఽశ్వాశ్చ మృగపక్షిణః 65
బభూవు స్సుభృతా స్తత్ర నాన్యో హ్యన్య మకల్పయత్.

ఆ సేనలోని యేనుగులు, గాడిదలు, ఒంటెలు, గోవులు, గుఱ్ఱములును, పశుపక్షులును భరద్వాజుని మహిమచే మిగుల తృప్తినందినవై, ఋషి కల్పించిన యాహారముకంటె వేఱగు నాహారమును స్వీకరింపలేదు.

నా౽శుక్లవాసా స్తత్రా౽సీ త్క్షుధితో మలినో౽పి వా. 66
రజసా ధ్వస్తకేశో వా నరః కశ్చి దదృశ్యత,

ఆ సేనలో నొక్కడైనను తెల్లని వస్త్రములు ధరింపనివాడు గాని, ఆకలిగొనినవాడుగాని, ఒలుమాసినవాడుగాని, తలమాసిన వాడుగాని యగపడకుండెను.

అజై శ్చాపి చ వారాహై ర్నిష్ఠానవరసంచయైః, 67
ఫలనిర్యూహసంసిద్ధై స్సూపై ర్గన్ధరసాన్వితైః,
పుష్పధ్వజవతీః పూర్ణా శ్శుక్ల స్యాన్నస్య చాభితః. 68
దదృశు ర్విస్మితా స్తత్ర నరా లౌహీ స్సహస్రశః

మేకమాంసములతో, పందిమాంసములతో, శ్రేష్ఠపదార్థములతో పండ్లరసములు, చక్కెర కలిపి కాచిన రసాయనములతో, పప్పుపదార్థములతో, సుగంధములు, రుచులతో, అలంకారము కొఱకేర్పరచిన పుష్పముల కూర్పుతో, తెల్లని యన్నముతో నిండిన లోహపాత్రలు వేలకొలదిగా చూచి యా జను లచ్చెరువందిరి.

బభూవు ర్వనపార్శ్వేషు కూపాః పాయసకర్దమాః. 69
తా శ్చ కామదుఘా గావః ద్రుమా శ్చాప్య న్మధుశ్చ్యుతః.

అప్పుడా యటవీప్రాంతమందలి బావులు పాయసమే బురదగా కలిగి (పాయసభరితములై) యుండెను. గోవులు కోరిక తీరునంతగా పాలిచ్చునవియై యుండెను. చెట్లు తేనియలు గార్చెను.

వాప్యో మైరేయపూర్ణా శ్చ మృష్టమాంసచయై ర్వృతాః,
ప్రతప్తపిఠరై శ్చాపి మార్గమాయూరకౌక్కుటైః.

దిగుడు బావులు మైరేయ మను మద్యముతో నిండి యుండెను. ఇట్టి, నెమలి, కోడి మున్నగువాని మాంసము కుండలలో బాగుగ వండబడి ఆ బావుల చుట్టును పెట్టబడియుండెను.

స్థాలీనాం చ సహస్రాణి స్థాలీనాం నియుతాని చ. 71
న్యర్బుదాని చ పాత్రాణి శాతకుమ్భమయాని చ,
స్థాల్యః కుమ్భ్యః కరమ్భ్యశ్చ దధిపూర్ణా స్సుసంస్కృతాః.
యౌవనస్థస్య గౌరస్య కపిత్థస్య సుగంధినః,
హ్రదాః పూర్ణా రసాలస్య దధ్న శ్శ్వేతస్య చాపరే. 73
బభూవుః పాయస స్యాన్యే శర్కరాయావసంచయాః.

వేలకొలది అన్నపాత్రలు, లక్షలాది కూరగిన్నెలు, కోట్లకొలది బంగారుభోజన పాత్రలు, పెరుగునకు రుచి కూర్చు శొంఠి మున్నగునవి కలిపిన చిన్న ముంతలు, పాత్రలు, పెద్ద గిన్నెలును, ఒక జాము ముందుగా చిలికిన వెలగపండువాసన గలది, తెల్లనివన్నెగల మజ్జిగయు, జీలకర్ర దంచి కలిపిన రసాలమను మజ్జిగయు కల పాత్రలు, పాయసపాత్రలు, చక్కెరయు విశేషముగ నట నుండెను.

కల్కాం శ్చూర్ణ కషాయాం శ్చ స్నానాని వివిధాని చ. 74
దదృశు ర్భాజనస్థాని తీర్థేషు సరితాం నరాః.

ఉసిరికపండ్లతో చేయబడిన కల్కములు, ఒంటిలు రుద్దుకొను మినుపపొడి మున్నగు సుగంధద్రవ్యములు, నూనెలు, వేడినీరు మున్నగునవి, ఆ యా నదీతీరముల రేవులం దుండగా సైనికులు చూచిరి.

శుక్లా నంశుమతశ్చా పి దన్తధావనసంచయాన్, 76
శుక్లాం శ్చన్దనకల్కాం శ్చ సముద్గే ష్వవతిష్ఠతః,
దర్పణా న్పరిమృష్టాం శ్చ వాససాం చాపి సంచయాన్,
పాదుకోపానహాం చైవ యుగ్మాని చ సహస్రశః.

నిర్మలములు, కుంచెవచ్చు దంతధావన కాష్ఠములు, దొప్పలలో నుంచబడిన శ్రేష్ఠమగు చందనపంకములు, తుడువబడి చక్కగా నున్న యద్దములు, వస్త్రసమూహములు, కొయ్యతో చేసిన పావుకోళ్లజతలు చర్మనిర్మితములైన చెప్పుల జతలును (వారచట చూచిరి).

అంజనీః కఙ్కతా న్కూర్చాం శ్ఛస్త్రాణి చ ధనూంషి చ,
మర్మత్రాణాని చిత్రాణి శయనా న్యాసనాని చ,
ప్రతిపానహ్రదా న్పూర్ణా న్ఖరోష్ట్రగజవాజినామ్, 78
అవగాహ్య సుతీర్థాం శ్చ హ్రదాన్ సోత్పలపుష్కరాన్,
ఆకాశవర్ణప్రతిమాన్ స్వచ్ఛతోయా న్సుఖప్లవాన్, 79
నీలవైడూర్యవర్ణాం శ్చ మృదూ న్యవససంచయాన్,
నిర్వాపార్థాన్ పశూనాం తే దదృశు స్తత్ర సర్వశః. 80

కాటుకబరణిలను, దువ్వెనలను, స్నానము మొ. చేయుటకుపయోగించు ఆసనములను (కూర్చము-మీసములు మున్నగువానిని దువ్వుకొను సాధనవిశేష మని మహేశ్వరతీర్థీయము) పైనికులలంకారముకొఱకు ధరించు నాయుధములను, కవచాదులను, వింత గొలుపు శయ్యలును, ఆసనములను, గాడిదలు, ఒంటెలు, ఏనుగులు, గుఱ్ఱములు గడ్డి మేసిన పిమ్మట నీరు త్రాగుట

కుపయోగించు నీటితోనిండిన మడుగులను, స్నానముచేయదగిన రేవులను కలువలతో, తామరలతో కూడినవై, ఆకాశమువలె నిర్మలములై, ఉత్తమజలములు కలిగి, సుఖముగూర్చు స్నానమునకు యోగ్యములైన కొలనులను, నీలము, వైడూర్యము అను రత్నముల వన్నె కలిగి పశువుల కాహారమునకైన కోమలములగు పచ్చగడ్డి ప్రోవులను వా రెల్లెదలను చూచిరి.

వ్యస్మయన్త మనుష్యా స్తే స్వప్నకల్పం తదద్భుతమ్,
దృష్ట్వాఽఽతిథ్యం కృతం తాదృ గ్భరతస్య మహర్షిణా. 81

భరద్వాజమహర్షి భరతున కొనర్చినది స్వప్నము వంటిది, ఆశ్చర్య జనకమైన అతిథ్యవిశేషమును కాంచి వారు అందరు విస్మయమందిరి.

ఇ త్యేవం రమమాణానాం దేవానా మివ నన్దనే,
భరద్వాజాశ్రమే రమ్యే సా రాత్రి ర్వ్యత్యవర్తత. 82

అని యిట్లు నందనవనమున దేవతలవోలె, సుందరమగు నా భరద్వాజాశ్రమమున క్రీడించుచుండగనే నారి కారాత్రి గడచెను.

ప్రతిజగ్ము శ్చ తా నద్యో గంధర్వా శ్చ యథాగతమ్,
భరద్వాజ మనుజ్ఞాప్య తా శ్చ సర్వా వరాంగనాః. 83

అట్లు తెల్లవారగా ఆ నదులు, గంధర్వులు, ఆ శ్రేష్ఠతరుణులును భరద్వాజు ననుమతి వడసి వచ్చిన త్రోవనే పోయిరి.

తథైవ మత్తా మదిరోత్కటా నరా
స్తథైవ దివ్యాగరుచన్దనోక్షితాః,
తథైవ దివ్యా వివిధా స్స్రగుత్తమాః
పృథ క్ప్రకీర్ణా మనుజైః ప్రమర్దితాః. 84

మద్యము నాస్వాదించిన సమయమున నెట్లు మదించి యుండిరో యట్లే జనులు మదమత్తులై, అగరు, చందనాది అంగరాగయుక్తులై యుండిరి. దివ్యములు శ్రేష్ఠములగు పలువిధములైన మాలలు మాత్రము మత్తులైన జనులచే మర్దింపబడనవై యనుభవకాలమునకంటె విలక్షణములై యుండెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకనవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున తొంబదియొకటవ సర్గము సమాప్తము.

---

## ద్వినవతితమః సర్గః — తొంబదిరెండవ సర్గము

తత స్తాం రజనీ ముష్య భరత స్సపరిచ్ఛదః,
కృతాతిథ్యో భరద్వాజం కామా దభిజగామ హ. 1

భరతు డట్లు భరద్వాజు డాతిథ్యమీయగా సపరివారముగ నారాత్రి యచట నివసించి, రాముని చేరు కోరికతో నాముని కడ కేగెను.

తమృషిః పురుషవ్యాఘ్రం ప్రాఞ్జలిం ప్రేక్ష్యచాఽఽగతమ్,
హుతాగ్నిహోత్రో భరతం భరద్వాజోఽభ్యభాషత. 2

భరద్వాజమహర్షి అగ్నికార్య మొనరించి, తన కడకు వచ్చి ప్రాంజలియై నిలచిన పురుషశ్రేష్ఠుడగు భరతుని గాంచి యిట్లనెను.

కచ్చి దత్ర సుఖా రాత్రి స్తవాస్మద్విషయే గతా,
సమగ్ర స్తే జనః కచ్చి దాతిథ్యే శంస మేఽనఘ!, 3

'ఓ అనఘుడా! నీ కిచట రాత్రి సుఖముగ గడచినదా? నీ వారందఱు అతిథ్యముచే తృప్తి నందిరా? తెలుపుము' అనెను.

త మువాచాంజలిం కృత్వా భరతోఽభిప్రణమ్య చ,
ఆశ్రమా దభినిష్క్రాన్త మృషి ముత్తమతేజసమ్. 4

(భరతుడు వచ్చిన సమయముననే కౌసల్య మున్నగువారి నెల్లరను చూడవలెనని) యాశ్రమము బయటకు వచ్చిన గొప్ప తేజముతో వెలుగొందు భరద్వాజునకు అంజలి యొగ్గి, నమస్కరించి భరతు డిట్లనెను.

సుఖోషితోఽస్మి భగవ! న్సమగ్రబలవాహనః,
తర్పిత స్సర్వకామైశ్చ సామాత్యో బలవ త్త్వయా. 5

ఓ మహాత్మా! నేను నా సకలసైన్యము, వాహనములు, మంత్రులు, ఎల్లరును నీచే మిగుల తృప్తినందించబడినారము. నేను చాల సుఖముగ రాత్రి గడపితిని.

అపేతక్లమసన్తాపాః సుభిక్షాః స్సుప్రతిశ్రయాః,
అపి ప్రేష్యా నుపాదాయ సర్వే స్మ సుసుఖోషితాః. 6

మేము మా పరిచారకులు మొదలుకొని అందఱము అల
సట, తాపములేక, సమృద్ధములగు అన్నము పానీయముల నను
భవించి, సుందర గృహములందు నివసించి సుఖముగ రాత్రి
గడపితిమి.

ఆమంత్రయేఽహం భగవన్! కామం త్వా మృషిసత్తమ!,
సమీపం ప్రస్థితం భ్రాతు ర్మైత్రే ణేక్షస్వ చక్షుషా. 7

ఓ పూజ్యుడా! నేను యథేష్టముగ నిన్ను సెలవడుగు
చున్నాను. ఓ ఋషిశ్రేష్ఠుడా! నా యన్నకడకు పోవ సమక
ట్టిన నన్ను స్నేహదృష్టిలో చూడుము.

ఆశ్రమం తస్య ధర్మజ్ఞ! ధార్మికస్య మహాత్మనః,
ఆచక్ష్వ కతమో మార్గః కియా నితి చ శంస మే. 8

ఓ ధర్మ మెఱిగినవాడా! ధార్మికుడు, మహాత్ముడు అగు
మాయన్న రాము నాశ్రమ మెచట నున్నదో, ఏదారిని పోవలెనో,
తెలుపుము.

ఇతి పృష్టస్తు భరతం భ్రాతృదర్శనలాలసమ్,
ప్రత్యువాచ మహాతేజా భరద్వాజో మహాతపాః. 9

అని యట్లడుగగా, అన్నను చూడవలెనని కుతూహల
పడుచున్న భరతునకు, మహాతేజశ్శాలియు, మహాతపస్వియుః
అగు భరద్వాజు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

దిశన ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో కూడిన నీ సైన్యమును నడిపించుము. అపుడు నీవు రాముని చూతువు.

ప్రయాణ మితి త చ్ఛ్రుత్వా రాజరాజస్య యోషితః, 14
హిత్వా యానాని యానార్హా బ్రాహ్మణం పర్యవారయన్.

అని యీవిధముగ ప్రయాణమును గూర్చి విని దశరథ మహారాజు భార్యలు తా మెక్కిన శిబికాదివాహనములు దిగిరాదగనివారయ్యు, మునిపై నాదరముకొలది యాబ్రహ్మవిదునకు నమస్కరించుటకు అయన చెంత కేగిరి.

వేపమానా కృశా దీనా సహ దేవ్యా సుమిత్రయా, 15
కౌసల్యా తత్ర జగ్రాహ కరాభ్యాం చరణౌ మునేః.

వార్ధకముచేతను, ఋషిని దర్శించుటచేతను వణకుచున్నదియు, రామవిరహముచే చిక్కి, దైన్యము నొందినదియు అగు కౌసల్య సుమిత్రతోగూడి చేతులతో దశరథుని పాదములు పట్టి ప్రణమిల్లెను.

అసమృద్ధేన కామేన సర్వలోకస్య గర్హితా, 16
కైకేయీ తస్య జగ్రాహ చరణౌ సవ్యపత్రపా.

ఫలింపని కోరికచే, జను లెల్లరిచే నిందింపబడిన కైక, తాను రాము డడవికి పోవుటకు కారణమైతి నని లజ్జ నొందుచు ముని పాదములు తాకి నమస్కరించెను

తం ప్రదక్షిణ మాగమ్య భగవన్తం మహామునిమ్, 17
అదూరా ద్భరత స్యైవ తస్థౌ దీనమనా స్తదా.

ఆమె ఆమహర్షికి ప్రదక్షిణ మొనర్చి (ప్రదక్షిణ వాక్షిణ ముతో) భరతుని చెంత దీనయై, నిలచెను.

తతః పప్రచ్ఛ భరతం భరద్వాజో దృఢవ్రతః, ౹౮
విశేషం జ్ఞాతు మిచ్ఛామి మాతౄణాం తవ రాఘవ ।,

అంత దృఢనియమములుగల భరద్వాజుడు భరతున కిట్లనెను – 'ఓ రాఘవుడా! నీ తల్లుల పేర్లు మున్నగు విశేషములను తెలియగోరుచున్నాను'.

ఏవ ముక్తస్తు భరతో భరద్వాజేన ధార్మికః, 19
ఉవాచ ప్రాఞ్జలి ర్భూత్వా వాక్యం వచనకోవిదః.

భరద్వాజు డిట్లు చెప్పగా, ధార్మికుడు, మాటలాడుటలో నేర్పరి యగు భరతుడు ప్రాంజలియై యిట్లు పలికెను.

యా మిమాం భగవన్! దీనాం శోకానశనకర్శితామ్, 20
పితు ర్హి మహిషీం దేవీం దేవతా మివ పశ్యసి,
ఏషా తం పురుషవ్యాఘ్రం సింహ విక్రాన్తగామినమ్, 21
కౌసల్యా సుషువే రామం ధాతార మదితి ర్యథా.

ఓ పూజ్యుడా! దైన్యము నందినదియు, దుఃఖముచే, ఆహారము తినకుండుటచే కృశించినదై దేవతవలె నీకు గన్పట్టుచున్న యీమె దశరథమహారాజు పట్టపుదేవి. ఈమెయే పురుష శ్రేష్ఠుడు, సింహమువోలె గంభీరముగ నడచువాడగు రాముని, అదితి విష్ణువును వోలె కనినది.

అస్యా వామభుజం శ్లిష్టా యైషా తిష్ఠతి దుర్మనాః, 22
కర్ణికారస్య శాఖేవ శీర్ణపుష్పా వనాంతరే,
ఏతస్యా స్తు సుతౌ దేవ్యాః కుమారౌ దేవవర్ణినౌ, 23
ఉభౌ లక్ష్మణశత్రుఘ్నౌ వీరౌ సత్యపరాక్రమౌ.

ఈమె యెడమ భుజమును తాకి నిలుచున్నది (కౌసల్యా వణకుచుండుటచే యామె కవలంబనముగ నున్నది) యు, అడవిలో పూలు రాలిన కొండగోగువలె నున్నదియు, అశ్వినీదేవతలతో సమానులు, వీరులు, సత్యపరాక్రములును అగు లక్ష్మణశత్రుఘ్నులను కన్న తల్లి సుమిత్ర.

యస్యాః కృతే నరవ్యాఘ్రౌ జీవనాశ మితో గతౌ, 24
రాజా పుత్త్రవిహీన శ్చ స్వర్గం దశరథో గతః,
క్రోధనా మకృతప్రజ్ఞాం దృప్తాం సుభగమానినీమ్, 25
ఐశ్వర్యకామాం కైకేయీ మనార్యా మార్యరూపిణీమ్,
మ మైతాం మాతరం విద్ధి నృశంసాం పాపనిశ్చయామ్,
యతో మూలం హి పశ్యామి వ్యసనం మహ దాత్మనః.

ఎవ్వతె కొఱకై నరశ్రేష్ఠులగు రామలక్ష్మణు లడవికి పంపబడుటచే జీవనాశ మొందింపబడిరో, రాజపుత్రులకు దూరమై దశరథుడు స్వర్గమున కేగెనో, అట్టి క్రోధవతి, అశిక్షితబుద్ధి కలది, గర్వించినది, తాను సుందరినని తలంచునది, ఐశ్వర్యము నపేక్షించునది, వస్తుతః పూజ్యతలేనిది యయ్యు యోగ్యురాలివలె, పైకి కనపట్టునది, క్రూరస్వభావము, పాపనిశ్చయముఁ గలదగు ఈమెను నా తల్లిగా నెఱుంగుము. నాకు గలిగిన యీ గొప్ప సంకటమున కీమెయే కారణము.

ఇత్యుక్త్వా నరశార్దూలో బాష్పగద్గదయా గిరా, 27
నిశశ్వాస స తామ్రాక్షః క్రుద్ధో నాగ ఇవ శ్వసన్.

అని యిట్లు పలికి, నరశ్రేష్ఠుడగు భరతుడు కన్నీటిచే మాట తొట్రుపడి, కన్నులెఱ్ఱబడగా, కోపించి బుసకొట్టు సర్పము వలె నిట్టూర్చుచుండెను.

భరద్వాజో మహర్షి స్తం బ్రువన్తం భరతం తథా, 28
ప్రత్యువాచ మహాబుద్ధి రిదం వచన మర్థవత్.

మహాబుద్ధిశాలి యగు భరద్వాజు డట్లు పలుకుచున్న భరతున కీ యర్థవంతమగు వాక్యము పలికెను.

న దోషే ణావగంతవ్యా కైకేయీ భరత! త్వయా. 29

భరతుడా! నీవు నీతల్లి కైక చేసినదానిని తప్పుగా తలంపకుము.

రామప్రవ్రాజనం హ్యేత త్సుఖోదర్కం భవిష్యతి,
దేవానాం దానవానాం చ ఋషీణాం భావితాత్మనామ్. 30
హిత మేవ భవిష్యద్ధిరామప్రవ్రాజనా దిహ.

రాము నడవికి పంపుట రానున్న కాలమున సుఖము కలిగించును. దేవతలకు దానవులకును, ఆత్మవిదులగు ఋషులకును ఇపుడు రాము నడవికి పంపుట హితమే కలిగించును. (అని భూతభవిష్యద్వర్తమానముల నెఱిగిన భరద్వాజుడు చెప్పెను.)

అభివాద్య తు సంసిద్ధః కృత్వా చైనం ప్రదక్షిణమ్, 31
ఆమంత్ర్య భరత స్సైన్యం యుజ్యతా మిత్యచోదయత్.

అంతట భరతుడు మునికి నమస్కరించి, ఆశీర్వాదము పొంది, ప్రదక్షిణ మాచరించి, సెలవు పొంది, సైన్యమును ప్రయాణమునకు సిద్ధముకం డని యాజ్ఞాపించెను.

తతో వాజిరథాన్ యుక్తాన్ దివ్యాన్ హేమపరిష్కృతాన్,
అధ్యారోహ త్ప్రయాణార్థీ బహూ న్బహువిధో జనః.

అంత నా సైన్యమందలి పలువిధములగు వారందఱును దివ్యములైన గుఱ్ఱములు, రథములను బంగారముతో నలంకరించి ప్రయాణము చేయగోరువారై, వాని నధిష్ఠించిరి.

గజకన్యా గజా శ్చైవ హేమకక్ష్యాః పతాకినః, 33
జీమూతా ఇవ ఘర్మాంతే సఘోషా స్సంప్రతస్థిరే.

ఆడేనుగులు, మగయేనుగులును, బంగారు (బంధించు) తాళ్లు కట్టబడినవై, పతాకములతో నలంకరింపబడినవై, వర్షాకాలపు మేఘములవలె గర్జించుచు బయలుదేరెను.

వివిధా న్యపి యానాని మహాంతి చ లఘూని చ, 34
ప్రయయు స్సుమహార్హాణి పాదై రేవ పదాతయః.

పెద్దవి, చిన్నవి యగు మిక్కిలి విలువగల వాహనములనేకములు ఆరోహకులతో కూడినవై బయలుదేరినవి. కాల్బలము నడచియే పోయెను.

అథ యానప్రవేకై స్తు కౌసల్యాప్రముఖాః స్త్రియః, 35
రామదర్శనకాంక్షిణ్యః ప్రయయు ర్ముదితా స్తదా.

అపుడు కౌసల్య మున్నగు స్త్రీలు రాముని దర్శనము కోరుచు, సంతోషముతో నుత్తమవాహనముల నెక్కి వెడలిరి.

చంద్రార్కతరుణాభాసాం నియుక్తాం శిబికాం శుభామ్, 36
ఆస్థాయ ప్రయయౌ శ్రీమాన్ భరత స్సపరిచ్ఛదః.

అంత శ్రీమంతుడగు భరతుడు ఉదయించిన సూర్య చంద్రులవంటి కాంతికలదై, వసిష్ఠాదులచే 'నీవిందు కూర్చుండుము' మని యాజ్ఞాపింపబడినట్టి శుభమగు పల్లకి నెక్కి సపరివారముగ బోయెను.

సా ప్రయాతా మహాసేనా గజవాజిరథాకులా, 37
దక్షిణాం దిశ మావృత్య మహామేఘ ఇవోత్థితః,
వనాని తు వ్యతిక్రమ్య జుష్టాని మృగపక్షిభిః, 38
గంగాయాః పరవేలాయాం గిరి ష్వపి నదీషు చ

ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో వ్యాప్తమైన యా పెద్ద సైన్యము పైకెగసిన మేఘమువలె దక్షిణదిశ నెల్ల యావరించినదై, మృగములు, పక్షులతో కూడిన యడవులను గడచి, గంగ కవ్వలిగట్టున కొండలపై, నదుల ప్రక్కలను విశ్రమించుచు సాగిపోయెను.

సా సంప్రహృష్టద్విపవాజియోధా
విత్రాసయంతీ మృగపక్షిసంఘాన్,
మహ ద్వనం త త్ప్రతిగాహమానా
రరాజ సేనా భరతస్య తత్ర.

హర్షమునొందిన యేనుగులు, గుఱ్ఱములు, యోధులు కలిగిన యా భరతుని సేన, మృగములను, పక్షులను భయపడజేయుచు మహారణ్యము ప్రవేశించుచున్నదై ప్రకాశించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ద్వినవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమునందయోధ్యాకాండమున తొంబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## త్రిణవతితమః సర్గః — తొంబదిమూడవ సర్గము

తయా మహత్యా యాయిన్యా ధ్వజిన్యా వనవాసినః,
అర్దితా యూథపా మత్తా సయూథా స్సంప్రదుద్రువుః. 1

అట్లు పోవుచున్న పెద్దసేనచే పీడింపబడినవై, ఏనుగులు మున్నగు వన్యములగు జంతువుల గుంపులకు నాయకస్థానీయములగు మదించిన ఏనుగులు మున్నగునవి, తమతమ గుంపులతో పరుగులెత్తినవి.

ఋక్షాః పృషతసంఘా శ్చ రురవశ్చ సమంతతః,
దృశ్యంతే వనరాజీషు గిరి ష్వపి నదీషు చ. 2

ఎలుగుబంట్లు, చుక్కలుగల లేళ్ళు, దుప్పులును అడవుల వరుసలలో, కొండలపై, నదులచెంత నెల్లెడల కానవచ్చుచుండెను.

స సంప్రతస్థే ధర్మాత్మా ప్రీతో దశరథాత్మజః,
వృతో మహతా నాదిన్యా సేనయా చతురంగయా. 3

ధర్మాత్ముడు, దశరథతనయు డగు భరతుడు, కోలాహల మొనరించుచున్న పెద్ద చతురంగబలముతో కూడి ప్రీతుడై పోవ సాగెను.

సాగరౌఘనిభా సేనా భరతస్య మహాత్మనః,
మహీం సంఛాదయామాస ప్రావృషి ద్యా మివాంబుదః. 4

మహాత్ముడగు భరతుని సముద్రసదృశమగు సైన్యము, వర్షాకాలమున మేఘ మాకాశమును వోలె భూమిని కప్పివైచెను.

తురంగౌఘై రవతతా వారణై శ్చ మహాజవైః,
అనాలక్ష్యా చిరం కాలం తస్మి న్కాలే బభూవ భూః. 5

అట్లు వ్యవధానమే లేక వ్యాపించిన వేగముగల గుఱ్ఱముల గుంపులతో, ఏనుగులతో కూడినదై ఆసమయమున చాలతడవు వఱకు భూమి యగపడకుండెను.

స యాత్వా దూర మధ్వానం సుపరిశ్రాంతవాహనః,
ఉవాచ భరత శ్శ్రీమా న్వసిష్ఠం మంత్రిణాం వరమ్. 6

శ్రీమంతుడగు భరతు డట్లు చాలదూర మేగి, గుఱ్ఱములు మున్నగు వాహనము లలసినవికాగా మంత్రవిదులలో శ్రేష్ఠుడగు వసిష్ఠున కిట్లనెను.

యాదృశం లక్ష్యతే రూపం యథా చైవ శ్రుతం మయా,
వ్యక్తం ప్రాప్తాః స్మ తం దేశం భరద్వాజో య మబ్రవీత్.

ఎట్టి ప్రదేశస్వరూపము నూహించితినో పూర్వము (భరద్వాజుడు వర్ణింపగా) నెట్లు వింటినో అట్టి భరద్వాజ నిర్దిష్టమగు ప్రదేశమునకు మనము వచ్చినారము.

అయం గిరి శ్చిత్రకూట ఇయం మందాకినీ నదీ,
ఏతత్ప్రకాశతే దూరా న్నీలమేఘనిభం వనమ్. 8

ఇదియే చిత్రకూట పర్వతము. ఇదియే గంగానది. ఇదే దూరమున కారుమబ్బువలె యడవి యొప్పుచున్నది.

గిరే స్సానూని రమ్యాణి చిత్రకూటస్య సంప్రతి,
వారణై రవమృద్యన్తే మామకైః పర్వతోపమైః. 9

సుందరములగు ఈ చిత్రకూట పర్వతపు నెత్తముల నిపుడు పర్వత సదృశములగు మా యేనుగులు త్రొక్కివేయుచున్నవి.

ముంచంతి కుసుమా న్యేతే నగాః పర్వతసానుషు,
నీలా ఇ వాతపాపాయే తోయం తోయధరా ఘనాః. 10

ఈ పర్వతపు చరియలపైనున్న చెట్లు, వర్షాకాలమున మేఘములు నీటినివోలె పుష్పములను విడచుచున్నవి.

కిన్న రాచరితం దేశం పశ్య శత్రుఘ్న ! పర్వతమ్,
మృగై స్సమంతా దాకీర్ణం మకరై రివ సాగరమ్. 11

ఓ శత్రుఘ్నుడా! కిన్నరులు తిరుగాడు ఈ పర్వత ప్రదేశము చూడుము. మొసళ్లచే సముద్రమువలె నీప్రదేశమెల్ల లేళ్లచే వ్యాప్తమై యున్నది.

ఏతే మృగగణా భాంతి శీఘ్రవేగాః ప్రచోదితాః,
వాయుప్రవిద్ధా శ్శరది మేఘరాజి రి వాంబరే. 12

మనసైనికులచే ప్రేరితములైన ఈ లేళ్లగుంపులు, శరత్కాలమున వాయు ప్రేరితమైన మేఘసమూహముల వలె మిక్కిలి వేగము కలవై కన్పట్టుచున్నవి.

కుర్వంతి కుసుమాపీడాం శిరస్సు సురభీ నమీ,
మేఘప్రకాశైః ఫలకై ర్దాక్షిణాత్యా యథా నరాః. 13

దాక్షిణాత్యు లగు జనులు, మేఘముల వలె నల్లనైన తమ కేశములను పైకి పలకలుగా కట్టి అందు పూల నలంకరించినట్లు, ఈ భటులు తమతలలపై పరిమళించు పుష్పముల నలంకరించుచున్నారు.

నిష్కూజ మివ భూ త్వేదం వనం ఘోరప్రదర్శనమ్,
అయోధ్యేవ జనాకీర్ణా సంప్రతి ప్రతిభాతి మా. 14

జనుల సవ్వడియే లేక వెనుక భయంకరముగ కన్పట్టిన యీ యడవి యిపుడు జనసంచారముచే నా కయోధ్యవలె నగపడుచున్నది.

ఖురై రుదీరితో రేణు ర్దివం ప్రచ్ఛాద్య తిష్ఠతి,
తం వహ త్యనిల శ్శీఘ్రం కుర్వ న్నివ మమ ప్రియమ్.15

గుఱ్ఱముల డెక్కలచే పైకెగురగొట్టబడిన ధూళి యాకాశము నాక్రమించి నిలిచినది, (అట్లు నిలచినచో నాకు రామాశ్రమ

ము కనిపించెడిది కాదు). అట్లు కనుపించుటకు హేతువై వాయువు నాకు ప్రియము గూర్చుచున్నదో యన్నటు లా ధూళిని శీఘ్రమే వేఱొక చోటికి కొనిపోవుచున్నది.

స్యందనాం స్తురగోపేతా న్సూతముఖ్యై రధిష్ఠితాన్,
ఏతా న్సంపతత శ్శీఘ్రం పశ్య శత్రుఘ్న ! కాననే. 16

శత్రుఘ్నుడా! ఈ యడవిలో రాముని దర్శించు కుతూహలముతో ప్రధానులగు సారథులచే నధిష్ఠితములై, గుఱ్ఱములచే పూన్చబడినవై వేగమే పోవుచున్న రథములను చూడుము.

ఏతా న్విత్రాసితా న్పశ్య బర్హిణః ప్రియదర్శనాన్,
ఏత మావిశత శ్శీఘ్ర మధివాసం పతత్రిణః. 17

సుందరములగు ఱెక్కలతో చూపుల కింపు గూర్చు నీ నెమళ్ళు మనసైన్యమును చూచి బెదరి కొండవైపు పోవుచున్నవి, చూడుము.

అతిమాత్ర మయం దేశో మనోజ్ఞః ప్రతిభాతి మా,
తాపసానాం నివాసోఽయం వ్యక్తం స్వర్గపథో యథా. 18

తపస్వులకు నెలవగు ఈ తావు నాకు మిగుల మనోజ్ఞముగా నగపడుచు స్పష్టముగ స్వర్గ ప్రదేశమువలె నున్నది.

మృగా మృగీభి స్సహితా బహవః పృషతా వనే,
మనోజ్ఞరూపా దృశ్యంతే కుసుమై రివ చిత్రితాః. 19

ఒడలిపై తెల్లని చుక్కలుగల లేళ్లు, ఆడు లేళ్లతో కూడి,

పూవులతో నలంకరింపబడినవి వోలె సుందర రూపములతో నగపడుచున్నవి.

సాధు సైన్యాః ప్రతిష్ఠంతాం విచిన్వంతు చ కాననే,
యథా తౌ పురుషవ్యాఘ్రౌ దృశ్యేతే రామలక్ష్మణౌ. 20

నరశ్రేష్ఠులగు రామలక్ష్మణులు కనిపించునట్లుగా సైన్యములు చక్కగా బయలుదేరి యడవిలో వారిని వెదుకవలయును.

భరతస్య వచ శ్శ్రుత్వా పురుషా శ్శస్త్రపాణయః,
వివిశు స్తద్వనం శూరా ధూమంచ దదృశు స్తతః. 21

ఆయుధములు చేత ధరించిన శూరులగు సైనికులు భరతుని వచన మాలించి, యా వనములో ప్రవేశించి యచట పొగను చూచిరి.

తే సమాలోక్య ధూమాగ్ర మూచు ర్భరత మాగతాః,
నామనుష్యే భవ త్యగ్ని ర్వ్యక్త మత్రైవ రాఘవౌ. 22

వా రట్లు పొగ పైకెగయుట గాంచి, మఱలివచ్చి భరతునితో – 'మనుష్యులు లేక అగ్నియుండదు. రామలక్ష్మణు లిటనే యున్నారనుట స్పష్టము అని పలికిరి.

అథవాఽత్ర నరవ్యాఘ్రౌ రాజపుత్త్రౌ పరంతపౌ,
మన్యే రామోపమా స్సంతి వ్యక్త మత్ర తపస్వినః. 23

నరశ్రేష్ఠులు, శత్రుతాపనులగు రామలక్ష్మణులే ఇట లేకుండినచో రామలక్ష్మణులవలె తేజస్సంపన్నులగు తపస్వులు

తప్పక యుందురు. వారిని రామలక్ష్మణుల నివాసమును గూర్చి యడుగవచ్చును.

తచ్ఛ్రుత్వా భరత స్తేషాం వచనం సాధుసమ్మతమ్,
సైన్యా నువాచ సర్వాం స్తా నమిత్రబలమర్దనః. 24

న్యాయమెఱిగినవారి కంగీకార్య మగు ఆ మాట నాలించి యమోఘశాసను డగు భరతు డా సకలసైన్యమున కిట్లనెను.

యత్రా భవన్త స్తిష్ఠన్తు నేతో గన్తవ్య మగ్రతః,
అహ మేవ గమిష్యామి సుమన్త్రో గురు రేవ చ. 25

మీరు నిశ్శబ్దముగా నిలువుడు. ఇటుపై మీరు ముందుకు రావలదు. నేను, సుమంత్రుడు, వసిష్ఠుడు మేమే పోయివత్తుము.

ఏవ ముక్తా స్తత స్సర్వే తత్ర తస్థు స్సమన్తతః,
భరతో యత్ర ధూమాగ్రం తత్ర దృష్టిం సమాదధాత్. 26

అని భరతుడు పలుకగా వారెల్లరు నటనే యెల్లెడల నిలచిరి. భరతుడును పొగపైభాగము కన్పించువైపే దృష్టి నిలిపెను.

వ్యవస్థితా యా భరతేన సా చమూ
ర్నిరీక్షమాణాఽపి చ ధూమ మగ్రతః,
బభూవ హృష్టా న చిరేణ జానతీ
ప్రియస్య రామస్య సమాగమం తదా. 27

భరతునిచే నట్లు ముందుకు పోకుండ నిలుపబడిన యా సేన ఎదుట కనిపించుచున్న పొగను చూచుచు అపుడు తమ

క్షుడగు రామునితో సమాగమ మచిరకాలములో కాగలదని యెంచి హర్షము నందెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్రిణవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున తొంబదినాల్గవ సర్గము సమాప్తము.

---

## చతుర్ణవతితమః సర్గః - తొంబదినాల్గవ సర్గము

దీర్ఘకాలోషిత స్తస్మి న్గిరౌ గిరివనప్రియః,
వైదేహ్యాః ప్రియ మాకాంక్ష న్స్వం చ చిత్తం విలోభయన్.
అథ దాశరథి శ్చిత్రం చిత్రకూట మదర్శయత్,
భార్యా మమరసంకాశ శ్శచీ మివ పురందరః. 2

ప్రాతఃకాలోచితమగు కర్మానుష్ఠానమునకు పిమ్మట ఆ కొండపై చిరకాలము నివసించినవా డయ్యును, ఎల్లపుడు నిత్యనూతనములై యలరారు కొండలు, అడవులందు ప్రీతికలవా డగుటచే, ప్రియునితో కూడియే వనసౌందర్యమును తిలకింప వలయునని కుతూహలపడు సీతకు ప్రీతిని కలిగింప గోరుచు, ఆ ప్రీతివలన తన మనమునుగూడ సంతోషపెట్టుకొనుచు దేవతాసదృశు (ఎల్లెడల దేవతల వలె నిర్భయు) డగు రాముడు, ఆశ్చర్యము కలిగించున దగుటచే సార్థకనామము కల చిత్రకూటమును, భార్యయగు సీతకు, దేవేంద్రుడు శచీదేవికి వోలె చూపెను.

న రాజ్యా ద్భ్రంశనం భద్రే! న సుహృద్భి ర్వినా భవః,
మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిమ్. 3

ఓ కల్యాణీ! నన్ను ప్రేమించు జనులతో నిండిన రాజ్యము పోవుటయును, మిత్రులకు దూరమగుటయును, సుందరమగు ఈ పర్వతమును చూచిన పిమ్మట నాకు దుఃఖము కలిగించుట లేదు. (పరమపదైశ్వర్యమును వీడి, వైనతేయాదులు చెంతలేకుండుట కూడ, లీలావిభూతియందున్నను పరమపదముకన్న అతిరమణీయమగు ఈగిరిని చూచిన పిమ్మట నామనస్సును బాధించుట లేదు (తనిశ్లో.)

పశ్యేమ మచలం భద్రే! నానాద్విజగణాయుతమ్,
శిఖరైః ఖమివోద్విద్ధై ర్ధాతుమద్భి ర్విరాజితమ్. 4

మంగళరూపిణీ! వివిధములగు పక్షి సమూహములతో కూడినది, ధాతువులతో గూడినవై, ఆకాశమును చొచ్చుకొని పోవు చున్నట్లున్న శిఖరములతో నలంకృతమైన ఈ కొండను చూడుము.

కేచి ద్రజతసంకాశాః కేచి త్క్షతజసన్నిభాః,
పీతమాంజిష్ఠవర్ణాశ్చ కేచి న్మణివరప్రభాః, 5
పుష్యార్క కేతకాభా శ్చ కేచిజ్జ్యోతీరసప్రభాః,
విరాజంతేఽచలేంద్రస్య దేశా ధాతువిభూషితాః. 6

ఈకొండ వివిధధాతువులతో కూడియుండుటచే, దానిపరిసరప్రదేశములలో కొన్ని వెండివలె మిక్కిలి తెల్లగను, కొన్ని రక్తవర్ణములుగను, కొన్ని ఇంద్రనీలవర్ణముతోను, కొన్ని పుష్య

రాగవర్ణముతోను, కొన్ని స్ఫటికవర్ణముతోను, కొన్ని మొగిలిపూవు వలె కొంచెము తెల్లనికాంతితోను, కొన్ని నక్షత్రములు (లేదా జ్వాలలు), పాదరసము వన్నెతోను ప్రకాశించుచున్నవి.

నానామృగగణద్వీపితరక్ష్వృక్షగణై ర్వృతః,
అదుష్టై ర్భాత్యయం శైలో బహుపక్షిసమాయుతః. 7

ఈ కొండ సహజముగ క్రూరమృగములైనను, మునిజన సాన్నిధ్యముచే హింసాదులు విడచిన పెద్దపులి, చిరుతపులి, ఎలుగు మున్నగు వివిధ మృగములతోడను, నానావిధములగు పక్షులతోడను కూడియున్నది.

ఆమ్రజమ్బ్వసనై ర్లోధ్రైః ప్రియాలైః పనసై ర్ధవైః,
అంకోలై ర్భవ్యతినిశై ర్బిల్వతిందుకవేణుభిః. 8
కాశ్మర్యరిష్టవరుణై ర్మధూకై స్తిలకై స్తథా,
బదర్యామలకై ర్నీపై ర్వేత్రధన్వనబీజకైః. 9
పుష్పవద్భిః ఫలోపేతై శ్ఛాయావద్భి ర్మనోరమైః,
ఏవ మాదిభి రాకీర్ణ శ్శ్రియం పుష్య త్యయం గిరిః. 10

ఈ చిత్రకూటము పుష్పించినవి, ఫలించినవి, నీడనిచ్చునవి, మనోహరములైనవి అగుమామిడి చెట్లు, నేరేడుచెట్లు, వేగిస చెట్లు, లొద్దుగుచెట్లు, మోరటిచెట్లు, పనసచెట్లు, చండ్రచెట్లు, ఊడుగుచెట్లు, మంచితినాసపుచెట్లు, మారేడు చెట్లు, తుమికిచెట్లు. వెదురుపొదలు, గుమ్ముడుచెట్లు, వేపచెట్లు, ఉలిమిరిచెట్లు, ఇప్ప చెట్లు, బొట్టుగుచెట్లు, రేగిచెట్లు, ఉసిరికచెట్లు, కడిమి చెట్లు, ప్రేప

తీగలు, ఏరుమద్దిచెట్లు, మున్నగు వివిధ వృక్షములతో కూడి శోభిల్లుచున్నది.

శైలప్రస్థేషు రమ్యేషు పశ్యేమాన్ రోమహర్షణాన్,
కిన్నరాన్ ద్వంద్వశో భద్రే రమమాణా న్మనస్వినః. 11

ఓకల్యాణీ! సుందరములైన కొండనెత్తములందు చూచుట తోడనే గగుర్పాటు కలిగించుచు, అన్యోన్యానురాగముకల మనస్సులతో కూడినవారై జంటలుగనున్న ఈకిన్నరులను చూడుము.

శాఖావసక్తాన్ ఖడ్గాం శ్చ ప్రవరా ణ్యంబరాణి చ,
పశ్య విద్యాధరస్త్రీణాం క్రీడోద్దేశా న్మనోరమాన్. 12

చెట్లకొమ్మలకు వ్రేలాడుచున్న (విద్యాధరుల) ఖడ్గములు, శ్రేష్ఠములగు వస్త్రములతో కూడిన విద్యాధరులను దేవతా విశేషముల స్త్రీలు విహరించు సుందరప్రదేశములను చూడుము.

జలప్రపాతై రుద్భేదై ర్నిష్యందై శ్చ క్వచి త్క్వచిత్,
స్రవద్భి ర్భా త్యయం శైల స్స్రవన్మద ఇవ ద్విపః. 13

ఒక్కొకచో పైనుండి నేలఁబడు జలపాతములు, వేఱొకచో భూమిని చీల్చుకొని పైకి ఉబికి వచ్చు నీటియూటలు ప్రవహించుచుండగా నీకొండ మదముగార్చు ఏనుగువలె నున్నది,

గుహాసమీరణో గంధా న్నానాపుష్పభవా న్వహన్,
ఘ్రాణతర్పణ మభ్యేత్య కం నరం న ప్రహర్షయేత్. 14

ఈ గుహనుండి వెడలుచున్న గాలి, వివిధ పుష్పముల

సుగంధమును మోయుచు ఘ్రాణేంద్రియమున కింపుగూర్చుచు వచ్చి యెవ్వని నానందపెట్టదు ?

యదీహ శరదోఽనేకా స్త్వయా సార్ధ మనిందితే!,
లక్ష్మణేన చ వత్స్యామి న మాం శోకః ప్రధక్ష్యతి. 15

ఓ సర్వాంగ సుందరీ! నీతోకూడి, లక్ష్మణసహితుడనై నే ననేక సంవత్సరము లీ వనమున నివసించుచో నగరము వీడుట వలన కలుగు దుఃఖము నన్ను బాధించదు. (నివసించుచో అనుట ద్వారా భవిష్యత్తులో సీతావివాసము సూచితము.)

బహుపుష్పఫలే రమ్యే నానాద్విజగణాయుతే,
విచిత్రశిఖరే హ్యస్మి న్రతవా నస్మి భామిని!. 16

ఓ భామినీ! అనేక పుష్పములు, పండ్లు కలది, సుందరమైనది, వివిధ పక్షి సంఘములతో కూడినది, ఆశ్చర్యము గొల్పు శిఖరములు కల ఈ కొండయం దాసక్తుడనై యున్నాను.

అనేన వనవాసేన మయా ప్రాప్తం ఫలద్వయమ్,
పితు శ్చానృణతా ధర్మే భరతస్య ప్రియం తథా. 17

ఈ వనవాసముచే నాకు రెండు ఫలములు కలిగినవి. ధర్మ విషయమున తండ్రి ఋణము తీర్చుట (పితృవాక్యపాలనము) యొకటి. భరతునకు ప్రియ మొనరించుట రెండవది. (భరతునకు ప్రియము కూర్చుట భావికాలమున భరతుడు తనకు కైంకర్యము చేయుటకవకాశ మిచ్చుట).

వైదేహి ! రమసే కచ్చి చ్చిత్రకూటే మయా సహ,
పశ్యంతీ వివిధా న్భావా న్మనోవాక్కాయసంయతాన్. 18

సీతా! మనో – వాక్ - కాయము లను కరణత్రయమును నిగ్రహించుకొని మలయమారుతము - కోకిలాలాపము - భ్రమరఝుంకారము – పుష్పహాసము మున్నగు ప్రభేదములు కల విభావములను నాతోకూడి చూచుచు చిత్రకూటమున క్రీడింతువా?

ఇద మేవామృతం ప్రాహూ రాజ్ఞి ! రాజర్షయః పరే,
వనవాసం భవార్థాయ ప్రేత్య మే ప్రపితామహాః. 19

ఓ రాణీ! పూర్వులు, రాజర్షులగు మాతాతముత్తాతలు దేహత్యాగానంతరము సంసార వినాశనమునకై అమృతమువలె భోగ్య వస్తువగు నీవానప్రస్థోచిత వనవాసమునే మోక్షసాధనముగా పేర్కొనిరి.

శిలా శ్శైలస్య శోభంతే విశాలా శ్శతశోఽభితః,
బహులా బహులై ర్వర్ణై ర్నీలపీతసితారుణైః. 20

వందలకొలదిగా కల ఈ పెద్ద కొండరాళ్లు అనేకములు, నలుపు, పసుపు, తెలుపు, ఎఱుపు రంగులతో నెల్లెడల శోభిల్లుచున్నవి.

నిశి భాం త్యచలేంద్రస్య హుతాశనశిఖా ఇవ,
ఓషధ్య స్స్వప్రభాలక్ష్మ్యా భ్రాజమానా స్సహస్రశః. 21

ఈ పర్వత శ్రేష్ఠమందలి ఓషధులు తమకాంతులచే తమ

స్వరూపమును కనుపట్టఁ జేయుచున్నవై రాత్రులందు వేలాదిగా ప్రకాశించుచున్నవి.

కేచి త్క్షయనిభా దేశాః కేచి దుద్యానసన్నిభాః,
కేచి దేకశిలా భాంతి పర్వత స్యాస్య భామిని !. 22

ఈ పర్వతప్రదేశములలో కొన్ని ఇండ్లవలెను, కొన్ని ఉద్యానముల వలెను, కొన్ని ఒంటిరాతివిగను ఒప్పుచున్నవి.

భి త్త్వేవ వసుధాం భాతి చిత్రకూట స్సముత్థితః,
చిత్రకూటస్య కూటోఽసౌ దృశ్యతే సర్వత శ్శుభః. 23

ఈ చిత్రకూటము భూమిని చీల్చుకొని పైకి వచ్చిన ట్లగపడుచున్నది. ఈ చిత్రకూటపర్వతశిఖరము కూడ సుందరముగా ప్రకాశించుచున్నది.

కుష్ఠపున్నాగస్థగరభూర్జపత్రోత్తరచ్ఛదాన్,
కామినాం స్వాస్తరా న్పశ్య కుశేశయదళాయుతాన్. 24

నల్లకలువలు, పున్నాగపూలు, పుత్రజీవిపూలు భూర్జపత్రము, పైన పరువబడి, పద్మదళములతో నిండిన కాముకుల చక్కని శయనములను చూడుము.

మృదితా శ్చాపవిద్ధా శ్చ దృశ్యంతే కమలస్రజః,
కామిభి ర్వనితే ! పశ్య ఫలాని వివిధాని చ. 25

ఓ సీతా ! కాముకులు ఉపయోగించుటచే నలిగి పారవేయబడిన తామర పూలదండలు, వివిధములగు పండ్లు కనిపించుచున్నవి. చూడుము.

వస్త్వౌకసారాం నళినీ మత్యే తీ వోత్తరా న్కురూన్,
పర్వత శ్చిత్రకూటో௨సౌ బహుమూలఫలోదకః. 26

అధికములగు కందమూలఫలములతో జలములతో విల సిల్లు నీ చిత్రకూటపర్వతము - తూర్పున నున్న అమరావతిని (లేదా కుబేరుని అలకాపురిని) మానససరస్సును (లేక సౌగంధి కసరస్సును) తన సౌందర్యముచే నతిశయించుచున్నది.

ఇమం తు కాలం వనితే! విజహ్రివాం
స్త్వయా చ సీతే! సహ లక్ష్మణేన చ,
రతిం ప్రపత్స్యే కులధర్మవర్ధినీం
సతాం పథి స్వై ర్నియమైః పరైః స్థితః. 27

ఓ సీతా! నీతో, లక్ష్మణునితో ఈ పదునాలుగేండ్ల కాలము అరణ్యవాసము చేసి, ఉత్తమములగు నియమములు పాటించి సత్పథము నవలంబించి ప్రజాపాలనరూపమగు కులధర్మమును వర్ధిల్లజేయు రాజసుఖము నొందెదను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
చతుర్నవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణమం దయోధ్యాకాండమున తొంబదినాల్గవ సర్గము సమాప్తము.

---

## పఞ్చనవతితమః సర్గః - తొంబదియైదవ సర్గము

అథ శైలా ద్వినిష్క్రమ్య మైథిలీం కోసలేశ్వరః,
అదర్శయ చ్ఛుభజలాం రమ్యాం మందాకినీం నదీమ్. 1

ఆవిధముగ చిత్రకూటసౌందర్యమును సీతకు చూపి, యచటనుండి వెడలినవాడై రాముడు ప్రశస్తజలములు కలిగి సుందరమైన గంగానది నామెకు చూపెను.

అబ్రవీ చ్చ వరారోహాం చారుచంద్రనిభాననామ్,
విదేహరాజస్య సుతాం రామో రాజీవలోచనః. 2

విపులములైన పిరుదులు కలది, సుందర చంద్రబింబమును పోలు ముఖము కలది అగు విదేహరాజుకూతురు సీతను చూచి రాముడు, విస్మయముతో తామరలవంటి తన కన్నులు వికసింపగా నిట్లనెను.

విచిత్రపులినాం రమ్యాం హంససారససేవితామ్,
కమలై రుపసంపన్నాం పశ్య మందాకినీం నదీమ్. 3

వింత వింతలగు ఇసుక దిబ్బలతో కూడి, హంసలతో, బెగ్గురులతో సేవించబడుచు, పద్మములు కలదై సుందరముగ నున్న ఈ గంగానదిని చూడుము.

నానావిధై స్తీరరుహై ర్వృతాం పుష్పఫలద్రుమైః,
రాజంతీం రాజరాజస్య నళినీ మివ సర్వతః. 4

తీరములందు వివిధములగు పుష్పించు, ఫలించు చెట్లతో

అంతటను వ్యాప్తమై కుబేరుని సౌగంధిక సరోవరము వలె ప్రకాశించు ఈ నదిని చూడుము.

మృగయూథనిపీతాని కలుషాంభాంసి సాంప్రతమ్,
తీర్థాని రమణీయాని రతిం సంజనయంతి మే. 5

మృగముల గుంపులు వచ్చి నీరు త్రాగుటచే కలగి కుంకుమ వర్ణముతో నొప్పు నీళ్లు కలిగిన ఈ నదిరేవులు నాకు (స్నానము చేయవలెనను) అభిలాషను కలిగించుచున్నవి.

జటాజినధరాః కాలే వల్కలోత్తరవాససః,
ఋషయ స్త్వవగాహన్తే నదీం మందాకినీం ప్రియే. 6

ఓ ప్రియురాలా! జడలు, చర్మములు దాల్చి, నారవస్త్రము లుత్తరీయములుగా ధరించిన ఋషులు తమ నియమునకు తగిన కాలమున గంగలో స్నానము చేయుచున్నారు.

ఆదిత్య ముపతిష్ఠంతే నియమా దూర్ధ్వబాహవః,
ఏతే పరే విశాలాక్షి! మునయ స్సంశితవ్రతాః. 7

ఓ విశాలనేత్రములు కలదానా! మఱికొందరు మునులు వ్రతనిష్ఠులై నియమముతో చేతులెత్తి సూర్యు నుపాసించుచున్నారు.

మారుతోద్ధూతశిఖరైః ప్రనృత్త ఇవ పర్వతః,
పాదపైః పత్రపుష్పాణి సృజద్భి రభితో నదీమ్ 8

గాలిచే కదల్పబడినవియు, ఆకులను, పూవులను విడుచు చున్నవగు చెట్లతో యీ పర్వతము నృత్యముచేయ నుద్యమించి నది వలె నున్నది.

క్వచి న్మణినికాశోదాం క్వచి త్పులినశాలినీమ్,
క్వచి త్సిద్ధజనాకీర్ణాం పశ్య మందాకినీం నదీమ్. 9

ఒక్కచో ముత్యము వలె నీరు నిర్మలముగ నున్నది. వేఱొకచో ఇసుక తిన్నెలతో నొప్పుచున్నది. మఱొక్కచో సిద్ధులతో, వ్యాప్తమైయున్నది అగు నీ గంగానదిని చూడుము,

నిర్ధూతా న్వాయునా పశ్య వితతా న్పుష్పసంచయాన్,
పోప్లూయమానా నపరా న్పశ్య త్వం జలమధ్యగాన్. 10

గాలిచే కొన్నిపూలు రాల్పబడినవై తీరములందు వ్యాపించియున్నవి చూడుము. నీటినడుమ మిక్కలి తేలియాడుచున్న మఱికొన్ని పుష్పసమూహములను కూడ దర్శింపుము.

తాం శ్చాతివల్గువచసో రథాంగాహ్వయనా ద్విజాః,
అధిరోహంతి కల్యాణి! నిష్కూజ న్త శ్శుభా గిరః 11

ఓ కల్యాణీ! రతికై అహ్వానించునపుడు పలుకు రమ్యములగు మాటలు కలవై, శుభములగు వాక్కుల నాలాపించుచు, చక్రవాకపక్షులు ఆ పుష్పరాసుల నధిష్ఠించు చున్నవి చూడుము.

దర్శనం చిత్రకూటస్య మందాకిన్యాశ్చ శోభనే,
అధికం పురవాసా చ్చ మన్యే చ తవ దర్శనాత్. 12

ఓ మాత్సర్యము లేనిదానా! చిత్రకూట దర్శనము (నివాసము) నగరవాసము కంటెను అధికసుఖము నిచ్చునది (ఏకాం

తభోగస్థానము కనుక) గంగానదీ సందర్శనము నీ సందర్శనము కంటె అధిక సుఖావహము (ఉద్దీపకము కనుక).

విధూతకలుషైః స్సిద్ధైః స్తపోదమశమాన్వితైః,
నిత్యవిక్షోభితజలాం విగాహస్వ మయా సహ. 13

తపము, దమము, శమము కలవారును, పాపరహితులును అగుసిద్ధులు నిత్యము స్నాన మాచరించుటచే కలచబడిన (వారిపాదరేణువులచే ధన్యమైన) గంగలో నాతో స్నానమాచరింపుము.

సఖీవచ్చ విగాహస్వ సీతే! మందాకినీం నదీమ్,
కమలా న్యవమజ్జంతీ పుష్కరాణి చ భామిని!. 14

సీతా! చెలితోగూడ నీ వెట్లు జలకమాడుదువో అట్లే నాతో కూడి గంగలో స్నానము చేయుము. స్తనములు, (పిరుదుల యొక్క తాకిడివలన పుట్టిన తరంగములచే) ఎఱ్ఱతామరను, తెల్ల తామరలను మునుగజేయుచు (లేదా నీ ముఖ కాంతిచే జయింప బడుటచే సిగ్గుతో మునుగుచున్నవానినివలె చేయుచు) స్నాన మొనర్చుము.

త్వం పౌరజనవ ద్వ్యాళా నయోధ్యా మివ పర్వతమ్,
మన్యస్వ వనితే! నిత్యం సరయూవ దిమాం నదీమ్. 15

ఓలలనా! నీవు వన్యమృగములను నిత్యము పౌరజనుల వలె చూడుము. (వన్యమృగములపై పురజనులపై వలె అనురాగము చూపుము). ఈ పర్వతము నయోధ్యను వలె ప్రీతితో చూడుము. అట్లే ఈనదిని సరయూనదినివోలె ప్రేమతో చూడుము.

లక్ష్మణ శ్చాపి ధర్మాత్మా మన్నిదేశే వ్యవస్థితః,
త్వం చానుకూలా వైదేహి! ప్రీతిం జనయథో మమ. 16

వైదేహీ! నా యాజ్ఞను పాటించు ధర్మాత్ముడగు లక్ష్మణుడు, అనుకూలవతివగు నీవు మీరిరువురు నాకు ప్రీతిని గూర్చుచున్నారు.

ఉపస్పృశం స్త్రిషవణం మధుమూలఫలాశనః,
నాయోధ్యాయైన రాజ్యాయ స్పృహయేఽద్యత్వయా సహ.

సీతా! నీతో కలసియుండి మూడు సంధ్యలలో స్నానము చేయుచు, తేనె - దుంపలు-పండ్లు ఆహారముగ గొనుచు నే నయోధ్యనుగాని-రాజ్యముగాని కోరను.

ఇమాం హి రమ్యాం గజయూథశాలినీం
నిపీతతోయాం గజసింహవానరైః,
సుపుష్పితైః పుష్పధరై రలంకృతాం
న సోఽస్తి య స్స్యా దగతక్లమ స్సుఖీ. 18

సుందరము, మృగసమూహములతో నొప్పునది, ఏనుగులు, సింహములు, కోతులచే త్రాగబడిన నీరు కలది, విరియబూసిన చెట్లతో నలంకృతమైనది అగు ఈ నదినిచూచి శ్రమతొలగి సుఖపడనివా డుండడు.

ఇతీవ రామో బహుసంగతం వచః
ప్రియాసహాయ స్సరితం ప్రతి బ్రువన్,

చచార రమ్యం నయనాంజనప్రభం
స చిత్రకూటం రఘువంశవర్ధనః. 19

అని ఇట్లు రఘువంశమును వర్ధిల్లజేయువాడును, ప్రియురాలితో కూడినవాడగు రాముడిటు లా నదిని గూర్చి ప్రసంగవశమున అనేకవిషయములు పలుకుచు కాటుకవలె నల్లనై ప్రకాశించు చిత్రకూట పర్వతప్రాంతమున సంచరించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పఞ్చనవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యము అగు శ్రీ మద్రామాయణమందయోధ్యాకాండమున తొంబదియైదవ సర్గము సమాప్తము.

---

## షణ్ణవతితమః సర్గః - తొంబదియాఱవ సర్గము

తాం తథా దర్శయిత్వా తు మైథిలీం గిరినిమ్నగామ్,
నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛందయన్. 1

రాముడా విధముగ సీతకు గంగానదిని చూపి, పిమ్మట కొండ నెత్తముపై గూర్చుండి యామెను వశీకరించుకొనుటకు తగిన మాటలిట్లు మాంసమునుగూర్చి పలికెను.

ఇదం మేధ్య మిదం స్వాదు నిష్టప్త మిద మగ్నినా,
ఏవ మాస్తే స ధర్మాత్మా సీతయా సహ రాఘవః. 2

ఇది పరిశుద్ధమైనది, ఇది రసవంతమైనది, ఇది
చక్కగ పక్వమైనది అని ధర్మాత్ముడగు రాముడు మాంస
జూపి దానిగుణమును ప్రశంసించుచు ఆమెతో కూడియు
(ఇట్లుచెప్పుటచే ముందు రాముడు తాను మాంసము భు
మిగిలిన దానినిగూర్చి తనభార్యకు వర్ణించి చెప్పెనని తోచ

తథా తత్రాఽఽసత స్తస్య భరత స్యోపయాయినః,
సైన్య రేణు శ్చ శబ్ద శ్చ ప్రాదురాస్తాం నభస్పృ

ఆ విధముగ నా చిత్రకూట పర్వత ప్రాంతమున
కూర్చుండియున్న రామునకు-భరతుని సైన్యము నడచివచ
నేర్పడిన ధూళి, పెద్ద ధ్వని మిన్నంటినవి.

ఏతస్మి న్నంతరే త్రస్తా శ్శబ్దేన మహతా తతః,
అర్దితా యూథపా మత్తా స్సయూథా దుద్రువు ర్దిశ

అంత నా మహాశబ్దమును వినినంతనే యూథప
మదించిన ఏనుగులు తమతమ యూథములతో గూడి నలు
లకు పరువులెత్తినది.

స తం సైన్యసముద్ధూతం శబ్దం శుశ్రావ రాఘవః
తాం శ్చ విప్రద్రుతా న్సర్వా న్యూథపా నన్వవైక్ష

రాముడా సైన్యముచే నేర్పడిన శబ్దము వినెను. ఆ
నకు భయపడి పరుగులెత్తిన మత్తేభములను చూచెను.

తాం శ్చ విద్రవతో దృష్ట్వా తం చ శ్రుత్వా చ నిస్వ
ఉవాచ రామ స్సౌమిత్రిం లక్ష్మణం దీప్తతేజసమ్

అట్లు పరుగెత్తు మత్తగజములను చూచి, ఆ మహాశబ్దము ను విని రాముడు ప్రజ్వరిల్లు తేజము గల లక్ష్మణున కిట్లనెను.

హన్త లక్ష్మణ! పశ్యేహ సుమిత్రా సుప్రజా స్త్వయా,
భీమస్తనితగంభీర స్తుముల శ్శ్రూయతే స్వనః. 7

ఏమిది! లక్ష్మణా! ఇటు చూడుము. నీవలన నీతల్లి యుత్త మసంతానవతియైనది. భయంకరమగు మేఘధ్వనివలె గంభీర మగు శబ్దము వినిపించుచున్నది!

గజయూథాని వాఽరణ్యే మహిషా వా మహావనే,
విత్రాసితా మృగా స్సింహై స్సహసా ప్రద్రుతా దిశః. 8

ఈ మహారణ్యమున సింహములచే భయపెట్టబడినవై ఏను గుల గుంపులుగాని, అడవిదున్నలుగాని, లేళ్లుగాని అన్నిదిక్కు లకు పరుగెత్తినవి.

రాజా వా రాజమాత్రో వా మృగయా మటతే వనే,
అన్యద్వా శ్వాపదం కించి త్సౌమిత్రే! జ్ఞాతు మర్హసి. 9

లక్ష్మణా! రాజుగాని లేక రాజుతో సమానుడైనవా డెవ్వ డేని వేటాడుచున్నాడా? లేక ఏదేని క్రూరజంతువు వన్యమృగ ములను భయపెట్టుచున్నదా? నీవిది తెలిసికొన దగుదువు.

సుదుశ్చరో గిరి శ్చాయం పక్షిణా మపి లక్ష్మణ!,
సర్వ మేత ద్యథాతత్త్వ మచిరాత్ జ్ఞాతు మర్హసి. 10

లక్ష్మణా! ఈ కొండ పక్షులకు గూడ తిరుగరానిది. నీ వి

జంతువుల భయమునకు కారణమేమో యథాతథముగ శీఘ్రమే తెలిసికొనదగుదువు.

స లక్ష్మణ స్సంత్వరిత స్సాల మారుహ్య పుష్పితమ్,
ప్రేక్షమాణో దిశ స్సర్వాః పూర్వాం దిశ ముదైక్షత. 11

అంత నా లక్ష్మణుడు శీఘ్రమే పూచిన యొక చెట్టునెక్కి, యన్ని దిక్కులు కలయజూచుచు, తూర్పు దిక్కు నవలోకించెను.

ఉదఙ్ముఖః ప్రేక్షమాణో దదర్శ మహతీం చమూమ్,
రథాశ్వగజసంబాధాం యత్తై ర్యుక్తాం పదాతిభిః. 12

పిమ్మట ఉత్తర దిక్కువైపు చూచుచు నచట రథములు, గుఱ్ఱములు, ఏనుగులతో కూడినది, సన్నద్ధులైన కాల్బలము వారితో కూడినదగు పెద్ద సైన్యమును కాంచెను.

తా మశ్వగజసంపూర్ణాం రథధ్వజవిభూషితామ్,
శశంస సేనాం రామాయ వచనం చేద మబ్రవీత్. 13

లక్ష్మణుడు రామునకు గుఱ్ఱములతో, ఏనుగులతో నిండి, రథములు, జెండాలతో నలంకృతమైనయు అగు సేననుగూర్చి తెలిపి-ఇట్లనెను.

అగ్నిం సంశమయ త్వార్య సీతా చ భజతాం గుహామ్,
సజ్యం కురుష్వ చాపం చ శరాం శ్చ కవచం తథా. 14

అన్నా! అగ్నిని చల్లార్పుము (అగ్నియున్నచో పొగవచ్చును పొగను బట్టి శత్రువులకు తమనివాసము తెలియవచ్చును).

సీతను గుహలోనికి పంపుము. నీ శరచాపములు కవచము సిద్ధము చేసికొమ్ము.

తం రామః పురుషవ్యాఘ్రో లక్ష్మణం ప్రత్యువాచ హ,
అంగావేక్షస్వ సౌమిత్రే! క స్యేమాం మన్యసే చమూమ్.

అపుడు పురుషశ్రేష్ఠుడగు రాముడు లక్ష్మణునితో "ఓయీ లక్ష్మణా! ఆసేన యెవ్వరిదో గమనింపు" మనెను.

ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణో వాక్య మబ్రవీత్,
దిధక్షన్నివ తాం సేనాం రుషితః పావకో యథా. 16

రాము డిట్లనగా లక్ష్మణుడు కోపించిన యగ్నివోలె నాసేనను తగులబెట్టి నిచ్చగించుచున్నాడా యన్నటులు చూచుచు అన్న కిట్లనెను.

సంపన్నం రాజ్య మిచ్ఛంస్తు వ్యక్తం ప్రాప్యాభిషేచనమ్,
అవాం హంతుం సమభ్యేతి కైకేయ్యా భరత స్సుతః. 17

(క్రూరస్వభావముకల) కైకేయీతనయుడగు భరతుడు (లభించిన దానితో తృప్తి నందక) రాజ్యమును సమృద్ధము (నిష్కంటకము) చేయగోరుచు, ఆరాజ్యమున (భాగస్వాములమగు) మనలను చంపవచ్చుచున్నాడు.

ఏష వై సుమహా ఞ్ఛ్రీమా న్విటపీ సంప్రకాశతే,
విరాజ త్యుద్గతస్కంధం కోవిదారధ్వజో రథే. 18

ధ్వజచిహ్నముగ నున్న మహావృక్షము ప్రకాశించుచు

న్నది. కోవిదారధ్వజము (కాంచనవృక్షము గుర్తుగాకల జెండా) ఉన్నతమగు స్కంధముతో ప్రకాశించుచున్నది.

భజ న్త్యేతే యథాకామ మశ్వా నారుహ్య శీఘ్రగాన్,
ఏతే భ్రాజంతి సంహృష్టా గజా నారుహ్య సాదినః. 19

అశ్వారోహకులు యథేచ్ఛగ వేగముగల గుఱ్ఱముల నెక్కి ఈ ప్రదేశమున కేతెంచుచు సంతోషములో ప్రకాశించుచున్నారు.

గృహీతధనుషౌ చావాం గిరిం వీర! శ్రయావహై,
అథ వే హైవ తిష్ఠావ స్సన్నద్ధా వుద్యతాయుధౌ. 20

వీరుడా! మన మిరువురము విండ్లుధరించి యీ కొండ నెక్కుదము. లేదా ఆయుధముల నెత్తి, సన్నద్ధులమై ఇచటనే యుండుదము.

అపి నౌ వశ మాగచ్ఛే త్కోవిదారధ్వజో రణే.

యుద్ధమున కోవిదారధ్వజముగల భరతుడు మనకు వశము కాగలడు.

అపి ద్రక్ష్యామి భరతం యత్కృతే వ్యసనం మహత్,21
త్వయా రాఘవ! సంప్రాప్తం సీతయా చ మయా తథా.

ఎవని వలని నీకు, సీతకు, నాకుగూడ మహాక్లేశము కలిగెనో, ఆ భరతుని రణమున చూడగలుగుదును గదా!

యన్నిమిత్తం భవా న్రాజ్యా చ్చ్యుతో రాఘవ! శాశ్వతాత్,
సంప్రాప్తోఽయ మరి ర్వీర ! భరతో వధ్య ఏవ మే.

వీరుడవగు. రామా! ఎవని వలన నీవు శాశ్వతమగు రాజ్యమునుండి పడగొట్టబడితివో, అట్టిశత్రువగు భరతుడు వచ్చినాడు. నా కాతడు వధ్యుడే.

భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ! 23
పూర్వాపకారిణాం త్యాగే న హ్యధర్మో విధీయతే.

రామా! భరతుని చంపుటలో దోషము నాకు కానరాలేదు. ముందే అపకారులగు వారిని విడచుట యధర్మము కాదు.

పూర్వాపకారీ భరత స్త్యక్తధర్మ శ్చ రాఘవ! 24
ఏతస్మి న్నిహతే కృత్స్నా మనుశాధి వసుంధరామ్.

రాఘవుడా! భరతుడు పూర్వ మపకార మొనర్చినవాడు. ధర్మము వీడినవాడును. అతడు చంపబడగా భూమండలము నెల్ల పరిపాలింపుము.

అద్య పుత్త్రం హతం సంఖ్యే కైకేయీ రాజ్యకాముకా 25
మయా పశ్యే త్సుదుఃఖార్తా హస్తిభగ్న మివ ద్రుమమ్.

రాజ్యముపై కాంక్షకల కైక ఏనుగుచే విరుగగొట్టబడిన చెట్టునువలె, యుద్ధమున నాచేచంపబడిన తన తనయుని మిగుల దుఃఖపీడితయై చూడగలదు.

కైకేయీం చ వధిష్యామి సానుబంధాం సబాంధవామ్ 26
కలుషే ణాద్య మహతా మేదినీ పరిముచ్యతామ్.

మంధర మున్నగువారి బంధువులతో కూడ కైకను చంపెదను. నేడు భూమి మహాపాపమునుండి విడువబడుగాక.

అ దేయమం సంయతం క్రోధ మసత్కారం చ మానద। 27
మోక్ష్యామి శత్రుసైన్యేషు కక్షే ష్వివ హుతాశనమ్,

మానదుడా! ఇప్పటివఱకు నిలుపుకొనియున్న కోపమును (మనవిషయమున చేయబడిన) తిరస్కారమున, ఎండు పొదలలో అగ్నినివోలె శత్రుసేనలపై విడిచెదను.

అద్యైత చ్చిత్రకూటస్య కాననం నిశితై శ్శరైః, 28
ఛింద ఞ్ఛత్రుశరీరాణి కరిష్యే శోణితోక్షితమ్,

నేడు తీక్ష్ణములైన బాణములతో శత్రుశరీరములు చీల్చుచు, చిత్రకూటపు అడవిని రక్తముతో తడపెదను.

శరై ర్నిర్భిన్నహృదయా న్కుంజరాం స్తురగాం స్తథా,
శ్వాపదాః పరికర్షంతు నరాం శ్చ నిహతా న్మయా,

నాబాణములచే చీల్చబడిన గుండెలు కల ఏనుగులను గుఱ్ఱములను, నాచే చంపబడిన జనులను వన్యమృగము లీడ్చుకొని పోవుగాక.

శరాణాం ధనుష శ్చాహ మనృణో౽స్మి మహామృధే. 30
ససైన్యం భరతం హత్వా భవిష్యామి న సంశయః.

ఇంతకు ముందా యీ మహాయుద్ధములో బాణములకు, వింటికిని శత్రురక్తముతో తర్పణము చేసి ఋణము తీర్చుకొన్న నేను, సైన్యముతో కూడిన భరతుని సంహరించియు ఋణవిముక్తుడనగుటలో సంశయము లేదు.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షణ్ణవతితమః సర్గః

ఇట్లు ఋషి ప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణమం దయోధ్యాకాండమున తొంబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## సప్తనవతితమః సర్గః — తొంబదియేడవ సర్గము

సుసంరబ్ధం తు సౌమిత్రిం లక్ష్మణం క్రోధమూర్ఛితమ్,
రామ స్తు పరిసాన్త్వ్యాథ వచనం చేద మబ్రవీత్. 1

కోపముతో మోహము నంది, తత్ప్రయుక్తమగు యుద్ధ సంరంభ మొనరించున్న లక్ష్మణు నోదార్చుచు రాము డిట్లు పలికెను.

కి మత్ర ధనుషా కార్య మసినా వా సచర్మణా,
మహేష్వాసే మహాప్రాజ్ఞే భరతే స్వయ మాగతే. 2

మహాబుద్ధిమంతు డగుటచే ఉచితములగు సందర్భములందే బాణము సంధించెడి మేటివిలుకాడగు భరతుడు స్వయముగ నిట కేతెంచిన యీ సందర్భమున విల్లుతోడను కత్తి-డాలు తోడను పని యేమున్నది ?

పితు స్సత్యం ప్రతిశ్రుత్య హత్వా భరత మాగతమ్,
కిం కరిష్యామి రాజ్యేన సాపవాదేన లక్ష్మణ !. 3

తండ్రి వాక్కును సత్యము చేతునని ప్రతినబూని, చెంతకు

వచ్చిన భరతుని చంపి ' తండ్రి రాజ్యమును భరతున కీయగా నతనిని చంపి రాముడు రాజ్యమును హరించినా ' డను అపవాదుతో కూడిన రాజ్యముతో నేమి చేతును ?

యద్ద్రవ్యంబాంధవానాం వా మిత్రాణాం వా క్షయే భవేత్
నాహం తత్ప్రతిగృహ్ణీయాం భక్షా న్విషకృతా నివ. 4

బంధువుల యొక్కయు, మిత్రులయొక్కయు వినాశము వలన లభించు ద్రవ్యమును విషముతో వండిన భక్ష్యమును వలె స్వీకరింపను.

ధర్మ మర్థం చ కామం చ పృథివీం చాపి లక్ష్మణ !,
ఇచ్ఛామి భవతా మర్థే హ్యేత త్ప్రతిశృణోమి తే. 5

లక్ష్మణా! సోదరులగు మీకొఱకై ధర్మమును, రత్నాదులను, కామమును, భూమిని కోరుచున్నాను. అట్లని ప్రతిజ్ఞచేతును.

భ్రాతౄణాం సంగ్రహార్థం చ సుఖార్థం చాపి లక్ష్మణ !,
రాజ్య మ ప్యహ మిచ్ఛామి సత్యేనాఽఽయుధ మాలభే. 6

రాజ్యము బహుచ్ఛిద్రమని యెఱింగియు నా సోదరులకు ధన సంగ్రహము కావలెనని, వారు సుఖముగ నుండవలెననియే వారి క్షేమము కోరియే దానిని కోరుచున్నాను. నామాట సత్యమగునట్లు ఆయుధము తాకుచున్నాను.

నేయం మమ మహీ సౌమ్య ! దుర్లభా సాగరాంబరా,
నహీచ్ఛేయ మధర్మేణ శక్రత్వమపి లక్ష్మణ !. 7

ఓ సౌమ్యుడా! సముద్రమే వస్త్రముగా కల ఈభూమినాకు సంపాదింప శక్యము కానిది కాదు. అట్లయ్యును నే నధర్మముగ దేవేంద్రపదవినేని పొందగోరను.

యద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద !,
భవే న్మమ సుఖం కించి ద్భస్మ తత్కురుతాం శిఖీ. 8

ఓ మానదుడా! భరతుడు, నీవు, శత్రుఘ్నుడు మీ ముమ్వురకు లభించని సుఖ మేదేని నాకున్నచో దాని నగ్ని భస్మము చేయుగాక!

మన్యేఽహ మాగతోఽయోధ్యాం భరతో భ్రాతృవత్సలః,
మమ ప్రాణా త్ప్రియతరః కులధర్మ మనుస్మరన్. 9

శ్రుత్వా ప్రవ్రాజితం మాం హి జటావల్కలధారిణమ్,
జానక్యా సహితం వీర ! త్వయా చ పురుషర్షభ !. 10

స్నేహే నాఽఽక్రాంతహృదయ శ్శోకే నాకులితేంద్రియః,
ద్రష్టు మభ్యాగతో హ్యేష భరతో నాన్యథాఽఽగతః. 11

ఓ వీరుడా! నే నిట్లు తలంతును. సోదరులయం దనురాగముకలవాడు, నాకు ప్రాణములకన్న ప్రీతిపాత్రుడగు భరతు డయోధ్యకు వచ్చి యుండును. అతడు జ్యేష్ఠుడే రాజ్యపరిపాలనము చేయవలె ననెడు వంశధర్మమును తలంచుచు-నేను జటావల్కలములు దాల్చి సీతతో, నీతోగూడ అయోధ్యను వీడి వచ్చితినని విని నావిషయమున ప్రీతితో నిండిన డెందము కలవాడగుటచే నా వివాసము వలన కలిగిన దుఃఖముచే కలత జెంది నన్ను చూడ వచ్చినాడే కాని నాకు విరోధిగ కాదు.

అంబాం చ కైకయీం రుష్య పరుషం చాప్రియం వదన్,
ప్రసాద్య పితరం శ్రీమా న్రాజ్యం మే దాతు మాగతః.12

శ్రీమంతు డగు భరతుడు, తన తల్లి కైకపై కోపించి, కఠిన ముగ అప్రియవచనములు పలికి, తండ్రి ననుమతింప జేసికొని నాకు రాజ్య మీయ వచ్చినాడు.

ప్రాప్తకాలం య దేషోఽస్మాన్భరతో ద్రష్టు మిచ్ఛతి,
అస్మాసు మనసాఽ ప్యేష నాప్రియం కించి దాచరేత్. 13

భరతుడు మనల నిచట దర్శింప దలచుట సమయో చితము. ఇతడు మనస్సులో గూడ మన కొకింతయు నప్రియ మాచరింపడు.

విప్రియం కృతపూర్వం తే భరతేన కదా ను కిమ్,
ఈదృశం వా భయం తేఽద్య భరతం యోఽత్ర శంకసే.14

నీవిపుడు భరతుని శంకించుచుంటివే. అతడు నీ కెన్నడైన అప్రియము కలిగించినాడా ? లేదా నీవిపుడు పలుకుచున్నట్లు భయజనకములగు మాటలు నిన్ను పలికెనా ?

న హి తే నిష్ఠురం వాచ్యో భరతో నాప్రియం వచః,
అహం హ్యప్రియ ముక్తః స్స్యాం భరత స్యాప్రియే కృతే.15

నీవు భరతుని కఠినముగా లేదా అప్రియముగ పలుక వలదు. నీవు భరతున కప్రియ మాచరించుచో నన్ను అప్రియముగ పలికినటులే యగును.

కథం ను పుత్రాః పితరం హన్యుః కస్యాం చి దాపది,
భ్రాతా వా భ్రాతరం హన్యా త్సౌమిత్రే! ప్రాణ మాత్మనః.

ఎట్టి యాపద వాటిల్లినను కుమారులు తండ్రిని చంపుదురా ? అట్లే సోదరుడు తన ప్రాణసమానుడగు సోదరుని చంపుకొనునా ?

(లక్ష్మణుడు వనవాసగమనకాలమున కోపముతో తండ్రినే చంపెద ననినాడు. ఇపుడు సోదరుని చంపెద ననుచున్నాడు. ఇతని మాటలను వినుచు తా నూరకుండిన కార్యహాని యగునని భయపడి రాము డతని రౌద్రబుద్ధిని నిరోధించి మఱల్చుచుండుట గమనార్హము).

యది రాజ్యస్య హేతో స్త్వ మిమాం వాచం ప్రభాషసే,
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్య మస్మై ప్రదీయతామ్. 17

నీవు రాజ్యముకొఱకే యిట్టి కఠినోక్తు లాడుచున్నచో-భరతుని చూచి – "భరతా । నీవు లక్ష్మణునకు రాజ్యమిమ్ము" అనియెదను.

ఉచ్యమానోఽపి భరతో మయా లక్ష్మణ ! తత్త్వతః,
రాజ్య మస్మై ప్రయచ్ఛేతి బాఢ మి త్యేవ వక్ష్యతి. 18

లక్ష్మణా । నేను 'లక్ష్మణునకు రాజ్య మిమ్మని' చెప్పగా, తప్పక అట్లే ఇత్తు ననియే చెప్పును.

తథోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః,
లక్ష్మణః ప్రవివే శేవ స్వాని గాత్రాణి లజ్జయా. 19

ధర్మశీలుడగు అన్న యటులు పలుకగా, నతని హితమందాసక్తిగల లక్ష్మణుడు సిగ్గుతో తన శరీరమును సంకోచ పరచుకొనెను.

త ద్వాక్యం లక్ష్మణః శ్రుత్వా వ్రీళితః ప్రత్యువాచ హ,
త్వాం మన్యే ద్రష్టు మాయాతః పితా దశరథ స్స్వయమ్.

లక్ష్మణు డా వాక్యము విని సిగ్గుపడి వేఱొక విషయము ప్రస్తావించుచు ఇట్లనెను— 'అన్నా! మన తండ్రి దశరథుడు నిన్ను చూడ వచ్చుచున్నాడని తలంతును.

వ్రీళితం లక్ష్మణం దృష్ట్వా రాఘవః ప్రత్యువాచ హ,
సిగ్గుపడిన లక్ష్మణుని చూచి రాము డిట్లు పలికెను.

ఏష మన్యే మహాబాహు రి హాస్మాన్ ద్రష్టు మాగతః. 21
అథవా నౌ ధ్రువం మన్యే మన్యమానః సుఖోచితౌ,
వనవాస మనుధ్యాయ గృహాయ ప్రతినేష్యతి. 22
ఇమాం వాఽప్యేష వైదేహీ మత్యంతసుఖసేవినీమ్,
పితా మే రాఘవ శ్శ్రీమా న్వనా దాదాయ యాస్యతి. 23
ఏతౌ తౌ సంప్రకాశేతే గోత్రవంతౌ మనోరమౌ,
వాయువేగసమౌ వీర! జవనౌ తురగోత్తమౌ. 24
స ఏష సుమహాకాయః కంపతే వాహినీముఖే,
నాగ శ్శత్రుంజయో నామ వృద్ధ స్తాతస్య ధీమతః. 25
న తు పశ్యామి తచ్ఛత్రం పాండురం లోకసత్కృతమ్,
పితు ర్దివ్యం మహాబాహో! సంశయో భవ తీహ మే. 26

మహానుభావుడగు ఈ దశరథుడు మమ్ము చూడ వచ్చి యుండును. లేదా మనము సుఖమునకు యోగ్యులమని తలచి, మన వనవాస క్లేశము తలంచి మనల నింటికి కొనిపోవును. లేదా మిక్కిలి సుఖము లనుభవించునట్టి సీతను శ్రీమంతు డగు నా తండ్రి యడవినుండి తీసికొనిపోవును. వీరుడ వగు లక్ష్మణా! ఉత్తమ జాతికి చెందినవై, సుందరములై, వాయువేగముతో సమానమైన వేగము కల ఈ శ్రేష్ఠములగు గుఱ్ఱము లెంతయు ప్రకాశించు చున్నవి. ధీమంతు డగు నాతండ్రిగారి శత్రుంజయమను పేరుగలది, మహాశరీరము కలది, పెద్దదియగు ఈ ఏనుగు సేన ముందు నడచుచున్నది. ఓ మహాభుజుడా! సకలజన పూజితము, దివ్యము అగు నాతండ్రి శ్వేతచ్ఛత్రము మాత్ర మగపడుటలేదు. నా కాయన విషయమున శంక కలుగుచున్నది.

వృక్షాగ్రా దవరోహ త్వం కురు లక్ష్మణ! మద్వచః,
ఇతీవ రామో ధర్మాత్మా సౌమిత్రిం తమువాచ హ. 27

లక్ష్మణా! నీవు చెట్టు కొననుండి దిగిరమ్ము. నా మాట పాటించుము. అని ధర్మాత్ముడగు రాముడు లక్ష్మణునితో పలికెను.

అవతీర్య తు సాలాగ్రా త్తస్మా త్స సమితింజయః,
లక్ష్మణః ప్రాంజలి ర్భూత్వా తస్థౌ రామస్య పార్శ్వతః. 28

శత్రుసేనలను జయించువాడగు లక్ష్మణుడా వృక్షాగ్రము నుండి దిగివచ్చి యన్న కంజలి ఘటించి, పార్శ్వమున నిలిచెను.

భరతే నాపి సందిష్టా సమ్మర్దో న భవే దితి,
సమన్తా త్తస్య శైలస్య సేనా వాస మకల్పయత్. 29

రామాశ్రమమున కెంతమాత్రము బాధ కలుగరాదని భరతు డాజ్ఞాపించగా ఆ సైన్యము ఆశ్రమమునకు దూరముగ చిత్రకూటము చుట్టును విడిసెను.

అధ్యర్ధ మిక్ష్వాకుచమూ ర్యోజనం పర్వతస్య సా,
పార్శ్వ న్యవిశ దావృత్య గజవాజిరథాకులా. 30

ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో కూడిన యిక్ష్వాకుని సేన పర్వతము చుట్టును ఒకటిన్నర యోజనముల మేర నాక్రమించి నిలచెను.

సా చిత్రకూటే భరతేన సేనా
ధర్మం పురస్కృత్య విధూయ దర్పమ్,
ప్రసాదనార్థం రఘునందనస్య
విరాజతే నీతిమతా ప్రణీతా. 31

చిత్రకూట సమీపమున, సైన్యముతోడనే రాముని చెంత కేగినచో యతని యనుగ్రహము కలుగదని నీతి నెఱిగిన భరతునిచే రాజుకడకు వినీతవేషముతో పోవలెనను ధర్మమును పురస్కరించుకొని, దర్పము వీడి, రాముని ప్రసన్నుని చేసికొనుటకై తీసికొని రాబడిన ఆసేన ప్రకాశించసాగెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తనవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున తొంబదియేడవ సర్గము సమాప్తము.

# అష్టనవతితమః సర్గః — తొంబదియెనిమిదవ సర్గము

నివేశ్య సేనాం తు విభుః పద్భ్యాం పాదవతాం వరః,
అభిగంతుం స కాకుత్స్థ మియేష గురువర్తకమ్. 1

ధార్మికుడు, నడచిపోవు భాగ్యము కలుగుటచే పాదములు కలవారిలో శ్రేష్ఠుడగు భరతుడు, గురువచనము ననుసరించి ప్రవర్తించువాడగు రాముని చెంతకు పాదచారియై పోవనెంచెను.

నివిష్టమాత్రే సైన్యే తు యథోద్దేశం వినీతవత్,
భరతో భ్రాతరం వాక్యం శత్రుఘ్న మిద మబ్రవీత్. 2

అపుడు ఆయా నిర్దిష్ట ప్రదేశములలో సైన్యము విడియగా, వినయవంతుడైన భరతుడు శత్రుఘ్నున కీ వాక్యము పలికెను.

క్షిప్రం వన మిదం సౌమ్య! నరసంఘై స్సమంతతః,
లుబ్ధైశ్చ సహితై రేభి స్త్వ మన్వేషితు మర్హసి. 3

ఓ సౌమ్యుడా! నీవు శీఘ్రమే ఈ బోయలతో, భటులతో కూడి యీ వనము నెల్ల అన్వేషింపుము.

గుహో జ్ఞాతిసహస్రేణ శరచాపాసిధారిణా,
సమన్వేషతు కాకుత్స్థా వస్మి న్పరివృత స్స్వయమ్. 4

గుహుడు ధనుర్బాణములు దాల్చిన తన బంధువులు వేయిమందితో నీచిత్రకూట పర్వతము చుట్టును స్వయముగ రామలక్ష్మణులను వెదుకవలయును.

అమాత్యై స్సహ పౌరై శ్చ గురుభి శ్చ ద్విజాతిభిః,
వనం సర్వం చరిష్యామి పద్భ్యాం పరివృత స్స్వయమ్.5

మంత్రులు, పౌరులు, గురువులు, బ్రాహ్మణులతోగూడి నేను స్వయముగ పాదచారినై ఈ యడవియం దెల్లడల రాముని వెదకుచు సంచరింతును.

యావ న్న రామం ద్రక్ష్యామి లక్ష్మణం వా మహాబలమ్,
వైదేహీం చ మహాభాగాం న మే శాంతి ర్భవిష్యతి. 6

రామునిగాని, మహాబలుడగు లక్ష్మణునిగాని, మహాభాగ్యవతి యగు సీతనుగాని చూడనంతవరకు నాకు శాంతి కలుగదు.

యావ న్న చంద్రసంకాశం ద్రక్ష్యామి శుభ మాననమ్,
భ్రాతుః పద్మపలాశాక్షం న మే శాంతి ర్భవిష్యతి. 7

ఎంతవరకు నేను తామర రేకులవంటి కన్నులుగల రాముని మంగళకరమగు ముఖమును చూడనో అంతవఱకు నాకు శాంతి చేకూరదు.

యావ న్న చరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ,
శిరసా ధారయిష్యామి న మే శాంతి ర్భవిష్యతి. 8

ఎంతవఱకు వజ్రము, అరవిందము, అంకుశము, సుధాకలశము మున్నగు రాజచిహ్నములతో నొప్పు నా యన్న పాదములు తలఁదాల్పనో యంతవఱకు నాకు శాంతి లభించదు.

యావ న్న రాజ్యే రాజ్యార్హః పితృపైతామహే స్థితః,
అభిషేకజలక్లిన్నో న మే శాంతి ర్భవిష్యతి. 9

రాజ్యార్హుడగు నాయన్న తండ్రి తాతలనుండి సంక్రమించిన ప్రజాపరిపాలనాధికారమున నిలచి, పట్టాభిషేకజలములచే తడువడో అప్పటివఱకు నాకు శాంతి యేర్పడదు.

సిద్ధార్థః ఖలు సౌమిత్రి ర్య శ్చంద్రవిమలోపమమ్,
ముఖం పశ్యతి రామస్య రాజీవాక్షం మహాద్యుతి. 10

నిర్మలచంద్రుని బోలునది, పద్మముల వంటి కన్నులు కలది, గొప్పకాంతిగలది అగు రాముని ముఖమును సదా దర్శించు లక్ష్మణుడు కృతార్థుడు కదా.

కృతకృత్యా మహాభాగా వైదేహీ జనకాత్మజా,
భర్తారం సాగరాంతాయాః పృథివ్యా యాఽనుగచ్ఛతి. 11

మహాకుల ప్రసూత, మహాభాగ్యవతియే సీతాదేవి. ఆమె సాగరపర్యంతము వ్యాపించిన భూమికి భర్తయగు తన నాథు ననుసరించి పోవుచున్నది.

సుభగ శ్చిత్రకూటోఽసౌ గిరిరాజోపమో గిరిః,
యస్మి న్వసతి కాకుత్స్థః కుబేర ఇవ నందనే. 12

కుబేరుడు నందనవనమందువలె రాముడిచట నివసించుటచే హిమవత్పర్వతమునకు సాటియగు ఈ చిత్రకూటపర్వతము చాల భాగ్యవంతమైనది.

కృతకార్య మిదం దుర్గం వనం వ్యాళనిషేవితమ్,
య దధ్యాస్తే మహాతేజా రామ శ్శస్త్రభృతాం వరః. 13

మహాతేజశ్శాలియు, ఆయుధధారులలో నుత్తముడును అగు రాముడు నివసించుటచే దుష్టసర్పాదులచే ప్రవేశింపరాని యీ యడవియు కృతార్థమైనది.

ఏవ ముక్త్వా మహాతేజా భరతః పురుషర్షభః,
పద్భ్యామేవ మహాబాహుః ప్రవివేశ మహ ద్వనమ్. 14

మహాతేజశ్శాలియు, మహాబాహుడును, నరశ్రేష్ఠుడగు భరతు డట్లుపలికి, కాలినడకనే యా మహారణ్యము బ్రవేశించెను.

స తాని ద్రుమజాలాని జాతాని గిరిసానుషు,
పుష్పితాగ్రాణి మధ్యేన జగామ వదతాం వరః. 15

వక్తలలో శ్రేష్ఠుడైన ఆ భరతుడు కొండచరియలపై మొలచినవియు, పుష్పించినట్టివియు అగు వృక్షసమూహముల నడుమ నడచి పోయెను.

స గిరే శ్చిత్రకూటస్య సాల మాసాద్య పుష్పితమ్,
రామాశ్రమగత స్యాగ్నే ర్దదర్శ ధ్వజ ముచ్ఛ్రితమ్. 16

అతడు చిత్రకూటపర్వతప్రాంతమున పుష్పించిన యొక చెట్టుచెంత కేగి, యచట రామాశ్రమ మందలి యగ్నియొక్క ధ్వజము (పొగ) పైకెగయుట చూచెను.

తం దృష్ట్వా భరత శ్శ్రీమా న్ముమోహ సహ బాంధవః,
అత్ర రామ ఇతి జ్ఞాత్వా గతః పార మివాంభసః. 17

శ్రీమంతుడు బంధుసహితుడగు భరతు డా పొగచూచి,

రాము డిచటనే యున్నాడని తెలిసికొని, సముద్రము దాటిన వానివలె, మూర్ఛాసదృశమగు ఆనందపరవశ్యము నందెను.

సచిత్రకూటే తు గిరౌ నిశామ్య
రామాశ్రమం పుణ్యజనోపపన్నమ్,
గుహేన సార్ధం త్వరితో జగామ
పున ర్నివే శ్యైవ చమూం మహాత్మా. 18

పుణ్యముచేసిన వారలలో కూడిన రామాశ్రమము నా చిత్ర కూట గిరిపై చూచి (లేదా తత్సమీపమందుండు వారు చెప్పగా విని) రాముని వెదుకవచ్చిన సైన్యమును గూడ ముందునకు రావలదని వారించి, మహాత్ముడగు భరతుడు గుహునితోగూడ త్వరగా పోయెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అష్టనవతితమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున తొంబదియెనిమిదవ సర్గము సమాప్తము.

## ఏకోనశతతమః సర్గః - తొంబదితొమ్మిదవ సర్గము

నివిష్టాయాం తు సేనాయా ముత్సుకో భరత స్తదా,
జగామ భ్రాతరం ద్రష్టుం శత్రుఘ్న మనుదర్శయన్. 1

సేన యట్లు నిలువగా, తానును ఒకింత తడవుండి, రాముని

చూడవలెనని వేడుకపడు భరతుడు రామాశ్రమ సమీప చిహ్నములను శత్రుఘ్నునకు చూపుచు అన్నను చూచుటకు వెడలెను.

ఋషిం వసిష్ఠం సందిశ్య మాతౄ ర్మే శీఘ్ర మానయ,
ఇతి త్వరిత మగ్రే స జగామ గురువత్సలః. 2

పెద్దలపై గౌరవము కల భరతుడు-'శీఘ్రమే మాతల్లులను కొనిరం' డని వసిష్ఠునకు చెప్పి, త్వరితగతిని ముందునడచెను.

సుమంత్ర స్త్వపి శత్రుఘ్న మదూరా దన్వపద్యత,
రామదర్శనజ స్తర్షో భరత స్యేవ తస్య చ. 3

సుమంత్రుడును శత్రుఘ్నుని వెంటనే పోయెను. రాముని చూడవలెనను ఉత్కంఠ భరతునకు వలె సుమంత్రునకును (శత్రుఘ్నుడు భరతు ననుసరించుటచే నతనికి అన్నను చూడవలెనను త్వర యెట్లును ఊహ్యము) ఉండినది.

గచ్ఛన్నే వాథ భరత స్తాపసాలయసంస్థితామ్,
భ్రాతుః పర్ణకుటీం శ్రీమా నుటజం చ దదర్శ హ. 4

శ్రీమంతుడగు భరతు డట్లు పోవుచునే తపస్వుల నివాసముల నడుమ నున్నదియగు, అన్నయొక్క అగ్నిగృహమును, చూడవచ్చిన వా రుండుటకు నిర్మితమైన పర్ణకుటీరమును చూచెను.

శాలాయా స్త్వగ్రత స్తస్యా దదర్శ భరత స్తదా,
కాష్ఠాని చావభగ్నాని పుష్పా ణ్యుపచితాని చ. 5

భరతు డపు డా పర్ణశాల యెదుట చీల్చబడిన కట్టెలను (రాత్రులందు ప్రకాశార్థము మంటవేయుటకు కట్టెలు) పూజకొఱకు సంపాదించబడిన పూలను చూచెను.

స లక్ష్మణస్య రామస్య దదర్శాఽఽశ్రమ మీయుషః,
కృతం వృక్షే ష్వభిజ్ఞానం కుశచీరైః క్వచి త్క్వచిత్. 6

భరతుడు— జలాశయమునుండి ఆశ్రమమునకు పోవుచు రామునిచే, లక్ష్మణునిచేతను ఒండొరుల రాకపోకలు పరస్పరము తెలియుకొఱకు చెట్లయందు దర్భలతో, వల్కలములలో చేయ బడిన గుర్తును చూచెను. (ఆశ్రమమునకు వచ్చు మార్గము స్పష్టముగా తెలియుటకు రామలక్ష్మణులు కుశచీరములతో నట నట చెట్లపై గుర్తు లేర్చరచిరని మహేశ్వర తీర్థీయము)

దదర్శ చ వనే తస్మి న్మహత స్సంచయా న్కృతాన్,
మృగాణాం మహిషాణాం చ కరీషై శ్శీతకారణాత్. 7

భరతు డా వనమందు శీతనివారణము కొఱకై యొకచో చేర్చి పెట్టబడిన మృగములు, దున్నలయొక్క పేడకడుల గుట్టలను చూచెను.

గచ్ఛ న్నేవ మహాబాహు ర్ద్యుతిమా న్భరత స్తదా,
శత్రుఘ్నం చాబ్రవీ ద్ధృష్ట స్తా నమాత్యాం శ్చ సర్వశః.8

తేజశ్శాలి మహాభుజుడగు భరతు డపుడు హర్షముతో శత్రుఘ్నునకు, సుమంత్రుడు మున్నగు మంత్రులకు నిట్లనెను.

మన్యే ప్రాప్తాః స్మ తం దేశం భరద్వాజో య మబ్రవీత్,
నాతిదూరే హి మన్యేఽహం నదీం మందాకినీ మితః. 9

భరద్వాజుడు చెప్పిన ప్రదేశమునకు వచ్చితినని తలంచు చున్నాను. గంగానది ఇటకు చెంతనే కలదనియు తలంతును.

ఉచ్చై ర్బద్ధాని చీరాణి లక్ష్మణేన భవే దయమ్,
అభిజ్ఞానకృతః పంథా అకాలే గంతు మిచ్ఛతా. 10

నారవస్త్రము లున్నత ప్రదేశములలో కట్టబడియున్నవి. సాయంకాలము మున్నగు అకాలమందు ఫల- మూల-జలా దులు తెచ్చుటకై పోవలసిన లక్ష్మణుడు మార్గము తెలియుటకై గుర్తు పెట్టియుండును (కాన మన మీ మార్గముననే పోవలయు నని భా.)

ఇదం చోదాత్తదంతానాం కుంజరాణాం తరస్వినామ్,
శైలపార్శ్వే పరిక్రాంత మన్యోన్య మభిగర్జతామ్. 11

ఇది మహా దంతములు కలవి, వేగముగ పోవునవి, ఒండొరులను చూచి గర్జించునవగు ఏనుగులు పర్వతప్రాంతమున తిరిగినచోటు.

య మే వాధాతు మిచ్ఛంతి తాపసా స్సతతం వనే,
త స్యాసౌ దృశ్యతే ధూమ స్సంకులః కృష్ణవర్త్మనః. 12

తపస్వులే యగ్నిని సాయంప్రాంతః కాలములందు హోమము మాచరించుట కెల్లపుడు రక్షింపగోరుదురో, ఆ గార్హపత్యాగ్ని యొక్క దట్టమైన పొగ కనుపించుచున్నది.

అత్రాహం పురుషవ్యాఘ్రం గురుసంస్కారకారిణమ్,
ఆర్యం ద్రక్ష్యామి సంహృష్టో మహర్షిమివ రాఘవమ్. 13

ఈ యాశ్రమముననందే నేనుత్తమోపదేశము గావించువాడును, నరశ్రేష్ఠుడును అగు రాముని మహర్షినివలె హర్షముతో దర్శింతును.

అథ గత్వా ముహూర్తం తు చిత్రకూటం స రాఘవః,
మందాకినీ మనుప్రాప్త స్తం జనం చేద మబ్రవీత్. 14

పిమ్మట భరతుడు చిత్రకూటము కడ కేగి, గంగానదిని చేరబోయి, శత్రుఘ్నుడు మున్నగు తనవారల కిట్లనెను.

జగత్యాం పురుషవ్యాఘ్రః ! ఆస్తే వీరాసనే రతః,
జనేంద్రో నిర్జనం ప్రాప్య ధి జ్మే జన్మ సజీవితమ్. 15

పురుషశ్రేష్ఠుడు, జనపాలుడగు రాముడు భూమిపై వీరాసనమున (కుడిమోకాలిపై ఎడమపాదమునుంచి కూర్చుండుట వీరాసనము) కూర్చుండుటయం దాసక్తుడై యున్నాడు. నా జన్మము, ప్రాణమును నిరర్థకములు.

మత్కృతే వ్యసనం ప్రాప్తో లోకనాథో మహాద్యుతిః,
సర్వా న్కామా న్పరిత్యజ్య వనే వసతి రాఘవః, 16
ఇతి లోకసమాకృష్టః పాదే ష్వద్య ప్రసాదయన్,
రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్య చ. 17

'లోకనాథుడు, మహాకాంతిమంతుడగు రాముడు భరతుని కొఱకు (కైకేయిచే భరతునకు రాజ్యమిప్పించుకొఱకు) కష్టములు పొందినాడు. అన్ని యభీష్టములను విడచి రాము డడవిలో నివసించుచున్నాడు' అని ప్రజలచే అపవాదు పొంది, ఇపుడా రాముని

ప్రసన్నుని చేసికొనుచు ఆయన పాదములపైనను, సీతాదేవిపాద ములపైనను పడెదను. అట్లే లక్ష్మణునికిని ప్రణామము చేతును (లక్ష్మణుడు తనకంటె చిన్నవాడయ్యును కార్యగౌరవముచేత నే అతని పాదములపై పడుట. తాను రాముని ప్రసన్నుని చేసికొను చుండగా లక్ష్మణుడు తనకుచేసిన అపకారము తనయందారోపించి భరతునిపై ప్రసన్నుడవు కావలదని రాముని నిరోధించునని యతని పాదములపైబడి యతనిని గూడ ప్రసన్నుని చేసికొనుట).

ఏవం సంవిలపం స్తస్మి న్వనే దశరథాత్మజః,
దదర్శ మహతీం పుణ్యాం పర్ణశాలాం మనోరమామ్. 18
సాలతాలాశ్వకర్ణానాం పర్ణై ర్బహుభి రావృతామ్,
విశాలాం మృదుభి స్తీర్ణాం కుశై ర్వేది మివాధ్వరే. 19
శక్రాయుధనికాశై శ్చ కార్ముకై ర్భారసాధనైః,
రుక్మపృష్ఠై ర్మహాసారై శ్శోభితాం శత్రుబాధకైః. 20
అర్కరశ్మిప్రతీకాశై ర్ఘోరై స్తూణీగతై శ్శరైః,
శోభితాం దీప్తవదనై స్సర్పై ర్భోగవతీ మివ. 21
మహారజతవాసోభ్యా మసిభ్యాం చ విరాజితామ్,
రుక్మబిందువిచిత్రాభ్యాం చర్మభ్యాం చాపి శోభితామ్. 22
గోధాంగుళిత్రై రాసక్తై శ్చిత్రైః కాంచనభూషితైః,
అరిసంఘై రనాధృష్యాం మృగై స్సింహగుహా మివ. 23

అని భరతు డిట్లు విలపించుచు, ఆ యడవిలో మద్ది తాడి యాకు లనేకములచే కప్పబడినదియు, విశాలమైనదియు, యాగ వేదికవలె మృదువైనదర్భలు పఱుచబడినదియు, ఇంద్రధనుస్సును

బోలునవియు, మిక్కిలి భీకరమగు యుద్ధమున కార్యసాధనము
లును, బంగారుతో పూయబడిన పృష్ఠభాగములు కలవియు, మి
క్కిలి దృఢమైనవియు, శత్రువులను బాధించునవి యగు విండ్లతో
శోభిల్లుచున్నదియు, ప్రకాశించు కొనలు కలిగి సూర్యకిరణము
లను పోలినవి, అమ్ములపొదిలో నున్నవి అగు తీక్ష్ణబాణము
లచే పాములతో సర్పనగరమువలె శోభిల్లుచున్నదియు, బంగారుతో
చేసిన యొరలు గల కత్తులతో ప్రకాశించుచున్నదియు, బంగారు
చుక్కలచే నాశ్చర్యము గూర్చు డాళ్ళతో నొప్పునదియు, అల్లెత్రాటి
దెబ్బ తగులకుండుటకై చేతికి కట్టుకొను, ఉడుము తోలుతో చేయ
బడిన సువర్ణశోభితములైన, కవచములతోను ప్రేళ్ళను కాపాడు
అంగుళి కవచములతోను, కూడినదియు, లేళ్ళకు సింహగుహ
వలె శత్రుసమూహములకు ప్రవేశింప రానియు అగు సుందరము,
పవిత్రమగు పర్ణశాలను చూచెను.

ప్రాగుదక్ప్రవణాం వేదిం విశాలాం దీప్తపావకామ్,
దదర్శ భరత స్తత్ర పుణ్యాం రామనివేశనే. 24

భరతు డా రాముని పర్ణశాలయందు విశాలమును, ప్రజ్వ
లింపజేయబడిన అగ్నిహోత్రము కలది, ఈశాన్యభాగమున
పల్లమైనది అగు అగ్నివేదికను చూచెను.

నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటామండలధారిణమ్. 25

భరతు డొకింత నిరీక్షించి, జడలు ధరించినవాడై పర్ణశా
లలో కూర్చుండిన తన యన్న రాముని చూచెను. (జటాధారి

యగుటచే అతనిని తన యన్నగా గుర్తించుకొనుకే భరతుడు క్షణ కాలము నిరీక్షించుట).

తం తు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్,
దదర్శ రామ మాసీన మభితః పావకోపమమ్. 26

సింహస్కంధం మహాబాహుం పుండరీకనిభేక్షణమ్,
పృథివ్యా స్సాగరాంతాయా భర్తారం ధర్మచారిణమ్. 27

ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతమ్,
స్థండిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేన చ. 28

సింహమునకు వలె నున్నతములైన భుజశిఖరములు కల వాడును, మహాభుజుడును, తెల్లతామరలవంటి కన్నులు కలవాడును, సముద్రపర్యంతము వ్యాపించిన భూమికి ప్రభువును, ధార్మికుడును, నారవస్త్రము గట్టుకొని, కృష్ణాజినము నుత్తరీయముగ దాల్చి తపోవిశేషముచే నెల్లడల తేజస్సుచే పరివేష్టితుడై, దర్భలు పరచిన నేలపై సీతతో, లక్ష్మణునితో కూర్చుండి, శాశ్వతుడగు బ్రహ్మవలె నొప్పుచున్న రాముని చూచెను.

తం దృష్ట్వా భరత శ్శ్రీమాన్ దుఃఖశోకపరిప్లుతః,

శ్రీమంతుడు, ధర్మాత్ముడగు భరతు డన్నను చూచి దుఃఖ శోకముల మునిగి యాతనికడకు పరుగెత్తెను.

అభ్యధావత ధర్మాత్మా భరతః కైకయీసుతః 29
దృష్ట్వైవ విలలా పార్తో బాష్పసందిగ్ధయా గిరా,
అశక్నువన్ ధారయితుం ధైర్యా ద్వచన మబ్రవీత్. 30

కైక కుమారుడగు భరతుడు తన యన్న నా తాపసవేషమున చూడగనే ఖిన్నుడై, తన బాధను నిలుపుకొనలేక శోకముచే తొట్రుపడు మాటలతో ధైర్యమును కూడగట్టుకొని ఇట్లనెను.

యః సంసది ప్రకృతిభి ర్భవే ద్యుక్త ఉపాసితుమ్,
వన్యై ర్మృగై రుపాసీన స్సోఽయ మాస్తే మమాగ్రజః. 31

ఎవడు సభలో ప్రజల కుపాసింపయోగ్యుడో అట్టి నా యీ యన్న వన్యమృగములచే సేవింపబడుచున్నాడు.

వాసోభి ర్బహుసాహస్రై ర్యో మహాత్మా పురోచితః,
మృగాజినే సోఽయ మిహ ప్రవస్తే ధర్మ మాచరన్. 32

అనేకవేల మూల్యముగల వస్త్రములచే నెవ డలంకరింప దగియున్నాడో అట్టి రాము డిపుడు ధర్మ మాచరించుచు కృష్ణాజినము దాల్చుచున్నాడు.

అధారయ ద్యో వివిధా శ్చిత్రా స్సుమనస స్సదా,
సోఽయం జటాభార మిమం వహతే రాఘవః కథమ్. 33

ఎవడు పూర్వము పలువిధములగు నానావర్ణములు కల పుష్పములు శిరమున దాల్చువాడో అట్టి యీ నా యన్న రాముడు జటాభారము నెట్లు ధరింపగలడు ?

యస్య యజ్ఞై ర్యథోద్దిష్టై ర్యుక్తో ధర్మస్య సంచయః,
శరీరక్లేశసంభూతం స ధర్మం పరిమార్గతే. 34

ఎవని ధర్మానుష్ఠానము శాస్త్రవిహితములగు యజ్ఞముల

నాచరించుటకు యోగ్యమో అట్టి రాముడు శరీరమును కష్టపెట్టు టచే లభించు ధర్మమును సేవించుచున్నాడు.

చందనేన మహార్హేణ యస్యాంగ ముపసేవితమ్,
మలేన తస్యాంగ మిదం కథ మార్యస్య సేవ్యతే. 35

శ్రేష్ఠమగు చందనముతో నెవని శరీరము పూయబడెడిదో, ఆ పూజ్యుడగు నా యన్న శరీరమిపుడు మురికితో కూడియున్న దేల?

మన్నిమిత్త మిదం దుఃఖం ప్రాప్తో రామ స్సుఖోచితః,
ధి గ్జీవితం నృశంసస్య మమ లోకవిగర్హితమ్. 36

సుఖము లనుభవింపదగిన రాముడు నావలన దుఃఖముల పాలైనాడు. జనులచే నిందింపబడిన క్రూరుడనగు నా జీవితము నకు నిందయగుగాక!

ఇ త్యేవం విలప న్దీనః ప్రస్విన్నముఖపంకజః,
పాదా వప్రాప్య రామస్య పపాత భరతో రుదన్. 37

అని యిట్లేడ్చుచు, దీనుడై, పద్మమువంటి ముఖమున చెమట కారగా, రాముని పాదముల చెంత కేగకయే భరతు డేడ్చుచు నేలపై పడెను.

దుఃఖాభితప్తో భరతో రాజపుత్త్రో మహాబలః,
ఉక్త్వాఽఽర్యేతి సకృ ద్దీనం పున ర్నోవాచ కించన. 38

రాజపుత్రుడు, మహాబలుడగు భరతుడు దుఃఖపీడితుడై 'ఆర్యా!' అని యొక్కమారు దీనముగ పలికి మరేమియు పలుకలేదు.

బాష్పాభిహితకంఠ శ్చ ప్రేక్ష్య రామం యశస్వినమ్,
అర్ఘ్యే త్వ్యా నాథ సంక్రుశ్య వ్యాహర్తుం నాశక త్తదా. 39

కన్నీటిచే కంఠము కలుషితము కాగా భరతుడు కీర్తిశాలి యగు రాముని చూచి 'ఓ పూజ్యుడా !' యని పిలచి, మఱల పలుకుటకు సమర్థుడు కాడయ్యెను.

శత్రుఘ్న శ్చాపి రామస్య వవందే చరణౌ రుదన్,
తావుభౌ స సమాలింగ్య రామోఽప్యశ్రూ ణ్యవర్తయత్. 40

శత్రుఘ్నుడును రోదించుచు రాముని పాదములకు ప్రణమిల్లెను. రాముడు వా రిరువుర నాలింగనము చేసికొని కన్నీరు కార్చెను.

తత స్సుమంత్రేణ గుహేన చైవ
సమీయతూ రాజసుతా వరణ్యే,
దివాకర శ్చైవ నిశాకర శ్చ
యథాఽమ్బరే శుక్రబృహస్పతిభ్యామ్. 41

అంత నా రామలక్ష్మణు లా యరణ్యమున (భరత శత్రుఘ్నులను కలసికొనిన పిమ్మట) సుమంత్రుని, గుహుని సూర్య చంద్రు లాకాశమున గురుశుక్రులను వలె కలసికొనిరి.

తా న్పార్థివా న్వానరయూథపాంశ్చ
స్సమాగతాం స్తత్ర మునా త్వరణ్యే,
వనౌకస స్తేఽపి సమీక్ష్య సర్వే
ఽప్యశ్రూ ణ్యముంచ న్ప్రవిహాయ హర్షమ్. 42

గజయూధపతులవలె నొప్పు ఆ నలుగురు రాజకుమారు లా మహారణ్యమున నొక్కచో కలసికొనుట చూచిన వనవాసు లగు తపస్వులు సంతోషము వీడి దుఃఖముతో కన్నీరు కార్చిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోనశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమునం దయోధ్యాకాండమున తొంబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## శతతమః సర్గః – నూఱవ సర్గము

జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి,
దదర్శ రామో దుర్దర్శం యుగాంతే భాస్కరం యథా. 1

జటావల్కలములు ధరించినవాడును, దోసిలి యొగ్గిన వాడును, నేలపై బడినవాడును, ప్రళయకాల సూర్యునివలె అప్తు లకు చూడశక్యముగా (గుర్తింపరా) కున్న భరతుని రాముడు చూచెను.

కథంచి దభివిజ్ఞాయ వివర్ణవదనం కృశమ్,
భ్రాతరం భరతం రామః పరిజగ్రాహ బాహునా. 2

రాముడు కాంతితొలగిన ముఖము కలవాడును,మిగుల చిక్కిన వాడును అగు సోదరుడైన భరతుని చాల కష్టము మీద గుర్తించి తనచేతులతో పట్టి లేవనెత్తెను.

ఆఘ్రాయ రామ స్తం మూర్ధ్ని పరిష్వజ్య చ రాఘవః,
అంకే భరత మారోప్య పర్యపృచ్ఛ త్సమాహితః. 3

రఘువంశసంజాతుడగు రాముడా భరతుని శిరము మూర్కొని, యతనిని కౌగలించుకొని, యొడిలో కూర్చుండ జేసి యనన్యమనస్కుడై ఇట్లడిగెను.

క్వను తేఽభూ త్పితా తాత! య దరణ్యం త్వ మాగతః,
న హి త్వం జీవత స్తస్య వన మాగంతు మర్హసి. 4

నాయనా! నీ వడవికి వచ్చితివే? తండ్రి యిపు డెచట నున్నాడు? ఆయన జీవించియుండగా అయనకు సేవచేయుచు సన్నిహితుడవై యుండదగిన నీ వడవికి రాదగవు గదా!

చిరస్య బత పశ్యామి దూరా ద్భరత మాగతమ్,
దుష్ప్రతీక మరణ్యేఽస్మిన్ కిం తాత! వన మాగతః. 5

అహా! (కాంతి తొలగుటచే) బహుదూరమునుండి వచ్చిన, గుర్తింప వీలుకాని భరతుని చాలకాలమునకీ యరణ్యమున చూచుచున్నాను. నాయనా! నీ వీ యడవి కేల వచ్చితివి?

కచ్చి ద్ధారయతే తాత! రాజా యత్త్వ మిహాఽఽగతః,
కచ్చి న్న దీన స్సహసా రాజా లోకాంతరం గతః. 6
కచ్చి త్సౌమ్య! న తే రాజ్యం భ్రష్టం బాలస్య శాశ్వతమ్.

నాయనా! నీ విపు డిటకు వచ్చితివే? రాజు జీవించియే

యున్నాడా ? ఆయన మిక్కిలి దుఃఖమునందు పరలోకమున కేగలేదు గదా ? సౌమ్యుడా ! పిన్నవగు నీ రాజ్యము ప్రభువు రాగములేక నశింపలేదు కదా ?

కచ్చిచ్ఛుశ్రూషసే తాత పితరం సత్యవిక్రమమ్. 7

సత్యపరాక్రముడైన మనతండ్రి మాట వినుచు ఆయనను సేవించుచుంటివి కదా (లేక తండ్రి ననాదరము చేసి వచ్చితివా యనుట).

కచ్చిద్దశరథో రాజా కుశలీ సత్యసంగరః,
రాజసూయాశ్వమేధానా మాహర్తా ధర్మనిశ్చయః. 8

సత్య ప్రతిజ్ఞ కలవాడు రాజసూయ, అశ్వమేధ యాగముల నాచరించిన వాడు, ధర్మము విషయమున నిశ్చితమగు అభిప్రాయము కలవాడగు దశరథ మహారాజు కుశలముగ నున్నాడా ?

స కచ్చిద్బ్రాహ్మణో విద్వాన్ ధర్మనిత్యో మహాద్యుతిః,
ఇక్ష్వాకూణా ముపాధ్యాయో యథావ త్తాత! పూజ్యతే. 9

తండ్రీ ! ప్రసిద్ధుడును, బ్రహ్మవేత్తయును, సర్వవిద్యాకోవిదుడును, బ్రహ్మవర్చస్సుతో కూడినవాడును, ఇక్ష్వాకులకు కులగురువగు వసిష్ఠుడు వెనుకటివలె గౌరవింప బడుచున్నాడు కదా ?

సా తాత కచ్చి త్కౌసల్యా సుమిత్రా చ ప్రజావతీ,
సుఖినీ కచ్చి దార్యా చ దేవీ నందతి కైకయీ. 10

నాడు మిక్కిలి దుఃఖితయై కనుపించిన కౌసల్య, సత్సం

తానవతి సుమిత్ర సుఖముగ నున్నారా ? పూజ్యురాలగు కైక రాజ్యలాభముచే సంతోషించుచున్నదా ?

కచ్చి ద్వినయసంపన్నః కులపుత్రో బహుశ్రుతః,
అనసూయు రనుద్రష్టా సత్కృత స్తే పురోహితః. 11

వినయముతో నొప్పువాడు, సత్కులమున పుట్టినవాడు, బహుశాస్త్ర పారీణుడు, అసూయలేని వాడు, వసిష్ఠుడు చెప్పిన విధులను చక్కగ పర్యవేక్షించు నీ పురోహితుడు (రామునకు సుయజ్ఞునివలె భరతునకును కలడని తలంపవచ్చును. సుయజ్ఞుడే అతనికిని పురోహితుడిని కొందరి అభిప్రాయము.) చక్కగా గౌరవింపబడుచున్నాడా ?

కచ్చి దగ్నిషు తే యుక్తో విధిజ్ఞో మతిమా న్నృజుః,
హుతం చ హోష్యమాణం చ కాలే వేదయతే సదా. 12

అగ్నికార్యముల నాచరింపజేయుటకై నీచే నియుక్తుడైన వాడు, అగ్నిహోత్రము మొదలు అశ్వమేధము వఱకు సకల యజ్ఞవిధుల నెఱిగినవాడు, ఊహాపోహాదులను కల్పించుటలో నేర్పరి, ఎదుట వానికూడ నొకేవిధముగు ప్రవర్తన కలవాడగు నీ పురోహితుడు అయా సమయములో తానాచరించిన, చేయబోయెడిదగు హోమములను గూర్చి నీకు తెలుపుచున్నాడా ?

కచ్చి ద్దేవా న్పితౄన్ మాతౄ ర్గురూ న్పితృసమా నపి,
వృద్ధాం శ్చ తాత! వైద్యాంశ్చ బ్రాహ్మణాం శ్చాభిమన్యసే.

యజ్ఞాదులచే దేవతలను, ఆజ్ఞను పాటించుట-సేవచేయుటలచే తల్లిదండ్రులను, అనుసరణము-అభిమతముల నాచరిం

చుటలచే గురువులను, ధనదానాదులచే తల్లిదండ్రులతో సమానులగు జ్ఞాతులను, నమస్కారాదులచే జ్ఞానశీల వయోవృద్ధులను, విద్వాంసులగు బ్రాహ్మణులను గౌరవించుచున్నావా ?

ఇష్వస్త్రవరసమ్పన్న మర్థశాస్త్రవిశారదమ్,
సుధన్వాన ముపాధ్యాయం కచ్చి త్త్వం తాత! మన్యసే.14

అమంత్రకములు, సమంత్రకములగు శ్రేష్ఠములైన బాణములు కలవాడును, నీతి శాస్త్రకోవిదుడును, ధనుర్వేదాచార్యుడగు సుధన్వు నాదరించుచుంటివి కదా.

కచ్చి దాత్మసమా శ్శూరా శ్శ్రుతవంతో జితేంద్రియాః,
కులీనా శ్చేంగితజ్ఞా శ్చ కృతా స్తే తాత! మంత్రిణః. 15

నీకు సమానులు (విశ్వసనీయులు), ధీరులు, నీతిశాస్త్రకోవిదులు, ఇతరులకు లోభపెట్టదగనివారు, ఉత్తమకుల సంజాతులు, పరులను చూడగనే వారి మనోభావము గ్రహింపగలవారును అగువారినే మంత్రులుగా చేసికొంటివా ?

మంత్రో విజయమూలం హి రాజ్ఞాం భవతి రాఘవ!,
సుసంవృతో మంత్రధరై రమాత్యై శ్శాస్త్రకోవిదైః. 16

రాఘవుడా ! నీతిశాస్త్రకోవిదులు, రహస్యముగ నాలోచించునట్టి మంత్రులచే బయటపడనీక బాగుగ కాపాడబడిన యాలోచనయే రాజుల విజయమునకు మూలము.

కచ్చి న్నిద్రావశం నైషీః కచ్చి త్కాలే ప్రబుధ్యసే,
కచ్చి చ్చాపరరాత్రేషు చిన్తయ స్యర్థనైపుణమ్. 17

నీవు నిద్రకు లోబడుటలేదు కదా ? ఉచిత సమయమున మేలుకొనుచుంటివా ? అర్ధరాత్రులందు రాచకార్యములకు సంబంధించిన సామర్థ్యము నాలోచించుచుంటివా ?

కచ్చి న్మంత్రయసే నైకః కచ్చి న్న బహుభి స్సహ,
కచ్చి త్తే మంత్రితో మంత్రో రాష్ట్రం న పరిధావతి. 18

నీ వొంటరిగ, లేదా పలువురితో రాజకార్యముల నాలోచించుట లేదు కదా ? నీ రహస్యాలోచనము దేశమం దంతటను తెలిసిపోవుటలేదు కదా ! (ఒంటరిగ ఆలోచించుటచే ఆలోచనలోని గుణదోషములు తెలియుట కవకాశ ముండదు. పలువురితో చర్చించిన ఐకమత్యము కుదురదు. రహస్యమును చెడును.)

కచ్చి దర్థం వినిశ్చిత్య లఘుమూలం మహోదయమ్.
క్షిప్ర మారభసే కర్తుం న దీర్ఘయసి రాఘవ!. 19

స్వల్ప సాధనములచేతనే సిద్ధించునది, మహాఫలము నిచ్చునది యగు పనిని చేయ సమకట్టి, శీఘ్రమే యా పని నారంభించు చుంటివా ? విలంబము చేయవు కదా ?

కచ్చిత్తు సుకృతా న్యేవ కృతరూపాణి వా పునః,
విదు స్తే సర్వకార్యాణి న కర్తవ్యాని పార్థివాః. 20

సామంతరాజులు నీ వాలోచించిన సకల కార్యములను చక్కగా నిర్వహింపబడిన వెనుకనే, లేదా శీఘ్రమే ఫలింపనున్న వానినిగనే ఎఱుగుదురు గదా ! నీవు చేయనిశ్చయించుకొన్న పను లెఱుగరు కదా !

కచ్చి న్న తర్కై ర్యుక్త్యా వా యే చా ప్యపరికీర్తితాః,
త్వయా వా తవ వాఽమాత్యై ర్బుధ్యతే తాత! మంత్రితమ్.

నీవుగాని, నీ మంత్రులుగాని సంకల్పించిన పనిని ఊహలచేగాని, అనుమానముచేగాని, ఇంగితముచేగాని పరులు గుర్తించుటలేదు కదా!

కచ్చి త్సహస్రా న్మూర్ఖాణా మేక మిచ్ఛసి పండితమ్,
పండితో హ్యర్థకృచ్ఛ్రేషు కుర్యా న్నిఃశ్రేయసం మహత్. 22

వేయిమంది మూర్ఖులను విడచియైన, ఆలోచించి పని చేయు పండితు నొక్కనిని కోరుచుంటివా? కార్యమున సంకటము వాటిల్లినపుడు పండితుడు మిగుల శ్రేయస్సును కలిగించును.

సహస్రా ణ్యపి మూర్ఖాణాం య ద్యుపాస్తే మహీపతిః,
అథవా ప్యయుతా న్యేవ నాస్తి తేషు సహాయతా. 23

రాజు వేలకొలదిగా లేదా పదివేలాదిగానైనను మూర్ఖులను సంగ్రహించినచో వారివలన మంత్రోపాయమున ఒనగూడు సహాయ మేమియు నుండదు.

ఏకో ఽప్యమాత్యో మేధావీ శూరో దక్షో విచక్షణః,
రాజానం రాజమాత్రం వా ప్రాపయే న్మహతీం శ్రియమ్. 24

బుద్ధికుశలుడును, స్థిరబుద్ధియు, ఆలోచనచేయుటలో సమర్థుడును, నీతిశాస్త్ర పండితుడును అగు మంత్రి యొక్కడయ్యును, రాజునకుగాని, రాజుతో సమానుడైన వానికి గాని గొప్ప సంపదను చేకూర్చును.

కచ్చి న్ముఖ్యా మహ త్స్వేవ మధ్యమేషు చ మధ్యమాః,
జఘన్యా శ్చ జఘన్యేషు భృత్యాః కర్మసు యోజితాః. 25

ఉత్తములగు సేవకులు వంటుట, వడ్డించుట మున్నగు ముఖ్య కార్యములందును, జాత్యాదులచే మధ్యములగు భృత్యులు శయ్యవేయుట, ఆసనాదులు తెచ్చుట మున్నగు మధ్యమ కార్యములందును, జాత్యాది హీనులగు సేవకులు పాదములు కడుగుట, చెప్పులు తెచ్చుట, పాదము లొత్తుట మున్నగు నధమకృత్యములందును నియమింపబడిరా (లేక వ్యత్యయముగనా) ?

అమాత్యా నుపధాతీతా న్పితృపైతామహా ఞ్ఛుచీన్,
శ్రేష్ఠాం ఛ్ఛ్రేష్ఠేషు కచ్చి త్త్వం నియోజయసి కర్మసు. 26

సుపరీక్షితులును, కులక్రమాగతులును, త్రికరణ పరిశుద్ధులును, శ్రేష్ఠులును అగు మంత్రుల నుత్తమ కార్యములు చేయ నియమించుచుంటివి కదా.

(రాజు లెవ్వనిచేనైన అమూల్య వస్త్రాభరణాదులు పంపి, వీని నంతఃపురకాంతలు పంపి రనియో, శత్రురాజు కానుకగా పంపెననియో లోభపెట్టి పరీక్షింతురు. ఆ పరీక్షలో నెగ్గినవారు ఉపధాతీతులు).

కచ్చి న్నోగ్రేణ దండేన భృశ ముద్వేజితప్రజమ్,
రాష్ట్రం త వానుజానన్తి మంత్రిణః కైకయీసుత!. 27

ఓ భరతా ! నీవు తీవ్రముగు దండన విధించి ప్రజలను పీడించుచుండగా అట్టి ప్రజలతో కూడిన రాజ్యమును నీమంత్రులనుమతింపరు కదా ? (నీవట్లు తీవ్రదండముతో ప్రజలను

పీడించుచుండగా మంత్రులు నిన్ను పనినుండి నివారించు చున్నారా?)

కచ్చి త్త్వాం నావజానంతి యాజకాః పతితం యథా,
ఉగ్రప్రతిగ్రహీతారం కామయాన మివ స్త్రియః. 28

పట్టకూడని దానములు పట్టి, ధన మార్జించి, యాగము చేయ తలపెట్టిన పతితుని యాజకులు (యాగము చేయించు వారు)అనాదరము చేయునట్లు, ఇష్టము లేకున్నను బలాత్కారము చేయువానిని స్త్రీ లవమానించునట్లు, బలాత్కారముగ అధికముగ పన్నులు విధించుచు ధనార్జన చేయుచుండగా నిన్ను ప్రజ లవమానించుట లేదు కదా?

ఉపాయకుశలం వైద్యం భృత్యసందూషణే రతమ్,
శూర మైశ్వర్యకామం చ యో న హంతి స వధ్యతే. 29

సామాద్యుపాయములందు నేర్పరి, కటికుడు చెప్పిన కుటిలనీతి విద్యలో నేర్పరి, అంతరంగిక భృత్యులలో లేని దోషములు కల్పించి వారిని తొలగించువాడు, రాజును పీడించుటకును భయపడనివాడును, క్రమముగ రాజైశ్వర్యమును కూడ చేజిక్కించుకొనగోరినవాడగు పురుషు నే రాజు చంపడో వాడాతని చేతనే చంపబడును.

కచ్చి ద్ధృష్ట శ్చ శూర శ్చ మతిమాన్ ధృతిమా ఞ్ఛుచిః,
కులీన శ్చానురక్త శ్చ దక్ష స్సేనాపతిః కృతః. 30

రాజు చేయు సత్కారముచేతనే సంతుష్టుడు (లేదా వ్యవహారములలో ప్రతిభావంతుడు), శత్రువుల నడుమలో పెట్టుటలో

నిరతుడు, ఆయా సమయముల కనుగుణముగ సేనా వ్యూహాదుల నెఱిగిన బుద్ధిశాలి, ఆపదలలో ప్రశస్తమగు ధైర్యము కలవాడు, యజమానిపై విశ్వాసము కలవాడు, సత్కులమున పుట్టినవాడు, రాజుపై అంతులేని ప్రేమకలవాడు, కార్యకుశలు డగువానిని నీవు సేనాపతిగా నియమించితివా ?

బలవంత శ్చ కచ్చి త్తే ముఖ్యా యుద్ధవిశారదాః,
దృష్టాపదానా విక్రాంతా స్త్వయా సత్కృత్య మానితాః. 31

మహాబలవంతులు, యుద్ధకుశలురు, పూర్వము యుద్ధమున తమ సామర్థ్యము చూపినవారు, శూరులు అగు ప్రధానవీరులను నీవు చక్కగా పారితోషికాదుల నిచ్చి శ్లాఘించితివి కదా.

కచ్చి ద్బలస్య భక్తం చ వేతనం చ యథోచితమ్,
సంప్రాప్తకాలం దాతవ్యం దదాసి న విలమ్బసే. 32

నీవు నీ సైన్యమున కా యా సమయములం దీయవలసిన అహారము, ప్రతిమాస మీయవలసిన వేతనములను వారి వారి పనులకు తగిన ట్లిచ్చుచుంటివి కదా ? అట్లిచ్చుటలో విలంబము జరుగుట లేదు కదా?

కాలాతిక్రమణా చ్చైవ భక్తవేతనయో ర్భృతాః,
భర్తుః కుప్యంతి దుష్యంతి సోఽనర్థ స్సుమహాన్ స్మృతః.

కాలము మీరుటచే (సమయమున అహారవేతనముల నీయకుండుటచే) వానిపైననే అధారపడి జీవించు భృత్యులు ప్రభువుపై కోపింతురు. దానివలన వారు మనోవికారము నందుదురు. అ వికారము చాల కీడును కలిగించును.

కచ్చి త్సర్వేఽనురక్తా స్త్వాం కులపుత్త్రాః ప్రధానతః,
కచ్చి త్ప్రాణాం స్తవార్థేషు సంత్యజంతి సమాహితాః. 34

ప్రధానులగు క్షత్రియు లెల్లరు నీయం దనురక్తులే కదా! వారు సదా దత్తావధానులై నీపనులకై ప్రాణములనైన విడువ సిద్ధపడుదురా ?

కచ్చి జ్జానపదో విద్వా న్దక్షిణః ప్రతిభానవాన్,
యథోక్తవాదీ దూత స్తే కృతో భరత! పండితః. 35

నీ దేశముననే పుట్టినవాడును (పరదేశమున పుట్టినవాడగుచో పక్షపాతముగా వ్యవహరించును), ఇతరుల మనోభావమెఱిగినవాడును, సమర్థుడును, సమయోచిత స్ఫూర్తిగలవాడును, తనద్వారా సందేశ మీయబడిన విషయము నతిక్రమింపక సందేశమునకు ప్రతి సందేశము పలుకు వాడును, యుక్తాయుక్త వివేకముకలవాడును అగువానిని నీవు దూతనుగా చేసికొంటివా?

కచ్చి దష్టాదశాన్యేషు స్వపక్షే దశ పంచ చ,
త్రిభి స్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని చారకైః. 36

నీవు శత్రుపక్షమందలి పదునెనిమిది తీర్థములయు, స్వపక్షమందలి పదునైదు తీర్థముల యొక్కయు రహస్య ప్రయత్నములు తెలిసికొనుటకు ఇతరులకు తెలియరాకుండునట్లు వేషాంతర ధారణచేసిన చారుల నొక్కొక్క తీర్థమునకు ముగ్గురను చొప్పున నియమించి వారిచే తెలిసికొనుచున్నావా ?

మంత్రి, పురోహితుడు, యువరాజు, సేనాపతి, అంతఃపుర కార్యనిర్వాహకుడు, కారాగృహాధికారి, కోశాధ్యక్షుడు, రాజాజ్ఞను

వెల్లడించువాడు, తగవులలో మీ వ్యవహార మేమని యడుగు
వాడు, సేనాపతి, నగరాధ్యక్షుడు, పని ముగియుటతోడనే ప్రతి
ఫలము పొందు సైన్యముకంటె ఇతరులగు భృత్యుల కిచ్చుటకై
రాజువద్ద నుండి ధనము నొక్కమారుగ తెచ్చివేఱ్వేఱుగ వారి కిచ్చు
కర్మాంతికుడు, సభానిర్వహణమును పర్యవేక్షించు అధికారి,
శాస్త్రము ననుసరించి దాయవిభాగాదులలో వివాదము తీర్చు
అధికారి, రాజాజ్ఞ ప్రకారము దోషులను దండించువాడు, గిరిదుర్గ
వనదుర్గాదులను సదా రక్షించువాడు, సరిహద్దులను కాపాడు
వాడు అనునీ పదునెనిమిది మంది శత్రుపక్షమునను, మొదటి
ముగ్గురను విడచి పదునైదుమంది స్వపక్షమునను తీర్థములు.

కచ్చి ద్వ్యపాస్తా నహితా న్ప్రతియాతాం శ్చ సర్వదా,
దుర్బలా ననవజ్ఞాయ వర్తసే రిపుసూదన! 37

నీచే వెడలగొట్టబడి, మఱల తిరిగివచ్చిన శత్రువులను
దుర్బలులని భావించి వారిని లెక్కచేయకయే యుండవుగదా
(అట్టివారు తిరిగివచ్చుట ఏదో యొక ఊహ లేక జరుగదు కాన
జాగరూకత వహింపవలెనని భావము)

కచ్చి న్న లోకాయతికా న్బ్రాహ్మణాం స్తాత! సేవసే,
అనర్థకుశలా హ్యేతే బాలాః పండితమానినః. 38

లోకాయతికులు కేవలము ప్రత్యక్షానుమానములనే ప్రమాణ
ములుగ అంగీకరించువారు. వేదప్రామాణ్యము నంగీకరింపరు
అట్లు నాస్తికులగు బౌద్ధచార్వాకాది బ్రాహ్మణులను సేవింపవు
కదా! వారు తత్త్వార్థజ్ఞానము లేనివారు. (వేదా ధర్మానుష్ఠాన

శ్రద్ధ లేకుండుటచే సజ్జనులచే విడువబడుట, నరకమున పడుట అను నీ యనర్థమున కుశలురు) అజ్ఞానులు, తాము పండితులు కాకున్నను పండితుల మని భావించువారు. వీ రనర్థములు కలిగించుటలో నేర్పరులు

ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః,
బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్య నిరర్థం ప్రవదంతి తే. 39

వేదమార్గ విరుద్ధమైన బుద్ధికలిగిన ఆ లోకాయతికులు, సాత్త్వికులగు మహర్షులు రచించిన ధర్మశాస్త్ర గ్రంథములు సంప్రదాయ పరంపరగా పఠింపబడుచున్నను, శుష్కతర్క విషయకమగు బుద్ధికలవారై నిష్ప్రయోజనములగు మాటలు చెప్పుదురు.

వీరై రధ్యుషితాం పూర్వ మస్మాకం తాత! పూర్వకైః,
సత్యనామాం దృఢద్వారాం హస్త్యశ్వరథసంకులామ్. 40

బ్రాహ్మణైః క్షత్త్రియై ర్వైశ్యై స్స్వకర్మనిరతై స్సదా,
జితేంద్రియై ర్మహోత్సాహై ర్వృతా మార్యై స్సహస్రశః.

ప్రాసాదై ర్వివిధాకారై ర్వృతాం వైద్యజనాకులామ్,
కచ్చి త్సముదితాం స్ఫీతా మయోధ్యాం పరిరక్షసి. 42

నాయనా! మన పూర్వులగు వీరులు నివసించినట్టిది, గట్టివగు ద్వారములు కలది, ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో నిండినది, తమ తమ కర్మలలో సదా నిరతులు, జితేంద్రియులు, మిక్కిలి ఉత్సాహవంతులు అగుటచే పూజ్యులగు వేలకొలది బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులతో కూడినది, వివిధాకృతులు

కల భవనములతో పరివేష్టితమైనది, పండితులతో కూడినది, సంతుష్టులగు జనులు కలది, సమృద్ధమైనది అగు అయోధ్య యొక్క పేరును యథార్థ మొనరించుచు కాపాడుచున్నావా ?

కచ్చి చ్చైత్యశతై ర్జుష్ట స్సునివిష్టజనాకులః,
దేవస్థానైః ప్రపాభి శ్చ తటాకై శ్చోపశోభితః. 43

ప్రహృష్టనరనారీక స్సమాజోత్సవశోభితః,
సుకృష్టసీమా పశుమా న్హింసాభిః పరివర్జితః. 44

అదేవమాతృకో రమ్య శ్శ్వాపదైః పరివర్జితః,
పరిత్యక్తో భయై స్సర్వైః ఖనిభి శ్చోపశోభితః. 45

వివర్జితో నరైః పాపై ర్మమ పూర్వై స్సురక్షితః,
కచ్చి జ్జనపద స్స్ఫీత స్సుఖం వసతి రాఘవ!. 46

అశ్వమేధము వఱకుగల మహాయజ్ఞ చయన ప్రదేశ సమూహము అనేకములతో కూడినది, సుభిక్షముగుటచే వేఱొక దేశమునకు పోవలెనను ఆలోచన లేక స్థిరముగ నివసించు జనులతో వ్యాప్తమైనది, దేవాలయములతోను, మార్గములం దేర్పరచిన పానీయశాలలతోను చెరువులతోడను కూడినది, మిక్కిలి సంతోషము కల స్త్రీ పురుషులతో కూడినది, ధర్మనిర్ణయ సభలతో (లేదా వ్యాపారుల సమూహములతో) కూడినది, దేవమాతృకము (వాన నీటిపై నాధారపడు సేద్యముకలది) కాక నదీ మాతృక (నది నీటిపై ఆధారపడు వ్యవసాయము కలది) మైనది, సుందరమైనది, క్రూరజంతువులు లేనిది. సకల భయములు తొలగినది, గనులతో శోభిల్లునది, పాపజనులు లేనిది, నా పూర్వులచే చక్కగా

కాపాడబడినది అగు కోసలదేశము సమృద్ధమై, సుఖముగ నున్నదా ?

కచ్చి త్తే దయితా స్సర్వే కృషిగోరక్షజీవినః,
వార్తాయాం సంశ్రిత స్తాత! లోకో హి సుఖ మేధతే. 47

వ్యవసాయము, గోరక్షణము చేయుచు జీవించు వైశ్యులు నీయం దనురక్తులై యున్నారా ? క్రయవిక్రయాది రూపమగు వాణిజ్య మున్నపుడే నిన్నాశ్రయించిన జనులు సుఖముగ నుందురు.

తేషాం గుప్తిపరీహారైః కచ్చి త్తే భరణం కృతమ్,
రక్ష్యా హి రాజ్ఞా ధర్మేణ సర్వే విషయవాసినః. 48

వారి కభీష్టముల నిచ్చి, క్లేశములు తొలగించి నీవు పోషించుచున్నావా ? తన దేశమున నివసించువా రెల్లరును రాజునకు రక్షింపదగినవారే.

కచ్చిత్ స్త్రియ స్సాంత్వయసి కచ్చి త్తాశ్చ సురక్షితాః,
కచ్చి న్న శ్రద్దధా స్యాసాం కచ్చి ద్గుహ్యం న భాషసే. 49

నీ యంతఃపురకాంతల కనుకూలముగ నున్నావా ? పరపురుషులతో సంభాషణాదులు చేయకుండ వారిని కాపాడుచున్నావా ? వారి మాట లన్నియు యథార్థములే యని నమ్మవు కదా ! వారికి రహస్యములు చెప్పవు కదా ?

కచ్చి న్నాగవనం గుప్తం కచ్చి త్తే సంతి ధేనుకాః,
కచ్చి న్న గణికాశ్వానాం కుంజరాణాం చ తృప్యసి. 50

ఏనుగుల యుత్పత్తి స్థానమగు నాగవనమును కాపాడు చుంటివా ? ఏనుగులను పట్టుటకు సాధనములగు ఆడేనుగులు, గుఱ్ఱములు, మగేనుగులను సంపాదించుటలో (చాలు లెమ్మని) తృప్తినందవు కదా ?

కచ్చి ద్దర్శయసే నిత్యం మనుష్యాణాం విభూషితమ్,
ఉత్థా యోత్థాయ పూర్వాహ్ణే రాజపుత్త్ర! మహాపథే. 51

రాజపుత్రా ! నీవు ప్రతిదినము ఉదయముననే లేచి, యలంకరించుకొని సభలో జనులకు దర్శన మిచ్చుచున్నావా ?

కచ్చి న్న సర్వే కర్మాంతాః ప్రత్యక్షా స్తేఽవిశంకయా,
సర్వే వా పున రుత్సృష్టా మధ్య మే వాత్ర కారణమ్. 52

పనివారు ఏ జంకును లేక నీకడకు వచ్చుటలేదు కదా. లేదా వారల కందఱకు దర్శనమీయక నీవు విడువవు కదా. నీవు వారికి పదే పదే దర్శనమిచ్చుచో వారికి నీయెడ అనాదర మేర్పడును. దర్శనమే ఈయకున్నచో వారికి విజ్ఞాపనము చేయు నవకాశములేక కోపము వచ్చును. దానిచే రాజకార్యములు కుంటుపడును. కావున తగుసమయములలో దర్శన మిచ్చుటే యుక్తము.

కచ్చి త్సర్వాణి దుర్గాణి ధనధాన్యాయుధోదకైః,
యంత్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పిధనుర్ధరైః. 53

నీ ఉదకదుర్గములు, పర్వతదుర్గములు, వనదుర్గములును, ధన, ధాన్య, ఆయుధ, జలములతోడను, యంత్రములతోడను, శిల్పులతోడను, విలుకాండ్రతోడను నిండియున్నవా ?

అయ స్తే విపులః కచ్చి త్కచ్చి దల్పతరో వ్యయః,
అపాత్రేషు న తే కచ్చి త్కోశో గచ్ఛతి రాఘవ!. 54

ఓ భరతుడా ! నీకు రాబడి యధికముగ వ్యయ మల్ప ముగ నున్నదా ? నీ ధన మధికముగ, అపాత్రులకు, నట విట గాయకాదులకు పోవుటలేదు కదా ?

దేవతార్థే చ పిత్రర్థే బ్రాహ్మణాభ్యాగతేషు చ,
యోధేషు మిత్రవర్గేషు కచ్చి ద్గచ్ఛతి తే వ్యయః. 55

నీవు చేయు వ్యయము దేవకార్యములకు, పితృకార్యము లకు, బ్రాహ్మణులకొఱకు, అతిధులకు, యోధులకు, మిత్రులకు మాత్రమే పోవుచున్నదా ?

కచ్చి దార్యో విశుద్ధాత్మా క్షారిత శ్చోరకర్మణా,
అపృష్ట శ్శాస్త్రకుశలై ర్న లోభా ద్వధ్యతే శుచిః. 56

పరిశుద్ధమగు స్వభావము కలవాడు, త్రికరణశుద్ధుడు, సజ్జను డగువాడు దొంగతనము చేసినట్లు నింద మోపబడి, శాస్త్రజ్ఞు లగు వారిచే ఆ విషయమున ప్రశ్నింపబడకయే ధనలోభముచే నీచే చంపబడుటలేదు కదా !

గృహీత శ్చైవ పృష్ట శ్చ కాలే దృష్ట స్సకారణః,
కచ్చి న్న ముచ్యతే చోరో ధనలోభా న్నరర్షభ!. 57

ఓ నరశ్రేష్ఠుడా ! దొంగతనము చేయుచు పట్టుబడినవాడై, అధికారులచే ప్రశ్నింపబడి, ఒకానొక సమయమున దొంగిలింప

బడిన సొమ్ముతో దొరికిన చోరుని, ధనలోభముచే (దొంగ నీకు ధన మిత్తునని యాశ చూపుటచే) విడచి పెట్టవు కదా ?

వ్యసనే కచ్చి దాఢ్యస్య దుర్గతస్య చ రాఘవ!,
అర్థం విరాగాః పశ్యన్తి త వామాత్యా బహుశ్రుతాః. 58

ధనికునకు-దరిద్రునకు నడుమ వివాదరూప మగు సంకటము కలుగగా, నీ మంత్రు లా వ్యవహారమును ధనమం దాశ లేక నిష్పక్షపాతముగ చూతురా ?

యాని మిథ్యాభిశస్తానాం పత న్త్యస్రాణి రాఘవ!,
తాని పుత్రా న్పశూ న్ఘ్నంతి ప్రీత్యర్థ మనుశాసతః. 59

భరతుడా ! అసత్యమగు దోషారోపణము చేయబడినవారై, దండితులైన ప్రజల కన్నులనుండి కారిన కన్నీరు, న్యాయాన్యాయములను విచారింపక కేవలము భోగమునకు రాజ్యపాలనము చేయు రాజు బిడ్డలను, పశువులను నశింపజేయును.

కచ్చి ద్వృద్ధాంశ్చ బాలాంశ్చ వైద్యముఖ్యాంశ్చ రాఘవ!,
దానేన మనసా వాచా త్రిభి రేతై ర్బుభూషసే. 60

భరతుడా ! ముసలివారిని, పిన్నలను, పండితులను ధనాదుల నిచ్చుట, స్నేహముతో చూచుట, ప్రియముగ మాటలాడుటలచే వశీకరింపగోరుచుంటివా ?

కచ్చి ద్గురూంశ్చ వృద్ధాంశ్చ తాపసాన్ దేవతాతిథీన్,
చైత్యాంశ్చ సర్వా న్సిద్ధార్థా న్బ్రాహ్మణాంశ్చ నమస్యసి.

గురువులకు, పెద్దలకు, తపస్వులకు, దేవతలకు, అతిథులకు, దేవతలు నివసించు చతుష్పథములందలి చెట్లకు, యాగాదులు చేసి ఆముష్మికఫలసిద్ధి కలవారికి, బ్రాహ్మణులకు నమస్కరించుచున్నావా ?

కచ్చిదర్థేన వాధర్మ మర్థం ధర్మేణ వా పునః,
ఉభౌ వా ప్రీతిలోభేన కామేన చ న బాధసే. 62

అర్థముచే ధర్మమును బాధించుట లేదు కదా ? (పూర్వాహ్ణమున ధర్మము సంపాదింపవలసియుండగా ధనము సంపాదించి ధర్మమునుబాధింపవు కదా) ధర్మముచే అర్థమును బాధింపవు కదా (అపరాహ్ణము ధనార్జనకు యోగ్యసమయము కాగా అపుడు ధర్మము నార్జించుచు అర్థమును బాధింపవు కదా) అట్లే సుఖాభిలాషతో సాయంకాలము చేయదగినదిగా విధించబడిన కామముచే ఆరెంటిని బాధించుటలేదు కదా. (లేదా అర్థముచే ధర్మమును, ధర్మముచే అర్థమును ఇట్టి రెంటిని బాధింపవు కదా).

కచ్చి దర్థం చ కామం చ ధర్మం చ జయతాం వర!,
విభజ్య కాలే కాలజ్ఞ! సర్వా న్వరద! సేవసే. 63

జయమునందువారిలో శ్రేష్ఠుడవు, సమయజ్ఞుడవు, వరములిచ్చు వాడవగు భరతుడా ! ధర్మార్థకామములను సంపాదించుట కనుమతములైన సమయములలో నా మూటిని నేర్పుగ ఒకదానికి పిమ్మట వేఱొక్కటి చొప్పున సేవించుచుంటివా?

కచ్చి త్తే బ్రాహ్మణా శ్శర్మ సర్వశాస్త్రార్థకోవిదాః,
ఆశంసంతే మహాప్రాజ్ఞ! పౌరజానపదై స్సహ. 64

ఓ మహాబుద్ధిమంతుడా! సకలశాస్త్ర నిష్ణాతులగు బ్రాహ్మణులు, పౌరులు, పల్లెప్రజలు నీ సుఖము కోరుదురా?

నాస్తిక్య మనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతామ్,
అదర్శనం జ్ఞానవతా మాలస్యం పంచవృత్తితామ్, 65
ఏకచింతన మర్థానా మనర్థజ్ఞై శ్చ మంత్రణమ్,
నిశ్చితానా మనారంభం మంత్ర స్యాపరిరక్షణమ్, 66
మంగళాద్యప్రయోగం చ ప్రత్యుత్థానం చ సర్వతః,
కచ్చి త్త్వం వర్జయ స్యేతా న్రాజదోషాం శ్చతుర్దశ. 67

పరలోకము లేదను భావము కలిగియుండుట అసత్యము పలుకుట, కోపించుట, ఏమఱియుండుట, విలంబముగా పనులు చేయుట, సజ్జనులను దర్శింపకుండుట, సోమరితనము పంచేంద్రియములకు పరవశుడగుట, మంత్రులతో చర్చింపక తానొక్కడే రాజకార్యముల నాలోచించుట, విరుద్ధముగా నాలోచించు వారితో రాజకార్యములనుగూర్చి చర్చించుట, నిశ్చయించిన పనులు ప్రారంభించకుండుట, రహస్యమును రక్షింపకుండుట, ప్రాతఃకాలమున అద్దములో ముఖము చూచుకొనుట వంటి మంగళముల నాచరింపకుండుట, ఉత్తములు—హీను లను వివేకము లేక ఎవరు వచ్చినను లేచుట అను నీ పదునాలుగు రాజదోషములను (నీ వాచరించుటచే) పెంపొందింపక విడతువు కదా?

దశపంచ చతుర్వర్గా న్సప్తవర్గం చ తత్త్వతః,
అష్టవర్గం త్రివర్గం చ విద్యా స్తిస్రశ్చ రాఘవ|. 68
ఇంద్రియాణాం జయం బుద్ధ్వాషాడ్గుణ్యం దైవమానుషమ్,
కృత్యం వింశతివర్గం చ తథా ప్రకృతిమండలమ్, 69

యాత్రాదండవిధానం చ ద్వియోనీ సంధివిగ్రహౌ,
కచ్చి దేతా న్మహాప్రాజ్ఞ! యథావ దనుమన్యసే. 70

మిక్కిలి ప్రాజ్ఞుడవగు భరతుడా! నీవు దశవర్గమును, పంచవర్గమును, చతుర్వర్గమును, సప్తవర్గమును, అష్టవర్గమును, త్రివర్గమును, మూడు విద్యలను, ఇంద్రియములను వశమందుంచుకొనుటను, షడ్గుణములను, దైవమానుషములను, భేదన కార్యమును, వింశతివర్గమును, ప్రకృతిమండలమును యాత్రా దండ విధానమును, సంధి, విగ్రహము, యాత్ర, దండములను, చక్కగా తెలిసికొని పనిలో విడువదగిన వానిని విడి, ఉపాదేయములను అంగీకరింతువా? ఇందులకు వివరణము–

1. దశవర్గము :– 'మృగయాఽక్షో దివాస్వాపః పరివాదః స్త్రియో మదః, తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గుణః' వేట, జూదము, పగటినిద్ర, అపవాదము, స్త్రీలు, మదము, నృత్తము, గీతము, వాద్యము, పనిలేక తిరుగుట యనునివి దశవర్గమని మనువు చెప్పినాడు కామందకుడు. మాత్రము–లుబ్ధః క్రూరోఽలసోఽ సత్యః ప్రమాదీ భీరు రస్థిరః, మూఢోఽవయోఽవ మంతా చ సుఖచ్ఛేద్యో రిపుర్మత' అని లోభము, కోపము, సోమరితనము, అసత్యము, అజాగ్రత, పిరికితనము, చంచలత, మూఢత, అవినీతి, అవమానించుట అను నివి దశవర్గమని భావించినాడు.

2. పంచవర్గము :–అవి ఐదు. దుర్గములు–మను పక్షమున –'ఔదకం పార్వతం వార్క్షమైరిణం ధాన్వనం తథా, శస్తం ప్రశస్త మతిభిః దుర్గం దుర్గోపచింతకైః' జలదుర్గము, పర్వతదుర్గము, వృక్షదుర్గము, ఎడారిదుర్గము, ధన్వదుర్గము అనునవి.

కామందకుని పక్షమున నివి ఐదు వైరములు-'సాపత్న్యం వస్తుజం స్త్రీజం వాగ్జాత మపరాధజం, వైరప్రభేద నిపుణై ర్వైరం పంచవిధం స్మృతమ్' జాతివైరము, వస్తువుకొఱకై నాది-నాది యని వైరము అట్లే స్త్రీకొఱకై వైరము, వాక్కలహము, అపరాధము చేయుట వలన కలిగిన కలహము అనునది.

3. చతుర్వర్గము : చతుర్విధోపాయములు. సామ-దాన-భేద-దండము లనునవి చతుర్విధమిత్రులు - 'ఔరసం తంతు సంబంధం తథా వంశక్రమాగతం, రక్షితం వ్యసనేభ్యశ్చ మిత్రం జ్ఞేయం చతుర్విధమ్' ఔరసుడు, తంతుసంబంధి, వంశక్రమాగతుడు, ఆపదలనుండి కాపాడినవాడు ఈ నలుగురు మిత్రులు. లేదా ధనమును న్యాయముగా సంపాదించుట మున్నగు నాలుగు ధర్మములు-'న్యాయే నార్జన మర్థస్య రక్షణం వర్ధనం తథా, సత్పాత్రే ప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్' న్యాయముగ ధనమును సంపాదించుట, కాపాడుట, పెంచుట, యోగ్యున కిచ్చుట యనునవి. (కామందకుడు)

4. సప్తవర్గము : స్వామ్యమాత్యాదులు. 'స్వామ్యమాత్యశ్చ రాష్ట్రం చ దుర్గం కోశో బలం సుహృత్, పరస్పరోపకారీదం రాజ్యం సప్తాంగ ముచ్యతే' రాజు, మంత్రి, రాష్ట్రము, దుర్గము, ధనాగారము, సైన్యము, మిత్రుడు అనునవి. లేదా స్వపక్ష జనులలో అవాంతరభేద సప్తకము. 'నిజోఽథ మైత్రశ్చ సమాశ్రితశ్చ, సుబంధుజః కార్యసముద్భవశ్చ, భృత్యో గృహీతో వివిధోపచారైః, పక్షం బుధా స్సప్తవిధం వదన్తి' తనవాడు, మైత్రుడు, ఆశ్రితుడు, ఉత్తమబంధువు కుమారుడు, కార్యమున అనుకూలించిన సేవకుడు, అనేకములగు ఉపచారములచే వశీకరించుకొన

బడినవాడు అను పేరలు. లేదా సప్తవ్యూహములు. 'శ్యేన స్సూచీ చ వజ్రశ్చ శకటో మకర స్తథా, దండాఖ్యః పద్మనామా చ వ్యూహా స్సప్త ప్రధానతః' శ్యేనవ్యూహము, సూచీవ్యూహము వజ్రవ్యూహము, శకటవ్యూహము, మకరవ్యూహము, దండ వ్యూహము, పద్మవ్యూహము అనునవి. (కామందకుడు)

5. అష్టవర్గము : 'కృషి వాణిజ్యదుర్గాణి సేతుః కుంజర బంధనం, ఖన్యాకరః కరాదానం శూన్యానాం చ నివేశనం, అష్ట వర్గ మిమం సాధు స్వస్థవృత్తో న లోపయేత్' వ్యవసాయము, వాణిజ్యము, దుర్గములు, ఆనకట్ట, ఏనుగులను బంధించుట, గనులు, పన్నులు రాబట్టుట, శూన్యనివేశనము అనునవి. లేదా పైశున్యాదు లెనిమిది–'పైశున్యం సాహసం ద్రోహం ఈర్ష్యాసూ యార్థదూషణం, వాగ్దండయోశ్చ పారుష్యం క్రోధజోఽపి గణో ఽష్టకః' కొండెములు చెప్పుట, సాహసము, ద్రోహము, అసహ నము, ఇతరుల గుణములను దోషములుగా చిత్రించుట, ధన మును విచ్చలవిడిగా నిరర్థకముగా వెచ్చించుట. కఠినముగ మాటలాడుట, కఠినముగ శిక్షించుట అనునవి.

6. త్రివర్గము : ధర్మము, అర్థము, కామము అనునవి. లేదా ఉత్సాహశక్తి, ప్రభుత్వశక్తి-మంత్రశక్తి యనునవి. లేదా పరుల యొక్క క్షయము, స్థితి, వృద్ధి అనునవి. లేదా సాధ్యముకాని పనులలో ప్రయత్నము, చేయ శక్యములైన వానిని తెలియక, ప్రయత్నపడకుండుట, తెలిసియు అదను తప్పి ప్రయత్నించుట అను కార్యవ్యసనములు మూడు.

7 త్రివిద్యలు : త్రయి, వార్త, దండనీతి యనునవి త్రయి అనగా ఋగ్యజుస్సామ వేదములు. వార్త అనగా కృషి, గోరక్ష, వాణిజ్యములు దండనీతి యన నీతిశాస్త్రము.

8. షడ్గుణములు : సంధి, విగ్రహము, యానము, ఆస నము, ద్వైధీభావము. సమాశ్రయము అనునవి.

9. దైవిక వ్యసనములు : 'హుతాశనో జలం వ్యాధి ర్దుర్భిక్షో మరణం తథా' నిప్పు-నీరు-రోగము-కఱవు, చావు అనునవి.

10. మానుష వ్యసనములు : 'ఆయుక్తేభ్యశ్చ చోరేభ్యః పరేభ్యో రాజవల్లభాత్, పృథివీపతిలోభాచ్చ వ్యసనం పంచధా భవేత్' అధికారులు, దొంగలు, శత్రువులు, రాజునకు ఇష్టుడు రాజు యొక్క లోభము. అను వానివల్ల కలుగు క్లేశములు.

11. కృత్యము : శత్రుపక్షమందలివాడు-యజమాని వలన జీతము పొందనివాడు, అవమానము పొందినవాడు రాజుచే కోపింపబడినవాడు. రాజుచే భయపెట్టబడినవాడు. వీరలకు కావలసిన వాని నిచ్చి శత్రువులనుండి వారిని వేరుచేయుట యను భేదనము

12. వింశతివర్గము : సంధికి తగనివారు - బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, బంధువులచే విడువబడినవాడు, పిరికివాడు, భయపడు మంత్రి, సేనాపతి మున్నగువారు కలవాడు, లోభము కలవాడు, లుబ్ధులు చుట్టును కలవాడు, ప్రజలయం దనురాగము లేనివాడు, విషయములం దత్యంతానురాగము కలవాడు, అనేకా లోచనలు కలవాడు, దేవతలను, బ్రాహ్మణులను నిందించువాడు, మహర్షి శాపోపహతుడు, దైవమే సర్వము నిచ్చునని ప్రయత్నము చేయనివాడు, కఱవుచే పీడితుడు, సైన్యనాశముచే పీడితుడు, విదేశములలో నున్నవాడు, పెక్కండ్రు శత్రువులు కలవాడు, క్రూరగ్రహదశాభాగము కలవాడు, సత్యము, ధర్మము లేనివాడు

అను నీ యిరువది విధములగు రాజులతో సంధిచేయరాదు. లేదా ఇరువది యుద్ధహేతువులు. రాజ్యము నపహరించుట, స్త్రీ నపహరించుట, స్థానము నపహరించుట, బంధువు నపహరించుట, ధనము నపహరించుట, మదము, మానము, విషయములందా సక్తి, జ్ఞాననాశము, అర్థనాశము, శక్తినాశము, ధర్మనాశము, దైవప్రాతికూల్యము, మిత్రావమానము, మిత్రధన చౌర్యము, బంధునాశము, ప్రాణులపై దయలేకుండుట, మండల దూషణము (తన మంత్రి, సేనాని, మిత్రులు వే అగుట) ఒకే వస్తువునకు పెక్కండ్రు ఆశపడుట అను నీ యిరువది.

13. ప్రకృతిమండలము : 1) ప్రకృతులు ఐదు. మంత్రి, రాష్ట్రము, కోట, బొక్కసము, దండము. అనునవి 2) మండలము-పండ్రెండు విధములగు రాజులు. విజిగీషువునకు శత్రువు, అతని మిత్రుడు, శత్రువునకు మిత్రుడు, మిత్రునకు మిత్రుడు అను పురోవర్తులైదుగురు, పార్ష్ణిగ్రాహుడు, ఆక్రందుడు, పార్ష్ణి గ్రహాసారుడు, ఆక్రందాసారుడు అని వెనుకనుండు నలుగురు. పార్శ్వస్థుడు, మధ్యముడు, ఉదాసీనుడు అని మొత్తము పండ్రెండుమంది.

14. యాత్రాదండ విధానము - యాత్ర - శత్రువుపై దండెత్తుట, ఇది యైదు విధములు : 1) విగృహ్యయానము పార్ష్ణి గ్రాహాదులు లేకయే శత్రువుపై దండెత్తుట. 2) సంభూయ యానము సామంతులలో కలసి దండెత్తుట. 3) ప్రసంగయానము ఒకనిపై దండెత్తుచున్నానని ప్రకటించి యకస్మాత్తుగ వేఱొకనిపై దండెత్తుట. 4) ఉపేక్ష్యయానము శత్రువుపై దండయాత్ర కుద్దేశించి మధ్యలో వానిని వీడి వాని మిత్రునిపై తలపడుట.

5) సంధాయ యానము-పార్ష్ణిగ్రాహాదులతో సంధిచేసికొని కలసి కట్టుగా యుద్ధమునకు పోవుట. దండము రెండు విధములు. 1) వ్యూహరచన, 2) శత్రుశిక్షణము.

15. ద్వియోని :- ముందుచెప్పబడిన సంధి, విగ్రహ, యాన, అసన, ద్వైధీభావ, సమాశ్రయములను సంధివిగ్రహము లలో అంతర్భావము చేయుటచే అవి రెండు. ఇందు సంధిలో ద్వైధీభావ సమాశ్రయములును, విగ్రహములో యానాసనములును అంతర్భావితములు.

మంత్రిభి స్త్వం యథోద్దిష్టై శ్చతుర్భి స్త్రిభి రేవ వా,
కచ్చి త్సమస్తై ర్వ్యస్తై శ్చ మంత్రం మంత్రయసే మిథః.

శాస్త్రోక్త మంత్రి లక్షణములతో కూడిన మంత్రులు నలుగురు, లేదా ముగ్గురితో కలసి యాలోచించియు, వేఱ్వేఱుగ వారి యభిప్రాయములు గమనించియు ఆలోచనము చేయుచుంటివి కదా ?

కచ్చి తే సఫలా వేదాః కచ్చి త్తే సఫలాః క్రియాః,
కచ్చి త్తే సఫలా దారాః కచ్చి త్తే సఫలం శ్రుతమ్. 72

నీ వధ్యయనము చేసిన వేదములు అగ్నిహోత్రాదుల ననుష్ఠించుటచే సఫలములైనవా? నీవు సంపాదించిన ధనములు దానము, భోగములచే సఫలములైనవా ? నీ భార్యలు రతిచే, పుత్రులచే సఫలత నొందుచున్నారా ? నీ శాస్త్రశ్రవణము శీలము, ఆచరణములచే సఫలమా ?

కచ్చి ద్దేషైవ తే బుద్ధి ర్యథోక్తా మమ రాఘవ!,
అయుష్యా చ యశస్యా చ ధర్మకామార్థసంహితా. 73

ఆయుష్షను పెంచునది, కీర్తిని కలిగించునది, ధర్మ, కామ, అర్థములందు తత్పరమైనది, నే నిప్పుడు వరకు నీకు తెలిపిన ఈ బుద్ధి నా కున్నటులు నీకును కలదా ?

యాం వృత్తిం వర్తతే తాతో యాం చ నః ప్రపితామహాః,
తాం వృత్తిం వర్తసే కచ్చి ద్యా చ సత్పథగా శుభా. 74

సన్మార్గము ననుసరించునట్టిది, నిందితము కానిది యగు ఏ వృత్తిని దశరథ మహారా జనుసరించుచున్నాడో, దేనిని మా ముత్తాత మున్నగువా రనుసరించిరో (తాత అగు అజుడు చిర కాలము రాజ్యము పాలింపకుండుటచే ఆయనను పేర్కొనలేదు) ఆ వర్తనమునే నీ వవలంబించుచున్నావా ?

కచ్చి త్స్వాదు కృతం భోజ్య మేకో నాశ్నాసి రాఘవ!,
కచ్చి దాశంసమానేభ్యో మిత్రేభ్య స్సంప్రయచ్ఛసి. 75

భరతుడా! మధురమగు ఆహారమును నీ వొక్కడవే తినుట లేదుకదా ? నిన్ను ధనము కోరు మిత్రులకు ధన మిచ్చు చుంటివా ?

రాజా తు ధర్మేణ హి పాలయిత్వా
మహామతి ర్దండధరః ప్రజానామ్,
అవాప్య కృత్స్నాం వసుధాం యథావ
దిత శ్చ్యుత స్స్వర్గ ముపైతి విద్వాన్. 76

పూర్వోక్తమగు నీతిని, ధర్మము నెఱిగినవాడు, యుక్తా

యుక్తముల నెఱిగి దండించు రాజు పూర్వరాజులవలె ధర్మముగ భూమిని పాలించుచు, సకల భూమండలమును తన యధీనము గావించుకొని, ప్రారబ్ధకర్మావసానమున నీ లోకమునుండి చ్యుతుడై, శరీరముకంటె వేఱగు ఆత్మ నెఱిగినవాడై స్వర్గమున కేగును.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
శతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూఱవ సర్గము సమాప్తము.

---

## ఏకోత్తరశతతమః సర్గః - నూటొక్కటవ సర్గము

రామస్య వచనం శ్రుత్వా భరతః ప్రత్యువాచ హ,
కిం మే ధర్మా ద్విహీనస్య రాజధర్మః కరిష్యతి. 1

రాముని వాక్యమును విని భరతు డిట్లు పలికెను–'నీ సేవా రూపమగు ముఖ్యధర్మమునుండి (లేదా నీ విప్పటివఱకు తెలిపిన రాజధర్మము ననుష్ఠించుటకు హేతువగు రాచరికము నుండి) దూరమైన నాకు రాజ్యపరిపాలన రూపమగు రాజధర్మ మేమి చేయును ?

శాశ్వతోఽయం సదా ధర్మః స్థితోఽస్మాసు నరర్షభ!,
జ్యేష్ఠపుత్త్రే స్థితే రాజ| న్న కనీయా న్నృపో భవేత్. 2

ఓ నరశ్రేష్ఠుడా ! రాజా! జ్యేష్ఠపుత్రు డుండగా చిన్నవాడు

రాజు కారా దను ని నిత్యసిద్ధమగు ధర్మము మాపూర్వులం దెల్లపుడు నున్నది.

స సమృద్ధాం మయా సార్ధ మయోధ్యాం గచ్ఛ రాఘవ।,
అభిషేచయ చాత్మానం కుల స్యాస్య భవాయ నః. 3

ఓ రాఘవుడా! నాతో కలసి మిగుల సమృద్ధమగు అయోధ్యకు రమ్ము. మనవంశపు క్షేమముకోరి నిన్ను పట్టాభిషిక్తుని చేసికొమ్ము.

రాజానం మానుషం ప్రాహు ర్దేవత్వే సమ్మతో మమ,
యస్య ధర్మార్థసహితం వృత్త మాహు రమానుషమ్. 4

ఏ జనులు రాజును మనుష్యు దని యందురో వారే ధర్మార్థ సహితమగు నీ నడవడిని అమానుష మనియెదరు. నీవు మనుష్యుని అవయవ సంస్థానము కలవాడ వయ్యును, మానవాతీత ములగు శీల, వృత్త విశేషములచే సకలలోకసామ్యతను మించిన భగవన్నారాయణుడవని నేను భావింతును.

కేకయస్థే చ మయి తు త్వయి చారణ్య మాశ్రితే,
దివ మార్యో గతో రాజా యాయజూక స్సతాం మతః. 5

నేను కేకయదేశమం దుండగా, నీ వరణ్యమున కేగగా సతతయాగ నిర్వహణశీలుడు, సత్పురుషుల కభిమతుడు, పూజ్యుడగు మహారాజు, స్వర్గమున కేగెను.

నిష్క్రాంతమాత్రే భవతి ససీతే సహలక్ష్మణే,
దుఃఖశోకాభిభూత స్తు రాజా త్రిదివ మభ్యగాత్. 6

నీవు సీతతో లక్ష్మణునితో గూడి వెడలిన వెంటనే రాజు దుఃఖమువలన కలిగిన శోకముచే పీడితుడై స్వర్గమున కేగెను.

ఉత్తిష్ఠ పురుషవ్యాఘ్ర క్రియతా ముదకం పితుః,
అహం చాయం చ శత్రుఘ్నః పూర్వ మేవ కృతోదకా. 7

ఓ పురుషశ్రేష్ఠుడా! నీ వింక లెమ్ము. తండ్రికి జలతర్పణ మిమ్ము. నేనును, శత్రుఘ్నుడును ముందే ఉదకక్రియ యొనర్చితిమి.

ప్రియేణ కిల దత్తం హి పితృలోకేషు రాఘవ!,
అక్షయ్యం భవ తీ త్యాహు ర్భవాం శ్చైవ పితుః ప్రియః.

ఓ రాఘవుడా! తండ్రి కిష్టుడగు తనయు డిచ్చిన జలతర్పణము పితృలోకమున అక్షయఫలజనక మందురు. నీవు జ్యేష్ఠుడ వగుటచే తండ్రికి ప్రీతిపాత్రుడవు.

త్వామేవ శోచం స్తవ దర్శనేప్సు
స్త్వయ్యేవ సక్తా మనివర్త్య బుద్ధిమ్,
త్వయా విహీన స్తవ శోకరుగ్ణ
స్త్వాం సంస్మర న్నస్తమితః పితా తే. 9

నిన్నుగూర్చియే శోకించుచు, నిన్నే చూడగోరి, నీపై నిలచిన యాబుద్ధిని మఱలింపక, నిన్నెడబాసి, నీ విరహమువల్ల కలిగిన శోకముచే పీడితుడై నిన్నే తలంచుచు తండ్రి యస్తమించెను." అని భరతుడు రామునితో పలికెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటొకటవ సర్గము సమాప్తము.

---

## ద్వ్యుత్తరశతతమః సర్గః — నూటరెండవ సర్గము

తాం శ్రుత్వా కరుణాం వాచం పితు ర్మరణసంహితామ్,
రాఘవో భరతే నోక్తాం బభూవ గతచేతనః. 1

తన తండ్రి మరణించినాడను శోకావహమైన మాటను భరతుడు పలుకగా విని రాముడు మూర్ఛనందెను.

తం తు వజ్ర మి వోత్సృష్ట మాహవే దానవారిణా,
వాగ్వజ్రం భరతే నోక్త మమనోజ్ఞం పరంతపః. 2
ప్రగృహ్య బాహూ రామో వై పుష్పితాగ్రో యథా ద్రుమః,
వనే పరశునా కృత్త స్తథా భువి పపాత హ. 3

శత్రువులను పీడించువాడగు రాముడు యుద్ధమున దేవేంద్రునిచే వేయబడిన వజ్రాయుధమువలెనున్న భరతోక్తమగు కఠోరవాక్కును విని, చేతులు కట్టుకొని నిలచి అడవిలో గొడ్డలిచే నఱుకబడిన పూచిన చెట్టువలె భూమిపై పడెను.

తథా నిపతితం రామం జగత్యాం జగతీపతిమ్,
కూలఘాతపరిశ్రాంతం ప్రసుప్త మివ కుంజరమ్, 4

భ్రాతర స్తే మహేష్వాసం సర్వత శ్శోకకర్శితమ్,
రుదంత స్సహ వైదేహ్యా నిషిచు స్సలిలేన వై. 5

అంత నా సోదరు లెల్లరు సీతతోగూడి యేడ్చుచు, ఒడ్డను మదముచే పొడిచి యలసినదై నిదురించుచున్న యేనుగువలె భూమిపై బడియున్న మేటి విలుకాడును, శోకపీడితుడును, భూపతియు అగు రామునిపై అంతటను నీటిని చల్లిరి.

స తు సంజ్ఞాం పున ర్లబ్ధ్వా నేత్రాభ్యా మస్ర ముత్సృజన్,
ఉపాక్రామత కాకుత్స్థః కృపణం బహు భాషితుమ్. 6

కాకుత్స్థుడగు రాముడు మరల తెలివినొంది, కనులనుండి కన్నీరు కార్చుచు, దీనుడై ఇట్లధికముగ పలుకదొడగెను.

స రామ స్స్వర్గతం శ్రుత్వా పితరం పృథివీపతిమ్,
ఉవాచ భరతం వాక్యం ధర్మాత్మా ధర్మసంహితమ్. 7

మహారాజగు తండ్రి మృతిచెందె నని వినిన ధర్మాత్ముడగు రాముడు ధర్మసహితముగ భరతున కిట్లనెను.

కిం కరిష్యా మ్యయోధ్యాయాం తాతే దిష్టాం గతిం గతే,
క స్తాం రాజవరా ద్ధీనా మయోధ్యాం పాలయిష్యతి. 8

అయ్యో! ఇపు డేమి చేయుదును? తండ్రి అయోధ్యలో మరణించెనే! అరాజశ్రేష్ఠుని రక్షణలో నుండిన అయోధ్య నిపు డెవడు పరిపాలించును?

కిం ను తస్య మయా కార్యం దుర్జాతేన మహాత్మనః,
యో మృతో మమ శోకేన మయా చాపి న సంస్కృతః. 9

దశరథమహారాజు నా వియోగమువలన కలిగిన శోకము భరింపలేక మరణించెను. ఆయనకు చరమ సంస్కారమైన చేయనైతిని. ఇట్టి దుష్టుడనగు నాతో ఆ మహాత్మున కేమి ప్రయోజనము ?

అహో! భరత! సిద్ధార్థో యేన రాజా త్వయాఽనఘ!,
శత్రుఘ్నేన చ సర్వేషు ప్రేతకృత్యేషు సత్కృతః. 10

(పితృసంస్కారము చేయుట అను భాగ్యము నుండి తప్పించునట్టి) పాపము లేనివాడవగు భరతుడా! నీవును, శత్రుఘ్నుడును నిష్పన్న సకల ప్రయోజనుడగు మహారాజు మృతినందగా ఆయన కాచరింపవలసిన ప్రేతకృత్యముల నన్నింటిని అనుష్ఠించి, సత్కరించితిరి.

నిష్ప్రధానా మనేకాగ్రాం నరేంద్రేణ వినాకృతామ్,
నివృత్తవనవాసోఽపి నాయోధ్యాం గన్తు ముత్సహే. 11

మహారాజు మరణించుటచే ప్రధానపురుషుడు లేనిది, వ్యాకులమైనది అగు అయోధ్యకు వనవాసానంతరము కూడ పోవ నుత్సహింపను.

సమాప్తవనవాసం మా మయోధ్యాయాం పరంతప!,
కో ను శాసిష్యతి పున స్తాతే లోకాన్తరం గతే. 12

ఓ శత్రుతాపనుడా! తండ్రి పరలోకమున కేగినాడే. వనవాసము పూర్తిచేసికొనిన నన్నయోధ్యలో ఆదేశించువారింకెవ్వరు ?

పురా ప్రేక్ష్య సువృత్తం మాం పితా యాన్యాహ సాన్త్వయన్,
వాక్యాని తాని శ్రోష్యామి కుత శ్శ్రోత్రసుఖా న్యహమ్.13

తన యాదేశమును పాలించుట యను చక్కని నడవడి కల నన్ను చూచి, మన తండ్రి ప్రీతితో నే మంచి మాటలు పలికెనో, చెవుల కింపగు ఆ మాట లిపు డెవరు పలుకగా వినగలను ?

ఏవ ముక్త్వా స భరతం భార్యా మభ్యేత్య రాఘవః,
ఉవాచ శోకసంతప్తః పూర్ణచంద్రనిభాననామ్, 14
సీతే! మృత స్తే శ్వశురః పిత్రా హీనోఽసి లక్ష్మణ,
భరతో దుఃఖ మాచష్టే స్వర్గతం పృథివీపతిమ్. 15

రాము డిట్లు భరతునితో పలికి పూర్ణచంద్రునిపోలు ముఖము కల భార్యకడకు వచ్చి శోకపీడితుడై ఇట్లనెను—సీతా ! నీ (యందత్యంతానురాగముకల) మామగారు మరణించిరి. లక్ష్మణా ! తండ్రిలేనివాడ వైతివి. భరతుడు మహారాజు మరణవార్తను దుఃఖముతో తెలిపినాడు.

తతో బహుగుణం తేషాం బాష్పం నేత్రే ష్వజాయత,
తథా బ్రువతి కాకుత్స్థే కుమారాణాం యశస్వినామ్. 16

రాము డట్లు పలుకగా కీర్తిమంతులగు ఆ రాజతనయుల కన్నులనుండి దుఃఖముచే మిక్కుటమై కన్నీరు కారెను.

తత స్తే భ్రాతర స్సర్వే భృశ మాశ్వాస్య రాఘవమ్,
అబ్రువన్ జగతీభర్తుః క్రియతా ముదకం పితుః. 17

అంత నా సోదరు లెల్లరు రాముని పలువిధములుగ నోదార్చి మహారాజున కుదకక్రియ చేయుమని చెప్పిరి.

సా సీతా శ్వశురం శ్రుత్వా స్వర్గలోకగతం నృపమ్,
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మశక న్నేక్షితుం పతిమ్. 18

తన మామగారు మరణించినా రని వినిన సీత కన్నీరొలుకు కనులతో తన పతిని చూడజాల దయ్యెను.

సాంత్వయిత్వా తు తాం రామో రుదన్తీం జనకాత్మజామ్,
ఉవాచ లక్ష్మణం తత్ర దుఃఖితో దుఃఖితం వచః. 19

అటు ఏడ్చుచున్న సీతను రాము డోదార్చి, దుఃఖించుచున్న లక్ష్మణునితో, తానును దుఃఖించుచు నిట్లనెను.

ఆన యేంగుదిపిణ్యాకం చీర మాహర చోత్తరమ్,
జలక్రియార్థం తాతస్య గమిష్యామి మహాత్మనః. 20

లక్ష్మణా! గారపిండిని, స్నానవస్త్రమగు చీరమును, ఉత్తరీయమును తెమ్ము. మహాత్ముడగు తండ్రికి ఉదకక్రియ చేయుటకై పోయెదను.

సీతా పురస్తా ద్వ్రజతు త్వ మేనా మభితో వ్రజ,
అహం పశ్చా ద్గమిష్యామి గతి ర్హ్యేషా సుదారుణా. 21

సీత ముందు నడచును. ఆమెవెనుక నీవుపొమ్ము. నేను నీ వెనుక వత్తును. ఇట్టి అశుభసందర్భములలో ముందు బాలురు, స్త్రీలు, వారివెనుక పెద్దలుపోవుట ధర్మము.” అనెను.

తతో నిత్యానుగ స్తేషాం విదితాత్మా మహామతిః,
మృదు ర్దాంత శ్చ శాంత శ్చ రామే చ దృఢభక్తిమాన్,22

సుమంత్ర స్తై ర్నృపసుతై స్సార్ధ మాశ్వాస్య రాఘవమ్,
అవాతారయ దాలంబ్య నదీం మందాకినీం శివామ్. 23

అపుడు వారికి కులక్రమాగతుడగు అనుచరుడును, ఆత్మ స్వరూప మెఱిగినవాడును, గొప్ప ప్రజ్ఞ కలవాడును, మృదు స్వభావుడును, రామునియందు చెదరని భక్తిభావము కలవాడును అగు సుమంత్రుడు రాముని, తక్కిన రాజపుత్రులను ఓదార్చి, వారిని పవిత్రమగు గంగానదికి తీసికొనిపోయెను.

తే సుతీర్థాం తతః కృచ్ఛ్రా దుపాగమ్య యశస్వినః,
నదీం మందాకినీం రమ్యాం సదా పుష్పితకాననామ్. 24
శీఘ్రస్రోతస మాసాద్య తీర్థం శివ మకర్దమమ్,
సిషిచు స్తూదకం రాజ్ఞే త త్రైత త్తే భవ త్వితి. 25

కీర్తిమంతులగు ఆ సీతారామలక్ష్మణులు నిర్మలజలములు కలది, సుందరమైనది, తీరములందు సదా పుష్పించిన చెట్లు కలదగు గంగానదికి ఎట్లో పోయి, బురదలేని ఉత్తమమగు రేవును చేరి, 'తండ్రీ ! నీ కిదిగో జల మిచ్చుచుంటి' మని జల తర్పణ మొసగిరి.

ప్రగృహ్య చ మహీపాలో జలపూరిత మంజలిమ్,
దిశం యామ్యా మభిముఖో రుద న్వచన మబ్రవీత్. 26

అపుడు రాముడు దోసిలినిండుగా జలము తీసికొని, దక్షిణ దిక్కుకు తిరిగి యేడ్చుచు నిట్లనెను.

ఏత త్తే రాజశార్దూల విమలం తోయ మక్షయమ్,
పితృలోకగత స్యాద్య మద్దత్త ముపతిష్ఠతు. 27

ఓ రాజశ్రేష్ఠుడవగు తండ్రీ! నేనిచ్చు శుద్ధము, అక్షయ మగు నీ జలము పితృలోకముననున్న నీకు చేరునుగాక!

తతో మందాకినీతీరా త్ప్రత్యుత్తీర్య స రాఘవః,
పితు శ్చకార తేజస్వీ నివాపం భ్రాతృభి స్సహ. 28

అంత తేజశ్శాలియగు నా రాముడు గంగానదీ తీరము నుండి వెడలి, చెంతనే సోదరులతోగూడి తండ్రికి పిండప్రదాన మొనర్చెను.

ఐంగుదం బదరీమిశ్రం పిణ్యాకం దర్భసంస్తరే,
న్యస్య రామ స్సుదుఃఖార్తో రుద న్వచన మబ్రవీత్. 29
ఇదం భుంక్ష్వ మహారాజ! ప్రీతో యదశనా వయమ్,
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః. 30

రేగుపండ్లు, గారపిండి కలిపిన పిండములను, దర్భలు పఱచి వానిపై పెట్టినవాడై, రాముడు మిగుల దుఃఖపీడితుడై యిట్లనెను-మహారాజా! మేము భుజించునట్టి ఈ యాహారమును ప్రీతితో భుజింపుము. జనుడే యన్నము తినునో అతని దేవతలును అదే యాహారము కలవా రగుదురు.

తత స్తేనైవ మార్గేణ ప్రత్యుత్తీర్య నదీతటాత్,
ఆరురోహ నరవ్యాఘ్రో రమ్యసానుం మహీధరమ్. 31

అంతట ఆ నరశ్రేష్ఠుడు ఆ మార్గముననే నదియొడ్డును దాటి సుందరములగు సానుప్రదేశములు కల చిత్రకూట పర్వతము కడకేగెను.

తతః పర్ణకుటీద్వార మాసాద్య జగతీపతిః,
పరిజగ్రాహ బాహుభ్యా ముభౌ భరతలక్ష్మణౌ. 32

అంతట రాముడు పర్ణశాల ద్వారమును చేరి, భరత లక్ష్మణుల నిద్దరను తన బాహువులతో కౌగలించుకొనెను.

తేషాం తు రుదతాం శబ్దా త్ప్రతిశ్రుత్కోఽభవ ద్గిరౌ,
భ్రాతౄణాం సహ వై దేహ్యా సింహానా మివ నర్దతామ్.33

సీతతో గూడిన ఆ సోదరులు విలపించుచుండగా, గర్జించు సింహముల ప్రతిధ్వనివోలె ఆ కొండపై వారి రోదనము మార్మ్రోగెను.

మహాబలానాం రుదతాం కుర్వతా ముదకం పితుః,
విజ్ఞాయ తుములం శబ్దం త్రస్తా భరతసైనికాః. 34
అబ్రువం శ్చాపి రామేణ భరత స్సంగతో ధ్రువమ్,
తేషా మేవం మహా ఞ్ఛబ్దః శోచతాం పితరం మృతమ్.35

మహాబలవంతులగు ఆ రాజతనయులు తండ్రి కుదకక్రియ చేసి రోదింపగా నేర్పడిన శబ్దమును విని భయపడిన భరతుని సైనికులు—'నిశ్చయముగ భరతుడు రాముని కలసినాడు. ఆ సోదరులందరు ఒకచో కలసి మరణించిన తండ్రిని తలచి దుఃఖముతో రోదించుటచే నీ మహాశబ్ద మేర్పడినది' అనిరి.

అథ వాసా న్పరిత్యజ్య తం సర్వేఽభిముఖా స్స్వనమ్,
అ ప్యేకమనసో జగ్ము ర్యథాస్థానం ప్రధావితాః. 36

అంత నా సైనికు లెల్లరు తమ నివాసములను వీడి, ఏకోద్యోగులై ఆధ్వని వచ్చిన దిశకే వేగముగ పోయిరి.

హయై రన్యే గజై రన్యే రథై రన్యే స్వలంకృతైః,
సుకుమారా స్త థైవాన్యే పద్భి రేవ నరా యయుః. 37

సుకుమారులగు కొందఱు గుఱ్ఱములపై కొంద ఱేనుగులపై, కొందఱు చక్కగా నలంకరించబడిన రథములపై వెడలగా-తక్కినవా రెల్లరు కాలినడకనే యట కేగిరి.

అచిరప్రోషితం రామం చిరవిప్రోషితం యథా,
ద్రష్టుకామో జన స్సర్వో జగామ సహసాఽఽశ్రమమ్. 38

రాముడు కొలదికాలమునకు ముందే అడవి కేగినను, చాల కాలము ముందే వెడలినవానివలె చూడగోరిన జనులెల్లరు శీఘ్రముగ నాశ్రమమున కేగిరి.

భ్రాతృణాం త్వరితా స్తత్ర ద్రష్టుకామా స్సమాగమమ్,
యయు ర్బహువిధై ర్యానైః ఖురనేమిస్వనాకులైః. 39

వా రెల్లరు సోదరులు నలువు రొకచో నచట కూడియుండగా చూడగోరినవారై గిట్టలయొక్క, చక్రపుటంచులయొక్క ధ్వనులతోకూడిన పలువిధములగు యానములనెక్కి పోయిరి.

సా భూమి ర్బహుభి ర్యానైః ఖురనేమిసమాహతా,
ముమోచ తుములం శబ్దం ద్యౌ రివాభ్రసమాగమే. 40

ఆ ప్రదేశము, అనేక వాహనముల గిట్టలు, చక్రపు అంచుల తాకిడిచే మేఘముతో కూడిన ఆకాశమువలె పెద్ద ధ్వని కల దయ్యెను.

తేన విత్రాసితా నాగాః కరేణుపరివారితాః,
ఆవాసయంతో గంధేన జగ్ము రన్య ద్వనం తతః. 41

ఆ ధ్వనిచే బెదరగొట్టబడిన యేనుగులు, ఆడేనుగులతో కూడినవై తమ మదగంధముతో ప్రదేశములను పరిమళింప జేయుచు వేఱొక యడవి కేగినవి.

వరాహవృకసంఘా శ్చ మహిషా స్సర్పవానరాః,
వ్యాఘ్ర గోకర్ణ గవయా విత్రేసుః పృషతై స్సహ. 42

పందులు, తోడేళ్లు, దున్నలు, పాములు, కోతులు, పులులు, కంచరగాడిదలు, గురుపోతులు, దుప్పులును, భయపడెను.

రథాంగసాహ్వా నత్యూహా హంసాః కారండవాః ప్లవాః,
తథా పుంస్కోకిలాః క్రౌంచా విసంజ్ఞా భేజిరే దిశః. 43

చక్రవాకములు, నీరుకోడులు, నీటిజింకలు, హంసలు, కన్నెలేడిపిల్లలు, పెనుకొంగలు, మగకోకిలలు, కొంచపిట్టలు భ్రాంతినొంది యన్ని దిశలకు పారిపోయెను.

తేన శబ్దేన విత్రస్తై రాకాశం పక్షిభి ర్వృతమ్,
మనుష్యై రావృతా భూమి రుభయం ప్రబభౌ తదా. 44

ఆ శబ్దమునకు భీతిల్లిన పక్షు లాకాశము నావరించెను. అట్లు భయమునందిన జనులు భూమిపై నావరించిరి. ఇట్లు భూమ్యాకాశములు రెండును మిగుల ప్రకాశించినవి.

తత స్తం పురుషవ్యాఘ్రం యశస్విన మరిందమమ్,
ఆసీనం స్థండిలే రామం దదర్శ సహసా జనః. 45

అంతట పురుషశ్రేష్ఠుడు, కీర్తిమంతుడు, శత్రునాశకుడగు

రాముడు పర్ణశాలలో నేలపై గూర్చుండగా జనులు వేగముగ పోయి యతనిని దర్శించిరి.

విగర్హమాణః కైకేయీం సహితో మంథరా మపి,
అభిగమ్య జనో రామం బాష్పపూర్ణముఖోఽభవత్. 46

జను లెల్లరు కలసి కైకేయిని, మంథరను నిందించుచు రాముని కడకేగి కన్నీరు కార్చిరి.

తా న్నరా న్బాష్పపూర్ణాక్షా న్సమీక్ష్యాథ సుదుఃఖితాన్,
పర్యష్వజత ధర్మజ్ఞః పితృవ న్మాతృవ చ్చ సః 47

ధర్మ మెఱిగిన రాము డట్లు కన్నీరు నింపుకొని, మిగుల దుఃఖితులై తన్ను చూడవచ్చిన జనులను కాంచి, పురుషులను తండ్రులను వలె, స్త్రీలను తల్లులను వలెను కౌగలించుకొనెను.

స తత్ర కాంశ్చి త్పరిషస్వజే నరా
న్నరా స్తు కేచి త్తు త మభ్యవాదయన్,
చకార సర్వా న్సవయస్యబాంధవా
న్యథార్హ మాసాద్య తదా నృపాత్మజః. 48

అట్లు చూడవచ్చిన వారిలో కొందఱిని రాము డాలింగన మొనర్చెను. కొంద రతనికి ప్రణమిల్లిరి. రాముడు అట్లు వచ్చిన వారిలో మిత్రులను, బంధువులను ఉచితరీతిని సమీపించి సమ్మానించెను.

స తత్ర తేషాం రుదతాం మహాత్మనాం
భువం చ ఖం చానునినాదయన్ స్వనః,

గుహా గిరీణాం చ దిశ శ్చ సన్తతం
మృదంగఘోషప్రతిమః ప్రశుశ్రువే. 4

ఆ యాశ్రమమున మహాత్ములగు నా రాజపుత్రుల రోదన ధ్వని భూమ్యాకాశములను ప్రతిధ్వనింపజేయుచు కొండగుహలలో అన్నిదిక్కులలో మద్దెల మ్రోతవలె నెడతెగక వినబడెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ద్వ్యుత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము. ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నూటరెండవ సర్గము సమాప్తము.

---

## త్ర్యుత్తరశతతమః సర్గః - నూటమూడవ సర్గము

వసిష్ఠః పురతః కృత్వా దారా న్దశరథస్య చ,
అభిచక్రామ తం దేశం రామదర్శనతర్షితః. 1

అంత వసిష్ఠుడు దశరథుని భార్యలను తోడ్కొని రాముని చూడవలెనను నభిలాషకలవాడై ఆ ప్రదేశమును చేరెను.

రాజపత్న్య శ్చ గచ్ఛంత్యో మందం మందాకినీం ప్రతి,
దదృశు స్తత్ర తత్తీర్థం రామలక్ష్మణసేవితమ్. 2

రాజభార్యలును మెల్లగా గంగానదికడ కేగుచు, రామలక్ష్మణులు సేవించిన యా గంగానది రేవును చూచిరి.

కౌసల్యా బాష్పపూర్ణేన ముఖేన పరిశుష్యతా,
సుమిత్రా మబ్రవీ ద్దీనా యా శ్చాన్యా రాజయోషితః. ६

కౌసల్య వాడిన ముఖమున కన్నీరు సిండినదై, దైన్యము కలదై సుమిత్రతోడను, తక్కిన రాజభార్యలతోడను ఇట్లనెను.

ఇదం తేషా మనాథానాం క్లిష్ట మక్లిష్టకర్మణామ్,
వనే ప్రా క్కేవలం తీర్థం యే తే నిర్విషయీకృతాః.

ఎవ్వరికిని యే చెఱుపు కలుగు పనులు చేయని వారును రాజ్యమునుండి వెడలగొట్టబడిన వారును, దిక్కులేని వారైన సీత రామలక్ష్మణు లడవిలో నడచుటచే నలిగినదే ఈ రేవు.

ఇత స్సుమిత్రే! పుత్త్ర స్తే సదా జల మతంద్రితః,
స్వయం హరతి సౌమిత్రి ర్మమ పుత్త్రస్య కారణాత్.

సుమిత్రా! నీ కొడుకు లక్ష్మణు డేమఱక నాకుమారుడ రాముని కొఱకు సదా జలము స్వయముగా నిటనుండియే తెచ్చుచున్నాడు.

జఘన్యమపి తే పుత్త్రః కృతవా న్నతు గర్హితః,
భ్రాతు ర్య దర్థసహితం సర్వం త ద్విహితం గుణైః.

నీ కుమారుడగు లక్ష్మణుడు నీటిని తెచ్చుట మున్న హీన కార్యము చేయుచున్నను తన తండ్రితో సమానుడ అన్నకు వలయునది గాన గుణవంతమే యగుటచే అత హీనకృత్యము చేయువాడని నిందింపబడడు.

అవ్యాయ మపి తే పుత్త్రః క్లేశానా మతథోచితః,
నీచానర్థసమాచారం సజ్జం కర్మ ప్రముంచతు. 7

ఇప్పుడు తా ననుభవించుచున్న క్లేశము లనుభవింపదగని నీ తనయుడును నికృష్టము, దుఃఖప్రచురమగు ఆచరణముకల ఈపని నిటుపై విడచును గాక (భరతుని కోరిక నంగీకరించి రాముడు పట్టాభిషిక్తు డగునని, దానిచే లక్ష్మణున కీ క్లేశము తొలగునని కౌసల్య భావించుచున్నది).

దక్షిణాగ్రేషు దర్భేషు సా దదర్శ మహీతలే,
పితు రింగుదిపిణ్యాకం న్యస్త మాయతలోచనా. 8

విశాలమగు కన్నులు కల ఆ కౌసల్య యచట భూమిపై దక్షిణాగ్రములగు దర్భలపై పితృకార్యమునకై పెట్టబడిన గార పిండి పిండములు చూచెను.

తం భూమౌ పితు రార్తేన న్యస్తం రామేణ వీక్ష్య సా,
ఉవాచ దేవీ కౌసల్యా సర్వా దశరథస్త్రియః. 9

దుఃఖపీడితుడగు రాముడు తండ్రికై యా భూమిపై నుంచిన పిండము జూచినదై కౌసల్య తక్కిన దశరథ పత్నులతో నిట్లనెను.

ఇద మిక్ష్వాకునాథస్య రాఘవస్య మహాత్మనః,
రాఘవేణ పితు ర్దత్తం పశ్య తైత ద్యథావిధి. 10

ఇది ఇక్ష్వాకునాథుడు, మహాత్ముడు, తండ్రియగు దశరథునకు రాముడు శాస్త్రోక్తముగా సమర్పించిన పదార్థము.

తస్య దేవసమానస్య పార్థివస్య మహాత్మనః,
నైత దౌపయికం మన్యే భుక్తభోగస్య భోజనమ్. 11

దేవతలకు సాటియగువాడు, మహాత్ముడు, వివిధ భోగము లనుభవించినవాడగు దశరథ మహారాజున కిది యుచితమైనది కాదని తలంతును.

చతురంతాం మహీం భుక్త్వా మహేంద్రసదృశో విభుః,
కథ మింగుదిపిణ్యాకం స భుంక్తే వసుధాధిపః. 12

దేవేంద్రునకు సాటియైనవాడు, మహాసమర్థుడగు మహారాజు చతుస్సాగర మధ్యగతమగు భూమండలమునెల్ల ననుభవించి గారపిండిపిండముల నెట్లు భుజింతును?

అతో దుఃఖతరం లోకే న కించి త్ప్రతిభాతి మా,
యత్ర రామః పితు ర్దద్యా దింగుదిక్షోద మృద్ధిమాన్. 13

రాజైశ్వర్యమునకు యోగ్యుడగు రాముడు తండ్రికి గారపిండి పిండము వేయవలసివచ్చెనా? ఇంతకంటె మిక్కిలి దుఃఖకరమగు విషయము నాకు వేరొండు కనుపించుటలేదు.

రామే ణేంగుదిపిణ్యాకం పితు ర్దత్తం సమీక్ష్య మే,
కథం దుఃఖేన హృదయం న స్ఫోటతి సహస్రధా. 14

రాముడు తన తండ్రికి గారపిండి నాహారముగా నీయగా చూచి కూడ దుఃఖముతో నా హృదయము మేల వేయి ముక్కలుగా బ్రద్దలు కాకున్నది?

శ్రుతిస్తు ఖ ల్వియం సత్యా లౌకికీ ప్రతిభాతి మా,
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః. 15

లోకమున వాడుకలో నున్న 'పురుషున కేది యాహారమో, అతని దేవతలకును అదే యాహార' మను శ్రుతి సత్యమని నాకు తోచుచున్నది.

ఏవ మార్తాం సపత్న్య స్తా జగ్ము రాశ్వాస్య తాం తదా,
దదృశు శ్చాశ్రమే రామం స్వర్గచ్యుత మివామరమ్. 16

అని యిట్లు శోకపీడితయైన కౌసల్య నపుడు సవతులోదార్చి రామాశ్రమమున కేగిరి. వా రచట స్వర్గమునుండి భువికి వచ్చి పడిన దేవతవలెనున్న రాము నాశ్రమమున కాంచిరి.

సర్వభోగైః పరిత్యక్తం రామం సంప్రేక్ష్య మాతరః,
ఆర్తా ముముచు రశ్రూణి సస్వరం శోకకర్శితాః. 17

సకల భోగముల విడచిన రాముని చూచినవారై తల్లులందరును దుఃఖపీడితలై కన్నీరు కార్చి బిగ్గరగా రోదించిరి.

తాసాం రామ స్సముత్థాయ జగ్రాహ చరణా ఞ్ఛుభాన్,
మాతౄణాం మనుజవ్యాఘ్ర స్సర్వాసాం సత్యసంగరః.18

మనుజ శ్రేష్ఠుడు, సత్యప్రతిజ్ఞకలవాడగు రాముడు వెంటనే లేచి శుభములగు తల్లుల పాదములు తాకి ప్రణమిల్లెను.

తాః పాణిభి స్సుఖస్పర్శై ర్మృద్వంగుళితలై శ్శుభైః,
ప్రమమార్జూ రజః పృష్ఠా ద్రామ స్యాయతలోచనాః. 19

విశాలనేత్రములు కల అత్తలులు, మృదువులగు వ్రేళ్లుకలిగి, సుఖస్పర్శకల చేతులతో రాముని వీపుపై తడవి దుమ్మును తుడిచిరి.

సౌమిత్రి రపి తా స్సర్వా మాతౄ స్సమ్ప్రేక్ష్య దుఃఖితః,
అభ్యవాదయ తాసక్తం శనై రామా దనంతరమ్ 20

లక్ష్మణుడును తల్లు లందఱను చూచి దుఃఖితుడై రాముడు ప్రణమిల్లిన పిమ్మట, తానును వెంటనే మెల్లగా వారికి మ్రొక్కెను.

యథా రామే తథా తస్మి న్సర్వా వవృతిరే స్త్రియః,
వృత్తిం దశరథా జ్జాతే లక్ష్మణే శుభలక్షణే. 21

దశరథతనయుడును, శుభలక్షణములు కలవాడును అగు లక్ష్మణుని యందు కూడ రామునిపై వలెనే తల్లులందరు ప్రవర్తించిరి. (వాత్సల్యముతో వీపు నిమిరిరి.)

సీతాఽపి చరణాం స్తాసా ముపసంగృహ్య దుఃఖితా,
శ్వశ్రూణా మశ్రుపూర్ణాక్షీ సా బభూ వాగ్రతః స్థితా. 22

సీతయు తన యత్తల పాదములు తాకి ప్రణమిల్లి కన్నుల నీరు నింపుకొని దుఃఖితయై వారి ముందు నిలచెను.

తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా,
వనవాసకృశాం దీనాం కౌసల్యా వాక్య మబ్రవీత్. 23

దుఃఖముచే పీడింపబడినది, వనవాసముచే చిక్కినది, దీనయైనది అగు సీతను తల్లి కూతునువలె కౌగలించుకొని కౌసల్య యిట్లనెను.

విదేహరాజస్య సుతా స్నుషా దశరథస్య చ,
రామపత్నీ కథం దుఃఖం సంప్రాప్తా విజనే వనే. 24

విదేహరాజు కూతురు, దశరథుని కోడలు, రాముని భార్య ఎట్లీ నిర్జనవనమున దుఃఖము నొందినది?

పద్మ మాతపసంతప్తం పరిక్లిష్ట మి వోత్పలమ్,
కాంచనం రజసా ధ్వస్తం క్లిష్టం చంద్ర మి వాంబుదైః.25
ముఖం తే ప్రేక్ష్య మాం శోకో దహ త్యగ్నిరివాఽఽశ్రయమ్
భృశం మనసి వైదేహి! వ్యసనారణిసంభవః. 26

సీతా! ఎండకు వాడిన తామర పూవువలె, వాడిన కలువవలె, దుమ్ముచే కప్పబడి కాంతి తరిగిన బంగారమువలె, మేఘములచే కప్పబడిన చంద్రునివలె నున్న నీ ముఖము చూచిన నా మనస్సులో ఆపదయను అరణినుండి పుట్టిన శోకము అగ్ని కట్టెలను వోలె దహించుచున్నది.

బ్రువంత్యా మేవ మార్తాయాం జనన్యాం భరతాగ్రజః,
పాదా వాసాద్య జగ్రాహ వసిష్ఠస్య చ రాఘవః. 27

పూజ్యురాలగు తల్లి యిట్లు పలుకుచుండగనే, భరతుని యన్నయగు రాముడు వసిష్ఠుని సమీపించి యాయనకు పాదాభివందనము చేసెను.

పురోహిత స్యాగ్నిసమస్య వై తదా
బృహస్పతే రింద్ర ఇ వామరాధిపః,

ప్రగృహ్య పాదౌ సుసమృద్ధతేజస
స్సహైవ తే నోపవివేశ రాఘవః. 28

రాము డపుడు బృహస్పతికి దేవరాజగు ఇంద్రుడు వలె తేజముచే అగ్నివలె నలరారు పురోహితుడగు వసిష్ఠుని, పాదము లంటి ప్రణమిల్లి అతనితోడనే కూర్చుండెను.

తతో జఘన్యం సహితైః స్సమంత్రిభిః
పురప్రధానైశ్చ తథైవ సైనికైః,
జనేన ధర్మజ్ఞతమేన ధర్మవా
నుపోపవిష్టో భరత స్తదాఽగ్రజమ్. 29

అంతట ధార్మికుడగు భరతుడు రామవసిష్ఠులు కూర్చుండిన పిమ్మట మంత్రులు, పురప్రధానులు, సైనికులు, పరమ ధార్మికులగు జనులతో గూడి యన్నచెంత గూర్చుండెను.

ఉపోపవిష్ట స్తు తదా స వీర్యవాం
స్తపస్వివేషేణ సమీక్ష్య రాఘవమ్,
శ్రియా జ్వలంతం భరతః కృతాంజలి
ర్యథా మహేంద్రః ప్రయతః ప్రజాపతిమ్. 30

అట్లు పరాక్రమసంపన్నుడగు భరతుడు అన్న చెంతనే కూరుచుండి, తాపసవేషముతో నుండి, మిక్కిలి తేజశ్శాలియై యొప్పు రాముని, చూచి నియమవంతుడగు దేవేంద్రుడు బ్రహ్మకు వోలె ప్రణమిల్లెను.

కి మేష వాక్యం భరతోఽద్య రాఘవం
ప్రణమ్య సత్కృత్య చ సాధు వక్ష్యతి,

ఇతీవ త స్యార్యజనస్య తత్త్వతో
బభూవ కౌతూహల ముత్తమం తదా. 31

భరతు డిపుడు రామునకు ప్రణమిల్లి, సత్కారపూర్వకముగ చక్కగా నేమి చెప్పునో కదా యని వినుటకై అర్యులగు నా ప్రజల కందరికిని మిక్కిలి యుత్తమమగు వేడుక కలిగెను.

స రాఘవ స్సత్యధృతి శ్చ లక్ష్మణో
మహానుభావో భరత శ్చ ధార్మికః,
వృతాః సుహృద్భి శ్చ విరేజు రధ్వరే
యథా సదస్యై స్సహితా స్త్రయోఽగ్నయః. 32

సత్యము ధైర్యముకల రాముడును, మహానుభావుడగు లక్ష్మణుడును, ధార్మికుడగు భరతుడును మిత్రులతో కూడినవారై యాగమున సదస్సులలో కూడిన గార్హపత్యము, అహవనీయము, దక్షిణ మను మూడగ్నులవలె ప్రకాశించిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్ర్యుత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటమూడవ సర్గము సమాప్తము.

---

## చతురుత్తరశతతమః సర్గః - నూటనాల్గవ సర్గము

తం తు రామ స్సమాజ్ఞాయ భ్రాతరం గురువత్సలమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రష్టుం సముపచక్రమే. 1

రాముడు, తాను హస్తగతమైన రాజ్యమును విడచితినని, జటావల్కలములు ధరించితినని, వనవాసినైతినని భరతుడు తనయందు భక్తిమంతు డగుట యెటిగి, తమ్ముడగు లక్ష్మణునితో కూడి యిట్లు ప్రశ్నింపదొడగెను.

కి మేత దిచ్ఛేయ మహం శ్రోతుం ప్రవ్యాహృతం త్వయా,
యస్మా త్త్వ మాగతో దేశ మిమం చీరజటాజినీ. 2

భరతుడా! నీవు చీరములు, జడలు, జింకతోలు ధరించి, రాజ్యము వీడి యీప్రదేశమున కేల వచ్చితివి! నీవు స్వయముగా తెలుపగా వినగోరుచున్నాను.

కిన్నిమిత్త మిమం దేశం కృష్ణాజినజటాధరః,
హిత్వా రాజ్యం ప్రవిష్ట స్త్వం తత్సర్వం వక్తు మర్హసి. 3

నీవేల కృష్ణాజినము. జడలు దాల్చి రాజ్యము వీడి యీ ప్రదేశమునకు వచ్చితివో ఆవిషయ మంతయు తెలుపదగుదువు.

ఇత్యుక్తః కైకయీపుత్త్రః కాకుత్స్థేన మహాత్మనా,
ప్రగృహ్య బలవ ద్భూయః ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్.4

రాము డిట్లు భరతుని గాఢముగ నాలింగనము చేసికొని ప్రశ్నింపగా భరతు డంజలి ఘటించి యన్న కిట్లనెను.

ఆర్యం తాతః పరిత్యజ్య కృత్వా కర్మ సుదుష్కరమ్,
గత స్స్వర్గం మహాబాహుః పుత్త్రశోకాభిపీడితః. 5

మహాభుజుడగు మన తండ్రి మిగుల దుష్కరకృత్యము (జ్యేష్ఠుడు పాలింపదగిన రాజ్యమును స్త్రీనియోగముచే కనిష్ఠున

కిచ్చుట) చేసి, పూజ్యుడవగు నిన్ను విడచి పుత్రశోకపీడితుడై స్వర్గమున కేగెను.

ప్రియో నియుక్తః కైకేయ్యా మమ మాత్రా పరంతప!,
చకార సుమహ త్పాప మిద మాత్మయశోహరమ్. 6

ఓ శత్రువులను పీడించువాడా! అయన నాతల్లి కైకేయిచే ప్రేరితుడై తనకీర్తిని పోగొట్టు (సుపుత్రు నడవికి పంపుట యను) ఈ మహాపాప మాచరించినాడు.

సా రాజ్యఫల మప్రాప్య విధవా శోకకర్శితా,
పతిష్యతి మహాఘోరే నిరయే జననీ మమ. 7

ఇట్లు పాపకృత్యమున తండ్రిని ప్రేరించిన నా తల్లి, తా నాశించిన రాజ్యఫలమును పొందక, విధవయై దుఃఖపీడితయై, అత్యంత దారుణమగు నరకమున పడును.

తస్య మే దాసభూతస్య ప్రసాదం కర్తు మర్హ సి,
అభిషించస్వ చాద్యైవ రాజ్యేన మఘవా నివ. 8

నేను నీ దాసుడను. (కైకేయీ సంబంధముచే నాకును అపవాదు కలిగినది.) నన్ను నీ వనుగ్రహింపవలయును. నీవు దేవేంద్రునివోలె రాజ్యమునం దభిషిక్తుడవు కమ్ము.

ఇమాః ప్రకృతయ స్సర్వా విధవా మాతర శ్చ యాః,
త్వత్సకాశ మనుప్రాప్తాః ప్రసాదం కర్తు మర్హసి. 9

ఈ ప్రజలందరు. మన తల్లులను (ఈ ప్రయోజనము

గోరియే) నీ కడకు వచ్చియున్నారు. నీ వెల్లరిపై ప్రసన్నుడవు కాదగుదువు.

తదానుపూర్వ్యా యుక్తం చ యుక్తం చాత్మని మానద!,
రాజ్యం ప్రాప్నుహి ధర్మేణ సకామా న్సుహృదః కురు. 10

మన వంశగౌరవము కాపాడువాడా! జ్యేష్ఠానుక్రమముగను, నీసామర్థ్యము చేతను గూడ నీ రాజ్యమును నీవు పాలించు టుచితము. కావున ధర్మసమ్మతమగు నీరాజ్యము స్వీకరింపుము. మిత్రుల కోరిక తీర్పుము.

భవ త్వవిధవా భూమి స్సమగ్రా పతినా త్వయా,
శశినా విమలే నేవ శారదీ రజనీ యథా. 11

శరత్కాలపు రాత్రి నిర్మలచంద్రునిచే వలె, పాలకుడవగు నీతో కూడినదై ఈ సమస్తభూమండలము విధవ కాకుండుగాక.

ఏభి శ్చ సచివై స్సార్ధం శిరసా యాచితో మయా,
భ్రాతు శ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి. 12

నే నీ మంత్రులతో కూడి శిరము వంచి నమస్కరించి యాచించుచున్నాను. నీ సోదరుడను, శిష్యుడను, దాసుడను, నన్ననుగ్రహింపదగుదువు.

తదిదం శాశ్వతం పిత్ర్యం సర్వం ప్రకృతిమండలమ్,
పూజితం పురుషవ్యాఘ్ర! నాతిక్రమితు మర్హసి. 13

నీవు నగరమున నుండగా సన్నిహితులు కానివారు, ఇపుడు

నీ చెంతకే వచ్చినవారు, సనాతనమైనవారు,(పరంపరగా వచ్చినవారు) పూజార్హులు అగు మంత్రులు మున్నగు వారిని అతిక్రమింప దగవు.

ఏవ ముక్త్వా మహాబాహు స్సబాష్పః కైకయీసుతః,
రామస్య శిరసా పాదౌ జగ్రాహ విధివ త్పునః. 14

మహాభుజుడగు భరతు డిట్లు పలికి, కన్నీరు గార్చుచు, శిరమువంచి మరల యథావిధిగ రాముని పాదములకు ప్రణమిల్లెను.

తం మత్త మివ మాతంగం నిశ్వసంతం పునః పునః,
భ్రాతరం భరతం రామః పరిష్వ జ్యేద మబ్రవీత్. 15

అట్లు మదించిన యేనుగువలె మాటిమాటికి నిట్టూర్చుచు నిలచిన తమ్ముడగు భరతుని కౌగలించుకొని రాము డిట్లనెను.

కులీన స్సత్త్వసంపన్న స్తేజస్వీ చరితవ్రతః,
రాజ్యహేతోః కథం పాప మాచరే త్త్వద్విధో జనః. 16

ఉత్తమవంశమున బుట్టినవాడు, సాత్త్వికుడు, పరాక్రమశాలి, చక్కని యాచారము కలవాడు అగు నీవంటివా డెట్లు రాజ్యమును కోరి పాప మాచరించును ?

న దోషం త్వయి పశ్యామి సూక్ష్మమ ప్యరిసూదన!,
న చాపి జననీం బాల్యా త్త్వం విగర్హితు మర్హసి. 17

ఓ శత్రునాశకుడా ! నీ యందు దోషము లేశముగనైనా కగపడదు. నీవు నీతల్లి నజ్ఞానముతో నిందింపదగవు.

కామకారో మహాప్రాజ్ఞ! గురూణాం సర్వదాఽనఘ!,
ఉపపన్నేషు దారేషు పుత్త్రేషు చ విధీయతే. 18

ఓ దోషరహితుడవగు మహాబుద్ధిమంతుడా ! పెద్దలకు శిష్యులు, దాసుల విషయమునను, భార్యల విషయమునను, కుమారుల విషయమునను, యథేచ్ఛగా నాచరించుట విహితమే.

వయ మస్య యథా లోకే సంఖ్యాతా స్సౌమ్య! సాధుభిః,
భార్యాః పుత్త్రా శ్చ శిష్యా శ్చ త్వ మనుజ్ఞాతు మర్హసి. 19

లోకమున భార్య మున్నగువా రెట్లు యజమాని చెప్పు చేతలలో నడచువారుగా సజ్జనులచే పరిగణింపబడిరో దశరథున కట్లే నియమింపదగినవార మని యెఱుగుము.

వనే వా చీరవసనం సౌమ్య ! కృష్ణాజినాంబరమ్,
రాజ్యే వాఽపి మహారాజో మాం వాసయితు మీశ్వరః. 20

ఓ సౌమ్యుడా! నారవస్త్రములు, కృష్ణాజినములు దాల్చి నే నడవియందుండునట్లుగాని, లేదా రాజ్యపాలన చేయునట్లు గాని శాసించుటకు మహారాజు సమర్థుడు.

యావ త్పితరి ధర్మజ్ఞే గౌరవం లోకసత్కృతమ్,
తావ ద్ధర్మభృతాం శ్రేష్ఠ! జనన్యా మపి గౌరవమ్. 21

ఓ ధార్మికులలో శ్రేష్ఠుడా ! ధర్మమెఱిగిన తండ్రియందు లోకపూజితమగు గౌరవ మెట్టిదో తల్లియందును అట్టి గౌరవ ముంచవలెను.

ఏతాభ్యాం ధర్మశీలాభ్యాం వనం గచ్ఛేతి రాఘవ!,
మాతాపితృభ్యా ముక్తోఽహం కథ మన్య త్సమాచరే. 22

ఓ భరతుడా! ధార్మికులగు మన తల్లి దండ్రులు 'రామా! నీ వడవి కేగు'మని నన్ను శాసింపగా నే నట్లుగాక వేఱుగ నెట్లాచరింతును ?

త్వయా రాజ్య మయోధ్యాయాం ప్రాప్తవ్యం లోకసత్కృతమ్
వస్తవ్యం దండకారణ్యే మయా వల్కలవాససా. 23

నీ వయోధ్యలో లోక సత్కృతమగు రాజ్యమును స్వీకరింప వలెను నేను నార వస్త్రములు దాల్చి దండకారణ్యమున నివసింపవలెను.

ఏవం కృత్వా మహారాజో విభాగం లోకసన్నిధౌ,
వ్యాదిశ్య చ మహాతేజా దివం దశరథో గతః. 24

ప్రజల సముక్షమున మహాపరాక్రమశాలియగు మహారాజు దశరథుడు మన కిట్టి విభాగము చేసి, అట్లాచరింప నాజ్ఞాపించి స్వర్గమున కేగెను.

స చ ప్రమాణం ధర్మాత్మా రాజా లోకగురు స్తవ,
పిత్రా దత్తం యథాభాగ ముపభోక్తుం త్వ మర్హసి. 25

సకల లోక ప్రధానుడగు ధర్మాత్ముడైన మన తండ్రి మాటయే నీకు ప్రమాణము. నీవు తండ్రి యొసగిన భాగము ననుభవింపదగుదువు.

చతుర్దశ సమా స్సౌమ్య! దండకారణ్య మాశ్రితః,
ఉపభోక్ష్యే త్వహం దత్తం భాగం పిత్రా మహాత్మనా. 26

ఓ సౌమ్యుడా! పదునాలుగేండ్లు దండకారణ్యమున నివసిం
నేను మహాత్ముడగు తండ్రియొసగిన భాగము ననుభవింతును.

యదబ్రవీ న్మాం నరలోకసత్కృతః
పితా మహాత్మా విబుధాధిపోపమః,
త దేవ మన్యే పర మాత్మనో హితం
న సర్వలోకేశ్వరభావ మ ప్యహమ్. 2

సకల జనులకు సత్కరింపదగినవాడు, మహాత్ము
మన తండ్రి నా కేమి చెప్పెనో దానినే నాకు పరమహితము
భావించుచున్నాను. అట్లు కాని సకలలోకాధిపత్యమును నా
హితముగ తలంపను' అని రాముడు భరతునితో పలికెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
చతురుత్తరశతతమః సర్గః

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటనాల్గవసర్గము సమాప్తము.

---

## పంచోత్తరశతతమః సర్గః - నూట యయిదవ సర్గము

తతః పురుషసింహానాం వృతానాం తై స్సుహృద్గణైః,
శోచతా మేవ రజనీ దుఃఖేన వ్యత్యవర్తత

అంత నా పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణ భరతులు మిత్ర
గణ సమేతులై దుఃఖించుచుండగనే ఆరాత్రి గడచిపోయెను.

రజన్యాం సుప్రభాతాయాం భ్రాతర స్తే సుహృద్వృతాః,
మందాకిన్యాం హుతం జప్యం కృత్వా రామ ముపాగమన్.

రాత్రి తెల్లవారగనే ఆ సోదరులు, మిత్రులతో గూడిన వారై, గంగలో స్నానము చేసి, జపహోమాదుల నొనర్చి రాముని కడ కేతెంచిరి.

తూష్ణీం తే సముపాసీనా న కశ్చి త్కించి దబ్రవీత్,
భరత స్తు సుహృన్మధ్యే రామం వచన మబ్రవీత్. 3

వా రందరును మౌనముగ కూర్చుండిరి. ఎవ్వడును ఏమియు పలుకలేదు. అంతట భరతుడు మిత్రుల నడుమ రాముని చూచి యిట్లనెను.

సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ,
తద్దదామి త వైవాహం భుంక్ష్వ రాజ్య మకంటకమ్. 4

నేను యుక్తవచనములతో నా తల్లి నూరడిల్ల జేసితిని. ఆమె యభీష్టరూపముగ ఈ రాజ్యము నా కొసగితివి. దానిని తిరిగి నీకే యొసంగెదను. శత్రురహితమగు నీ రాజ్యము ననుభవింపుము.

మహతే వాంబువేగేన భిన్న స్సేతు ర్జలాగమే,
దురావారం త్వదన్యేన రాజ్యఖండ మిదం మహత్. 5

వర్షాకాలమున నదీవేగముచే తెగిన కట్ట తిరిగి కట్టుట కలవికానటు లీ భరతఖండ మను పెద్దరాజ్యము (కోసలరాజ్యము) నీకు తక్క అన్యుల కదుపులో నుంచ నలవికానిది.

గతిం ఖర ఇ వాశ్వస్య తార్క్ష్య స్యేవ పతత్రిణః,
అనుగంతుం న శక్తి ర్మే గతిం తవ మహీపతే!. 6

ఓ మహీపతీ! గాడిద గుఱ్ఱముతో సమానముగ పరుగెత్త జాలనట్లు, సామాన్య పక్షి గరుడునితో సమానముగ ఎగురలేనట్లు నాకును నిన్ననుసరించుటకు శక్తి చాలదు.

సుజీవం నిత్యశ స్తస్య యః పరై రుపజీవ్యతే,
రామ! తేన తు దుర్జీవం యః పరా నుపజీవతి. 7

రామా! ఎవడు ఎల్లపుడు పరుల జీవనమున కాధారమగునో అతని జీవనము ఉత్తమము. కాని ఎవ డితరులపైననే యాధార పడి బ్రతుకునో అతని బ్రతుకు మాత్రము నికృష్టము.

యథా తు రోపితో వృక్షః పురుషేణ వివర్ధితః,
హ్రస్వకేణ దురారోహో రూఢస్కంధో మహాద్రుమః. 8
న యదా పుష్పితో భూత్వా ఫలాని న విదర్శయేత్,
సతాం నానుభవే త్ప్రీతిం యస్య హేతోః ప్రరోపితః. 9
ఏషోపమా మహాబాహో! త మర్థం వేత్తు మర్హసి,
యది త్వ మస్మా న్వృషభో భర్తా భృత్యా న్న శాధి హి. 10

మహాభుజుడ వగు రామా! ఒకానొక పురుషుడు విత్తునాటి మొక్కను పెంచినాడు. అది పొట్టివానికి ఎక్కరాని రీతిగా పెరిగి పెద్దకాండము గలిగి మహావృక్ష మైనది. అది పుష్పించి, ఫలించనిచో—దానిని నాటి నందులకు ప్రయోజనము కలుగలేదు కాన సజ్జనులకు ఫలవిషయకమగు ప్రీతిని కలిగింపదు. మాకు నీవు ప్రభుపవు. మేము నీ భృత్యులము. నీవు మమ్ము

శాసింపనిచో పైన పేర్కొనినది ఉపమ యగును. నీ వీ విషయ మెఱుగదగును.

ఇచ్చట విత్తునాటిన వానికి దశరథ మహారాజు, పెంచబడిన మహావృక్షమునకు రాముడు, పుష్పదర్శనమునకు అభిషేకమున కున్ముఖత, ఫలాననుభవమునకు రాజ్యమును పాలింపకుండు టయు ఉపమేయములు.

శ్రేణయ స్త్వాం మహారాజ! పశ్య న్త్వగ్ర్యాశ్చ సర్వశః,
ప్రతపంత మి వాదిత్యం రాజ్యే స్థిత మరిందమమ్. 11

ఓ మహారాజా! ప్రజాసముదాయములు, ప్రధానవ్యక్తులును దీప్తితో వెలుగొందు సూర్యునివలె, శత్రువుల నడంచి రాజ్యపాలన మొనర్చుచుండగా నిన్ను చూతురుగాక!

త వానుయానే కాకుత్స్థ! మత్తా నర్దన్తు కుంజరాః,
అన్తఃపురగతా నార్యో నందంతు సుసమాహితాః. 12

ఓ కాకుత్స్థుడా! పట్టాభిషిక్తుడవగు నీవు పట్టపుటేనుగు నెక్కి ఉత్సవమున పాల్గొనగా తక్కిన మదించిన ఏనుగు లుత్సాహముతో నిన్ననుసరించుచు క్రీడించుగాక! అంతఃపురకాంతలును నీకథలనే యేమఱుపాటులేక చెప్పుకొనుచు నానందింతురు గాక!

తస్య సాధ్వి త్యమన్యంత నాగరా వివిధా జనాః,
భరతస్య వచ శ్శ్రుత్వా రామం ప్రత్యనుయాచతః 13

అట్లు రాముని యాచించుచున్న భరతుని వాక్యములు విని, అయోధ్యానగరవాసులగు జను లెల్లరు బాగు బాగని మెచ్చుకొనిరి.

తమేవం దుఃఖితం ప్రేక్ష్య విలపంతం యశస్వినమ్,
రామః కృతాత్మా భరతం సమాశ్వాసయ దాత్మవాన్. 14

అన్న తన ప్రార్థన నంగీకరింపకుండుటచే దుఃఖించిన వాడును, నా వలనకదా మా యన్న యడవి కేగుట, తండ్రి మరణించుట సంభవించెనని ప్రలాపము చేయుచున్నవాడును, కీర్తిశాలియు అగు భరతుని ధీరుడు, సుశిక్షితమగు బుద్ధి కలవాడగు రాము డోదార్చుచు నిట్లనెను.

నాఽఽత్మనః కామకారోఽస్తి పురుషోఽయ మనీశ్వరః,
ఇత శ్చేతరత శ్చైనం కృతాంతః పరికర్షతి. 15

తమ్ముడా! పురుషుడు అస్వతంత్రు డగుటచే నతనికి స్వేచ్ఛగా ప్రవర్తింప వలనుపడదు. స్వతంత్ర మగు దైవమే ఈ దేశము నుండి దేశాంతరమునకు నరుని లాగికొనిపోవును.

సర్వే క్షయాంతా నిచయాః పతనాంతా స్సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాంతా మరణాంతం చ జీవితమ్. 16

బహుముఖముగ సంపాదించిన ధనము లన్నియు తుదకు క్షీణించును. (చోరులో, రాజులో హరింతురు. లేదా తానే స్వేచ్ఛగా వ్యయము చేయును.) అత్యున్నత పదవులు తుదకు పతనమైపోవును. (బ్రహ్మేంద్రాదులును తమ తమ యధికారము ముగియగనే పదవిభ్రష్టులు కాక తప్పదు) సంయోగములు (పుత్రమిత్ర కళత్రాదులతోడి సంబంధము లెడబాయుటతో ముగియును. గొప్ప బ్రతుకును, చావుతో పర్యవసానము నందును. (పితృమరణ శోకముతో భరతు డిట్లను చున్నాడని ఆ శోకమును

పోగొట్టుచున్నాడు రాముడు. ఈ శ్లోకమున మొదటి మూడు పాదములలో దృష్టాంతములు చెప్పబడినవి. నాల్గవ పాదమున దార్ష్టాంతికము(దశరథమరణము) సూచితమైనది. పరిహరింపరాక కాలకృతమైన పితృమరణమునకు వగవవలదని భావము.

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనా ద్భయమ్,
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణా ద్భయమ్. 17

చెట్టున బాగుగ పండిన పండ్లకు పతనము వలన తక్క వేఱొండు భయము లేదు. అట్లే పుట్టిన ప్రతివానికి చావును మించిన భయము వేఱొకటి లేదు.

యథాఽగారం దృఢస్థూణం జీర్ణం భూత్వాఽవసీదతి,
తథైవ సీదన్తి నరా జరామృత్యువశంగతాః. 18

గట్టిస్తంభములతో నిర్మితమైన ఇల్లు పాతబడి కూలిపోవునట్లే నరులును ముసలివారై, మృత్యువువాత బడుదురు.

అత్యేతి రజనీ యాతు సా న ప్రతినివర్తతే,
యా త్యేవ యమునా పూర్ణా సముద్ర ముదకాకులమ్.19

గడచిపోయిన రాత్రి మఱలిరాదు. జలసంకులమైన సముద్రమును చేరుకొనుచు పొంగి పొరలు యమున మఱల్పరానిది.

అహోరాత్రాణి గచ్ఛన్తి సర్వేషాం ప్రాణినా మిహ,
ఆయూంషి క్షపయంత్యాశు గ్రీష్మే జలమి వాంశవః. 20

ఈ లోకమున సకల ప్రాణులకును రాత్రింబవళ్లు గడచు

చునే యుండును. అవి వేసవియందు సూర్య కిరణములు నీ
వోలె జీవుల యాయువును శీఘ్రముగనే క్షీణింపజేయును.

అత్మాన మనుశోచ త్వం కి మన్య మనుశోచసి,
అయు స్తే హీయతే యస్య స్థితస్య చ గతస్య చ.

నీవు నిన్ను గూర్చియే చింతింపుము. పరులనుగూర్చి (
దురపిల్లెదవు? ఏలయన నీ వొకచోట నిలచినను, తిరుగుచు(
నీయాయువు తఱిగిపోవుచునే యుండును.(కావున పరలోకవ
గూర్చి చింతింపుము )

సహైవ మృత్యు ర్వ్రజతి సహ మృత్యు ర్నిషీదతి,
గత్వా సుదీర్ఘ మధ్వానం సహ మృత్యు ర్నివర్తతే.

మృత్యువు మనుజుడు నడచుచో నతనితో కలసి నడచ
అతడు కూర్చుండిన అదియు కూర్చొనును. చాలా దూ
పోయి, వచ్చినను మృత్యు వతనితోడనే పోయి వచ్చును. (క
చావును తప్పించుకొనుట సాధ్యముకాదని భావము.)

గాత్రేషు వళయః ప్రాప్తా శ్శ్వేతా శ్చైవ శిరోరుహాః,
జరయా పురుషో జీర్ణః కిం హి కృత్వా ప్రభావయేత్.

శరీరము ముసలితనము పైబడుటచే ముడుతలు పడ
జుట్టు తెల్లబడును, మనుజుని జవసత్త్వము లుడుగును. ఏం
య మవలంబించి నరుడు తన్ను వీనినుండి తప్పింప
సమర్థు డగును?

నందం త్యుదిత అదిత్యే నందం త్యస్తమితే రవౌ,
అత్మనో నావబుధ్యంతే మనుష్యా జీవితక్షయమ్.

మనుజులు సూర్యు డుదయింపగనే ధనార్జనమునకు సమయ మాయె నని యానందింతురు. సూర్యాస్తమయమును జూచియు కామోపభోగములకు తగు సమయము వచ్చెనని సంతోషింతురు. కాని సూర్యుని ఉదయాస్తమయములు తమ జీవితమును క్షయము చేయుచున్నవని తెలిసికొనకున్నారు. (చిల్లికుండలో నింపిన నీరు వలె తమ అయువు క్రమముగా క్షీణించుటను కానకున్నారు.)

హృష్యం త్యృతుముఖం దృష్ట్వా నవం నవ మి హాగతమ్,
ఋతూనాం పరివర్తేన ప్రాణినాం ప్రాణసంక్షయః. 25

క్రొంగ్రొత్తగా నవతరించు ఋతువులను చూచి, ఆయా ఋతువులలో క్రొంగ్రొత్త యనుభవముల నందుచు ఆనందింతురు. కాని ఆ ఋతువులే మాఱుచు జీవుల ప్రాణములు హరించును.

యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే,
సమేత్య చ వ్యపేయాతాం కాల మాసాద్య కంచన. 26

ఏవం భార్యా శ్చ పుత్త్రా శ్చ జ్ఞాతయ శ్చ వసూని చ,
సమేత్య వ్యవధావంతి ధ్రువో హ్యేషాం వినాభవః. 27

ఒక మహాసముద్రమున రెండు కొయ్యలు ఒకచో కలసికొని మరల వేఱొక్క సమయమున విడిపోయినట్లు భార్యలు, తనయులు జ్ఞాతులు, ధనములు ఒకప్పుడు లభించి, వేఱొక సమయమున తొలగిపోవును. వానిలో వియోగము తప్పనిసరి.

నాత్ర కశ్చి ద్యథాభావం ప్రాణీ సమభివర్తతే,
తేన తస్మి న్న సామర్థ్యం ప్రేతస్యా స్త్యనుశోచతః. 28

లోకమున నే జీవియు తన యిష్టానుసారము బంధువులతో కలసి యుండజాలదు. ఆ కారణముచే మరణించువానికొరకై దుఃఖించువా డతని మరణమును నివారింప సమర్థుడుకాడు.

(బ్రహ్మాది స్తంబ పర్యంతమగు నీ బద్ధలోకమున నెవ్వడును తన యభిలాష కొలది,(తన సంకల్పమున కెదురు లేక) ప్రవర్తింప జాలడు. బ్రహ్మాదుల ఆయుఃప్రమాణము మనుజులు మున్నగు జీవుల కంటె చాల అధికము. అట్టిబ్రహ్మాదులకే తుదకు మరణము తప్పదు. చచ్చిన వానికై దుఃఖించువాడు వానిని చావునుండి తప్పించ లేడు. కాన బ్రహ్మాదులకును తప్పని శోకము వీడి, సర్వానర్థములు తొలగుకొఱకు ప్రయత్నింపుడని భావము.)

యథా హి సార్థం గచ్ఛన్తం బ్రూయా త్కశ్చి త్పథి స్థితః,
అహ మ ప్యాగమిష్యామి పృష్ఠతో భవతా మితి 29

ఏవం పూర్వై ర్గతో మార్గః పితృపైతామహో ధ్రువః,
త మాపన్నః కథం శోచే ద్యస్య నాస్తి వ్యతిక్రమః. 30

బాటసారులు కొందరు మార్గమున పోవుచుండగా వేఱొకడు మార్గమున నిలిచి నేనును మీవెంట వత్తునని పలికి వారి ననుసరించునో యట్లే (మన పూర్వులు తాత ముత్తాతల మార్గము ననుసరించినట్లు, మనమును పూర్వుల మార్గ మనుసరింపక తప్పదు. అది యెఱిగినవా డేల దుఃఖించును?

వయసః పతమానస్య స్రోతసో వాఽనివర్తినః,
ఆత్మా సుఖే నియోక్తవ్య స్సుఖభాజః ప్రజాః స్మృతాః. 31

కావున వెనుకకు రాని నదివలె. వయస్సు వెనుకకు రాక ముందుకు పోవుచుండగా, ప్రతియొక్కడు పరలోకహితము దలంచుచు తన్ను సుఖహేతువగు ధర్మమున నియమించుకొనవలయును. ఏలయన ప్రజలు ధర్మసాధ్యమగు సుఖమందాసక్తిగలవారని చెప్పుదురు.

ధర్మాత్మా స శుభైః కృత్స్నైః క్రతుభి శ్చాప్తదక్షిణైః,
ధూతపాపో గత స్స్వర్గం పితా నః పృథిపీపతిః. 32

ధర్మాత్ముడు, మన తండ్రి యగు మహారాజు శుభకరములగు క్రతువు లన్నియు నిర్వహించి, ఋత్విజులకు భూరిదక్షిణలనొసగి, పాపములు తొలగినవాడై స్వర్గమున కేగినాడు. (కావున ఆయన విషయమున లేశముగ నైన శోకింప బనిలేదు.

భృత్యానాం భరణా త్సమ్య క్ప్రజానాం పరిపాలనాత్,
అర్థాదానా చ్చ ధర్మేణ పితా న స్త్రిదివం గతః. 33

సేవకులను పోషించుటవలనను, ప్రజలను చక్కగా కాపాడుట వలనను, ధర్మము తప్పక పన్ను మున్నగు రూపమున ధనము గ్రహించుట వలనను మన తండ్రి స్వర్గమున కేగెను.

కర్మభి స్తు శుభై రిష్టైః క్రతుభి శ్చాప్తదక్షిణైః,
స్వర్గం దశరథః ప్రాప్తః పితా నః పృథిపీపతిః. 34

ప్రజలకు తనకును శుభము కూర్చునవి, అభిమతములైనవియు అగు చెఱువులు త్రవ్వించుట మున్నగు పనులచేతను దక్షిణలు సమృద్ధిగా నొసగి చేసిన యాగములచేతను మన తండ్రియగు దశరథమహారాజు స్వర్గతుడైనాడు.

ఇష్ట్వా బహువిధై ర్యజ్ఞై ర్భోగాం శ్చావాప్య పుష్కలాన్,
ఉత్తమం చాయు రాసాద్య స్వర్గతః పృథివీపతిః. 35

పలు యాగములు చేసి, సమృద్ధిగ భోగముల ననుభవించి, చిరకాలము జీవించి మన తండ్రి యగు మహారాజు స్వర్గతు డైనాడు.

అయు రుత్తమ మాసాద్య భోగా నపి చ రాఘవః,
స న శోచ్యః పితా తాత! స్వర్గత స్సత్కృత స్సతామ్. 36

మన తండ్రి చిరకాలము జీవించి, సకల రాజభోగము లనుభవించి, స్వర్గమున కేగినాడు. సత్పురుషులచే నాదరింపబడిన ఆ మహారాజుకొఱకై శోకింపదగదు.

న జీర్ణం మానుషం దేహం పరిత్యజ్య పితా హి నః,
దైవీ మృద్ధి మనుప్రాప్తో బ్రహ్మలోకవిహారిణీమ్. 37

మన తండ్రి జీర్ణమైన మానవశరీరమును వీడి, బ్రహ్మలోకమున విహరింపజాలిన దివ్యదేహాదిసంపద నందినాడు.

తం తు నైవంవిధః కశ్చి త్ప్రాజ్ఞ శ్శోచితు మర్హతి,
తద్విధో యద్విధ శ్చాసి శ్రుతవా న్బుద్ధిమత్తరః. 38

నీవు శాస్త్రవిదుడవు, మిగుల బుద్ధిమంతుడవు. నీవంటివాడు అట్టి తండ్రిని గూర్చి దుఃఖింపదగదు.

ఏతే బహువిధా శ్శోకా విలాపరుదితే తథా,
వర్జనీయా హి ధీరేణ సర్వావస్థాసు ధీమతా. 39

దశరథ మహారాజు మరణించుట, నే నడవికి పోవుట మున్నగు పలుహేతువులచే కలుగు దుఃఖము, ప్రలాపము, కన్నీరు కార్చుటలును బుద్ధిమంతుడగువాడు సర్వావస్థలందును విడిచిపెట్టవలయును.

స స్వస్థో భవ మా శోచే ర్యాత్వా చావస తాం పురీమ్,
తథా పిత్రా నియుక్తోఽసి వశినా వదతాం వర। 40

చక్కగ మాటలాడు వారలలో శ్రేష్ఠుడవగు భరతుడా! నీ వింక యూరడిల్లుము. శోకింపకుము. ఇటనుండి వెడలి యయోధ్యకు పొమ్ము. జితేంద్రియుడగు తండ్రి నిన్న ట్లాజ్ఞాపించెను.

యత్రాహ మపి తే నైవ నియుక్తః పుణ్యకర్మణా,
తత్రై వాహం కరిష్యామి పితు రార్యస్య శాసనమ్. 41

పవిత్రములగు యజ్ఞాదికార్యముల ననుష్ఠించిన మన తండ్రి నన్నే వనవాసము చేయ నియమించెను. ఆతండ్రి శాసనము నట్లే యాచరింతును.

న మయా శాసనం తస్య త్యక్తుం న్యాయ్య మరిందమ!,
తత్త్వయాఽపి సదా మాన్యం స వై బంధు స్స నః పితా.

ఓ శత్రువుల నణచువాడా! నే నాయన యాజ్ఞ నాచరింపక విడచుట తగదు. నీకును అయన యాదేశము గౌరవింప దగినది. అయన మనకు బంధువు. మన తండ్రి.

తద్వచః పితు రేవాహం సమ్మతం ధర్మచారిణః,
కర్మణా పాలయిష్యామి వనవాసేన రాఘవ ! 43

రాఘవుడ వగు భరతుడా! ధార్మికుడగు మన తం
సమ్మతమగు ఆయన వాక్యమును అరణ్యమున నివసిం
యను ఆచరణముచే పాటించగోరుచున్నాను.

ధార్మికే ణానృశంసేన నరేణ గురువర్తినా,
భవితవ్యం నరవ్యాఘ్ర! పరలోకం జిగీషతా.

ఓ నరశ్రేష్ఠుడా! పరలోకసుఖము కోరువాడు ధర్మ
తప్పక, క్రౌర్యము లేక, పెద్దల ననుసరించవలయును.

ఆత్మాన మనుతిష్ఠ త్వం స్వభావేన నరర్షభ!,
నిశామ్యతు శుభం వృత్తం పితు ర్దశరథస్య నః.

ఓ పురుష శ్రేష్ఠుడా! మన తండ్రి యగు దశరథుని
చారమును దృష్టిలో నుంచుకొని నిన్ను నీవురాజుగా చేసికొ

ఇత్యేవ ముక్త్వా వచనం మహాత్మా
పితు ర్నిదేశప్రతిపాలనార్థమ్,
యవీయసం భ్రాతర మర్థవ చ్చ
ప్రభు ర్ముహూర్తా ద్విరరామ రామః.

ఈ విధముగ మహాత్ముడును, సమర్థుడును అగు రామ
తండ్రి యాజ్ఞ పాలించుమని సప్రయోజనముగ మాటల
యూరకుండెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచోత్తరశతతమ స్సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణము
దయోధ్యాకాండమున నూటయైదవ సర్గము సంపూర్ణము.

# షడుత్తరశతతమః సర్గః - నూటయాఱవ సర్గము

ఏవ ముక్త్వా తు విరతే రామే వచన మర్థవత్,
తతో మందాకినీతీరే రామం ప్రకృతివత్సలమ్, 1
ఉవాచ భరత శ్చిత్రం ధార్మికో ధార్మికం వచః.

రాము డిట్లు అర్థవంతముగా పలికి విరమించగా, నపుడా గంగయొడ్డున సహజ వాత్సల్యము కలవాడగు రామునితో ధార్మికుడగు భరతు డిట్లు చిత్రముగ ధార్మికమగు మాటలాడెను.

కో హి స్యా దీదృశో లోకే యాదృశ స్త్వ మరిందమ. 2
న త్వాం ప్రవ్యథయే ద్దుఃఖం ప్రీతి ర్వా న ప్రహర్షయేత్,

ఓ శత్రువుల నణచు నట్టివాడా! నీవు దుఃఖింపవలసివచ్చి నను భాధపడుటలేదు. సంతోషింపదగిన దానికి సంతోషించుటయు లేదు. నీ వంటివాడు ఎవ్వడీ లోకమున నుండును?

సమ్మత శ్చాసి వృద్ధానాం తాంశ్చ పృచ్ఛసి సంశయాన్. 3

పెద్దలు నిన్ను సర్వజ్ఞుడ వని యాదరింతురు. అట్లయ్యును నీవు వారిని సంశయముల నడిగెదవు.

యథా మృత స్తథా జీవ న్యథా సతి తథాఽ సతి,
య స్యైష బుద్ధిలాభ స్స్యా త్పరితప్యేత కేన సః. 4

మరణించిన వానిని ద్వేషింపనట్లే జీవించిన వానిని ద్వేషింపకుండుట, లేని వస్తువుపై రాగము లేనట్లే ఉన్నవస్తువుపై

గూడ రాగము లేకుండుట అను బుద్ధికలవాడు దేనికి బాధపడును?

పరావరజ్ఞో యశ్చ స్యా త్తథా త్వం మనుజాధిప।,
స ఏవం వ్యసనం ప్రాప్య న విషీదితు మర్హతి. 5

త్రికాలజ్ఞుడు (లేదా ఆత్మానాత్మజ్ఞుడు లేదా పరమాత్మ జీవాత్మల స్వరూప మెరిగినవాడు) ఆపదలుపొందియుబాధపడడు. నీవును అట్లే దుఃఖింపవు (అట్లయ్యును నీవురాజ్యమును పోగొట్టు కొనుట, వనవాసము చేయుట అను అపదను పొందుటను, నీ యెడబాటును నేనెట్లు సహింతునని భావము)

అమరోపమసత్త్వ స్త్వం మహాత్మా సత్యసంగరః,
సర్వజ్ఞ స్సర్వదర్శీ చ బుద్ధిమాం శ్చాసి రాఘవ।. 6

ఓ రాఘవుడా! దేవతలకు సాటి యగువాడా! సత్త్వగుణ సంపన్నుడవు (లేదా నిన్నాశ్రయించినవారికి సత్త్వగుణకార్యమగు తత్త్వజ్ఞానము కలిగించువాడవు) గొప్పధైర్యము కలవాడవు. సర్వమెరిగిన వాడవు. సమస్తము చూడగలవాడవు. ప్రశస్తమగు బుద్ధికలవాడవు.

న త్వా మేవంగుణై ర్యుక్తం ప్రభవాభవకోవిదమ్,
అవిషహ్యతమం దుఃఖ మాసాదయితు మర్హతి. 7

ఇట్టి గొప్ప గుణములు కలవాడవు, జీవుల యుత్పత్తి, వినాశముల నెఱిగినవాడవు అగు నిన్ను మావంటివారికి సహింపరాని (రాజ్యభ్రంశ వనవాసాదుల వలనకలుగు) దుఃఖము ఎదుర్కొనలేదు.

ప్రోషితే మయి యత్పాపం మాత్రా మత్కారణాత్కృతమ్,
క్షుద్రయా తదనిష్టం మే ప్రసీదతు భవా న్మమ. 8

నేను దేశాంతరమందుండగా నాకొఱకై నీచురాలగు నా తల్లి గేసేపాప మొనర్చెనో నా కది ఇష్టము కాదు. నీవు నాకు ప్రసన్నుడవు కమ్ము.

ధర్మబన్ధేన బద్ధోఽస్మి తే నేమాం నేహ మాతరమ్,
హన్మి తీవ్రేణ దండేన దండార్హాం పాపకారిణీమ్. 9

నేను ధర్మ మను త్రాటితో కట్టబడితిని. కావుననే పాప కృత్యము చేయుటచే దండనమునకు తగినదైనను నా తల్లిని తీవ్ర దండనముతో చంపనైతిని.

కథం దశరథా జ్జాత శ్శుద్ధాభిజనకర్మణః,
జానన్ ధర్మ మధర్మిష్ఠం కుర్యాం కర్మ జుగుప్సితమ్. 10

పరిశుద్ధమగు వంశమున పుట్టినవాడు, శ్లాఘ్యములగు సత్కర్మల నాచరించినవాడగు దశరథునకు పుట్టినవాడనై, ధర్మము నెఱిగి, ఎల్లరును అసహ్యపడునట్టి యధర్మకార్య మెట్లుచేయుదును?

గురుః క్రియావా న్వృద్ధశ్చ రాజా ప్రేతః పితేతి చ,
తాతం న పరిగర్హేయం దైవతం చేతి సంసది. 11

గొప్పవాడు, యజ్ఞాది సత్కర్మ లాచరించినవాడు, ముదుసలి మన రాజు, మృతుడు అన్నిటిని మించి కన్నతండ్రి, దైవసమానుడని మనతండ్రిని సభలో నిందింపను.

కో హి ధర్మార్థయో ర్హీన మీదృశం కర్మ కిల్బిషమ్,
స్త్రియాః ప్రియం చికీర్షుస్స న్కుర్యాద్ధర్మజ్ఞ! ధర్మవిత్. 12

ఓ ధర్మమెఱిగినవాడా! ధర్మజ్ఞుడగు ఎవడు ఒక స్త్రీకి ప్రీతి కలిగించవలెనని ధర్మార్థహీన (కామ ప్రధాన) మగు నిట్టి పాపకృత్య మొనర్చును?

అంతకాలే హి భూతాని ముహ్యంతీతి పురా శ్రుతిః,
రాజ్ఞైవం కుర్వతా లోకే ప్రత్యక్షం సా శ్రుతిః కృతా. 13

మరణసమయమున విరుద్ధమగు బుద్ధి కలుగును (వినాశ కాలే విపరీతబుద్ధిః) అన్ని వెనుక చెప్పగా విందుము. రాజిట్లు చేసి యామాటను ప్రత్యక్షము చేసినాడు.

సాధ్వర్థ మభిసంధాయ క్రోధా న్మోహాచ్చ సాహసాత్,
తాతస్య యదతిక్రాంతం ప్రత్యాహరతు తద్భవాన్. 14

కైక యొక్క కోపకారణముగ (నీవు రాము నడవికి పంపనిచో నే నిపుడే విషము త్రాగుదు నని కైకకోపము) కైకేయీవిషయకమగు మోహమువలన, ఆలోచన లేక చేసిన సాహసమువలన తండ్రి చేసిన ధర్మాతిక్రమణమును చక్కబరచి మఱల్చుము.

పితుర్హి సమతిక్రాంతం పుత్రో య స్సాధు మన్యతే,
త దపత్యం మతం లోకే విపరీత మతోఽన్యథా. 15

తండ్రి చేసిన ధర్మాతిక్రమము నే తనయుడు సరిచేయ దలంచునో అతడే (తండ్రిని పతనమునుండి యుద్ధరించుటచే) అపత్య మని యందురు. అట్లు సరిచేయ నిచ్ఛగింపనివాడు తనయుడే కాదు.

తదపత్యం భవా నస్తు మా భవాన్ దుష్కృతం పితుః,
అభిపత్తా కృతం కర్మ లోకే ధీరవిగర్హితమ్. 16

కావున నీవు తండ్రి యాచరణమును సరిచేసి యతని యపత్యము కమ్ము. ఆయన చేసినట్టి దుష్టము, బుద్ధిమంతులచే నిందితమగు పనివల్ల కలిగిన పాపమును నీవు పొందకుము.

కైకేయీం మాం చ తాతం చ సుహృదో బాంధవాంశ్చనః,
పౌరజానపదా న్సర్వాం స్త్రాతు సర్వమిదం భవాన్. 17

నా తల్లి కైకను, నన్ను, తండ్రిని, మన మిత్రులను, బంధువులను, పౌరులను, గ్రామములందలి జనులను అందఱను కాపాడుము.

క్వ చారణ్యం క్వ చ క్షాత్రం క్వ జటాః క్వ చ పాలనమ్,
ఈదృశం వ్యాహతం కర్మ న భవా న్కర్తు మర్హతి. 18

అడవి యెడ? క్షత్రియధర్మ మేడ? జడలు దాల్చు టెక్కడ? పుడమి గాచు టెక్కడ? ఇట్టి విపరీత కృత్యము నీవు చేయదగవు.

ఏష హి ప్రథమో ధర్మః క్షత్రియ స్యాభిషేచనమ్,
యేన శక్యం మహాప్రాజ్ఞ! ప్రజానాం పరిపాలనమ్. 19

ఓ మహాబుద్ధిశాలీ! క్షత్రియునకు పట్టాభిషేకమే మొదటి ధర్మము. దానిచేతనే ప్రజాపాలనము సాధ్యము.

కశ్చ ప్రత్యక్ష ముత్సృజ్య సంశయస్థ మలక్షణమ్,
ఆయతిస్థం చరే ద్ధర్మం క్షత్రబంధు రనిశ్చితమ్. 20

ఏ క్షత్రియుడు దృశ్యమానమగు త్యాగభోగములతో కూడినది, పరలోకమున శ్రేయస్సాధనమైనదగు ప్రజాపాలన రూప ధర్మమును విడచి, కనుపించనిది, లక్షణ రహితమైనది, కాలాంతరముననే ఫలించునది, క్షత్రియుడు మొదట దీని ననుష్ఠింపవలెనని యే ప్రమాణముచేతను నిశ్చితము కానిదగు తాపసధర్మము నాచరించును ?

అథ క్లేశజ మేవ త్వం ధర్మం చరితు మిచ్ఛసి,
ధర్మేణ చతురో వర్ణా న్పాలయన్ క్లేశ మాప్నుహి. 21

అట్లుకాక క్లేశమువల్ల కలుగు ధర్మమునే నీవు సేవింప నెంతువేని ధర్మముగా నాల్గువర్ణముల వారిని పాలించుచు క్లేశము ననుభవింపుము.

చతుర్ణా మాశ్రమాణాం హి గార్హస్థ్యం శ్రేష్ఠ మాశ్రమమ్,
ప్రాహు ర్ధర్మజ్ఞ! ధర్మజ్ఞా స్తం కథం త్యక్తు మర్హసి. 22

ఓ ధర్మ మెఱిగినవాడా! ధర్మజ్ఞులు నాలు గాశ్రమములలో గృహస్థాశ్రమమునే శ్రేష్ఠమని యందురు. నీ వా యాశ్రమము నెట్లు విడువనగును ?

శ్రుతేన బాలః స్థానేన జన్మనా భవతో హ్యహమ్,
స కథం పాలయిష్యామి భూమిం భవతి తిష్ఠతి. 23

విద్యచే, ప్రాప్తి క్రమముచే, వయస్సుచే గూడ నేను పిన్నవాడను. అట్టి నేను నీవుండగా భూమి నెట్లు పాలింతును ?

హీనబుద్ధిగుణో బాలో హీనః స్థానేన చాప్యహమ్,
భవతా చ వినాభూతో న వర్తయితు ముత్సహే. 24

సద్గుణ బుద్ధి లేనివాడను, పిన్నను, పదప్రాప్తిక్రమముచే గూడ పిన్ననగు నేను. నీవు లేక యూరకనే యుండుటకైన నుత్సహింపను.

ఇదం నిఖిల మవ్యగ్రం రాజ్యం పిత్ర్య మకంటకమ్,
అనుశాధి స్వధర్మేణ ధర్మజ్ఞ! సహ బాంధవైః. 25

ఓ ధర్మ మెఱిగినవాడా! ఏ క్లేశములు లేనిది, శత్రురహితమైనది, తండ్రి నుండి సంక్రమించినదగు ఈ సకలరాజ్యమును నీ బంధువులతోకూడి స్వధర్మము ననుసరించి పాలింపుము.

ఇహైవ త్వాఽభిషించంతు సర్వాః ప్రకృతయ స్సహ,
ఋత్విజ స్సవసిష్ఠాశ్చ మంత్రవిన్మంత్రకోవిదాః. 26

వసిష్ఠునితో, ఋత్విజులతో, కూడిన మంత్రకోవిదులగు ప్రజలెల్లరు సమంత్రకముగ నిన్నిచటనే కోసలరాజ్యమునం దభిషేకింతురుగాక.

అభిషిక్త స్త్వ మస్మాభి రయోధ్యాం పాలనే వ్రజ,
విజిత్య తరసా లోకా న్మరుద్భి రివ వాసవః. 27

దేవతలచే దేవేంద్రునివలె మాచే నభిషిక్తుడవై, లోకములను శీఘ్రమే జయించి అయోధ్యను పాలింప నేగుము.

ఋణాని త్రీ ణ్యపాకుర్వ న్సుహృద స్సాధు నిర్దహన్,
సుహృద స్తర్పయ న్కామై స్త్వమే వాత్రానుశాధి మామ్. 28

దేవ-ఋషి-పితృ-ఋణములు మూటిని తీర్చుకొనుచు, శత్రువులను లెస్సగా నిర్జించి, మిత్రుల కోరికలు తీర్చి తృప్తి నందించి నీవే నన్నిచట నాజ్ఞాపించుము.

అ ద్యార్య! ముదితా స్సంతు సుహృద స్తేఽభిషేచనే,
అద్య భీతాః పలాయంతాం దుర్హృద స్తే దిశో దశ. 29

ఆర్యుడవగు రామా! నీ మిత్రు లభిషేకవార్త నెఱిగి సంత సింతురుగాక. నీశత్రువు లీ వార్తకు భీతిల్లి నలుదిక్కుల పారి పోవుదురుగాక.

ఆక్రోశం మమ మాతుశ్చ ప్రమృజ్య పురుషర్షభ!,
అద్య తత్ర భవంతం చ పితరం రక్ష కిల్బిషాత్. 30

పురుషశ్రేష్ఠుడవగు రామా! నాతల్లికి జనులవలన కలిగిన నిందను పోగొట్టి, పూజ్యుడగు తండ్రిని పాపమునుండి కాపాడుము.

శిరసా త్వాఽభియాచేఽహం కురుష్వ కరుణాం మయి,
బాంధవేషు చ సర్వేషు భూతేష్వివ మహేశ్వరః. 31

శిరోనమన పూర్వకముగ నిన్ను ప్రార్థింతును. నాయందును, సకలబంధుజనుల యెడను, ప్రాణులపై పరమేశునివలె దయజూపుము.

అథైత త్పృష్ఠతః కృత్వా వనమేవ భవా నితః,
గమిష్యతి గమిష్యామి భవతా సార్ధ మప్యహమ్. 32

నా యీ ప్రార్థనను త్రోసిరాజని నీ విటనుండి యడవికే పోవుచో నేనును నీతోడనే వత్తును.

తథాహి రామో భరతేన తామ్యతా
ప్రసాద్యమాన శ్శిరసా మహీపతిః,

న చైవ చక్రే గమనాయ సత్త్వవా
న్మతిం పితు స్తద్వచనే ప్రతిష్ఠితః. 33

రాము డట్లు దుఃఖితుడైన భరతునిచే శిరః ప్రణామ పూర్వకముగ ప్రార్థింపబడియు, తండ్రిమాటపై నిలచినవాడై అయోధ్యకు పోవ నిచ్చగింపలేదు.

తదద్భుతం స్థైర్య మవేక్ష్య రాఘవే
సమం జనో హర్ష మవాప దుఃఖితః,
న యా త్యయోధ్యా మితి దుఃఖితోఽభవత్
స్థిరప్రతిజ్ఞత్వ మవేక్ష్య హర్షితః. 34

రామునిలో ఆశ్చర్యముగొల్పు స్థిరబుద్ధిని గాంచి జనులొకేమారు దుఃఖమును, హర్షమును కూడ పొందిరి. వారు రాముడయోధ్యకు రానవెనని దుఃఖించిరి. అతని స్థిరప్రతిజ్ఞకు సంతోషించిరి.

త మృత్విజో నైగమయూథవల్లభా
స్తదా విసంజ్ఞాశ్రుకలాశ్చ మాతరః,
తథా బ్రువాణం భరతం ప్రతుష్టువుః
ప్రణమ్య రామం చ యయాచిరే సహ 35

ఋత్విజులు, పౌరులు, గణముఖ్యులు, తల్లులును అపుడు వివశులై కన్నీరు కార్చిరి. వారట్లు పలికిన భరతుని పొగడిరి. రామునికి ప్రణతులై అయోధ్యకు రమ్మని యాచించిరి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షడుత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటాఱవ సర్గము సమాప్తము.

---

## సప్తోత్తరశతతమః సర్గః - నూట యేడవ సర్గము

పున రేవం బ్రువాణం తం భరతం లక్ష్మణాగ్రజః,
ప్రత్యువాచ తత శ్శ్రీమాన్ జ్ఞాతిమధ్యేఽభిసత్కృతః. 1

బంధువుల నడుమ భరతుడు స్తోత్రాదులచే తన్ను పూజించి యిట్లు పలుకుచుండగా శ్రీమంతుడగు రాముడు మఱల నతని కిట్లనెను.

ఉపపన్న మిదం వాక్యం యత్త్వ మేవ మభాషథాః,
జాతః పుత్త్రో దశరథా త్కైకేయ్యాం రాజసత్తమాత్. 2

తమ్ముడా! రాజశ్రేష్ఠుడగు దశరథునకు కైకవలన బుట్టిన నీవు-ఇట్లు మాటలాడు టెంతయు ఉచితముగానున్నది.

పురా భ్రాతః పితా నః స మాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్. 3

తమ్ముడా! పూర్వము మన తండ్రి నీ తల్లిని పెండ్లియాడు సమయమున 'నీ కూతు(రు)కు పుట్టినవానికే రాజ్యమిత్తు' నని నీ మాతామహునకు మాట నిచ్చెను.

దైవాసురే చ సంగ్రామే జనన్యై తవ పార్థివః,
సమ్ప్రహృష్టో దదౌ రాజా వర మారాధితః ప్రభుః. 4

ఆపైన దేవదానవుల నడుమ యుద్ధ మేర్పడినపుడు నీ తల్లి యొనర్చిన సేవకు సంతుష్టుడై మహారాజామెకు వర (ద్వయ) మిచ్చెను.

తత స్సా సమ్ప్రతిశ్రావ్య తవ మాతా యశస్వినీ,
అయాచత నరశ్రేష్ఠం ద్వౌ వరౌ వరవర్ణినీ. 5
తవ రాజ్యం నరవ్యాఘ్ర! మమ ప్రవ్రాజనం తథా,
తౌ చ రాజా తదా తస్యై నియుక్తః ప్రదదౌ వరౌ. 6

ఓ నరశ్రేష్ఠుడా! ఈ సందర్భమున కీర్తిమతియగు నీ తల్లి, మహారాజుచే శపథ మొనర్ప జేసి, యా నరశ్రేష్ఠుని నీకు రాజ్యము, నాకు వనవాసము అను రెండు వరములు కోరినది. ఆమెచే నట్లు ప్రేరితుడైన రాజును రెండువరమున నామె కిచ్చెను.

విశే: కైకేయీ వివాహ సమయముననే దశరథుడు కన్యాశుల్కముగ రాజ్యమును ఆమెకు కలిగిన సంతానమున కిత్తునని ప్రతిజ్ఞచేయుట చేతనే భరతునకు రాజ్యము ప్రాప్తించెను కదా. మఱల దానినే కైక వరము కోరుట ఎట్లు? అని ఒక సందేహము. దీనికి సమాధాన మిది. సత్యమే. బాల్యమున నెప్పుడో దశరథుడు శపథము చేసినాడు. నడుమ చాలకాలము గడచినది. సంతానము చాలకాలమునకే కలిగినది. కావున కైక తన భర్త చేసిన ప్రతిజ్ఞను మఱచి, తనకు అనుకొనకుండగనే సంప్రాప్తమైన వరద్వయమును కోరెను. కాన నిది దోషము కాదు. కావుననే రాజుకడ రెండువరములు కోరు సందర్భమున గూడ మంథర "కిం న స్మరసి కైకేయి" (కైకా! నీ కీ విషయము గుర్తు లేదా) యనుచు వివాహవృత్తాంతమును స్మరింపజేసినది. కావున చిరకాలమునకు ముందు జరిగిన వృత్తాంతమును కైక మఱచుటయు

సహజమే. అట్లగుచో "వివాహకాలమున కైకేయిబిడ్డకే రాజ్యమిత్తు నని ప్రతిజ్ఞచేసి రాజు రాజ్యమును రామున కెట్లీయ నమకట్టెను? అన్నచో-నిజమే-'ఉద్వాహకాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వ ధనాపహారే, విప్రస్య చార్థే హ్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని' [వివాహ సమయము, భార్యాసంగమము, ప్రాణాపాయస్థితి, ధనమంతయు పోవు పరిస్థితి, బ్రాహ్మణుని పని అను నీ యైదు సందర్భములలో నసత్యమాడుట పాపము కలిగింపదు]. అను న్యాయముచే దోషము లేదని తలంచియే దశరథు డట్లు చేసెను కనుక అందు దోషము లేదు. కేకయరాజు కూడ రాముని గుణసంపత్తికి మోహితుడై తన దౌహిత్రునకు రాజ్య మిమ్మని కోరలేదు. రాముడును సుమంత్రాదుల వలన నీ రహస్య మెఱిగియే యున్నాడు. కావుననే వా రిదియెల్ల వినుచు కూడ నూఱ కుండిరని తెలియనగును.

తేన పిత్రాఽహ మప్యత్ర నియుక్తః పురుషర్షభ ।,
చతుర్దశ వనే వాసం వర్షాణి వరదానికమ్. 7

ఓ నరశ్రేష్ఠుడా! కావున నేనును తండ్రిచే నీ దండ కారణ్యమున పదునాలుగేండ్లు వరదాన నిమిత్తకమగు నివాసము చేయ నియుక్తుడనైతిని.

సోఽహం వన మిదం ప్రాప్తో నిర్జనం లక్ష్మణాన్వితః,
సీతయా చా ప్రతిద్వన్ద్వ స్సత్యవాదే స్థితః పితుః 8

అట్లు తండ్రిచే నియుక్తుడనైన నేను అనివార్యనిశ్చయుడనై సీతతో, లక్ష్మణునితో కూడి నాతండ్రి వచనము సత్యమొనర్చుచు నీ నిర్జనారణ్యమునకు వచ్చితిని.

భవానపి తథే త్యేవ పితరం సత్యవాదినమ్,
కర్తు మర్హసి రాజేంద్ర క్షిప్ర మే వాభిషేచనాత్. 9

రాజశ్రేష్ఠుడా! నీవును అట్లే శీఘ్రమే రాజ్యాభిషిక్తుడవై తండ్రిని సత్యభాషిని చేయదగుదువు.

ఋణా న్మోచయ రాజానం మత్కృతే భరత! ప్రభుమ్,
పితరం చాపి ధర్మజ్ఞం మాతరం చాభినందయ. 10

భరతుడా! నాకై నీవు రాజును ఋణమునుండి విడిపించుము. ధర్మజ్ఞుడగు తండ్రిని, తల్లినికూడ సంతోషపెట్టుము.

శ్రూయతే హి పురా తాత శ్రుతి ర్గీతా యశస్వినా,
గయేన యజమానేన గయే ష్వేవ పితౄ న్ప్రతి. 11

నాయనా! పూర్వము గయుడను కీర్తిమంతుడగు మహనీయుడు గయలో పితృయాగము చేయుచు తెలిపిన గాథ విందుము కదా.

పు న్నామ్నో నరకా ద్యస్మా త్పితరం త్రాయతే సుతః,
తస్మా త్పుత్త్ర ఇతి ప్రోక్తః పితౄ న్య త్పాతి వా సుతః. 12

కుమారుడు తండ్రిని 'పుత్' అను పేరుగల నరకమునుండి కాపాడువాడు లేదా పితరులను రక్షించువాడు కాన 'పుత్రుడు' అనబడినాడు.

ఏష్టవ్యా బహవః పుత్రా గుణవంతో బహుశ్రుతాః,
తేషాం వై సమవేతానా మపి కశ్చి ద్గయాం వ్రజేత్. 13

గుణవంతులు, పెక్కు శాస్త్రములు చదివిన తనయులు చాలమంది కావలెనని ప్రతి తండ్రియు కోరవలెను. వారిలో నే యొక్కడైనను గయాక్షేత్రమునకు పోవును (అని గయుడు తెలిపిన గాథ).

ఏవం రాజర్షయ స్సర్వే ప్రతీతా రాజనందన!,
తస్మా త్త్రాహి నరశ్రేష్ఠ! పితరం నరకా త్ప్రభో!. 14

కావున రాజపుత్రుడవు, నరశ్రేష్ఠుడవు, సమర్థుడవగు ఓ భరతుడా! నీవు తండ్రిని నరకమున బడకుండ కాపాడుము.

అయోధ్యాం గచ్ఛ భరత! ప్రకృతీ రనురంజయ,
శత్రుఘ్నసహితో వీర! సహ సర్వై ర్ద్విజాతిభిః. 15

వీరుడవగు భరతుడా! నీ వింక శత్రుఘ్నసమేతుడవై, ద్విజు లెల్లరితో కలసి యయోధ్యకు పోయి రాజ్యము చేయుచు ప్రజలను సంతోషపెట్టుము.

ప్రవేక్ష్యే దండకారణ్య మహ మప్యవిలంబయన్ ,
ఆభ్యాం తు సహితో రాజన్! వైదేహ్యా లక్ష్మణేన చ. 16

రాజా! నేనును ఇటుపై నేమాత్రము జాగు చేయక సీతాలక్ష్మణులతో గూడి దండకారణ్యమును ప్రవేశింతును.

త్వం రాజా భరత! భవ స్వయం నరాణాం
వన్యానా మహ మపి రాజరా ణ్మృగాణామ్,
గచ్ఛ త్వం పురవర మద్య సంప్రహృష్ట
స్సంహృష్ట స్త్వహ మపి దండకా న్ప్రవేక్ష్యే. 17

భరతుడా ! నీవు స్వయముగ నయోధ్యలో రాజవు కమ్ము. నే నడవిలో మృగములకు (మృగములవలె జీవితములు గడపు మునులను) రంజింపజేయువాడను, శిక్షకుడ నయ్యెదను. (లేదా ఈ వాక్యము అనంతరకాలమున సుగ్రీవరంజనము, వాలివధలకు సూచకము). నీ విపు డానందముతో శ్రేష్ఠమగు నయోధ్యా నగరమున కేగుము. నేనును అట్లే సంతోషముతో దండకను ప్రవేశింతును

ఛాయాం తే దినకరభాః ప్రబాధమానాం
వర్షత్రం భరత! కరోతు మూర్ధ్ని శీతామ్,
ఏతేషా మహ మపి కాననద్రుమాణాం
ఛాయాం తా మతిశయినీం సుఖీ శ్రయిష్యే. 18

తెల్లగొడుగు నీ తలపై సూర్యకిరణముల తీవ్రతాపమును బాధించు చల్లని నీడను కలిగించుగాక. నేనును ఆ నీడనుమించు చల్లని యడవి చెట్ల నీడను సుఖినై యాశ్రయింతును.

శత్రుఘ్నః కుశలమతి స్తు తే సహాయ
స్సౌమిత్రి ర్మమ విదితః ప్రధానమిత్రమ్,
చత్వార స్తనయవరా వయం నరేంద్రం
సత్యస్థం భరత! చరామ మా విషాదమ్. 19

బుద్ధికుశలుడగు శత్రుఘ్నుడు నీకు సహాయుడుగనున్నాడు. నాకు లక్ష్మణుడు మిక్కిలి మైత్రితో తోడుపడువాడున్నాడు. ఇట్లు పుత్రశ్రేష్ఠులమగు మనము నలుగురము తండ్రిని సత్యభాషిని

చేయుదము. నీవు విచారింపకుము. అని రాముడు భరతు సమాధానపరచెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటయేడవ సర్గము సమాప్తము.

---

## అష్టోత్తరశతతమః సర్గః - నూట యెనిమిదవ సర్గము

ఆశ్వాసయన్తం భరతం జాబాలి ర్బ్రాహ్మణోత్తమః,
ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేత మిదం వచః. 1

బ్రాహ్మణశ్రేష్ఠుడగు జాబాలి, అట్లు భరతు నోదార్చుచున్న ధర్మజ్ఞు డగు రాముని కిట్లు వైదికధర్మ విరుద్ధముగ పలికెను. (బ్రాహ్మణోత్తము డనుటచే అతడు పలికిన నాస్తికవచనము కేవలము తాత్కాలిక దుఃఖోపశమనార్థమే కాని వాస్తవముగ నతని హృదయము కాదని సూచితము.)

సాధు రాఘవ! మాభూ త్తే బుద్ధి రేవం నిరర్థికా,
ప్రాకృతస్య నరస్యేవ హ్యార్యబుద్ధే ర్మనస్వినః. 2

రామా! దొడ్డబుద్ధి కలవాడవు, మహాధైర్యశాలివగు నీకు సామాన్యునకు వోలె నిట్టి నిరర్థకమగు ఆలోచన కలుగకుండుగాక! (నీ యాలోచనను మఱలుచ్చుకొమ్ము.)

కః కస్య పురుషో బంధుః కి మాప్యం కస్య కేనచిత్,
య దేకో జాయతే జంతు రేక ఏవ వినశ్యతి. 3

ఎవ డెవనికి చుట్టము? ఎవని కే సాధనముతో నేది సాధ్యము? (ఎవడును దేనిని పొంద పనిలేదు) ఏలయన ప్రతి వాడును ఒంటరిగనే పుట్టి ఒంటరిగనే చచ్చుచున్నాడు.

తస్మా న్మాతా పితా చేతి రామ! సజ్జేత యో నరః,
ఉన్మత్త ఇవ స జ్ఞేయో నాస్తి కశ్చి ద్ధి కస్యచిత్. 4

కావున నా తల్లి, నాతండ్రి యనుచు నెవడు మిక్కిలి సంగము కలిగియుండునో, వానిని పిచ్చివానిగా భావింపవలెను. వాస్తవమున నెవ్వరికిని ఎవ్వరును లేరు.

యథా గ్రామాంతరం గచ్ఛ న్నరః కశ్చి త్క్వచి ద్వసేత్,
ఉత్సృజ్య చ తమావాసం ప్రతిష్ఠే తాపరేఽహని, 5
ఏవ మేవ మనుష్యాణాం పితా మాతా గృహం వసు,
ఆవాసమాత్రం కాకుత్స్థ! సజ్జంతే నాత్ర సజ్జనాః. 6

రామా! ఎట్లొకడు గ్రామాంతరము పోవుచు, నడుమ నొకచో నారాత్రి యుండునో, మఱునా డాచోటు విడచి వెడలి పోవునో అట్లే మనుజులకును తండ్రి, తల్లి, ఇల్లు, సొమ్మునుసత్రములో నివాసమువలె, (వానితో సంబంధ మవి యున్నంతవఱకే అవి దూర మగుటతోడనే వానిని తలంప పని లేదు.) కాన సజ్జనులీ పిత్రాదులందు సక్తులు కారు.

పిత్ర్యం రాజ్యం పరిత్యజ్య స నార్హసి నరోత్తమ!,
ఆస్థాతుం కాపథం దుఃఖం విషమం బహుకంటకమ్ 7

ఓ నరశ్రేష్ఠుడా! నీ తండ్రి రాజ్యమును విడచి, దుఃఖప్రదమును, యౌవనమున తగనిది, అనేక క్లేశములతో కూడిన దగు వానప్రస్థమార్గము పట్టుట నీకు తగదు

సమృద్ధాయా మయోధ్యాయా మాత్మాన మభిషేచయ,
ఏకవేణీధరా హి త్వాం నగరీ సంప్రతీక్షతే. 8

అయోధ్యానగరాధిదేవత ఏకవేణిని ధరించి, (వ్రత పరాయణయై) నీకై యెదురుచూచుచున్నది. నీవు సమృద్ధమగు అయోధ్యయం దభిషిక్తుడవు కమ్ము.

రాజభోగా ననుభవ న్మహార్హా న్పార్థివాత్మజ!,
విహర త్వ మయోధ్యాయాం యథా శక్ర స్త్రివిష్టపే. 9

రాజపుత్రా! గొప్ప విలువైన రాజభోగము లనుభవించుచు, స్వర్గమున దేవేంద్రునివలె నీ వయోధ్యలో విహరింపుము.

న తే కశ్చి ద్దశరథ స్త్వం చ తస్య న కశ్చన,
అన్యో రాజా త్వమ ప్యన్య స్తస్మా త్కురు యదుచ్యతే 10

దశరథుడు నీ కేమియు కాడు. నీ వాతని కేమియు గావు. రాజు వేఱు. నీవు వేఱు. కావున నేను చెప్పినట్లు చేయుము.

బీజమాత్రం పితా జన్తో శ్శుక్లం రుధిర మేవ చ,
సంయుక్త మృతుమ న్మాత్రా పురుష స్యేహ జన్మ తత్.11

తండ్రి ప్రాణికి బీజమాత్రమే (అల్పమగు కారణము). ప్రధానకారణము ఋతుకాలమున తల్లి ధరించిన శుక్లశోణితమే, అదియే పురుషుని జన్మహేతువు.

గత స్స నృపతి స్తత్ర గన్తవ్యం యత్ర తేన వై,
ప్రవృత్తి రేషా మర్త్యానాం త్వం తు మిథ్యా విహన్యసే. 12

ఆ రాజు తాను పోవలసిన చోటుకు పోయెను (పంచ భూతములందే లయమయ్యెను. పంచభూతములకంటె భిన్నమగు ఆత్మ లేదు కనుక - ఇది నాస్తికమతము) మరణశీలు రగు మనుజుల స్వభావమే ఇది. నీవు అసత్యమగు సంబంధమును తలంచుకొని బాధపడుచున్నావు.

అర్థధర్మపరా యే యే తాం స్తాం ఛోచామి నేతరాఞ్,
తే హి దుఃఖ మిహ ప్రాప్య వినాశం ప్రేత్య భేజిరే. 13

ప్రత్యక్షసౌఖ్యమును విడచి యెవరు కేవలము అర్థ సంపాదన పరులును, కేవల ధర్మపరులును అగుదురో వారిని జూచిన నాకు మిక్కిలి దుఃఖము కలుగుచున్నది. (తక్కిన కేవల ప్రత్యక్ష సుఖానుభవ పరులను గూర్చి నాకట్టి చింత లేదు) వా రుండియు దుఃఖింతురు, లేకయు నశింతురు.

అష్టకా పితృదైవత్య మిత్యయం ప్రసృతో జనః,
అన్న స్యోపద్రవం పశ్య మృతో హి కి మశిష్యతి. 14

అష్టకాశ్రాద్ధమని, ప్రతిసాంవత్సరిక శ్రాద్ధ మని పితృదేవతలకే యే శ్రాద్ధము పెట్టుటలో నాసక్తులో అది యంతయు అన్నమును వ్యర్థపెట్టుటే కాని వేఱుకాదు. చచ్చిన వా డేమి తినును ?

యది భుక్త మి హాన్యేన దేహ మన్యస్య గచ్ఛతి,
దద్యా త్ప్రవసత శ్శ్రాద్ధం న త త్ప థ్యశనం భవేత్. 15

ఇచట నొకడు తినిన యన్నము వేఱొకని శరీరమునకు పోవుచో ఇల్లు వెడలి దూరదేశమం దున్నవానికిని శ్రాద్ధము పెట్ట వచ్చును కదా. అట్లు పెట్టిన అది బాటసారి కాహారముగ నుండుట అనుభవ విరుద్ధము కదా.

దానసంవననా హ్యేతే గ్రంథా మేధావిభిః కృతాః,
యజస్వ దేహి దీక్షస్వ తప స్తప్యస్వ సన్త్యజ. 16

'దేవతల నారాధింపుము, దానము లిమ్ము, యజ్ఞాదులందు దీక్ష వహింపుము, తప మొనర్పుము, అర్థేషణాదులను విడుము,' ఇత్యాదులన్నియు పరుల ద్రవ్యమును సంపాదించుకొఱకు తెలివి గలవారు గ్రంథములలో చెప్పిన మాటలు.

స నాస్తి పర మి త్యేవ కురు బుద్ధిం మహామతే।,
ప్రత్యక్షం య త్తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు. 17

కాన నో మహాబుద్ధిశాలీ। నీవు పరలోక మన్నది లేదని నిశ్చయింపుము. ప్రత్యక్ష ఫలము నిచ్చు రాజ్యభోగాదుల నంగీకరించుము. పరోక్షముగా సుఖఫలకములగు పితృవాక్య పరిపాలనాదులను వెనుకబెట్టుము.

స తాం బుద్ధిం పురస్కృత్య సర్వలోకనిదర్శినీమ్,
రాజ్యం త్వం ప్రతిగృహ్ణీష్వ భరతేన ప్రసాదితః. 18

సర్వజనసమ్మతమగు ప్రత్యక్షముకంటె వేఱు లేదను బుద్ధిని పురస్కరించుకొని, భరతునకు ప్రసన్నుడవై రాజ్యము గ్రహింపుము, అని జాబాలి రామునితో పలికెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అష్టోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నూటయెనిమిదవ సర్గము సమాప్తము.

---

## నవోత్తరశతతమః సర్గః - నూటతొమ్మిదవ సర్గము

జాబాలేస్తు వచ శ్శ్రుత్వా రామ స్సత్యాత్మనాం వరః,
ఉవాచ పరయా భక్త్యా స్వబుద్ధ్యా చావిపన్నయా. 1

సత్యబుద్ధిగలవారిలో శ్రేష్ఠుడగు రాముడు జాబాలివచన మాలించి, వైదిక కర్మలయందలి శ్రద్ధతోడను, జాబాలి పలుకులచే చలనమునొందని బుద్ధితోడను ఇట్లనెను.

భవా న్మే ప్రియకామార్థం వచనం య దిహోక్తవాన్ ,
అకార్యం కార్యసంకాశ మపథ్యం పథ్యసమ్మితమ్. 2

నాకు ప్రియమగు పట్టాభిషేకాదులను చేకూర్చుటకై నీ విపుడు పలికినదెల్ల కర్తవ్య సదృశమైన అకార్యము. హితముః వలె దోచు అహితము.

నిర్మర్యాద స్తు పురుషః పాపాచారసమన్వితః,
మానం న లభతే సత్సు భిన్నచారిత్రదర్శనః. 3

మర్యాదలేనివాడగుటచే పాపాచరణము కలవాడును,

వేదవిహితమునకంటె వేరగు ఆచారమును ప్రతిపాదించి మతమును ప్రవర్తింపజేయువాడును సజ్జనులకు మాన్యుడు కాడు.

కులీన మకులీనం వా వీరం పురుషమానినమ్,
చారిత్ర మేవ వ్యాఖ్యాతి శుచిం వా యది వాఽశుచిమ్. 4

ఒకడు ఉత్తమవంశమున బుట్టినవాడో - హీనవంశమున బుట్టినవాడో, వీరుడో- భీరుడో, పవిత్రుడో - అపవిత్రుడో అను దానిని వాని నడవడియే తెలుపును. దానికి వేఱు ప్రమాణముతో పనిలేదు.

అనార్య స్త్వార్యసంకాశ శ్శౌచా ద్ధీన స్తథా శుచిః,
లక్షణ్యవ దలక్షణ్యో దుశ్శీల శ్శీలవా నివ. 5
అధర్మం ధర్మవేషేణ య దీమం లోకసంకరమ్,
అభిపత్స్యే శుభం హిత్వా క్రియావిధివివర్జితమ్. 6
క శ్చేతయానః పురుషః కార్యాకార్యవిచక్షణః,
బహుమంస్యతి మాం లోకే దుర్వృత్తం లోకదూషణమ్.

అయోగ్యుడనై యోగ్యునివలెను, శౌచవిహీనుడనై శుద్ధునివలెను, శిష్టలక్షణము లేకయే, ఆ లక్షణములు కలవానివలెను, దురాచారినై సుశీలము కలవానివలెను, నేను శుభసాధకమగు వైదికధర్మమును వీడి, లోకసంకర కారణమై, వైదిక క్రియలచే, వేదవిధిచే గూడ విడువబడిన యీ యధర్మమును ధర్మముగా స్వీకరించుచో, దురాచారముకల జనులకు దూషింపదగిన నన్నే జానవంతు డీ లోకమున గౌరవించును ?

కస్య ధాస్యా మ్యహం వృత్తం కేన వా స్వర్గ మాప్నుయామ్,
అనయా వర్తమానో హి వృత్త్యా హీనప్రతిజ్ఞయా. 8

నేను వనవాస ప్రతిజ్ఞ వీడి, 'పరోక్షమును వెనుక బెట్టు' మని నీవు చెప్పినట్టి విధమునే యవలంబించినవాడనై, నీవు చెప్పిన యీ యాచరణ మెవని కుపదేశింతును ? ఏ సాధనముచే స్వర్గమున కేగుదును ?

కామవృత్త స్త్వయం లోకః కృత్స్నః స్సముపవర్తతే,
యద్వృత్తా స్సంతి రాజాన స్తద్వృత్తా స్సంతి హి ప్రజాః.9

ఈ లోకమంతయు నా మార్గమునే పట్టి స్వేచ్ఛాచారము కలదగును. రాజు లెట్లు నడచుకొందురో ప్రజలు నట్లే ప్రవర్తించుదురు.

సత్య మే వానృశంసం చ రాజవృత్తం సనాతనమ్,
తస్మా త్సత్యాత్మకం రాజ్యం సత్యే లోకః ప్రతిష్ఠితః. 10

జీవులపై దయజూపుట ప్రధానముగా కల సనాతనమగు రాజవృత్తము సత్యమే. కావున రాజ్యము (రాజ్యమందలి జన సమూహము) సత్యప్రధానము. సత్యముపైననే లోకము సుస్థిరముగ నిలచియున్నది.

ఋషయ శ్చైవ దేవాశ్చ సత్య మేవ హి మేనిరే,
సత్యవాదీ హి లోకేఽస్మి న్పరమం గచ్ఛతి క్షయమ్. 11

ఋషులును, దేవతలును సత్యమే మిక్కిల గొప్పదని భావించిరి. ఈ లోకమున సత్యవాదియే ఉత్కృష్ట స్థానమును పొందును.

ఉద్విజన్తే యథా సర్పా న్నరా దనృతవాదినః,
ధర్మ స్సత్యం పరో లోకే మూలం స్వర్గస్య చోచ్యతే. 12

పాము‌ను చూచి భయపడున ట్లసత్యములు పలుకువారిని చూచి జనులు భయపడుదురు. సత్యమే లోకమున పరము ధర్మము. సత్యమే స్వర్గమునకును మూలమని చెప్పబడినది.

సత్య మే వేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితా సదా,
సత్యమూలాని సర్వాణి సత్యా న్నాస్తి పరం పదమ్. 13

లోకమున సత్యమే నియామకము. లక్ష్మి సదా సత్యమందే నివసించును. తక్కిన ధర్మము లన్నింటికి సత్యమే మూలము. సత్యముకంటె గొప్పస్థానము వేఱొండు లేదు.

దత్త మిష్టం హుతం చైవ తప్తాని చ తపాంసి చ,
వేదా స్సత్యప్రతిష్ఠానా స్తస్మా త్సత్యపరో భవేత్. 14

దానము, యాగము, హోమము, తపస్సులు, వేదములు సత్యమే ఆధారముగ కలవి. కావున మనుజుడు సత్యమునే పలుకవలెను.

ఏకః పాలయతే లోక మేకః పాలయతే కులమ్,
మజ్జ త్యేకో హి నిరయ ఏక స్స్వర్గే మహీయతే. 15

సత్యపరు డొక్కడు లోకమును పాలించును. సత్యశీలు డొక్కడే వంశమును కాపాడును. సత్యశీలుడు కానివాడు నరకమున పడును. సత్యవంతుడు స్వర్గమున మహత్త్వము నందును.

సోఽహం పితు ర్నియోగం తు కిమర్థం నానుపాలయే,
సత్యప్రతిశ్రవ స్సత్యం సత్యేన సమయీకృతః. 16

సత్యసంధుడను, రాజుకాంక్షితము నెఱవేర్తునని సత్య

ముతో ప్రతిన బూనినవాడను అగు నేను తండ్రియాజ్ఞను పాలింప కుండు టెట్లు ?

నైవ లోభా న్న మోహా ద్వా న హ్యజ్ఞానా త్తమోన్వితః,
సేతుం సత్యస్య భేత్స్యామి గురో స్సత్యప్రతిశ్రవః. 17

సత్యసంధుడనగు నేను రాజ్యలోభముచే గాని, మోసపు మాటలు వినుటవల్ల కలిగిన మతిభ్రమచేగాని, తెలియకగాని తమోగుణయుక్తుడనై సత్యమర్యాదను మీఱను.

అసత్యసంధస్య సత శ్చల స్యాస్థిరచేతసః,
నైవ దేవా న పితరః ప్రతీచ్ఛంతీతి న శ్శ్రుతమ్. 18

సత్యము పలుకనివాడు, చంచల స్వభావము కలవాడు, మనః స్థైర్యము లేనివా, డిచ్చిన హవ్య కవ్యాదులను దేవతలు గాని, పితరులుగాని స్వీకరింపరని విందుము.

ప్రత్యగాత్మ మిమం ధర్మం సత్యం పశ్యా మ్యహంస్వయమ్
భార స్సత్పురుషాచీర్ణ స్తదర్థ మభిమన్యతే. 19

సత్యరూపమగు నీ ధర్మమును నేను ఆత్మకంటె వేఱుకాని దానినిగా చూచుచున్నాను. సత్పురుషులచే నాచరితమైన జటా వల్కలాదులు ధరించుటయను భారము సత్యరూపమగు ధర్మము కొఱకే అభీప్సితమైనది.

క్షాత్రం ధర్మ మహం త్యక్ష్యే హ్యధర్మం ధర్మసంహితమ్,
క్షుద్రై ర్నృశంసై ర్లుబ్ధై శ్చ సేవితం పాపకర్మభిః. 20

అధర్మ మధికముగా కలిగి, ధర్మమల్పముగా కలది,

నీచులు, క్రూరులు, లోభులు, పాపకృత్యములు చేయువారు సేవించునట్టి క్షాత్రధర్మమును నేను విడచిపుత్తును.

కాయేన కురుతే పాపం మనసా సమ్ప్రధార్య చ,
అనృతం జిహ్వయా చాహ త్రివిధం కర్మ పాతకమ్. 21

పాపకృత్యమును మనుజుడు మనస్సులో సంకల్పించును. నాల్కతో అసత్యము పలుకును.శరీరముతో పాప మాచరించును. ఇట్లు పాపకర్మము త్రివిధము.

భూమిః కీర్తి ర్యశో లక్ష్మీః పురుషం ప్రార్థయంతి హి,
స్వర్గస్థం నానుపశ్యన్తి సత్య మేవ భజేత తత్. 22

దానముచేయుట వలన కలిగిన ప్రశస్తి, పౌరుషమువల్ల కలిగిన ప్రతిష్ఠ, సంపద, సత్యనిష్ఠుడగు వానిని పొందగోరును. స్వర్గమునకుకూడ అతనితో నవి పోవును. కాన సత్యమునే సేవింపవలెను.

శ్రేష్ఠం హ్యనార్య మేవ స్యా ద్య ద్భవా నవధార్య మామ్,
అహ యుక్తికరై ర్వాక్యై రిదం భద్రం కురుష్వ హ. 23

శ్రేష్ఠముగా నిశ్చయించి, నీవు యుక్తియుక్త వాక్యములతో 'నిది చేయు'మని చెప్పిన దంతయు అయోగ్యమే.

కథం హ్యహం ప్రతిజ్ఞాయ వనవాస మిమం గురౌ,
భరతస్య కరిష్యామి వచో హిత్వా గురో ర్వచః 24

నా తండ్రికి వనవాసము చేతునని ప్రతిజ్ఞచేసి, యా పితృవాక్యము విడచి, భరతుని మాట నెట్లు పాటింతును? (ఇది

ప్రత్యక్షము నాచరింపుము – పరోక్షమును వెనుకకు త్రోయుము అను జాబాలి వాక్యమునకు రాముని సమాధానము).

స్థిరా మయా ప్రతిజ్ఞాతా ప్రతిజ్ఞా గురుసన్నిధౌ,
ప్రహృష్యమాణా సా దేవీ కైకేయీ చాభవ త్తదా. 25

నేను నాతండ్రికడ స్థిరమగు ప్రతిజ్ఞచేసితిని. అప్పుడు కైకేయీ దేవియు మిగుల నానందించినది.

వనవాసం వస న్నేవం శుచి ర్నియతభోజనః,
మూలైఃపుష్పైః ఫలైః పుణ్యైః పితౄన్ దేవాంశ్చ తర్పయన్.
సన్తుష్టపంచవర్గో ఽహం లోకయాత్రాం ప్రవర్తయే,
అకుహ శ్శ్రద్దధాన స్స న్కార్యాకార్యవిచక్షణః. 27

నేను వనవాసము చేయుచు, పరిశుద్ధుడనై, వనమున లభించు కందమూల ఫలాదులనే యాహారముగ గొనుచు, పవిత్రములగు పుష్ప, మూల, ఫలములతో పితరులను, దేవతలను తృప్తి నందించుచు, సంతోషమునందిన పంచేంద్రియసమూహము కలవాడనై, కుటిలత లేక, కార్యాకార్యముల నెఱిగినవాడనై పితృ వాక్య పరిపాలన రూపమగు లోకయాత్రను నిర్వహింతును.

కర్మభూమి మిహ ప్రాప్య కర్తవ్యం కర్మ యచ్ఛుభమ్,
అగ్ని ర్వాయు శ్చ సోమశ్చ కర్మణాం ఫలభాగినః. 28

ఈ కర్మభూమిలో పుట్టిన జనులు శుభకర్మలు చేయవలయును. అట్టి కర్మభూమిలో శుభకర్మల నాచరించి అగ్ని, వాయువు, చంద్రుడును అగ్నిత్వ, వాయుత్వ, చంద్రత్వరూప ఫలములను పొందిరి.

శతం క్రతూనా మాహృత్య దేవరా ట్త్రిదివం గతః,
తపాం స్యుగ్రాణి చాస్థాయ దివం యాతా మహర్షయః.29

దేవేంద్రుడు నూఱు యాగములు చేసి స్వర్గరాజ్యమును పొందెను. మహర్షులు ఘోరతప మాచరించి స్వర్గమున కేగిరి.

అమృష్యమాణః పున రుగ్రతేజా
నిశమ్య తం నాస్తికవాక్యహేతుమ్,
అ థాబ్రవీ త్తం నృపతే స్తనూజో
విగర్హమాణో వచనాని తస్య. 30

తీవ్రమైన తేజముతో నొప్పు రాముడు జాబాలి పలికిన శ్రాద్ధ విషయకమై నాస్తికవాక్యరూపమగు తర్కమును విని, యాతని వచనములను తన మనస్సులోనే నిందించుచు నతని కిట్లనెను.

సత్యం చ ధర్మం చ పరాక్రమం చ
భూతానుకమ్పాం ప్రియవాదితాం చ,
ద్విజాతి దేవాతిథిపూజనం చ
పంథాన మాహు స్త్రిదివస్య సంతః. 31

సత్యము, ధర్మము, పరాక్రమము, భూతదయ, ప్రియము పలుకుట, బ్రాహ్మణపూజ, అతిథిసత్కారము అనునివి స్వర్గమునకు మార్గము లని యందురు.

తేనైవ మాజ్ఞాయ యథావ దర్థ
మేకోదయం సమ్ప్రతిపద్య విప్రాః,
ధర్మం చరంత స్సకలం యథావ
త్కాంక్షన్తి లోకాగమ మప్రమత్తాః. 32

ఆ కారణముచే బ్రాహ్మణు లీ విషయమును యథాతథ ముగా తెలిసికొని, ఐకమత్యమును పొంది, తమ తమ వర్ణాశ్రమో చితమగు సకలధర్మమును సావధానులై చక్కగా ననుష్ఠించుచు స్వర్గాదిలోకప్రాప్తిని కోరుదురు.

నిందా మ్యహం కర్మ పితుః కృతం త
ద్య స్త్వా మగృహ్ణా ద్విషమస్థబుద్ధిమ్,
బుద్ధ్యాఽన యైవంవిధయా చరన్తం
సునాస్తికం ధర్మపథా దపేతమ్. 33

అవైదికమార్గనిష్ఠాతమగు బుద్ధికలవాడవై, చార్వాక మతానుసారిణియగు బుద్ధిని పరుల కుపదేశించి, యాచరించుచు, పరలోకమే లేదను బుద్ధికలిగి, ధర్మమార్గము వీడిన నిన్ను నాతండ్రి చేరదీసినాడు. నాతండ్రి చేసిన ఈ పనిని నేను నిందించు చున్నాను.

యథాహి చోర స్స తథాహి బుద్ధ
స్తథాగతం నాస్తిక మత్ర విద్ధి,
తస్మాద్ధి య శ్శంక్యతమః ప్రజానాం
న నాస్తికే నాభిముఖో బుధ స్స్యాత్. 34

చోరునివోలె వేదబాహ్యుడుగా ప్రసిద్ధుడైన నాస్తికుడును నిరాకరింపదగినవాడు. అట్లే ఈ లోకమున చార్వాకుని బుద్ధునితో సమానునిగ తెలిసికొమ్ము. కావున ప్రజల కవైదికుడుగా శంకనీయు డగు నాస్తికునికి పండితు డెదురు పోరాదు.

త్వత్తో జనాః పూర్వతరే వరా శ్చ
శుభాని కర్మాణి బహూని చక్రుః,

జిత్వా సదేమం చ పరం చ లోకం
తస్మా ద్ద్విజా స్స్వస్తి హుతం కృతం చ. 31

నీకు పూర్వులు, జ్ఞానముచే శ్రేష్ఠులగువారు చాల శుభకరములను పనుల నాచరించిరి. వా రిహపరలోకములు జయించి సదా గ్రహనక్షత్రాదిరూపమున వర్తించుచున్నారు. ఇట్లు కర్మానుష్ఠాన మైహికాముష్మిక సకలఫల సాధనమగుటవలన బ్రాహ్మణులు మంగళాత్మకమగు కర్మను, యజ్ఞాదులను, తపోదానాదులను చేయుదురు. (ఇట్లు ప్రత్యక్షము మాత్రమే ప్రమాణము కాదు. తదతిరిక్తములగు వేదములును ప్రమాణములే. పలువురు మహాత్ములు వానిని ప్రమాణముగ స్వీకరించుటే ఇందులకు నిదర్శనము. ఆ మహాజన పరిగ్రహము వేద మపౌరుషేయ మగుట చేతనే. ఆ అపౌరుషేయత్వము (పురుషకృతము కాకుండుట) అవిచ్ఛిన్న సంప్రదాయమగుచు,కర్త స్మరింపబడక పోవుటవలన. వైదికకర్మలు ఫలముకలవి. అగ్ని, రవి, చంద్రుడు, నక్షత్రములు, ఇంద్రాదులు తమ కర్మఫలముగ నాయా పదములలో నుండుట అబాధిత ప్రత్యక్షసిద్ధము కనుక. 'బాటసారికై వేళ్ళా కడు భుజింపగా బాటసారి కది చేరకుండుటకు' అట్లుచేయుంట శాస్త్రదృష్టమును, శాస్త్రవిహితమును కాకుండుటయే కారణము.

ధర్మే రతా స్సత్పురుషై స్సమేతా
స్తేజస్వినో దానగుణప్రధానాః,
అహింసకా వీతమలా శ్చ లోకే
భవంతి పూజ్యా మునయః ప్రధానాః. 36

ధర్మమం దాసక్తులును, సత్పురుషులతో కలిసియుండు వారును, తేజస్వులును, దానము చేయుటయను గుణము ప్రధాన

ముగ కలవారును, ప్రాణులను పీడింపనివారును, పాపరహితులును అగు మునిశ్రేష్ఠులు లోకమున పూజనీయులు".

ఇతి బ్రువంతం వచనం సరోషం
రామం మహాత్మాన మదీనసత్త్వమ్,
ఉవాచ తథ్యం పున రాస్తికం చ
సత్యం వచ స్సానునయం చ విప్రః. 37

అని మహాబలుడు, మహాత్ముడగు రాముడు మిక్కిలి కోపముతో నిట్లు పలుకగా నా బ్రాహ్మణుడు రామునితో యథార్థము, సజ్జనహితమగు మాట నిట్లు పలికెను.

న నాస్తికానాం వచనం బ్రవీ మ్యహం
న నాస్తికోఽహం నచ నాస్తి కించన,
సమీక్ష్య కాలం పునరాస్తికోఽభవం
భవేయ కాలే పున రేవ నాస్తికః. 38

నేను నాస్తికుల వచనము పలుకుట లేదు. నేను నాస్తికుడను కాను. పరలోకాదులు లేకపోవుట లేదు. (ఉండనే ఉన్నవి), ఇతరవాదులు నాస్తికమత మవలంబించి కుతర్కము చేయుచో నేనే నీవు చెప్పిన విధముగనే దానిని పలు విధములుగ ఖండించితిని. అట్టి నేనే ధర్మసంకటకాలమున నాస్తికవాదము చేసితిని. ఇటుపై గూడ నెపుడైన ధర్మసంకట మేర్పడినపుడు నాస్తికమత మవలంబించ వచ్చును. అంతమాత్రముచే నాలో నాస్తికత్వము కలుగదు. (వస్తుతః ధర్మసంకట మేర్పడినపుడు సకలమతముల నెఱిగిన పండితు డే మతమునైన యవలంబించి దానిని పరిహరింపవలయును. అందుచే మహరాజ్యమున నాయకుడు లేకుండుటయను సంకటమును తొలగింపనెంచిన జాబాలి రాముని వనవాసము

నుండి మఱల్చి అభిషేకోన్ముఖుని చేయుటకే నాస్తిక మతము నవలంబించి మాటలాడినాడు).

స చాపి కాలోఽయ ముపాగత శ్శనై
ర్యథా మయా నాస్తికవా గుదీరితా,
నివర్తనార్థం తవ రామ కారణా
త్ప్రసాదనార్థం చ మ యైత దీరితమ్. 39

రామా! నే నట్టి నాస్తికవాదము చేయవలసిన సమయ మాసన్నమగుటచే తదనుగుణముగనే నాస్తికవచనములు పలికితిని. ఇది నీవు వేదమార్గమునుండి చలింపజేయరానివాడవని లోకము లకు ప్రకటించుకొఱకే. భరతు నానందింప జేయుటకు, నిన్ను ప్రసన్నుని చేయుటకు మాత్రమే నే నట్లు పలికితిని." అని జాబాలి రామునకు చెప్పెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
నవోత్తరశతతమః సర్గః.
ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటతొమ్మిదవ సర్గము సమాప్తము.

---

## దశోత్తరశతతమః సర్గః - నూటపదియవ సర్గము

క్రుద్ధ మాజ్ఞాయ రామం తు వసిష్ఠః ప్రత్యువాచ హ,
జాబాలి రపి జానీతే లోక స్యాస్య గతాగతిమ్. 1

రాముడు కోపించినాడని యెఱిగి వసిష్ఠు డతని కిట్లనెను.

'రామా! జాబాలియు జను లీ లోకమునుండి పరలోకమున కేగుటను, అటనుండి మఱల నీ లోకమునకు వచ్చుటను ఎఱిగియే యున్నాడు.

నివర్తయితుకామస్తు త్వా మేత ద్వాక్య ముక్తవాన్,
ఇమాం లోకసముత్పత్తిం లోకనాథ! నిబోధ మే. 2

ఓ లోకేశ్వరా! నిన్ను వనవాసమునుండి మఱలించ గోరియే నీ కిట్టి మాటలు జాబాలి చెప్పినాడు. నే నీ లోకపు ఉత్పత్తిని గూర్చి తెలిపెదను వినుము.

సర్వం సలిల మే వాసీ త్పృథివీ యత్ర నిర్మితా,
తత స్సమభవ ద్బ్రహ్మా స్వయమ్భూ ర్దైవతై స్సహ. 3

తొలుత ప్రపంచమంతయు జలమయమైయుండెను. జలములపై భూమి నిర్మింపబడెను. పరబ్రహ్మచే దేవతలు, బ్రహ్మ జన్మించిరి.

స వరాహ స్తతో భూత్వా ప్రోజ్జహార వసుంధరామ్,

అంత శ్రీమహావిష్ణువు వరాహావతారము దాల్చి భూమి నుద్ధరించెను.

అసృజచ్చ జగ త్సర్వం సహపుత్త్రైః కృతాత్మభిః. 4
ఆకాశప్రభవో బ్రహ్మ శాశ్వతో నిత్య అవ్యయః,
తస్మా న్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యప స్సుతః. 5

అపు డవ్యయుడు, నిత్యుడు, శాశ్వతుడు, పరబ్రహ్మమువలన బుట్టినవాడగు బ్రహ్మ, తన తనయులగు మరీచ్యాదులతో

ప్రపంచము నెల్ల సృజించెను. బ్రహ్మకు మరీచి జన్మించెను. మరీచి కుమారుడు కాశ్యపుడు.

వివస్వా న్కాశ్యపా జ్జజ్ఞే మను ర్వైవస్వతః స్మృతః,
స తు ప్రజాపతిః పూర్వ మిక్ష్వాకుస్తు మనో స్సుతః. 6

కాశ్యపునివలన సూర్యుడు పుట్టెను. అతనికి మనువు జన్మించెను. మనువు కుమారుడు ఇక్ష్వాకువు. అతడు పూర్వము నరపతి

య స్యేయం ప్రథమం దత్తా సమృద్ధా మనునా మహీ,
త మిక్ష్వాకు మయోధ్యాయాం రాజానం విద్ధి పూర్వకమ్.7

సమృద్ధికల యీ భూమిని మనువు ఇక్ష్వాకువున కిచ్చెను. అట్లు ఇక్ష్వాకు వయోధ్యకు మొదటి రాజని యెఱుంగుము.

ఇక్ష్వాకోస్తు సుత శ్శ్రీమా న్కుక్షి రే వేతి విశ్రుతః,
కుక్షే రథాత్మజో వీరో వికుక్షి రుదపద్యత. 8

ఇక్ష్వాకువు కుమారుడు శ్రీమంతుడగు కుక్షి. కుక్షికి వీరుడగు వికుక్షి పుట్టెను.

వికుక్షే స్తు మహాతేజా బాణః పుత్రః ప్రతాపవాన్,
బాణస్య తు మహాబాహు రనరణ్యో మహాయశాః. 9

వికుక్షికి మహాతేజశ్శాలి, ప్రతాపవంతుడగు బాణుడు పుట్టెను. బాణునకు మహాభుజుడు, మహాయశస్వియగు అనరణ్యు డుద్భవించెను.

నానావృష్టి ర్బభూ వాస్మి న్న దుర్భిక్షం సతాం వరే,
అనరణ్యే మహారాజే తస్కరో నాపి కశ్చన. 10

సజ్జనశ్రేష్ఠుడగు అనరణ్యుడు మహారాజై యుండగా అనావృష్టిగాని, కఱువుగాని కలుగలేదు. దొంగలు లేకుండిరి.

అనరణ్యా న్మహాబాహుః పృథూ రాజా బభూవ హ,
తస్మా త్పృథో ర్మహారాజ స్త్రిశంకు రుదపద్యత. 11
స సత్యవచనా ద్వీర స్సశరీరో దివం గతః.

అనరణ్యునకు మహాభుజుడగు పృథువు పుట్టెను. అతనికి త్రిశంకు మహారాజు జన్మించెను. సత్యవ్రతుడు వీరుడగు నతడు శరీరముతో స్వర్గమున కేగెను.

త్రిశంకో రభవ త్సూను ర్ధుందుమారో మహాయశాః, 12
ధుందుమారా న్మహాతేజా యువనాశ్వో వ్యజాయత,

త్రిశంకువునకు మహాయశస్వియగు దుందుమారుడు కలిగెను. ఆ దుందుమారునకు మహాతేజశ్శాలియగు యువనాశ్వుడు పుట్టెను.

యువనాశ్వసుత శ్శ్రీమా న్మాంధాతా సమపద్యత. 13
మాంధాతుస్తు మహాతేజా స్సుసంధి రుదపద్యత.

యువనాశ్వునకు మాంధాతయను తనయుడు పుట్టెను. అతనికి మహాతేజస్వియగు సుసంధి పుట్టెను.

సుసంధే రపి పుత్త్రౌ ద్వౌ ధ్రువసంధిః ప్రసేనజిత్. 14
యశస్వీ ధ్రువసంధేస్తు భరతో రిపుసూదనః,

సుసంధికి ధ్రువసంధి, ప్రసేనజిత్తు అని యిరువురు తనయులు. ధ్రువసంధికి కీర్తిమంతుడు, శత్రునాశకుడగు భరతుడు తనయులు.

భరతాత్తు మహాబాహు రసితో నామ జాయత. 15
యస్యైతే ప్రతిరాజాన ఉదపద్యంత శత్రవః,
హైహయా స్తాలజఙ్ఘాశ్చ శూరాశ్చ శశిబిందవః. 16

భరతునకు మహాభుజుడగు అసితుడు జన్మించెను అతనికి సామంతులగు హైహయులు, తాలజంఘులు, శూరులు, శశిబిందువులు శత్రువులైరి.

తాంస్తు సర్వా న్ప్రతివ్యూహ్య యుద్ధే రాజా ప్రవాసితః,
స చ శైలవరే రమ్యే బభూ వాభిరతో మునిః. 17

ఆ అసితుడు వారితో యుద్ధమున తలపడి యోడి, రాజ్యము నుండి వెడలగొట్టబడెను. అతడు నిర్భయముగా నివసింప యోగ్యమగుటచే రమ్యమైన హిమవత్పర్వతముపై మునియై తిరిగెను.

ద్వే చాస్య భార్యే గర్భిణ్యౌ బభూవతు రితి శ్రుతిః,
ఏకా గర్భవినాశాయ సపత్న్యై సగరం దదౌ. 18

అతని భార్యలిద్దరు గర్భవతులై యుండిరి. అందొకర్తె గర్భవినాశము కొఱకు తన సవతికి విషము పెట్టెను.

భార్గవ శ్చ్యవనో నామ హిమవంత ముపాశ్రితః,
త మృషిం సముపాగమ్య కాళిందీ త్వభ్యవాదయత్. 19

పూజ్యుడగు చ్యవనుడను మహర్షి హిమవత్పర్వతముపై నుండెను. అసితుని భార్యలలో కాళింది యనునామె యాయనను చేరి ప్రణమిల్లెను.

స తా మభ్యవద ద్విప్రో వరేప్సుం పుత్త్రజన్మని,
పుత్త్ర స్తే భవితా దేవి! మహాత్మా లోకవిశ్రుతః, 20
ధార్మికశ్చ సుశీలశ్చ వంశకర్తాఽరిసూదనః.

పుత్రుడు కలుగునట్లు వరము కాంక్షించుచున్న ఆమె కా విప్రుడు 'ఓ దేవీ! నీకు మహాత్ముడు, లోకప్రసిద్ధుడు, ధార్మికుడు, సుశీలము కలవాడు, వంశకర్త, శత్రునాశకుడగు తనయుడు కలుగగలడు" అనెను.

కృత్వా ప్రదక్షిణం హృష్టా మునిం త మనుమాన్య చ, 21
పద్మపత్రసమానాక్షం పద్మగర్భసమప్రభమ్,
తత స్సా గృహ మాగమ్య దేవీ పుత్త్రం వ్యజాయత. 22

అంత నామె హర్షము నొంది, మునికి ప్రదక్షిణ మొనర్చి, ఆయన యనుమతి వడసి ఇంటికి వచ్చి తామరరేకులవంటి కన్నులు గలిగి, బ్రహ్మతేజముతో వెలుగొందు కుమారుని కనెను.

సపత్న్యా తు గర స్తస్యై దత్తో గర్భజిఘాంసయా,
గరేణ సహ తేనైవ జాత స్స సగరోఽభవత్. 23

ఆమెకు సవతి గర్భవిచ్ఛేదమునకై గరము (విషము) నిచ్చెను. ఆ గరముతో కూడి పుట్టినవాడగుటచే నతడు సగరుడాయెను

స రాజా సగరో నామ య స్సముద్ర మఖానయత్,
ఇష్ట్వా పర్వణి వేగేన త్రాసయంత మిమాః ప్రజాః. 24

ఆ సగరమహారాజు యజ్ఞ దీక్షనొంది, పర్వములందు అతి వేగముతో ప్రజలను భయపెట్టు సముద్రమును త్రవ్వించెను.

అసమంజ స్తు పుత్రోఽభూ త్సగరస్యేతి న శ్శ్రుతః,
జీవన్నేవ స పిత్రా తు నిరస్తః పాపకర్మకృత్. 25

సగరుని కుమారుడసమంజుడని వినుదుము. అతడు పాప కృత్యములు చేయుచు తండ్రిచే దేశమునుండి వెడలగొట్టబడెను.

అంశుమా నితి పుత్రోఽభూ దసమంజస్య వీర్యవాన్,
దిలీపోఽంశుమతః పుత్రో దిలీపస్య భగీరథః. 26

అసమంజున కంశుమంతుడను పరాక్రమశాలియగు పుత్రుడు పుట్టెను. అంశుమంతుని పుత్రుడు దిలీపుడు. దిలీపుని కుమారుడు భగీరథుడు.

భగీరథా త్కకుత్స్థస్తు కాకుత్స్థా యేన విశ్రుతాః,
కకుత్స్థస్య తు పుత్రోఽభూ ద్రఘు ర్యేన తు రాఘవాః. 27

భగీరథునకు కకుత్స్థుడు జన్మించెను. అతనివల్లనే అతని వంశమువారు కాకుత్స్థులని ప్రసిద్ధి నొందిరి. కకుత్స్థుని కుమారుడు రఘువు అతనిచే నా వంశమువారు రాఘవులని పిలువబడిరి.

రఘోస్తు పుత్ర స్తేజస్వీ ప్రవృద్ధః పురుషాదకః,
కల్మాషపాద స్సౌదాస ఇత్యేవం ప్రథితో భువి. 28

రఘువు కుమారుడు తేజశ్శాలియగు కల్మాషపాదుడు. అతడే పెరిగి పెద్దయై పురుషాదకుడు, సౌదాసుడు అని ప్రసిద్ధి నందెను.

కల్మాషపాదపుత్త్రోఽభూ చ్ఛంఖణ స్త్వితి విశ్రుతః,
య స్తు తద్వీర్య మాసాద్య సహసైన్యో వ్యనీనశత్. 29

కల్మాషపాదునకు శంఖణుడను తనయుడు కలిగెను. వసిష్ఠుని శాపముచే రాక్షసుడైన కల్మాషపాదునిచేతనే శంఖణుడు సైన్యముతో గూడ చంపబడెను.

శంఖణస్య తు పుత్త్రోఽభూ చ్ఛూర శ్శ్రీమా న్సుదర్శనః,
సుదర్శన స్యాగ్నివర్ణో హ్యగ్నివర్ణస్య శీఘ్రగః. 30

శంఖణునకు శూరుడు, శ్రీమంతుడగు సుదర్శనుడను తనయుడు కలిగెను. అతని కుమారు డగ్నివర్ణుడు. అగ్నివర్ణుని పుత్రుడు శీఘ్రగుడు.

శీఘ్రగస్య మరుః పుత్త్రో మరోః పుత్త్రః ప్రశుశ్రుకః,
ప్రశుశ్రుకస్య పుత్త్రోఽభూ దమ్బరీషో మహాద్యుతిః. 31

శీఘ్రగుని కుమారుడు మరువు. అతని కుమారుడు ప్రశుశ్రుకుడు. ప్రశుశ్రుకుని కుమారుడే మహాతేజస్వియగు అంబరీషుడు.

అంబరీషస్య పుత్త్రోఽభూ న్నహుష స్సత్యవిక్రమః,
నహుషస్య చ నాభాగః పుత్త్రః పరమధార్మికః. 32

అంబరీషుని కుమారుడు సత్యపరాక్రముడగు నహుషుడు. నహుషుని కుమారుడు నాభాగుడు. అతడు మహాధార్మికుడు.

అజ శ్చ సువ్రత శ్చైవ నాభాగస్య సుతా వుభౌ,
అజ స్యైవ చ ధర్మాత్మా రాజా దశరథ స్సుతః. 33

అజుడు, సువ్రతుడు అని నాభాగున కిరువురు తనయులు. వారిలో అజుని తనయుడే ధర్మాత్ముడగు దశరథమహారాజు.

తస్య జ్యేష్ఠోఽసి దాయాదో రామ ఇ త్యభివిశ్రుతః,
తద్గృహాణ స్వకం రాజ్య మవేక్షస్వ జనం నృప!. 34

ఆయన జ్యేష్ఠపుత్రుడవగు నీవు రాముడను నామముతో ప్రసిద్ధి నందినవాడవు. కావున నీ రాజ్యమును స్వీకరించి యీ జనులను కటాక్షింపుము.

ఇక్ష్వాకూణాం హి సర్వేషాం రాజా భవతి పూర్వజః,
పూర్వజే నావరః పుత్త్రో జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే. 35

ఇక్ష్వాకువంశ్యు లందరిలో మొదట పుట్టినవాడే రాజగు చున్నాడు. అట్లు జ్యేష్ఠు డుండగా కనిష్ఠుడు రాజ్యమున నభిషేకించబడుట లేదు.

స రాఘవాణాం కులధర్మ మాత్మన
స్సనాతనం నాద్య విహంతు మర్హసి,
ప్రభూతరత్నా మనుశాధి మేదినీం
ప్రభూతరాష్ట్రాం పితృవ న్మహాయశః. 36

అట్లు జ్యేష్ఠుడవగు నీవు, నీకు సంబంధించిన రాఘవులకు పరంపరాగతమగు జ్యేష్ఠాభిషేచన రూపమగు కులధర్మమును నీవు మొదలుకొని తప్పించుట తగదు. నీ తండ్రివలె మహా

కీర్తిశాలివై శ్రేష్ఠవస్తువులతో, బహువిధములగు అవాంతర రాష్ట్రములతో కూడిన భూమిని పరిపాలింపుము" అని వసిష్ఠుడు రామునితో చెప్పెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
దశోత్తరశతతమః సర్గః.
ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటపదియవ సర్గము సమాప్తము.

---

## ఏకాదశోత్తరశతతమః సర్గః -
## నూటపదునొకండవసర్గము

వసిష్ఠ స్తు తదా రామ ముక్త్వా రాజపురోహితః,
అబ్రవీ ద్ధర్మసంయుక్తం పున రే వాపరం వచః. 1

రాజపురోహితు డగు వసిష్ఠు డావిధముగ రామునితో పలికి మఱల ధర్మసంగతమగు నీ వాక్యము పలికెను.

పురుష స్యేహ జాతస్య భవంతి గురవ స్త్రయః,
ఆచార్య శ్చైవ కాకుత్స్థ ! పితా మాతా చ రాఘవ!. 2

కాకుత్స్థుడవగు ఓ రామా! పుట్టిన ప్రతివానికి తల్లి దండ్రులు, ఆచార్యుడు వీరు ముగ్వురును గురువులు.

పితా హ్యేనం జనయతి పురుషం పురుషర్షభ!,
ప్రజ్ఞాం దదాతి చాచార్య స్తస్మా త్స గురు రుచ్యతే. 3

ఓ పురుషశ్రేష్ఠుడా! తండ్రి (తల్లియు) పురుషునకు జన్మ

నిచ్చును. ఆచార్యు డతనికి ఉత్తమ జ్ఞానము నిచ్చును. (తల్లి దండ్రులు కేవలము శరీరము నిత్తురు. ప్రజ్ఞవలన నతనిని సృజించును. కావున ఈ జన్మ శ్రేష్ఠము) కావున ఆచార్యుడు గురు వనబడును.

సోఽహం తే పితు రాచార్య స్తవ చైవ పరంతప।,
మమ త్వం వచనం కుర్వ న్నాతివర్తే స్సతాం గతిమ్. 4

ఓ శత్రువులను పీడించువాడా! నేను నీ తండ్రికిని, నీకును ఆచార్యుడను. నీవు నా వచనము నాచరించుచు నీ పూర్వులగు రాజుల మార్గము నతిక్రమింపనివాడ వగుము.

ఇమా హి తే పరిషద శ్శ్రేణయ శ్చ ద్విజా స్తథా,
ఏషు తాత! చర న్ధర్మం నాతివర్తే స్సతాం గతిమ్. 5

నాయనా! ఈ బ్రాహ్మణసమూహములు, పురజనులు, క్షత్రియులు, వైశ్యులును నీవారే. వీరి విషయమున పరిపాలన రూపమగు ధర్మము నాచరించుచు నీ పూర్వుల మార్గము నతిక్రమింపని వాడవు కమ్ము.

వృద్ధాయా ధర్మశీలాయా మాతు ర్నార్హ స్యవర్తితుమ్,
అస్యా స్తు వచనం కుర్వ న్నాతివర్తే స్సతాం గతిమ్. 6

'పితుః శతగుణం మాతా' (తండ్రికంటె నూరురెట్లు మాన్యురాలు తల్లి) అన్నట్లు ముదుసలియు, ధర్మస్వభావము కలదియు అగు నీ తల్లికి శుశ్రూష చేయకుండుట తగదు. ఆమె మాట పాలించుచు నీ పూర్వుల మార్గము నతిక్రమింపని వాడవు కమ్ము.

భరతస్య వచః కుర్వ న్యాచమానస్య రాఘవ!,
అత్మానం నాతివర్తే స్త్వం సత్యధర్మపరాక్రమ!, 7

సత్యధర్మముల ననుష్ఠించుటలో శూరుడవగు రామా! నిన్ను బహుధా ప్రార్థించుచున్నవాడు, ఆత్మభూతు డగు భరతుని మాట నతిక్రమింపకుము. (ఇచట ఆత్మానం అనుదానికి- నీ సత్యధర్మ నిష్ఠాతత్వరూప స్వభావమును లేదా నీ సాధారణ ధర్మ మగు ఆశ్రిత పారతంత్ర్యమును అతిక్రమింపకుము అని యాచార్యోక్తి. ఆశ్రితపారతంత్ర్యమే సర్వేశ్వరుని స్వతస్సిద్ధమగు స్వభావము. ఎట్లు సత్యవచన మతిక్రమింపదగదో, ఎట్లు ధర్మ మతిక్రమింపరానిదో, అట్లే ఆశ్రితపరతంత్రతయు నీ కతిక్రమింప రానిదని భావము.

ఏవం మధుర ముక్త స్సన్ గురుణా రాఘవ స్స్వయమ్,
ప్రత్యువాచ సమాసీనం వసిష్ఠం పురుషర్షభః. 8

అని యిట్లు మధురముగా వసిష్ఠుడు పలుకగా, దానికి పురుషశ్రేష్ఠు డగు రాముడు వసిష్ఠున కిట్లు బదులు పలికెను.

య న్మాతాపితరౌ వృత్తం తనయే కురుత స్సదా,
న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతమ్, 9
యథాశక్తిప్రదానేన స్నాపనోచ్ఛాదనేన చ,
నిత్యం చ ప్రియవాదేన తథా సంవర్ధనేన చ. 10

పుత్రసంతానము బడయుటకై తల్లిదండ్రులు లే యే వ్రతము లాచరింతురో, ఉపవాసములు చేతురో, దేవతల నారాధింతురో అది లేశమాత్రముకూడ వారికి ప్రత్యుపకారము చేసి తీర్చుకొన

రానిది. అట్లే తనయుడు జన్మించిన తరువాతకూడ తమ శక్తి కొలది స్తన్యము నిచ్చి, అహారాదుల నొసగి, బుజ్జగింపు మాటలు పలికి, కంటికి రెప్పవలె కాపాడి పెంచుటద్వారా తల్లిదండ్రు లేమి చేసిరో తనయుడు దానికి ప్రత్యుపకారము చేయుట సాధ్యముకాని పని.

విశే : 'ధర్మి యున్నపుడు ధర్మములను గూర్చిన ఆలోచన చేయుట' (సతి ధర్మిణి ధర్మా శ్చింత్యన్తే) అను న్యాయము. ననుసరించి, సర్వధర్మములను సంపాదించుటకు మూలభూత మగు శరీరము నిచ్చినవా డగుటచేతను, బాల్యమున అత్యంతము అజ్ఞాన దశలో కూడ సర్వవిధములుగ సంరక్షించి బహువిధ ములుగ నుపకరించినవా డగుటచేతను అచార్యుని మాటకంటె తండ్రిమాటయే తప్పక నెఱవేర్ప వలయును కావుననే ప్రాధాన్య క్రమములో అచార్యునకు 'మాతృదేవో భవ- పితృదేవో భవ- ఆచార్యదేవో భవ' అని తృతీయస్థాన మీయబడినదే కాని ప్రథమ స్థానము కాదు. ఈ యభిప్రాయమునే పై శ్లోకము తెలుపును.

స హి రాజా జనయితా పితా దశరథో మమ,
అజ్ఞాతం య న్మయా తస్య న త న్మిథ్యా భవిష్యతి. 11

దశరథమహారాజు నా కన్నతండ్రి. నే నాయన కడ చేసిన ప్రతిజ్ఞ అసత్యము కానేరదు. (అయనకు నేను మొదట వాగ్దానము చేసియుంటిని కాన నిపుడు మాతృవచనము, సోదరవచనము పాటింపదగ నని భావము )

ఏవ ముక్తస్తు రామేణ భరతః ప్రత్యనంతరమ్,
ఉవాచ పరమోదార స్సూతం పరమదుర్మనాః. 12

రాము డిట్లు పలుకగా. పరమోదారు డగు భరతుడు, మనస్సు విచారము నొందగా, సమీపమం దున్న సూతున కిట్లనెను.

ఇహ మే స్థండిలే శీఘ్రం కుశా నాస్తర సారథే।,
అర్యం ప్రత్యుపవేక్ష్యామి యావ న్మే న ప్రసీదతి. 13

సారథీ ! నా కిచ్చటనే నేలపై దర్భలు పఱచుము. పూజ్యు డగు రాముడు ప్రసన్నుడగు వఱకు ఇచటనే పరుండి ఆయన గమనమును నిరోధింతును.

అనాహారో నిరాలోకో ధనహీనో యథా ద్విజః,
శేష్యే పురస్తా చ్ఛాలాయా యావన్న ప్రతియాస్యతి. 14

వడ్డీ కాశపడి ధన మప్పుగా నిచ్చి, దానిని తీర్పని ఋణ గ్రస్తుని యింటివాకిట అడ్డముపడిన ధనహీనుడగు బ్రాహ్మణుని వలె నే నాహారము విడచి, ముఖమునకు ముసుగువైచుకొని, ఈ పర్ణశాల యెదుటనే, నాయన్న అయోధ్యకు మఱలివచ్చువఱకు పరుండెదను.

స తు రామ మవేక్షంతం సుమంత్రం ప్రేక్ష్య దుర్మనాః,
కుశోత్తర ముపస్థాప్య భూమా వేవాఽస్తర త్స్వయమ్. 15

సుమంత్రుడు రాముని యనుజ్ఞకోరి చూచుచుండుట గమనించి భరతుడు ఖిన్నుడై తానే స్వయముగ దర్భాస్తరణము తెచ్చి నేలపై పఱచెను.

తమువాచ మహాతేజా రామో రాజర్షిసత్తమః,
కిం మాం భరత! కుర్వాణం తాత। ప్రత్యుపవేక్ష్యసి. 16

అంత మహాతేజశ్శాలి, రాజర్షిశ్రేష్ఠు డగు రాము డతని కిట్లనెను- 'నాయనా! నే నే యపకారము నీకు చేసితినని నా వాకిట నిలచి నన్ను నిరోధింతువు?'

బ్రాహ్మణో హ్యేకపార్శ్వేన నరా న్రోద్ధు మిహార్హతి,
న తు మూర్ధాభిషిక్తానాం విధిః ప్రత్యుపవేశనే. **17**

తనకు ధన మీయవలసిన వానినుండి వడ్డీతో ధనము రాబట్టుకొనగోరు బ్రాహ్మణున కట్లు ఒక ప్రక్కకు పరుండి, ఋణగ్రస్తు నడ్డగింప దగును. రా జట్లు చేయుట విధిసమ్మతము కాదు.

ఉత్తిష్ఠ నరశార్దూల! హి త్వ్మేత ద్దారుణం వ్రతమ్,
పురవర్యా మితః క్షిప్ర మయోధ్యాం యాహి రాఘవ!. **18**

నరశ్రేష్ఠుఁ డవగు ఓ భరతుడా! నీ వీ ఘోర నియమమును వీడి, శీఘ్రమే పురవరమగు అయోధ్యకు మఱలిపొమ్ము" అనెను.

ఆసీన స్త్వేవ భరతః పౌరజానపదం జనమ్,
ఉవాచ సర్వతః ప్రేక్ష్య కి మార్యం నానుశాసథ. **19**

భరతు డట్లు కుశాసనముపై కూర్చుండియే పట్టణ, గ్రామ వాసులగు జనుల నెల్లెడల కలయజూచి- 'పూజ్యుడగు రామునకు మీ రెవ్వరును ఇట్లు చేయుమని చెప్పలేరా?' యనెను.

తే త మూచు ర్మహాత్మానం పౌరజానపదా జనాః,
కాకుత్స్థ మభిజానీమ స్సమ్యగ్వదతి రాఘవః. **20**

ఏషోఽపి హి మహాభాగః పితు ర్వచసి తిష్ఠతి,
అత ఏవ న శక్తాః స్మో వ్యావర్తయితు మంజసా. **21**

అపుడా నగరవాసులు, పల్లెజనులును మహాత్ముడగు భరతున కిట్లనిరి— 'రాముని సత్యసంధునిగా మే మెఱుగుదుము. అతడు చెప్పినది సమంజసముగా నున్నది. ఆయన తండ్రి యాజ్ఞ పాలించుచున్నాడు. కావుననే వెంటనే ఆయనను మఱలింపలేకున్నాము' అనిరి.

తేషా మాజ్ఞాయ వచనం రామో వచన మబ్రవీత్,
ఏవం నిబోధ వచనం సుహృదాం ధర్మచక్షుషాః. 22

వారి వాక్యము విని రాము డిట్లనెను— "తమ్ముడా! ధర్మము నెఱిగిన మిత్రు లేమనుచున్నారో వినుము."

ఏత చ్చైవో భయం శ్రుత్వా సమ్య క్సంపశ్య రాఘవ!,
ఉత్తిష్ఠ త్వం మహాబాహో! మాం చ స్పృశ తథోదకమ్. 23

రాఘవుడవగు భరతుడా! నీవు నా మాటను, వీరిమాటను కూడ విని, చక్కగా కర్తవ్యమును పరికింపుము, క్షత్రియులకు విధింపబడని ప్రత్యుపవేశమునకు ప్రాయశ్చిత్తముగ జలము తాకి, నన్ను స్పృశింపుము. (వసిష్ఠాదు లుండగా తన్నే తాకుమనుటకు 'ఇటుపై నెన్నడును ఇట్లు చేయ'నని శపథము కొఱకు)

అ థోత్థాయ జలం స్పృష్ట్వా భరతో వాక్య మబ్రవీత్,
శృణ్వంతు మే పరిషదో మంత్రిణ శ్శ్రేణయ స్తథా. 24

న యాచే పితరం రాజ్యం నానుశాసామి మాతరమ్,
ఆర్యం పరమధర్మజ్ఞం నానుజానామి రాఘవమ్. 25

యది త్వవశ్యం వస్తవ్యం కర్తవ్యం చ పితు ర్వచః,
అహమేవ నివత్స్యామి చతుర్దశ సమా వనే. 26

అంత భరతుడు లేచి నీరు తాకి యిట్లనెను– 'సభ్యులారా! మంత్రులారా! ప్రజలారా! నా యీ వాక్యము వినుడు- నేను నా తండ్రిని రాజ్య మిమ్మని యడుగలేదు. నా తల్లి నిట్లు వరము కోరు మనలేదు. మిక్కిలి ధర్మజ్ఞుడగు నా యన్న రాము డడవికి పోవుటను నే నంగీకరింపనులేను. తండ్రి మాటయే తప్పక ఆచరింపవలయుచో, అరణ్యముననే నివసింపవలయుచో నేనే పదునాలుగేం డ్లరణ్యవాసము చేతును.

ధర్మాత్మా తస్య తథ్యేన భ్రాతు ర్వాక్యేన విస్మితః,
ఉవాచ రామ స్సంప్రేక్ష్య పౌరజానపదం జనమ్. 27

ధర్మాత్ము డగు రాముడు తన తమ్ముడు పలికిన యీ వాక్యమున కాశ్చర్యపడి పౌరులను, జానపదులను చూచి యిట్లనెను.

విక్రీత మాహితం క్రీతం యత్పిత్రా జీవతా మమ,
న త ల్లోపయితుం శక్యం మయా వా భరతేన వా. 28

జీవించియున్నపుడు తండ్రిచేసిన విక్రయము, కుదువ యుంచుట, క్రయములను నేను కాని భరతుడుగాని మార్చ తగదు. (ప్రస్తుత మేమన– "తండ్రి నాకు వనవాస మిచ్చి, దానికి మూల్యముగ రాజ్యము స్వీకరించినాడు లేదా నా వనవానమునే కుదువ బెట్టి నీకు రాజ్య మిప్పించినాడు. కాన దానిని మార్చ రాదు అని.")

ఉపధి ర్న మయా కార్యో వనవాసే జుగుప్సితః,
యుక్త ముక్తం చ కైకేయ్యా పిత్రా మే సుకృతం కృతమ్.29

నేను వనవాసమును ప్రతినిధికి విడువరాదు. శక్తియుండి యును అట్లు చేయుట హీనకర్మ యగును. కైకేయి యోగ్యముగనే పలికినది. నా తండ్రి ధర్మమునే యాచరించినాడు. (కావున మన మట్లు చేయకుండుట తండ్రిమాట తప్పినట్లే.)

జానామి భరతం క్షాంతం గురుసత్కారకారిణమ్,
సర్వ మే వాత్ర కల్యాణం సత్యసంధే మహాత్మని. 30

భరతుడు సహనము కలవాడని, గురుభక్తి కలవాడని నే నెఱుగుదును. సత్యసంధుడు, మహాత్ముడగు భరతునకు సర్వము శుభమగుగాక!

అనేన ధర్మశీలేన వనా త్ప్రత్యాగతః పునః,
భ్రాత్రా సహ భవిష్యామి పృథివ్యాః పతి రుత్తమః. 31

నే నడవినుండి తిరిగివచ్చి ధర్మశీలు డగు నీ సోదరునితో కలసి యీ భూమికి ఉత్తమ పాలకుడ నయ్యెదను.

వృతో రాజా హి కైకేయ్యా మయా తద్వచనం కృతమ్,
అనృతా న్మోచయానేన పితరం తం మహీపతిమ్. 32

కైక మహారాజును వరము కోరినది. నేను మన తండ్రి యగు మహారాజు నసత్యమునుండి విడిపించుచు అయన మాట పాలించితిని.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకాదశోత్తరశతతమ స్సర్గః.

ఇట్లు ఋషి ప్రోక్తము, అదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నూటపదునొకండవసర్గము సమాప్తము.

---

## ద్వాదశోత్తరశతతమః సర్గః - నూటపండ్రెండవ సర్గము

త మప్రతిమతేజోభ్యాం భ్రాతృభ్యాం రోమహర్షణమ్,
విస్మితా స్సంగమం ప్రేక్ష్య సమవేతా మహర్షయః. 1

పరస్పర సౌహార్దకరంబితము, గగుర్పాటు, కలిగించు నది యగు ఆ సోదరుల కలయికను చూచి యటకూడిన మహర్షు లెల్ల రాశ్చర్యము నందిరి.

అంతర్హితా స్త్వృషిగణా స్సిద్ధా శ్చ పరమర్షయః,
తౌ భ్రాతరౌ మహాత్మానౌ కాకుత్స్థౌ ప్రశశంసిరే. 2

అంతర్ధానము నందిన ఋషిసమూహములు, సిద్ధులు, మహర్షులును మహాత్ములు, సోదరులు అగు ఆ కాకుత్స్థులను ప్రశంసించిరి

స ధన్యో యస్య పుత్రౌ ద్వౌ ధర్మజ్ఞౌ ధర్మవిక్రమౌ,
శ్రుత్వావయంహి సంభాషా ముభయో స్స్పృహయామహే.

ధర్మజ్ఞులు, ధర్మశూరులగు వీ రిద్ద రెవరి బిడ్డలో ఆ దశరథ మహారాజు ధన్యుడు. వీరి సంభాషణము విని మే మింకను అట్టి సంభాషణము వినగోరుచున్నాము.

తత స్త్వృషిగణాః క్షిప్రం దశగ్రీవవధైషిణః,
భరతం రాజశార్దూల మిత్యూచు స్సంగతా వచః. 4

అపుడు రావణుని వధను కోరు ఋషు లెల్లరు కూడి రాజ శ్రేష్ఠుడగు భరతున కిట్లనిరి.

కులే జాత! మహాప్రాజ్ఞ! మహావృత్త! మహాయశః!,
గ్రాహ్యం రామస్య వాక్యం తే పితరం య ద్యవేక్షసే. 5

ఉత్తమకులసంజాతుడవు, మహాబుద్ధిశాలివి, ఉత్తమ ప్రవర్తన కలవాడవు, మహాకీర్తిశాలివగు ఓ భరతుడా! నీవు నీ తండ్రి సుఖముగ నుండుటనే కోరుచో రాముని వాక్యమును నీ వనుసరింపదగును.

సదాఽనృణ మిమం రామం వయ మిచ్ఛామహే పితుః,
అనృణత్వా చ్చ కైకేయ్యా స్స్వర్గం దశరథో గతః. 6

రాముడు సదా తండ్రి ఋణము తీర్చినవాడుగనే యుండ వలెనని మా కోరిక. కైకేయి ఋణము తీర్చినందుననే దశరథుడు స్వర్గమున కేగినాడు.

ఏతావ దుక్త్వా వచనం గంధర్వా స్సమహర్షయః,
రాజర్షయ శ్చైవ తదా సర్వే స్వాం స్వాం గతిం గతాః.7

అని యిట్లు గంధర్వులు, మహర్షులు, రాజర్షులును పలికి యందరును వెంటనే తమ తమ మార్గములు బట్టి పోయిరి.

హ్లాదిత స్తేన వాక్యేన శుభేన శుభదర్శనః,
రామ స్సంహృష్టవదన స్తా నృషీ నభ్యపూజయత్. 8

శుభదర్శనుడగు రాముడు వారి యా శుభవచనముల కానందించి, ముఖమున హర్షము వెలయగా నా ఋషులను పూజించెను.

త్రస్తగాత్రస్తు భరత స్స వాచా సజ్జమానయా,
కృతాంజలి రిదం వాక్యం రాఘవం పున రబ్రవీత్. 9

(తన యభీష్ట మెంతమాత్రము నెఱవేఱకుండుటచే) వెలుగందిన శరీరము గలవాడై భరతుడు పలుకులు తొట్రుపడగా రాముని కంజలి ఘటించి యిట్లనెను.

రాజధర్మ మనుప్రేక్ష్య కులధర్మానుసంతతిమ్,
కర్తు మర్హసి కాకుత్స్థ! మమ మాతు శ్చ యాచనామ్. 10

ఓ కాకుత్స్థుడా! వంశక్రమానుగత మగు జ్యేష్ఠాభిషేక రూపమగు ధర్మమును, రాజ్యపరిపాలన రూప ధర్మమును దృష్టి నిడుకొని, నా ప్రార్థనను, నా తల్లికోరికను తీర్పదగుదువు.

రక్షితుం సుమహ ద్రాజ్య మహ మేక స్తు నోత్సహే,
పౌరజానపదాం శ్చాపి రక్తా న్రంజయితుం తథా. 11

ఇంత పెద్ద రాజ్యమును నే నొక్కడను కాపాడ నుత్సహింపను. అట్లే నీయం దనురక్తులైన పౌరులను, పల్లెప్రజలను రంజింపజేయుటకును నే నొంటరిగా నిష్టపడను.

జ్ఞాతయశ్చ హి యోధా శ్చ మిత్రాణి సుహృద శ్చ నః,
త్వామేవ ప్రతికాంక్షన్తే పర్జన్య మివ కర్షకాః. 12

బంధువులు, యోధులు, ఉత్తమమగు మనస్సుకల మన

మిత్రులును, కృషీవలులు ఉరుముచున్న మబ్బునుబోలె నిన్నే కోరుచున్నారు.

ఇదం రాజ్యం మహాప్రాజ్ఞ! స్థాపయ ప్రతిపద్య హి,
శక్తిమా నసి కాకుత్స్థ! లోకస్య పరిపాలనే. 13

ఓ మహాబుద్ధిమంతుడవగు కాకుత్స్థుడా! ఈ రాజ్యమును స్వీకరించి కుదురుకొలుపుము. నీ వీ లోకమును కాపాడ సమర్థుడవు.

ఇత్యుక్త్వా న్యపత ద్భ్రాతుః పాదయో ర్భరత స్తదా,
భృశం సంప్రార్థయామాస రామ మేవ ప్రియంవదః. 14

ప్రియము పలుకువాడగు భరతు డట్లు పలికి తోడనే యన్న పాదములపై పడి, మాటిమాటికి రాజ్యము స్వీకరింపుమని యన్నను ప్రార్థించెను.

త మంకే భ్రాతరం కృత్వా రామో వచన మబ్రవీత్,
శ్యామం నళినపత్రాక్షం మత్తహంసస్వరం స్వయమ్ 15

రాముడు శ్యామలదేహుడును, కమలనేత్రుడును అగు తమ్ముని తొడపై కూర్చుండబెట్టుకొని, మదించిన హంస స్వరమును బోలు కంఠముతో నిట్లు మెల్లగా నిట్లనెను.

ఆగతా త్వా మియం బుద్ధి స్స్వజా వైనయికీ చ యా,
భృశ ముత్సహసే తాత! రక్షితుం పృథివీ మపి. 16

నాయనా! సహజము, గురుశిక్షణవల్ల కలిగినది అగు నీ

యుభయవిధమగు బుద్ధియు ముందే నీ కున్నది. కాన నీవు భూమిని కాపాడ సమర్థుడవు.

అమాత్యై శ్చ సుహృద్భి శ్చ బుద్ధిమద్భిశ్చ మంత్రిభిః,
సర్వకార్యాణి సమ్మంత్ర్య సుమహా న్త్యపి కారయ. 17

ప్రధాన మంత్రులతోను, మిత్రులతోడను, బుద్ధిమంతులగు ఉపమంత్రులతోడను అన్నికార్యములను చర్చించి, పెద్దపనులు కూడ చేయింపుము.

లక్ష్మీ శ్చంద్రా దపేయాద్వా హిమవాన్వా హిమం త్యజేత్,
అతీయా త్సాగరో వేలాం న ప్రతిజ్ఞా మహం పితుః. 18

కాంతి చంద్రుని విడచినను, హిమాలయము మంచు లేనిదైనను, సముద్రమే యవధి మీరినను నేను తండ్రికి చేసిన ప్రతిజ్ఞ వీడను.

కామా ద్వా తాత లోభా ద్వామాత్రా తుభ్య మిదం కృతమ్,
న త న్మనసి కర్తవ్యం వర్తితవ్యం చ మాతృవత్. 19

విషయ స్నేహమువలనగాని, రాజ్యముచే పరిపాలనాధి కారము చేపట్టవలెనను లోభముచేగాని తల్లి నీకీ పని చేసినది. దానిని నీవు మనసులో నుంచుకొనకుము. తల్లి కనుగుణముగ నడచుకొమ్ము

ఏవం బ్రువాణం భరతః కౌసల్యాసుత మబ్రవీత్,
తేజసాఽఽదిత్యసంకాశం ప్రతిపచ్చంద్రదర్శనమ్. 20

సూర్యునివలె తేజశ్శాలియు, చంద్రునివలె ఆహ్లాదకారియు అగు తన యన్న యిట్లు పలుకగా భరతు డతని కిట్లనెను.

అధిరోహాఽర్య! పాదాభ్యాం పాదుకే హేమభూషితే,
ఏ తే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః. 21

పూజ్యుడా! బంగారముతో నలంకరింపబడిన యీ పాదుకలపై ని పాదముల నుంచుము. ఇవియే సకల లోకమునకు యోగక్షేమములను కలిగించును.

సోఽధిరుహ్య నరవ్యాఘ్రః పాదుకే హ్యవరుహ్య చ,
ప్రాయచ్ఛ త్సుమహాతేజా భరతాయ మహాత్మనే. 22

మహాతేజశ్శాలి, నరశ్రేష్ఠుడగు రాము డా పాదుకలను తొడిగికొని, మరల వానిని విడచి, మహాత్ముడగు భరతున కిచ్చెను.

స పాదుకే సంప్రణమ్య రామం వచన మబ్రవీత్,
చతుర్దశ హి వర్షాణి జటాచీరధరో హ్యహమ్, 23
ఫలమూలాశనో వీర! భవేయం రఘునందన!,
తవాఽఽగమన మాకాఙ్క్ష న్వసన్వై నగరా ద్బహిః. 24
తవ పాదుకయో ర్న్యస్తరాజ్యతంత్రః పరంతప!,
చతుర్దశే హి సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ! 25
న ద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్.

భరతు డా పాదుకలకు ప్రణమిల్లి రామున కిట్లనెను-'పరంత

వగు రాఘువుడా! పదునాలుగు సంవత్సరములు జడలు, నార వస్త్రములు దాల్చి, ఫలములు, దుంపలు తినుచు, నీ రాక కెదురుచూచుచు, నగరము బయట నివసించుచు, నీ పాదుకల పైననే రాజ్యతంత్రముల నుంచెదను. పదునాల్గవ సంవత్సరము పూర్తియగుట తోడనే నిన్ను చూడనిచో నేనగ్నిప్రవేశ మొనరింతును.

తథేతి చ ప్రతిజ్ఞాయ తం పరిష్వజ్య సాదరమ్, 26
శత్రుఘ్నం చ పరిష్వజ్య భరతం చేద మబ్రవీత్.

రాము డట్లే యని భరతునకు వాగ్దాన మొసగి యాదరముతో నతనిని కౌగలించుకొని, శత్రుఘ్నుని గూడ పరిష్వంగము చేసి, భరతున కిట్లనెను.

మాతరం రక్ష కైకేయీం మా రోషం కురు తాం ప్రతి, 27
మయా చ సీతయా చైవ శప్తోఽసి రఘునందన!,
ఇత్యుక్త్వాఽశ్రుపరీతాక్షో భ్రాతరం విససర్జ హ. 28

నీ తల్లి కైకేయిని కాపాడుము. అమెపై కోపింపకుము. నే నిది నాపై, సీతపై ఆనపెట్టి చెప్పుచున్నాను, అని పలికి రాముడు కన్నుల నీరునిండగా భరతుని పోయిర మ్మనెను.

స పాదుకే తే భరతః ప్రతాపవాన్
స్వలంకృతే సంపరిపూజ్య ధర్మవిత్,
ప్రదక్షిణం చైవ చకార రాఘవం
చకార తే చోత్తమనాగమూర్ధని. 29

ధర్మ మెఱిగినవాడు, ప్రతాపశాలి యగు భరతుడు చక్కగా నలంకరింపబడిన యా పాదుకలను పూజించి, రామునకు ప్రదక్షిణ మొనరించెను. పిమ్మట ఆ పాదుకలను రాజెక్కు శ్రేష్ఠగజముపై పెట్టెను.

అ థాఽనుపూర్వ్యా త్ప్రతినంద్య తం జనం
గురూం శ్చ మంత్రిప్రకృతీ స్తథాఽనుజౌ,
వ్యసర్జయ ద్రాఘవవంశవర్ధన
స్థ్సిర స్స్వధర్మే హిమవా నివాచలః. 30

రఘువంశ వర్ధనుడు, ధీరుడు, తన ధర్మనిర్వహణమున హిమవత్పర్వతము వలె స్థైర్యము కలిగిన వాడగు రాముడు, క్రమానుగతముగగురువులను, మంత్రులను, ప్రజలను, తమ్ము లను ఆదరించి వారిని పోయిరండని పంపెను.

తం మాతరో బాష్పగృహీతకంఠ్యో
దుఃఖేన నామంత్రయితుం హి శేకుః,
స త్వేవ మాతౄ రభివాద్య సర్వా
రుద న్కుటీం స్వాం ప్రవివేశ రామః. 31

అపుడు తల్లులు దుఃఖించుచు బాష్ప మొలుకుటచే కంఠము నుండి మాట వెలువడక, రామునికి పోయివత్తుమని చెప్పజాల రైరి. రాముడే పోయి వారికి నమస్కరించి, రోదించుచు తన కుటీరమును ప్రవేశించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ద్వాదశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణమం దయోధ్యాకాండమున నూటపండ్రెండవ సర్గము సమాప్తము.

---

## త్రయోదశోత్తరశతతమః సర్గః
## నూటపదమూడవ సర్గము

తత శ్శిరసి కృత్వా తు పాదుకే భరత స్తదా,
ఆరురోహ రథం హృష్ట శ్శత్రుఘ్నేన సమన్వితః. **1**

అంతట భరతుడు శత్రుంజయమను ఆ గజశ్రేష్ఠముపై నుంచబడిన పాదుకల నాదరముగ తీసికొని, తన తలపై నిడికొని, ఆనందించినవాడై (తన కోరికకు తగిన కిరీటము లభించెనని ఆనందము, పూర్వము తాను రాజ్యము పాలించుట యందు స్వతంత్రత యగునని భయము, ఇపుడు పాదుకాలాభము చే హర్షము) శత్రుఘ్నునితో గూడి రథ మెక్కెను.

వసిష్ఠో వామదేవ శ్చ జాబాలి శ్చ దృఢవ్రతః,
అగ్రతః ప్రయయు స్సర్వే మంత్రిణో మంత్రపూజితాః. **2**

వసిష్ఠుడు, వామదేవుడు, సడలని నియమముకల జాబాలి, అమోఘమగు కార్యవిచార నైపుణ్యముచే సత్కృతులైన మంత్రు లెల్లరును ముందుగా పోయిరి.

మందాకినీం నదీం రమ్యాం ప్రాఙ్ముఖా స్తే యయు స్తదా,
ప్రదక్షిణం చ కుర్వాణా శ్చిత్రకూటం మహాగిరిమ్. **3**

సీతారాముల జలక్రీడలచే రమ్యమగు మందాకినీ నదికి ప్రదక్షిణ మొనర్చి, వారు తూర్పుదిక్కుగా చిత్రకూట పర్వతము కడ కేగిరి.

పశ్య న్ధాతుసహస్రాణి రమ్యాణి వివిధాని చ,
ప్రయయౌ తస్య పార్శ్వేన ససైన్యో భరత స్తదా. 4

భరతు డపుడు సుందరములగు వివిధ ధాతువులను చూచుచు సైన్యముతో గూడి యా పర్వతము ప్రక్కగా బోయెను.

అదూరా చ్చిత్రకూటస్య దదర్శ భరత స్తదా,
ఆశ్రమం యత్ర స ముని ర్భరద్వాజః కృతాలయః. 5

అంత భరతు డా చిత్రకూటమునకు చెంతనే భరద్వాజుడు నివసించు నాశ్రమము చూచెను.

స త మాశ్రమ మాగమ్య భరద్వాజస్య బుద్ధిమాన్,
అవతీర్య రథా త్పాదౌ వవందే భరత స్తదా. 6

బుద్ధిమంతుడగు భరతుడట్లు భరద్వాజు నాశ్రమమునకు వచ్చి, రథము దిగి, భరద్వాజుని పాదములకు ప్రణమిల్లెను.

తతో హృష్టో భరద్వాజో భరతం వాక్య మబ్రవీత్,
అపి కృత్యం కృతం తాత! రామేణ చ సమాగతమ్. 7

అంత భరద్వాజుడు భరతుని రాకకు ముదమంది 'నాయనా! పని యనుకూలముగ నాయెనా? రాముడు వచ్చెనా' యని యడిగెను.

ఏవముక్త స్స తు తతో భరద్వాజేన ధీమతా,
ప్రత్యువాచ భరద్వాజం భరతో భ్రాతృవత్సలః. 8

అని ధీమంతుడగు భరద్వాజు డడుగగా, అన్నయం దను రాగము కల భరతు డాయన కిట్లనెను.

స యాచ్యమానో గురుణా మయా చ దృఢవిక్రమః,
రాఘవః పరమప్రీతో వసిష్ఠం వాక్య మబ్రవీత్. 9

గురువగు వసిష్ఠుడు, నేనును యాచించినను, నాయన్న రాముడు వసిష్ఠున కిట్లు ప్రీతితో పలికెను.

పితుః ప్రతిజ్ఞాం తా మేవ పాలయిష్యామి తత్త్వతః,
చతుర్దశ హి వర్షాణి యా ప్రతిజ్ఞా పితు ర్మమ 10

'పదునాలుగేండ్లు రాము డరణ్యవాసము చేయు' నని కైకేయి కొఱకై నా తండ్రి చేసిన ప్రతిజ్ఞనే యథాతథముగ పరిపాలింతును.

ఏవ ముక్తో మహాప్రాజ్ఞో వసిష్ఠః ప్రత్యువాచ హ,
వాక్యజ్ఞో వాక్యకుశలం రాఘవం వచనం మహత్. 11
ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమభూషితే,
అయోధ్యాయాం మహాప్రాజ్ఞ! యోగక్షేమకరే తవ. 12

అని రాముడు పలుకగా మహాబుద్ధిశాలి, వాక్యజ్ఞుడు, మాటలాడుటలో నేర్పరి యగు వసిష్ఠు డిట్లు రామునకు ప్రత్యుత్తర మిచ్చెను. 'ఓ మహాప్రాజ్ఞుడా! బంగారుతో నలంకరింపబడిన యీ పాదుకల నానందముతో నిమ్ము. నీ పాదుకలే అయోధ్యలో

అపూర్వ వస్తులాభరూపమగు యోగమును, లబ్ధపరిపాలన రూపమగు క్షేమమును కలిగింపగలవు.

ఏవ ముక్తో వసిష్ఠేన రాఘవః ప్రాఙ్ముఖః స్థితః,
పాదుకే హ్యధిరుహ్యైతే మమ రాజ్యాయ వై దదౌ. 13

అని వసిష్ఠుడు చెప్పగా రాముడు తూర్పుదిక్కుకు తిరిగి పాదుకలపై పాదము లుంచి, వానిని రాజ్యపాలనమున కిచ్చినాడు.

నివృత్తోఽహ మనుజ్ఞాతో రామేణ సుమహాత్మనా,
అయోధ్యా మేవ గచ్ఛామి గృహీత్వా పాదుకే శుభే. 14

మహాత్ముడగు రామునిచే ననుగృహీతుడనై నే నీ శుభకరము లగు పాదుకలను తీసికొని అయోధ్యకే పోవుచున్నాను.

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః,
భరద్వాజ శ్శుభతరం ముని ర్వాక్య ముపాచ తమ్. 15

మహాత్ముడగు భరతుని యీ చక్కని వచనము విని, భరద్వాజుడు మిక్కిలి శుభకరమగు నీ మాట పలికెను.

నైత చ్చిత్రం నరవ్యాఘ్ర! శీలవృత్తవతాం వర!,
యదార్యం త్వయి తిష్ఠే త్తు నిమ్నే సృష్ట మివోదకమ్. 16

నరశ్రేష్ఠుడవు, శీలము, చక్కని ప్రవర్తన గలవారిలో నుత్తముడవగు ఓ భరతుడా! పల్లపు నేలలో నీరు నిలచినట్లు జ్యేష్ఠానువర్తన రూపమగు శ్రేయము నీయందుండుటలో ఆశ్చర్యము లేదు.

అమృత స్స మహాబాహుః పితా దశరథ స్తవ,
యస్య త్వ మీదృశః పుత్త్రో ధర్మజ్ఞో ధర్మవత్సలః. 17

ధర్మ మెఱిగినవాడవు, ధర్మమందాసక్తిగలవాడవు అగు నీవంటి ఉత్తమతనయునిచే మహాభుజుడగు నీ తండ్రి దశరథుడు మరణించియు అమృతుడై యున్నాడు.

త మృషిం తు మహాత్మాన ముక్తవాక్యం కృతాంజలిః,
ఆమంత్రయితు మారేభే చరణా వుపగృహ్య చ. 18

అని యట్లు పలికిన మహాత్ముడగు భరద్వాజున కంజలి యొగ్గి, పాదము లంటి ప్రణమిల్లి భరతుడు సెలవు కోరెను.

తతః ప్రదక్షిణం కృత్వా భరద్వాజం పునః పునః,
భరత స్తు యయౌ శ్రీమా నయోధ్యాం సహ మంత్రిభిః. 19

అంతట శ్రీమంతుడగు భరతుడు మాటిమాటికి భరద్వాజునకు ప్రణమిల్లి మంత్రులతో కూడి అయోధ్య కేగెను.

యానై శ్చ శకటై శ్చైవ హయై ర్నాగై శ్చ సా చమూః,
పున ర్నివృత్తా విస్తీర్ణా భరత స్యానుయాయినీ. 20

విస్తీర్ణమగు ఆ భరతుని సేన వివిధ వాహనములతో, శకటములతో, గుఱ్ఱములతో అయోధ్యకు మఱలి పోయెను.

తత స్తే యమునాం దివ్యాం నదీం తీర్త్వోర్మిమాలినీమ్,
దదృశు స్తాం పున స్సర్వే గంగాం శుభజలాం నదీమ్. 21

పిమ్మట వారు తరంగపంక్తులతో కూడిన యమునానదిని దాటి శుభజలములుకల గంగానది కడ కేగిరి.

తాం రమ్యజలసంపూర్ణాం సన్తీర్య సహ బాంధవః,
శృంగిబేరపురం రమ్యం ప్రవివేశ ససైనికః. 22

నిర్మలములైన జలములతో నిండిన యా నదిని బంధువులతో దాటినవాడై భరతుడు సైనికులతో గూడి సుందరమగు శృంగిబేరపురము చేరెను.

శృంగిబేరపురా దూర్ధ్వయ స్త్వయోధ్యాం సందదర్శ హ,
శృంగిబేరపురమునుండి పోయి భరతుడయోధ్యను చూచెను.

అయోధ్యాం చ తతో దృష్ట్వా పిత్రా భ్రాత్రా వివర్జితామ్, 23
భరతో దుఃఖసంతప్త స్సారథిం చేద మబ్రవీత్.

భరతు డంత తండ్రి, అన్నయు లేని అయోధ్యను చూచి దుఃఖపీడితుడై సారథితో నిట్లనెను.

సారథే! పశ్య విధ్వస్తా సాఽయోధ్యా న ప్రకాశతే, 24
నిరాకారా నిరానందా దీనా ప్రతిహతస్వరా.

సారథీ! అయోధ్య ఇపుడు కాంతి తొలగి, సుందరాకారము లేక, ఆనందహీనమై, మూగవోయి నట్లుండి ప్రకాశింపకున్నది చూడుము." అనెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్రయోదశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నూటపదమూడవ సర్గము సమాప్తము.

---

## చతుర్దశోత్తరశతతమః సర్గః-నూటపదునాల్గవ సర్గము

స్నిగ్ధగంభీరఘోషేణ స్యందనే నోపయా న్ప్రభుః,
అయోధ్యాం భరతః క్షిప్రం ప్రవివేశ మహాయశాః. 1

గొప్ప కీర్తి కలవాడు, ప్రభువు అగు భరతు డట్లు శ్రావ్యము గంభీరమగు ధ్వనికల రథమెక్కి పోవుచు శీఘ్రమే అయోధ్యలో ప్రవేశించెను.

బిడాలోలూకచరితా మాలీననరవారణామ్,
తిమిరాభ్యాహతాం కాళీ మప్రకాశాం నిశా మివ. 2

ఆ నగరమున పిల్లులు, గుడ్లగూబలు స్వేచ్ఛగా తిరుగాడు చుండెను. ఎక్కడను నరసంచారముగాని, యేనుగుల రాకపోకలు గాని లేవయ్యెను. చీకట్లు ఆవరించి నల్లనై కాంతితొలగి కృష్ణ పక్షపు రాత్రివలె యానగరము కన్పట్టెను.

రాహుశత్రోః ప్రియాం పత్నీం శ్రియా ప్రజ్వలితప్రభామ్,
గ్రహే ణాభ్యుత్థితే నైకాంరో హిణీ మివ పీడితామ్. 3

చంద్రుని ప్రియభార్యయు, మిక్కిలి కాంతిమతియు అగు రోహిణి అంగారక గ్రహముచే పీడింపపడిన ట్లా అయోధ్యయు కన్పట్టెను.

అల్పోష్ణక్షుబ్ధసలిలాం ఘర్మోత్తప్త విహంగమామ్,
లీనమీనఝషగ్రాహాం కృశాం గిరినదీ మివ. 4

ఎండ వేడిమిచే కాగి తఱిగిన నీరుకలది, ఉష్ణముచే పీడింపబడిన పక్షులు కల ఆ అయోధ్య, నశించిన చేపలు, మొసళ్ళు మున్నగు జల జంతువులతో కూడిన సెలయేరు వలె నుండెను.

విధూమా మివ హేమాభా మధ్వరాగ్నే స్సముత్థితామ్,
హవి రభ్యుక్షితాం పశ్చా చ్ఛిఖాం విప్రలయం గతామ్. 5

మొదట పొగలేక బంగారమువలె ప్రజ్వలించుచు, తరువాత పెరుగు మున్నగు హోమద్రవ్యము వేయుటచే లీనమైయున్న యాగాగ్ని యందలి జ్వాలవలె అయోధ్య నిష్ప్రభమైయుండెను.

విధ్వస్తకవచాం రుగ్ణగజవాజిరథధ్వజామ్,
హతప్రవీరా మాపన్నాం చమూ మివ మహాహవే. 6

మహాయుద్ధమున విరిగిన కవచములతో (కవచధారులగు యోధులతో కూడినది) దెబ్బతినిన ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, టెక్కెములు కలది, మృతినొందిన వీరులు కలదియై ఆపదనందిన సేన వలె అయోధ్య కన్పట్టెను.

సఫేనా సస్వనా భూత్వా సాగరస్య సముత్థితామ్,
ప్రశాంతమారుతోద్ధూతాం జలోర్మి మివ నిస్వనామ్. 7

నురుగుతో, పెద్ద ధ్వనితో సముద్రములో పైకిలేచి వాయువేగము శాంతించుటచే శాంతించిన యలవలె అయోధ్య నిశ్శబ్దముగ నుండెను.

త్యక్తాం యజ్ఞాయుధై స్సర్వై రభిరూపై శ్చ యాజకైః,
సుత్యాకాలే వినిర్వృత్తే వేదిం గతరవా మివ. 8

యాగ పరిసమాప్తి దినమునందు - యాగాంతమున స్ఫ్యాది యజ్ఞోపకరణములను తీసికొని, యాగములు చేయించువారు వెడలిపోగా సవ్వడి లేని యజ్ఞవేదిక వలె అయోధ్య కాననయ్యెను.

గోష్ఠమధ్యే స్థితా మార్తా మచరంతీం తృణం నవమ్,
గోవృషేణ పరిత్యక్తాం గవాం పంక్తి మివోత్సుకామ్, 9

గోశాలలో ఆబోతు లేకుండుటచే లేతగడ్డిని కూడ తినక దుఃఖించుచు దానియం దుత్కంఠగల గోపంక్తివలె అయోధ్య యగపడెను.

ప్రభాకరాద్యై స్సుస్నిగ్ధైః ప్రజ్వలద్భి రివోత్తమైః,
వియుక్తాం మణిభి ర్జాత్యై ర్నవాం ముక్తావళీ మివ. 10

మిక్కిలి సుందరములు, కాంతిమంతములు. శ్రేష్ఠములగు ప్రభాకరాది జాతిరత్నములు కూర్చబడని ముత్యాలసరమువలె అయోధ్య నిష్ప్రభమై యుండెను.

సహసా చలితాం స్థానా న్మహీం పుణ్యక్షయా ద్గతామ్,
సంహృతద్యుతివిస్తారాం తారా మివ దివ శ్చ్యుతామ్ 11

ఒక్కమారుగా తన తావు తప్పి, పుణ్యము క్షీణించుటచే యాకసమునుండి భూమిపైబడి, విస్తారమగు కాంతి తొలగిన నక్షత్రమువలె అయోధ్య చూడనయ్యెను.

పుష్పనద్ధాం వసన్తాన్తే మత్తభ్రమరనాదితామ్,
ద్రుతదావాగ్నివిప్లుష్టాం క్లాంతాం వనలతామివ. 12

వసంతర్తువు చివర పూవులు తొడిగి, మత్తెక్కిన తుమ్మెదల ఝుంకారముతో నొప్పుచు, నొక్కమారుగా శీఘ్రమే యలముకొనిన కార్చిచ్చుచే తగులబెట్టబడి, వాడిన వనలత వలె యయోధ్య కాంతి లేనిదై యుండెను.

సమ్మూఢనిగమాం స్తబ్ధాం సంక్షిప్తవిపణాపణామ్,
ప్రచ్ఛన్నశశినక్షత్రాం ద్యామి వాంబుధరై ర్వృతామ్.13

జన సంచారములేని మార్గము కలదై, అమ్మకములు నిలుపబడి, మూయబడిన అంగళ్లుకలదైన అయోధ్య మేఘములు క్రమ్ముకొనుటచే కప్పివేయబడిన చంద్రుడు, చుక్కలు గల ఆకాశమువలె నుండెను

క్షీణపానోత్తమై ర్భిన్నై శ్శరావై రభిసంవృతామ్,
హతశౌండా మివాఽకాశే పానభూమి మసంస్కృతామ్.14

అవరణములేని చోట, శ్రేష్ఠమగు పాదద్రవ్యము లేనిదై, పగులగొట్టబడిన పాత్రలతో, చంపబడిన మత్తజనులతో, అలంకారమే లేని పానశాలవలె యయోధ్య తోచెను.

వృక్ణభూమితలాం నిమ్నాం వృక్ణపాత్రై స్సమావృతామ్,
ఉపయుక్తోదకాం భగ్నాం ప్రపాం నిపతితామివ. 15

పగిలిన నేల కలది, పగిలిన పాత్రలు కలదియునై పాంథులు నీటిని త్రాగివేయుటచే నీరులేనిదై విరిగిపడిన వేసవి

యందలి పానీయశాల (చలివేంద్రము) వలె అయోధ్య కన్పించెను.

విపులాం వితతాం చైవ యుక్తపాశాం తరస్వినామ్,
భూమౌ బాణై ర్వినిష్కృత్తాం పతితాం జ్యామివాయుధాత్.

పొడవైనది, వింటి రెండు కొనల వఱకు వ్యాపించినది, ఎక్కుపెట్టబడినదై యుద్ధమున శత్రుబాణములచే త్రెగగొట్టబడి వింటిని వీడి నేలబడినదగు యల్లెత్రాటివలె యయోధ్య కనబడెను.

సహసా యుద్ధశౌండేన హయారోహేణ వాహితామ్,
విక్షిప్తభాండా ముత్సృష్టాం కిశోరీ మివ దుర్బలామ్. 17

యుద్ధకుశలుడగు గుఱ్ఱపురౌతుచే నెక్కబడినదై, తరువాత కొంత తడవున కలసి, జీను మున్నగునవి తీసివేయబడి, వాహనముగా ఉపయోగింపదగని ఆడు పిల్లగుఱ్ఱమువలె అయోధ్య కానవచ్చెను.

శుష్కతోయాం మహామత్స్యైః కూర్మైశ్చ బహుభి ర్వృతామ్,
ప్రభిన్నతటవి స్తీర్ణాం వాపీ మివ హృతోత్పలామ్. 18

నీరెండినది, పెనుమీలు, తాబేళ్ళు అనేకములుగా కలది, కలువలు లేనిది, ఒడ్లు విరుగుటచే విస్తరింపబడిన దిగుడుబావి వలె అయోధ్య యగపడెను.

పురుష స్యాప్రహృష్టస్య ప్రతిషిద్ధానులేపనామ్,
సన్తప్తామివ శోకేన గాత్రయష్టి మభూషణామ్. 19

చందనము మున్నగు మైపూత లేనిది, అలంకారములు

లేనిది, శోకపీడితమైనది యగు దుఃఖితుని శరీరమువలె యయోధ్య కనుపించెను.

ప్రావృషి ప్రవిగాఢాయాం ప్రవిష్ట స్యాభ్రమండలమ్,
ప్రచ్ఛన్నాం నీలజీమూతై ర్భాస్కరస్య ప్రభా మివ. 20

వర్షాకాలము విజృంభించగా, ఆకాశమధ్యమును చేరిన సూర్యుని యొక్క నల్లని మబ్బులచే కప్పబడిన కాంతివలె అయోధ్య కళదప్పియుండెను.

భరత స్తు రథస్థ స్సన్ శ్రీమా న్దశరథాఽఽత్మజః,
వాహయంతం రథశ్రేష్ఠం సారథిం వాక్య మబ్రవీత్. 21

శ్రీమంతుడు, దశరథపుత్రుడగు భరతుడు రథముపై నుండియే శ్రేష్ఠమగు రథము నడపు సారథి కిట్లనెను.

కిం ను ఖ ల్వద్య గమ్భీరో మూర్ఛితో న నిశమ్యతే,
యథాపుర మయోధ్యాయాం గీతవాదిత్రనిస్వనః. 22

వెనుకటి వలె నిప్పు డీ యయోధ్యలో గీత వాద్యముల నాదము గంభీరమై వినబడకున్న దేమి ?

వారుణీమదగంధశ్చ మాల్యగంధ శ్చ మూర్ఛితః,
ధూపితాగరుగంధ శ్చ న ప్రవాతి సమన్తతః. 23

మద్యపు మాదకమగు పరిమళము, పుష్పమాలలనుండి వెలువడు సుగంధము, వెలిగించిన యగరువత్తుల గంధము ఎల్లెడల ప్రసరింప దేల ?

యానప్రవరఘోషశ్చ స్నిగ్ధశ్చ హయనిస్వనః,
ప్రమత్తగజనాదశ్చ మహాంశ్చ రథనిస్వనః, 24
నేదానీం శ్రూయతే పుర్యా మస్యాం రామే వివాసితే.

శ్రేష్ఠములగు వాహనముల మ్రోత, గుఱ్ఱముల మధురమగు సవ్వడి, మదించిన యేనుగుల నాదము రాముడు లేని యీ నగరమున వినిపింపకున్నది.

చందనాగరుగంధాంశ్చ మహార్హాశ్చ నవస్రజః 25
గతే హి రామే తరుణా స్సంతప్తా నోపభుంజతే.

రాముడు వనమున కేగగనే యువకులు వెత జెంది, చందనము, అగరువు మున్నగు గంధద్రవ్యములను, మిగుల వెలగల క్రొంగ్రొత్త పుష్పమాలలను, ధరింపకున్నారు.

బహి ర్యాత్రాం న గచ్ఛంతి చిత్రమాల్యధరా నరాః, 26
నోత్సవా స్సంప్రవర్తన్తే రామశోకార్దితే పురే.

నరులు పలు వర్ణముల పూలతో కూర్చిన మాలలు ధరించి బయట తిరుగాడుటలేదు. రామశోకముతో నగరము పీడింపబడి యెచటను ఉత్సవములే లేకున్నవి.

సహి నూనం మమ భ్రాత్రా పురస్యాస్య ద్యుతి ర్గతా, 27
న హి రాజ త్యయోధ్యేయం సాసారే వారునీ క్షపా.

ఈ పట్టణపు కాంతి యంతయు నా యన్నతోనే పోయినది. ఇది సత్యము. ధారావర్షముతో కూడిన కృష్ణపక్షపు రాత్రివలె అయోధ్య ప్రకాశింపకున్నది

కదా ను ఖలు మే భ్రాతా మహోత్సవ ఇవాఽఽగతః, 28
జనయిష్యత్యయోధ్యాయాం హర్షం గ్రీష్మ ఇవాంబుదః.

ఎపుడు నా యన్న రాముడు మహోత్సవమువలె యయోధ్యకు వచ్చి, వేసవిలో మేఘమువలె హర్షము కలిగించును ?

తరుణై శ్చారువేషై శ్చ నరై రున్నతగామిభిః, 29
సంపతద్భి రయోధ్యాయాం నాభిభాంతి మహాపథాః.

సుందర వేషములు దాల్చి, వాహనముల నెక్కి యయోధ్యకు వచ్చు యువకులతో నేడు రాజమార్గములు కానరాకున్నవి.

ఏవం బహువిధం జల్ప న్వివేశ వసతిం పితుః. 30

అని ఇట్లు పలువిధములుగా పలుకుచు, సింహములేని గుహవలె, మహారాజగు తండ్రిలేని యతని వాసగృహము చేరెను.

తదా తదంతఃపుర ముజ్ఝితప్రభం
సురై రివోత్సృష్ట మభాస్కరం దినమ్.
నిరీక్ష్య సర్వం తు వివిక్త మాత్మవా
న్ముమోచ బాష్పం భరత స్సుదుఃఖితః. 31

అపు డా యంతఃపురము దేవతలు విడచుటచే సూర్యుడు లేని పగటివలె కాంతిహీన మయ్యెను. అంతటను జనరహితమై యున్న అ ప్రదేశమును చూచి మనోబలము కలవాడయ్యును, భరతుడు మిక్కిలి దుఃఖించి, కన్నీరు కార్చెను.

విశే. పూర్వము దేవాసుర యుద్ధమున రాక్షసులచే దేవత లోడింపబడిరి. రాహువు సూర్యుని పడగొట్టెను. చాలకాల మపుడు

రాత్రింబవళ్లను విభాగము లేక యుండెను. ఆపైన బ్రహ్మా యాజ్ఞచే అత్రిమహర్షి తన తేజస్సుతో ఏడుదినములు సూర్యుని వలె ప్రకాశించెనని పౌరాణిక కథ ఇట స్మరణీయము.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
చతుర్దశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటపదునాల్గవసర్గము సమాప్తము.

---

## పంచదశోత్తరశతతమః సర్గః - నూటపదునైదవ సర్గము

తతో నిక్షిప్య మాతౄ స్స అయోధ్యాయాం దృఢవ్రతః,
భరత శ్శోకసంతప్తో గురూ నిద మథాబ్రవీత్. 1

అంతట దృఢవ్రతు డగు ఆ భరతుడు తన తల్లుల నయోధ్యలో నుంచి, శోకపీడితుడై గురువుల కిట్లనెను.

నందిగ్రామం గమిష్యామి సర్వా నామంత్రయేఽద్య వః,
తత్ర దుఃఖ మిదం సర్వం సహిష్యే రాఘవం వినా. 2

నే నిపుడు నందిగ్రామమున కేగెదను. మీకడ సెలవు తీసికొందును. రాముడు లేకుండుటచే కలుగు నీ దుఃఖము నచట సహింతును.

గత శ్చ హి దివం రాజా వనస్థశ్చ గురు ర్మమ,
రామం ప్రతీక్షే రాజ్యాయ స హి రాజా మహాయశాః. 3

రాజు స్వర్గతు డైనాడు. పూజ్యుడగు అన్న యడవిలో నున్నాడు. ఆయన రాక కెదురు చూతును. మహాయశస్వియగు ఆయనయే రాజు.

ఏత చ్ఛ్రుత్వా శుభం వాక్యం భరతస్య మహాత్మనః,
అబ్రువ న్మంత్రిణ స్సర్వే వసిష్ఠ శ్చ పురోహితః. 4

మహాత్ము డగు భరతుని యీ శుభమగు మాట విని మంత్రు లందఱును, పురోహితు డగు వసిష్ఠుడును ఇట్లనిరి.

సుభృశం శ్లాఘనీయం చ యదు క్తం భరత! త్వయా,
వచనం భ్రాతృవాత్సల్యా దనురూపం తవైవ తత్. 5

భరతుడా! నీవు నీ సోదరునిపై ప్రేమతో పలికిన మాట మిక్కిలి శ్లాఘనీయము. ఇట్లు పలుకుట నీ కే చెల్లినది

నిత్యం తే బంధులుబ్ధస్య తిష్ఠతో భ్రాతృసౌహృదే,
ఆర్యమార్గం ప్రపన్నస్య నానుమన్యే తతః పుమాన్. 6

బంధువులపై ప్రేమకలవాడవై, అన్నయం దనురక్తుడవై, సజ్జనుల మార్గము నవలంబించిన నిన్నెవ్వడు సమ్మతింపడు ?

మంత్రిణాం వచనం శ్రుత్వా యథాభిలషితం ప్రియమ్,
అబ్రవీ త్సారథిం వాక్యం రథో మే యుజ్యతా మితి. 7

అంత భరతుడు మంత్రులు తన కభిలషితముగ ప్రీతిగ మాటలాడుట విని, రథమును సమకూర్చుమని సారథికి చెప్పెను.

ప్రహృష్టవదన స్సర్వా మాతౄ స్సమభివాద్య సః,
ఆరురోహ రథం శ్రీమాన్ శత్రుఘ్నేన సమన్వితః, 8

ముఖమున ఆనందము వెలయగా శ్రీమంతుడగు భరతుడు తల్లుల కెల్లరకు ప్రణమిల్లి శత్రుఘ్నునితో గూడి రథ మెక్కెను.

ఆరుహ్య చ రథం శీఘ్రం శత్రుఘ్నభరతా వుభౌ,
యయతుః పరమప్రీతౌ వృతౌ మంత్రిపురోహితైః. 9

భరత శత్రుఘ్ను లిరువురును మంత్రిపురోహితులతో పరివృతులై మిక్కలి ప్రీతితో వేగముగ పోవు రథ మెక్కి వెడలిరి.

అగ్రతో గురవ స్తత్ర వసిష్ఠప్రముఖా ద్విజాః,
ప్రయయుః ప్రాఙ్ముఖా స్సర్వే నందిగ్రామో యతోఽభవత్.

అందు ముందుగా గురువులగు వసిష్ఠుడు మున్నగు బ్రాహ్మణులు, తూర్పు దిక్కుగా నందిగ్రామమునకు బయలుదేరి పోయిరి.

బలం చ తదనాహూతం గజాశ్వరథసంకులమ్,
ప్రయయౌ భరతే యాతే సర్వే చ పురవాసినః. 11

భరతు డట్లు వెడలగనే, అతని యాహ్వానము లేకయే ఏనుగులు, గుఱ్ఱములు, రథములతో నిండిన సైన్యము, పౌరు లెల్లరును నందిగ్రామమున కేగిరి.

రథస్థ స్స హి ధర్మాత్మా భరతో భ్రాతృవత్సలః,
నందిగ్రామం యయౌ తూర్ణం శిర స్యాధాయ పాదుకే.12

ధర్మాత్ముడు, సోదరప్రేమ కలవాడగు భరతుడు రామపాదుకలు శిరమున దాల్చి రథమెక్కి శీఘ్రముగ నందిగ్రామమున కేగెను.

తత స్తు భరతః క్షిప్రం నందిగ్రామం ప్రవిశ్య సః,
అవతీర్య రథా త్తూర్ణం గురూ నిద మువాచ హ. 13

భరతు డట్లు వేగముగ నందిగ్రామము చేరి, రథమునుండి శీఘ్రమే దిగి, గురువుల కిట్లనెను.

ఏత ద్రాజ్యం మమ భ్రాత్రా దత్తం సంన్యాసవ త్స్వయమ్,
యోగక్షేమవహే చేమే పాదుకే హేమభూషితే. 14

ఈ రాజ్యమును నా యన్న నాకడ చక్కగా నిక్షేపించినాడు. బంగారుతో నలంకృతములైన ఈ రామపాదుక లీ రాజ్యమునకు యోగక్షేమములు కలిగించును.

భరత శ్శిరసా కృత్వా సన్న్యాసం పాదుకే తతః,
అబ్రవీ ద్దుఃఖసంతప్త స్సర్వం ప్రకృతిమండలమ్. 15

భరతు డట్లు ఉత్తమన్యాసముగా తన కీయబడిన పాదుకలను శిరముపై దాల్చి, దుఃఖపీడితుడై ప్రజ లెల్లర కిట్లనెను.

ఛత్రం ధారయత క్షిప్ర మార్యపాదా విమౌ మతౌ,
ఆభ్యాం రాజ్యే స్థితో ధర్మః పాదుకాభ్యాం గురుర్మమ. 16

పూజ్యుడగు మా యన్న రాముని పాదుకలకు ఛత్రము ధరించుడు. ఇవి యార్యుని పాదములుగనే భావించబడినది. నా సోదరుడగు ఆయన పాదుకలచే రాజ్యమున ధర్మము సుస్థిర మగును.

భ్రాత్రా హి మయి సన్న్యాసో నిక్షిప్త స్సౌహృదా దయమ్,
త మిమం పాలయిష్యామి రాఘవాగమనం ప్రతి. 17

నాయన్న నాపై ప్రీతికొలది యీ రాజ్యమును నాకప్పగించినాడు. రాఘవుడు మరలివచ్చు వఱకు దీనిని నేను కాపాడుదును.

క్షిప్రం సంయోజయిత్వా తు రాఘవస్య పున స్స్వయమ్,
చరణౌ తౌ తు రామస్య ద్రక్ష్యామి సహపాదుకౌ. 18

రాముడు వనవాసమునుండి మఱలి వచ్చుటతోడనే నేను స్వయముగ నీ పాదుకల నాయన చరణములకు తొడిగి, పాదుకా సమేతములుగ రామపాదములను దర్శింతును.

తతో నిక్షిప్తభారోఽహం రాఘవేణ సమాగతః,
నివేద్య గురవే రాజ్యం భజిష్యే గురువృత్తితామ్. 19

వనవాసానంతరము రాముని కలసి, నాయందుంచిన రాజ్యభారము నాయన కొసగి, ఆయనయందు పితృభావనతో శుశ్రూష చేసెదను.

రాఘవాయ చ సన్న్యాసం దత్త్వేమే వరపాదుకే,
రాజ్యం చేద మయోధ్యాం చ ధూతపాపో భవామి చ. 20

నాకీయబడిన న్యాసరూపమగు నీ శ్రేష్ఠ పాదుకలను, ఈ రాజ్యమును, అయోధ్యను రామున కొసగి పాపము తొలగినవాడ నగుదును.

అభిషిక్తే తు కాకుత్స్థే ప్రహృష్టముదితే జనే,
ప్రీతి ర్మమ యశ శ్చైవ భవే ద్రాజ్యా చ్చతుర్గుణమ్. 21

రాముడు పట్టాభిషిక్తుడై, జనులు మిగుల నానందముతో

పులకితులు కాగా రాజ్యముకంటె నాలుగు రెట్లుగా నాకుప్రీతియు, కీర్తియు కలుగును.

ఏవం తు విలప న్దీనో భరత స్స మహాయశాః,
నందిగ్రామేఽకరో ద్రాజ్యం దుఃఖితో మంత్రిభి స్సహ.

అని ఇట్లు మహాయశు డగు భరతుడు దీనుడై విలపించుచు దుఃఖముతో మంత్రులనుగూడి నందిగ్రామమున రాజ్యపాలన మొనర్చెను.

స వల్కలజటాధారీ మునివేషధరః ప్రభుః,
నందిగ్రామేఽవస ద్వీర స్ససైన్యో భరత స్తదా. 23

అంత వీరుడు, ప్రభువగు భరతుడు నారవస్త్రములు, దాల్చి, మునివేషము ధరించి, సైన్యముతోగూడ నందిగ్రామము ననే నివసించెను.

రామాగమన మాకాంక్ష న్భరతో భ్రాతృవత్సలః,
భ్రాతు ర్వచనకారీ చ ప్రతిజ్ఞాపారగ స్తథా. 24

పాదుకే త్వభిషి చ్యాథ నందిగ్రామేఽవస త్తదా,
భరత శ్శాసనం సర్వం పాదుకాభ్యాం న్యవేదయత్. 25

అన్నయం దాదరము కలవాడు, అన్న యాజ్ఞ పాలించువాడు, తన ప్రతిజ్ఞను నిర్వహించువాడగు భరతుడు రాముని రాక కెదురుచూచుచు, నందిగ్రామమున నివసించెను. శాసన విషయమంతయు రామపాదుకలకు నివేదించెను.

తతస్తు భరత శ్శ్రీమా నభిషిచ్యాఽఽర్యపాదుకే,
తదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా. 26

అంతట శ్రీమంతు డగు భరతుడు రామపాదుకలకు పట్టాభిషేక మొనర్చి, వాని కధీనుడై సదా రాజ్యము పాలించెను.

తదా హి య త్కార్య ముపైతి కించి
దుపాయనం చోపహృతం మహార్హమ్,
స పాదుకాభ్యాం ప్రథమం నివేద్య
చకార పశ్చా ద్భరతో యథావత్. 27

అటుపై నే చిన్న కార్యము చేయవలసి వచ్చినను, గొప్ప విలువైన యేదేని వస్తు వెవరైన నిచ్చినను, దాని నతడు మొదట పాదుకలకు నివేదించి, పిమ్మటనే దాని నెట్లు చేయవలెనో అట్లాచరించెడివాడు.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
పంచదశోత్తరశతతమః సర్గః.
ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూట పదునైదవ సర్గము సమాప్తము.

---

## షోడశోత్తరశతతమః సర్గః - నూటపదునాఱవ సర్గము

ప్రతిప్రయాతే భరతే వస న్రామ స్తపోవనే,
లక్షయామాస సోద్వేగ మథౌత్సుక్యం తపస్వినామ్. 1

భరతు డట్లు వెడలిపోవగా, రాముడు ఆ తపోవనమున నివసించుచు, అచటనున్న తపస్వుల యింగితాకారాదులచే వారికి కలిగిన ఆశ్రమాంతర గమనాభిలాషను- ధీతుడై గుర్తించెను.

యే తత్ర చిత్రకూటస్య పురస్తా త్తాపసాశ్రమే,
రామ మాశ్రిత్య నిరతా స్తా నలక్షయ దుత్సుకాన్. 2

పూర్వము చిత్రకూటము యొక్క తాపసాశ్రమమందున్న వారై రాము నాశ్రయించియున్న తపస్వులను వేఱు ఆశ్రమములకు పోవదలంచుచున్న వారినిగా రాముడు గమనించెను.

నయనై ర్భ్రుకుటీభి శ్చ రామం నిర్దిశ్య శంకితాః,
అన్యోన్య ముపజల్పంత శ్శనై శ్చక్రు ర్మిథః కథాః. 3

కన్నులతో, కనుబొమల కదలికలతో రాముని చూపుచు, శంకాన్వితులై యా తపస్వులు పరస్పరము గుసగుసలాడుచు, నేవేవో కథలు చెప్పుకొనసాగిరి.

తేషా మౌత్సుక్య మాలక్ష్య రామ స్త్వాత్మని శంకితః,
కృతాంజలి రువా చేద మృషిం కులపతిం తతః 4

వేఱొక యాశ్రమమునకు పోవలె నను వారి యౌత్సుక్యమును గమనించి, రాముడు తనలో సందేహపడి, యంత కులపతియగు ఋషికడ కేగి ప్రణమిల్లి ఇట్లనెను.

న కచ్చి ద్భగవ! న్కించి త్పూర్వవృత్త మిదం మయి,
దృశ్యతే వికృతం యేన విక్రియంతే తపస్వినః. 5

ఓ పూజ్యుడవగు మహర్షీ ! నే నేమైన దుష్కృతము ముం దెన్నడేని చేసితినా ? తపస్వు లేల మార్పు నందుచున్నారు ?

ప్రమాదా చ్చరితం కచ్చి త్కించి న్నావరజస్య మే,
లక్ష్మణ స్యర్షిభి ర్దృష్టం నానురూప మి వాత్మనః. 6

నా తమ్ముడగు లక్ష్మణు డెప్పుడేని యనవహితుడై యేమైన తనకు తగని (విరుద్ధమగు) పని నాచరింపగా మునులు చూచిరా ?

కచ్చి చ్ఛుశ్రూషమాణా వ శ్శుశ్రూషణపరా మయి,
ప్రమదాఽభ్యుచితాం వృత్తిం సీతా యుక్తం న వర్తతే. 7

నన్ను సేవించుటయందాసక్తురాలై, మీకు సేవచేయుచు సీత యనవధానముతో నేదేని యపచార మొనరింపలేదు కదా ?

అథర్షి ర్జరయా వృద్ధ స్తపసా చ జరాం గతః,
వేపమాన ఇవోవాచ రామం భూతదయాపరమ్. 8

అంతట ముసలితనముచే తపముచే గూడ వృద్ధుడైన యా ముని వణకుచు భూతదయాపరు డగు రాముని కిట్లనెను.

కుతః కల్యాణసత్త్వాయాః కల్యాణాభిరతే స్తథా,
చలనం తాత! వైదేహ్యా స్తపస్విషు విశేషతః. 9

శుభస్వభావము కలది, మంగళకరములగు కృత్యములందు మాత్రమే ఆసక్తిగలదియగు సీత యట్టి యతిక్రమణము, విశేషించి తపస్వుల యెడ నెట్లాచరించును ?

త్వన్నిమిత్త మిదం తావ త్తాపసా న్ప్రతివర్తతే,
రక్షోభ్య స్తేన సంవిగ్నాః కథయంతి మిథః కథాః. 10

నీ కారణముగ రాక్షసుల వలన తాపసుల కుపద్రవ మేర్పడినది. దానిచే కలవరపడిన తాపసులు రహస్యముగ రాక్షసులయు, వారి యుపద్రవములను గూర్చియు కథలు చెప్పకొనుచున్నారు.

రావణావరజః కశ్చి త్ఖరో నామేహ రాక్షసః,
ఉత్పాట్య తాపసా న్సర్వా ఞ్జనస్థాననికేతనాన్, 11
ధృష్ట శ్చ జితకాశీ చ నృశంసః పురుషాదకః,
అవలిప్తశ్చ పాప శ్చ త్వాం చ తాత! న మృష్యతే. 12

ఇచట రావణుని తమ్ముడగు ఖరుడను రాక్షసు డొకడు జనస్థానమున నివసించు తాపసుల నందరను వెడలగొట్టి, స్వేచ్ఛగా దౌష్ట్య మొనర్చుచు, జయముతో నొప్పుచు, క్రూరుడై, నరభక్షకుడై, గర్వితుడై, పాపియై, నిన్నును సహింపకున్నాడు.

త్వం యదాప్రభృతి హ్యస్మి న్నాశ్రమే తాత! వర్తసే,
తదా ప్రభృతి రక్షాంసి విప్రకుర్వంతి తాపసాన్. 13

నాయనా! నీ వీయాశ్రమమును ప్రవేశించినది మొదలు రాక్షసులు తాపసులను పీడించుచున్నారు.

దర్శయంతి హి బీభత్సైః క్రూరై ర్భీషణకై రపి,
నానారూపై ర్విరూపై శ్చ రూపై ర్వికృతదర్శనైః. 14

వారు ఏవగింపు కలిగించునవి, క్రూరములైనవి, భయము

కలిగించునవి, అనేక విధములైనవి, లోకములో నెక్కడను లేని విలక్షణమగు అవయవముల కూర్పుకలవి అగు వికృత రూపములతో వికృతనేత్రములతో నగపడుచున్నారు.

అప్రశస్తై రశుచిభి స్సంప్రయోజ్య చ తాపసాన్,
ప్రతిఘ్నం త్యపరా న్క్షిప్ర మనార్యాః పురతః స్థితాః. 15

అనార్యులగు ఆ రాక్షసులు తపస్వులముందు నిలచి అయోగ్యములు, అపరిశుద్ధములగు వస్తువులను వారిపై బడవైచి కొందఱను పీడించుచున్నారు. మఱికొందరను చంపుచున్నారు.

తేషు తే ష్వాశ్రమస్థానే ష్వబుద్ధ మవలీయ చ,
రమంతే తాపసాం స్తత్ర నాశయంతోఽల్పచేతసః. 16

ఆ యా ఆశ్రమ ప్రదేశములలో నెవ్వరికిని తెలియని రీతిలో దాగి, అల్పబుద్ధులగు రాక్షసులు తపస్వులను చంపుచు తిరుగుచున్నారు.

అపక్షిపంతి స్రుగ్భాండా నగ్నీ న్సించంతి వారిణా,
కలశాంశ్చ ప్రమృద్నంతి హవనే సముపస్థితే. 17

హోమము చేయబడుచుండగా నీ రాక్షసులు వచ్చి స్రుక్ స్రువములను పారవేయుచున్నారు. అగ్నిని నీటితో తడుపుచున్నారు. కలశములను పగులగొట్టుచున్నారు.

తై ర్దురాత్మభి రామృష్టా నాశ్రమా న్ప్రజిహాసవః,
గమనా యాన్యదేశస్య చోదయ న్త్యృషయోఽద్య మామ్.

దురాత్ములగు ఆ రాక్షసులు సంచరించుచున్న ఆశ్రమ

ములను విడువ గోరినవారై, తపస్వి లిపుడు నన్ను వేఱొక ప్రదేశమునకు పోవుటకే ప్రేరణచేయుచున్నాడు.

తత్పురా రామ! శారీరా ముపహింసాం తపస్విషు,
దర్శయంతి హి దుష్టా స్తే త్యక్ష్యామ ఇమ మాశ్రమమ్. 19

ఆ దుష్టులు తపస్వులను శారీరకముగ హింసించెదరు. కావున మే మీ యాశ్రమము వీడి పోయెదము

బహుమూలఫలం చిత్ర మతిదూరా దితో వనమ్,
పురాణాశ్రమ మేవాహం శ్రయిష్యే సగణః పునః. 20

నే నిచటినుండి తపస్విగణముతో వెడలి, అనేకములగు దుంపలు, పండ్లు కలది, ఆశ్చర్యము గొల్పునది, ఇచటకు మిగుల దూరమందున్న దగు వెనుకటి యాశ్రమముననే చేరెదను.

ఖర స్త్వయ్యపి చాయుక్తం పురా తాత! ప్రవర్తతే,
సహాస్మాభి రితో గచ్ఛ యది బుద్ధిః ప్రవర్తతే. 21

నాయనా! ఖరుడు నీ విషయమున గూడ నయుక్తముగా నాచరింపగలడు. కాన నీ విష్టపడుచో మాతో కలసి నీ విటనుండి బయలుదేరుము.

సకళత్రస్య సందేహో నిత్యం యత్తస్య రాఘవ!
సమర్థ స్యాపి హి సతో వాసో దుఃఖ మిహాద్య తే. 22

ఓ రాఘవుడా! ఎల్లపుడు యుద్ధ సన్నద్ధుడవయ్యును సపత్నీకుడవగు నీ కిది సంశయజనకమగు చోటు. నీవు సమర్థుడ వయ్యును నీ కిచటి నివాసము దుఃఖకరము.

ఇత్యుక్తవంతం రామ స్తం రాజపుత్ర స్తపస్వినమ్,
న శశా కోత్తరై ర్వాక్యై రవరోద్ధుం సముత్సుకమ్. 23

రాజపుత్రుడగు రాము డట్లు పలికిన యా తపస్వితో "నే నుండగా మీకు భయమేల ? నేనే యంతను రక్షింతు"నను నీ మాటలు పలికియు నిరోధింపజాల డయ్యెను.

అభినంద్య సమాపృచ్ఛ్య సమాధాయ చ రాఘవమ్,
స జగా మాఽఽశ్రమం త్యక్త్వా కులైః కులపతి స్సహ. 24

కులపతి యగు నా మహర్షి రాముని సంతోషపెట్టి సమాధాన పఱచి, యతనిని వీడ్కొని, తపస్వులతో నా యాశ్రమము విడచి పోయెను.

రామ స్సంసాధ్య త్వృషిగణ మనుగమనా
ద్దేశా త్తస్మా త్కులపతి మభివాద్య ఋషిమ్,
సమ్య క్ప్రీతై స్తై రనుమత ఉపదిష్టార్థః
పుణ్యం వాసాయ స్వనిలయ ముపసంపేదే. 25

రాము డా తపస్వులను బయలుదేర దీసి, తాను వారితో కొంచెము దూరము పోయి, కులపతి యగు ఆ మునికి ప్రణమిల్లి, పరితుష్టులగు మునులు పోయిరమ్మనగా, వారి యుపదేశము గ్రహించి, వారి యనుమతి పడసి, పవిత్రమగు తన నివాసమును చేరెను.

ఆశ్రమం త్వృషివిరహితం ప్రభుః
క్షణమపి విజహౌ న రాఘవః,

రాఘవం హి సతత మనుగతా
స్తాపసా శ్చార్షచరితధృతగుణాః. 26

రాముని మునిజనోచితమగు నాచారముచే మును లెల్లరు నతనిని సదా యనుసరించియే యుండెడివారు. ఆ కారణముచేతనే ఋషులు విడచిపోయినను, రాము డా యాశ్రమమును వారిపై గౌరవము కొలది క్షణమైనను విడచి పోలేదు.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
షోడశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం దయోధ్యాకాండమున నూట పదునాఱవసర్గము సమాప్తము.

---

## సప్తదశోత్తరశతతమః సర్గః - నూట పదునేడవ సర్గము

రాఘవ స్త్వథ యాతేషు తపస్విషు విచింతయన్,
న తత్రారోచయ ద్వాసం కారణై ర్బహుభి స్తదా. 1

తపస్వు లా యాశ్రమము వీడి పోయిన పిమ్మట, రాముడు మిగుల నాలోచించి, పలు కారణములచే నచట నివసింప నిష్టపడలేదు.

ఇహ మే భరతో దృష్టో మాతరశ్చ సనాగరాః,
సా చ మే స్మృతి రన్వేతి తా న్నిత్య మనుశోచతః. 2

"నే నిచట భరతుని చూచితిని. నా తల్లులు, పౌరుల నిచట కలసి కొంటిని", అని సదా వారిని గూర్చియే చింతించు నా కాయాప్రదేశములు చూడగనే వారి స్మరణము కలుగుచున్నది.

స్కంధావారనివేశేన తేన తస్య మహాత్మనః,
హయహస్తికరీషైశ్చ ఉపమర్దః కృతో భృశమ్. 3

మహాత్ముడగు భరతుని సేన యచట విడియుటచేతను, గుఱ్ఱములు, ఏనుగులు మలవిసర్జనము చేయుటచేతను, ఆ ప్రాంత మంతయు మిగుల నలిగి యుండెను.

తస్మా దన్యత్ర గచ్ఛామ ఇతి సంచింత్య రాఘవః,
ప్రాతిష్ఠత స వైదేహ్యా లక్ష్మణేన చ సంగతః. 4

కావున వేఱొక చోటకు పోవుద మని తలంచి రాముడు సీతా లక్ష్మణులతో గూడి యటనుండి బయలుదేరెను.

సోఽత్రే రాశ్రమ మాసాద్య తం వవందే మహాయశాః,
తం చాపి భగవా నత్రిః పుత్రవ త్ప్రత్యపద్యత. 5

మహాయశస్వియగు రాము డత్రిమహర్షి యాశ్రమమున కేగి యా మహర్షికి ప్రణమిల్లెను. ఆ మహర్షియు రాముని పుత్రునివలె నాదరించెను.

స్వయ మాతిథ్య మాదిశ్య సర్వ మస్య సుసత్కృతమ్,
సౌమిత్రిం చ మహాభాగాం సీతాం చ సమసాంత్వయత్. 6

అత్రిమహర్షియు తానే స్వయముగ సత్కారపూర్వకముగ రామున కాతిథ్య మొసగెను. లక్ష్మణుని, మహాభాగ్యవతి యగు సీతను ప్రీతివచనములతో నాదరించెను.

పత్నీం చ సమనుప్రాప్తాం వృద్ధా మామంత్ర్య సత్కృతామ్,
సాంత్వయామాస ధర్మజ్ఞ స్సర్వభూతహితే రతః. 7

ధర్మమెఱిగినవాడు, సకలప్రాణుల హితమం దాసక్తుడగు వసిష్ఠు డా సమయమున అచటకు వచ్చినది, ఎల్లరిచే సత్కరింప బడినట్టిది, వృద్ధురాలగు తన భార్య అనసూయాదేవిని పిలచి, ఆమెతో కలసి వారి నాదరించెను.

అనసూయాం మహాభాగాం తాపసీం ధర్మచారిణీమ్,
ప్రతిగృహ్ణీష్వ వైదేహీ మబ్రవీ దృషిసత్తమః. 8

ఋషిశ్రేష్ఠు డగు రాముడు సీతతో – 'అమ్మా! మహాభాగ్య వతి, తాపసి, ధర్మనిష్ఠగల దగు ఈ యనసూయాదేవికి నమస్క రింపు' మనెను.

రామాయ చాఽఽచచక్షే తాం తాపసీం ధర్మచారిణీమ్.

తాపసి, ధర్మచారిణి యగు ఆ అనసూయాదేవిని గూర్చి యా ముని రామున కిట్లు తెలిపెను.

దశవర్షా ణ్యనావృష్ట్యా దగ్ధే లోకే నిరన్తరమ్, 9
యయా మూలఫలే సృష్టే జాహ్నవీ చ ప్రవర్తితా,
ఉగ్రేణ తపసా యుక్తా నియమై శ్చాప్యలంకృతా. 10
దశవర్షసహస్రాణి తయా తప్తం మహత్తపః,
అనసూయా వ్రతై స్స్నాతా ప్రత్యూహాశ్చ నివర్తితాః. 11
దేవకార్యనిమిత్తం చ యయా స న్త్వరమాణయా,
దశరాత్రం కృతా రాత్రి స్సేయం మాతేవ తేఽనఘ! 12

పది సంవత్సరము లెడతెగని క్షామముచే లోక మెల్ల తగుల బడుచుండగా నీమె దుంపలు, పండ్లు సృష్టించినది. గంగానదిని ప్రవహింపజేసినది. నియమవతి యగు నీమె పదివేల సంవత్సరములు గొప్పతప మొనర్చినది. ఈమె యొనర్చిన కృచ్ఛ్రి చాంద్రాయణాది వ్రతములచే తపోవిఘ్నములు తొలగినవి. దేవ కార్యము సాధించుకొఱ కీమె త్వరపడుచు పదిరోజులు ఒకేరోజుగా చేసినది. ఇట్టి ఈ యనసూయ నీకు తల్లి వంటిది' అనెను.

తా మిమాం సర్వభూతానాం నమస్కార్యాం యశస్వినీమ్,
అభిగచ్ఛతు వైదేహీ వృద్ధా మక్రోధనాం సదా, 13
అనసూయేతి యా లోకే కర్మభిః ఖ్యాతి మాగతా.

సకల ప్రాణులకు నమస్కరింపదగినది, కీర్తిమతి, సదా కోపములేనిది, తన యనుష్ఠానములచే లోకమున అనసూయ (—స్పర్ధ చెంద నలవికానట్టి గొప్పదనము కలదగుటచే అసూయ చెందరానిది) గా ప్రసిద్ధి నొందినదగు నీ వృద్ధురాలికి సీత నమస్కరించునుగాక.

ఏవం బ్రువాణం త మృషిం తథే త్యుక్త్వా స రాఘవః, 14
సీతా మువాచ ధర్మజ్ఞా మిదం వచన ముత్తమమ్.

రాము డట్లు పలుకుచున్న మహర్షి కట్లే యని పలికి, ధర్మము నెఱిగిన సీతతో ని ట్లుత్తమముగ మాటలాడెను.

రాజపుత్త్రి ! శ్రుత మిదం మునే రస్య సమీరితమ్, 15
శ్రేయోఽర్థ మాత్మన శ్శీఘ్ర మభిగచ్ఛ తపస్వినీమ్.

ఓ రాజపుత్రీ ! మహర్షి పలికినది వింటివి కదా ! నీ శ్రేయ

స్సును కోరి శీఘ్రమే తపస్విని యగు అనసూయదేవికి ప్రణ మిల్లుము.

సీతా త్వేత ద్వచ శ్రుత్వా రాఘవస్య హితైషిణః, 16
తా మత్రిపత్నీం ధర్మజ్ఞా మభిచక్రామ మైథిలీ.

మైథిలియగు సీత, హితాకాంక్షి యగు రాముని వచన మాలించి, ధర్మము నెఱిగిన ఆ అత్రిభార్యయగు అనసూయకు ప్రదక్షిణ మొనర్చెను.

శిథిలాం వలితాం వృద్ధాం జరాపాండురమూర్ధజామ్. 17
సతతం వేపమానాంగీం ప్రవాతే కదళీ యథా,
తాం తు సీతా మహాభాగా మనసూయాం పతివ్రతామ్,18
అభ్యవాదయ దవ్యగ్రా స్వం నామ సముదాహరత్.

సడలిన సంధిబంధములు కలది, శరీరముపై ముడుతలు కలది, ముదుసలిది, వార్ధకముచే తెల్లబడిన వెంట్రుకలు కలది, పెనుగాలికి అరటి చెట్టువలె ఎల్లపుడు వణకుచున్న శరీరము కలది, మహాభాగ్యవతి, పతివ్రత యగు అనసూయకు వ్యాకులత లేనిదై సీత తన పేరు పేర్కొనుచు నమస్కరించెను.

అభివాద్య చ వైదేహీ తాపసీం తా మనిందితామ్, 19
బద్ధాంజలిపుటా హృష్టా పర్యపృచ్ఛ దనామయమ్.

సీత యట్లనిందితయు, తాపసియు నగు అనసూయకు ప్రణ మిల్లి, అంజలి ఘటించి, హర్షము కలదై, ఆమె 'నారోగ్యమా?' యని యడిగెను.

తత స్సీతాం మహాభాగాం దృష్ట్వా తాం ధర్మచారిణీమ్. 20
సాంత్వయం త్యబ్రవీ ద్ధృష్టా దిష్ట్యా ధర్మ మవేక్షసే.

అంత నా యనసూయ, మహాభాగ్యవతి, ధర్మచారిణి యగు నా సీతను చూచి, హర్షము కలదై, ఆమెకు ప్రియోక్తులతో నిట్లనెను- 'సీతా! నీవు భాగ్యవశముచే ధర్మదృష్టి కలిగియున్నావు.

త్యక్త్వా జ్ఞాతిజనం సీతే! మాన మృద్ధిం చ భామిని! 21
అవరుద్ధం వనే రామం దిష్ట్యా త్వ మనుగచ్ఛసి.

ఓ భామినీ! నీ బంధువులను, అహంకారమును, సంపదను విడచిపెట్టి, పదునాలుగేండ్లడవిలో నుండుమని తండ్రిచే నియుక్తుడైన రాముని నీవు భాగ్యవశముచే ననుసరించుచున్నావు.

నగరస్థో వనస్థో వా పాపో వా యది వా శుభః, 22
యాసాం స్త్రీణాం ప్రియో భర్తా తాసాం లోకా మహోదయాః

భర్త నగరమందున్నను, అడవిలో నున్నను, అతడు పాపియైనను పుణ్యపురుషుడైనను, ఏ స్త్రీలు భర్తను ప్రేమింతురో అట్టి స్త్రీలు ఉత్తమ లోకములు బడయుదురు.

దుశ్శీలః కామవృత్తో వా ధనై ర్వా పరివర్జితః, 23
స్త్రీణా మార్యస్వభావానాం పరమం దైవతం పతిః.

భర్త దురాచారియైనను, స్వేచ్ఛాచారియైనను, ధనము లేనివాడైనను. ఉత్తమ స్వభావముగల స్త్రీలకు పతియే పరమదైవము.

నాతో విశిష్టం పశ్యామి బాంధవం విమృశం త్యహమ్,24
సర్వత్ర యోగ్యం వైదేహి! తపః కృత మి వావ్యయమ్.

సీతా! ఎంత ఆలోచించియు సర్వావస్థలలో యోగ్యుడును, తఱుగని తపమునకు ఫలమువలె నొప్పు పతికంటె నుత్తముడగు బంధువును వేరొక్కని చూడకున్నాను.

న త్వేవ మవగచ్ఛంతి గుణదోష మసత్ స్త్రియః. 25

దుష్టబుద్ధిగల స్త్రీలు పైని పేర్కొనిన మంచి చెడ్డలను గమనింపలేరు.

కామవక్తవ్యహృదయా భర్తృనాథా శ్చరంతి యాః.
ప్రాప్నువ న్త్యయశ శ్చైవ ధర్మభ్రంశం చ మైథిలి!, 26
అకార్యవశ మాపన్నాః స్త్రియో యాః ఖలు తద్విధాః.

మైథిలీ! అట్టు పాడుపనులకు బానిసలైన స్త్రీలు కామరూపమగు విషయమునే యభిలషించుచు, పరపురుషులను కోరుచు, తిరుగుచు అపకీర్తిపాలయి, ధర్మభ్రంశము నొందుదురు.

తద్విధాస్తు గుణై ర్యుక్తా దృష్టలోకపరావరాః. 27

గుణవతులను నీవంటివారు మంచి చెడుల నెఱిగినవారై, తక్కిన ధర్మపరులవలె స్వర్గమున విహరింతురు.

తదేవ మేనం త్వ మనువ్రతా సతీ
పతివ్రతానాం సమయానువర్తినీ,
భవ స్వభర్తు స్సహధర్మచారిణీ
యశ శ్చ ధర్మం చ తత స్సమాప్స్యసి. 28

కావున నీవు రాము ననుసరించుచు, పతివ్రతానియమముల

ననుష్ఠించుచు, భర్తకు సహధర్మచారిణి వగుము. దానిచే నీవు కీర్తిని, ధర్మమును సంపాదింతువు" అని యుపదేశించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
సప్తదశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమం
దయోధ్యాకాండమున నూటపదునేడవ సర్గము సమాప్తము.

---

## అష్టాదశోత్తరశతతమః సర్గః
## నూటపదునెనిమిదవ సర్గము

సా త్వేవ ముక్తా వైదేహీ అనసూయాఽనసూయయా,
ప్రతిపూజ్య వచో మందం ప్రవక్తు ముపచక్రమే 1

అసూయలేనిది (తన కనసూయాదేవి చేసిన ధర్మోపదేశమును గుణముగా గ్రహించినట్టి దని భావము) యగు సీత, తన కట్లుపదేశించిన అనసూయను పూజించి యిట్లు మెల్లగా పలుకదొడగెను.

నైత దాశ్చర్య మార్యాయా యన్మాం త్వ మభిభాషసే,
విదితం తు మమా ప్యేత ద్యథా నార్యాః పతి ర్గురుః. 2

పరమ పూజ్యురాలవగు నీవు నా కిట్లుపదేశించుట ఎంతయు తగియుండుటచే నిం దేమాత్ర మాశ్చర్యము లేదు. స్త్రీకి భర్తయే దైవతమని నాకును తెలియును

యద్య ప్యేష భవే ద్భర్తా మమా౽ర్యే । వృత్తవర్జితః,
అద్వైధ ముపచర్తవ్య స్తథా ప్యేష మయా భవేత్. 3

కింపున ర్యో గుణశ్లాఘ్య స్సానుక్రోశో జితేంద్రియః,
స్థిరానురాగో ధర్మాత్మా మాతృవ త్పితృవ త్ప్రియః. 4

ఓ పూజ్యురాలా ! నా పతియే ఆచార రహితుడైనను. అయనలో గుణ-దోష విచారము చేయకయే నేనాయన కుపచారమొనర్పవలయును. అట్టిచో, గుణవంతుడు, మెచ్చుకొనదగినవాడు, దయాశాలి, జితేంద్రియుడు, సడలని యనురాగము కలవాడు, ధర్మాత్ముడు, తల్లివలె, తండ్రివలె ప్రీతిపాత్రుడగు పతి విషయమున వేరుగ చెప్పవలెనా ?

యాం వృత్తిం వర్తతే రామః కౌసల్యాయాం మహాబలః,
తా మేవ నృపనారీణా మన్యాసా మపి వర్తతే. 5

నా పతి, మహాబలుడగు రాము డెట్లు తన తల్లి కౌసల్యయందనురక్తుడో, అట్లే తక్కిన రాజపత్నులయెడల గూడ మాతృభావమే కలిగియున్నాడు.

సకృ ద్దృష్టాస్వపి స్త్రీషు నృపేణ నృపవత్సలః,
మాతృవ ద్వర్తతే వీరో మాన ముత్సృజ్య ధర్మవిత్. 6

ధర్మమెఱిగినవాడు, రాజునం దనురక్తుడగు రాముడు, తన తండ్రి యొకమారు చూచినట్టి స్త్రీలయెడలగూడ గర్వములేక మాతృభావముతో వర్తించును.

అగచ్ఛన్త్యా శ్చ విజనం వన మేవం భయావహమ్,
సమాహితం మే శ్వశ్ర్వా చ హృదయే త ద్ధృతం మహత్. 7

నే నిట్లు జనరహితమై భయంకరమగు అడవికి వచ్చు నపుడు మా యత్త కౌసల్యాదేవి నాకిట్టి యుపదేశమే చేసినది. నేను దానిని నా హృదయమున నిలుపుకొని యుంటిని.

పాణిప్రదానకాలే చ య త్పురా త్వగ్నిసన్నిధౌ,
అనుశిష్టా జనన్యాఽస్మి వాక్యం తదపి మే ధృతమ్. 8

పూర్వము నా పాణిగ్రహణకాలమున అగ్నిహోత్రము కడ నాతల్లి చేసిన యుపదేశమును కూడ నేను మఱువక స్మరించు చున్నాను.

నవీకృతం తు తత్సర్వం వాక్యైస్తే ధర్మచారిణి!,
పతిశుశ్రూషణా న్నార్యా స్తపో నాన్య ద్విధీయతే. 9

ఓ ధర్మచారిణీ! నీ యుపదేశముచే వారి యుపదేశ మంతయు క్రొత్తగా చెప్పినటులైనది. స్త్రీకి పతిశుశ్రూష కంటె వేఱొక్క తపము విహితము కాలేదు.

సావిత్రీ పతిశుశ్రూషాం కృత్వా స్వర్గే మహీయతే,
తథావృత్తి శ్చ యాతా త్వం పతిశుశ్రూషయా దివమ్.10

సావిత్రి పతి సేవ చేసి స్వర్గమున ప్రకాశించుచున్నది. అట్టి యాచరణమే కల నీవును పతిశుశ్రూషచే స్వర్గమునకు పోగలవు.

వరిష్ఠా సర్వనారీణా మేషా చ దివి దేవతా,
రోహిణీ న వినా చంద్రం ముహూర్త మపి దృశ్యతే. 11

సకల స్త్రీలలో శ్రేష్ఠురా. లగు నీ రోహిణీదేవత చంద్రుడు లేక యొక్క క్షణముగూడ కనుపించదు.

ఏవంవిధా శ్చ ప్రవరాః స్త్రియో భర్తృదృఢవ్రతాః,
దేవలోకే మహీయంతే పుణ్యేన స్వేన కర్మణా. 12

ఇట్లు తమ స్త్రీ లెల్లరును భర్తలయందు సడలని భక్తి కలవారు. కావుననే వారు తామొనరించిన పుణ్యకార్యముచే లోకమున వెలుగొందుచున్నారు.

తతోఽనసూయా సంహృష్టా శ్రుత్వోక్తం సీతయా వచః,
శిర స్యాఘ్రాయ చోవాచ మైథిలీం హర్షయ న్త్యుత. 13

అంతట అనసూయాదేవి సీత చెప్పిన మాట విని, యామెను శిరమున మూర్కొని, సంతోషపెట్టుచు నిట్లనెను.

నియమై ర్వివిధై రాప్తం తపో హి మహ దస్తి మే,
త త్సంశ్రిత్య బలం సీతే! ఛందయే త్వాం శుచివ్రతే!. 14

పలునియమములతో సాధించిన తపస్సు నాకడ అధికముగ నున్నది. ఆ తపోబలముచే నీవు కోర్కె నేదేని కోరుమనుచున్నాను. (నేను నీవు కోరిన వరమిత్తును).

ఉపపన్నం మనోజ్ఞం చ వచనం తవ మైథిలి!,
ప్రీతా చాస్మ్యుచితం కిం తే కరవాణి బ్రవీహి మే. 15

సీతా! నీ మాట యుక్తముగను, మనోహరముగను ఉన్నది. నీయందు నేను ప్రీతి కలిగియున్నాను. నీకేమి చేయవలయునో తెలుపుము.

తస్యా స్తద్వచనం శ్రుత్వా విస్మితా మందవిస్మయా,
కృత మిత్యబ్రవీ త్సీతా తపోబలసమన్వితామ్. 16

అనసూయ పలికిన యామాటకు విస్మయమంది సీత చిరునగవుతో–'అమ్మా! నీ వాక్యమే నాకన్నింటిని ప్రసాదించుటతో సమానము. వేఱొండు కోరికతో పనియేమి' అని తపోబలము కల యామెతో చెప్పెను.

సా త్వేవ ముక్తా ధర్మజ్ఞా తయా ప్రీతతరాఽ భవత్,
సఫలం చ ప్రహర్షం తే హంత సీతే! కరో మ్యహమ్. 17
ఇదం దివ్యం వరం మాల్యం వస్త్ర మాభరణాని చ,
అంగరాగం చ వైదేహి! మహార్హం చానులేపనమ్, 18
మయా దత్త మిదం సీతే! తవ గాత్రాణి శోభయేత్,
అనురూప మసంక్లిష్టం నిత్య మేవ భవిష్యతి. 19
అంగరాగేణ దివ్యేన లిప్తాంగీ జనకాత్మజే!,
శోభయిష్యసి భర్తారం యథా శ్రీ ర్విష్ణు మవ్యయమ్.20

సీత యిట్లు పలుకగా అనసూయ మఱింతగా ప్రీతినందెను. "సీతా! నాకు నీపై కలిగిన హర్షము నిపుడు సఫలమొనర్తును. ఇదిగో దివ్యమగు మాల, వస్త్రములు, ఆభరణములు, శరీరముపై పూసికొను గంధద్రవ్యము, గొప్ప విలువైన చందనాదిక మిదిగో నే నిచ్చుచున్నాను.ఇది యంతయు నీ శరీరమును శోభిల్లజేయును. ఇది ఎల్లపుడు నీకు ఉచితము, తఱుగని శోభకలది యగును. ఈ యంగరాగము పూసికొని అనశ్వరుడగు శ్రీ మహావిష్ణువును శ్రీదేవివలె నీవు నీ భర్తను ప్రకాశింపజేతువు.

సా వస్త్ర మంగరాగం చ భూషణాని స్రజ స్తథా,
మైథిలీ ప్రతిజగ్రాహ ప్రీతిదాన మనుత్తమమ్. 21

అని పలికి అనసూయాదేవి ప్రీతితో నిచ్చిన శ్రేష్ఠమగు వస్త్రమును, అంగరాగమును, అలంకారములను, మాలలను సీత స్వీకరించెను.

ప్రతిగృహ్య చ త త్సీతా ప్రీతిదానం యశస్వినీ,
శ్లిష్టాంజలిపుటా తత్ర సముపాస్త తపోధనామ్. 22

కీర్తిమతియగు సీత అనసూయ యొసగిన ప్రీతిదానమును గ్రహించి, దోసిలి యొగ్గి తపోధన యగు నా యనసూయను సేవించెను.

తథా సీతా ముపాసీనా మనసూయా దృఢవ్రతా,
వచనం ప్రష్టు మారేభే కాంచి త్ప్రియకథా మను. 23

అట్లు తన్ను సేవించుచున్న సీత నా దృఢవ్రత యగు అనసూయ ప్రియాలాపముగ నిట్లు ప్రశ్నింపదొడగెను.

స్వయంవరే కిల ప్రాప్తా త్వ మనేన యశస్వినా,
రాఘవే ణేతి మే సీతే! కథా శ్రుతి ముపాగతా. 24

తాం కథాం శ్రోతు మిచ్ఛామి విస్తరేణ చ మైథిలి!,
యథాఽనుభూతం కార్త్స్న్యేన త న్మే త్వం వక్తుమర్హసి. 25

సీతా! కీర్తిమంతుడగు ఈ రాఘవునిచే స్వయంవరమున వివాహమాడబడితి వని విందుము. నా కా కథ విస్తరముగ విన

వలెనని యున్నది. నీవా విషయమును నీయనుభవము ననుసరించి సంపూర్ణముగ తెలుపగోరుచున్నాను.

ఏవ ముక్తా తు సా సీతా తాం తతో ధర్మచారిణీమ్,
శ్రూయతా మితి చోక్త్వా వై కథయామాస తాం కథామ్.

అని యిట్లు ధర్మచారిణి యడుగగా, నా సీత 'విను' మని యామె కా కథను చెప్పెను.

మిథిలాధిపతి ర్వీరో జనకో నామ ధర్మవిత్,
క్షత్రధర్మే హ్యభిరతో న్యాయత శ్శాస్తి మేదినీమ్. 27

వీరుడు, ధర్మజ్ఞుడగు జనకుడు మిథిలానగరమునకు రాజు. ఆయన క్షత్రియధర్మమం దభిరుచి గలిగి న్యాయముగ రాజ్య మేలుచున్నాడు.

తస్య లాంగలహస్తస్య కర్షతః క్షేత్రమండలమ్,
అహం కిలోత్థితా భిత్త్వా జగతీం నృపతే స్సుతా. 28

ఆయన యొకప్పుడు యాగోపయోగిస్థలార్థము పొలము దున్నుచుండగా నేను భూమిని చీల్చుకొని పుట్టి ఆయన కూతురుగా నయితిని.

స మాం దృష్ట్వా నరపతి ర్ముష్టివిక్షేపతత్పరః,
పాంసుకుంఠితసర్వాంగీం జనకో విస్మితోఽభవత్. 29

ఆరాజు క్షేత్రమున శాస్త్రోక్తముగ నోషధి బీజములు చల్లుటలో నిమగ్నుడై దుమ్ము కొట్టుకొనిన యొడలితో కూడిన నన్ను చూచి యాశ్చర్యపడినాడు.

అనపత్యేన చ స్నేహా దంక మారోప్య చ స్వయమ్,
మ మేయం తనయే త్యుక్త్వా స్నేహెూ మయి నిపాతితః.

ఆయన సంతానము లేనివా డగుటచే ప్రేమతో తానే నన్నొడిలో బెట్టుకొని, ఈమె నా బిడ్డ యనుచు నాయం దను రాగము చూపినాడు.

అంతరిక్షే చ వాగుక్తాఽప్రతిమాఽమానుషీ కిల,
ఏవ మేత న్నరపతే। ధర్మేణ తనయా తవ. 31

అపు డాకాశమునుండి–"రాజా! ఈమె ధర్మమున నీ తనయయే" యని యశరీరవాణి యనుపమమగు నీ వాక్యము పలికెను.

తతః ప్రహృష్టో ధర్మాత్మా పితా మే మిథిలాధిపః,
అవాప్తో విపులా మృద్ధిం మా మవాప్య నరాధిపః. 32

ధర్మాత్ముడు, మిథిలాధిపతి యగు నాతండ్రి యా వాక్కును విని మిక్కిలి హర్షము నొందెను. ఆయన నన్ను కూతునుగా పొంది సంపదలను విరివిగా సంపాదించెను.

దత్తా చా స్మీష్టవ ద్దేవ్యై జ్యేష్ఠాయై పుణ్యకర్మణా,
తయా సంభావితా చాస్మి స్నిగ్ధయా మాతృసౌహృదాత్॥ 3

ఆయన నన్ను తీసికొనిపోయి తన కభిమతురాలు, పట్టపురాణియగు పెద్దభార్యకు నన్నొసగెను. ప్రేమమూర్తి యగు ఆమెయు మాతృప్రీతితో నన్నాదరించెను.

పతిసంయోగసులభం వయో దృష్ట్వా తు మే పితా,
చిన్తా మభ్యగమ ద్దీనో విత్తనాశా దివాధనః. 34

అంత నాకు పతిని పొందు వయసు వచ్చినదని యెఱిగిన నాతండ్రి, ధనము పోగొట్టుకొనిన పేదవోలె దీనుడై చింతిల్లెను.

సదృశా చ్చాపకృష్టా చ్చ లోకే కన్యాపితా జనాత్,
ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి. 35

లోకమున కన్య తండ్రి దేవేంద్రునితో సమాను డైనను, తనతో సమానుడే కాదు, నికృష్టు డగు వరునివైపు వ్యక్తివలన కూడ తిరస్కారము పొందక తప్పదు.

తాం ధర్షణా మదూరస్థాం దృష్ట్వా చాత్మని పార్థివః,
చిన్తార్ణవగతః పారం నాససా దాప్లవో యథా. 36

రాజా తిరస్కారము చేరువనే యుండుట భావించి, చింతా సముద్రమున బడి విరిగిన నావవలె దరి జేర డయ్యెను.

అయోనిజాం హి మాం జ్ఞాత్వా నాధ్యగచ్ఛ ద్విచింతయన్,
సదృశం చానురూపం చ మహీపాలః పతిం మమ. 37

రాజు నన్నయోనిజనుగా తెలిసి, నాకు తగిన పతి యెవ్వడో ఎంత విచారించియు తెలిసికొనలే డయ్యెను.

తస్య బుద్ధి రియం జాతా చింతయానస్య సంతతమ్,
స్వయంవరం తనూజాయాః కరిష్యా మీతి ధీమతః. 38

అనవరత మీ విషయమును గూర్చియే ఆలోచించుచున్న

ధీమంతుడగు నా తండ్రికి- తన తనూజకు స్వయంవర మేర్పరుప వలెనని యాలోచన కలిగెను.

మహాయజ్ఞే తదా తస్య వరుణేన మహాత్మనా,
దత్తం ధనుర్వరం ప్రీత్యా తూణీ చాక్షయసాయకౌ. 39

దక్షయజ్ఞకాలమున శివుడు దేవతల కిచ్చిన శ్రేష్ఠమగు ధనుస్సు, తఱుగని బాణములు కల అమ్ముల పొదిని, దేవతలు వరుణుని ద్వారా ప్రీతితో నా జనకునకు (పూర్వపురుషుడగు దేవరాతునకు) ఇచ్చిరి.

అసంచాల్యం మనుష్యైశ్చ యత్నేనాపి చ గౌరవాత్,
త న్న శక్తా నమయితుం స్వప్నే ష్వపి నరాధిపాః. 40

ఆ ధనుస్సు మిక్కలి బరువైన దగుటచే మనుజులకు ప్రయత్నము చేసియు కదల్ప నలవికానిది. కావున రాజులు దానిని కలలోనైన వంచుటకు సమర్థులుకారు.

తద్ధనుః ప్రాప్య మే పిత్రా వ్యాహృతం సత్యవాదినా,
సమవాయే నరేంద్రాణాం పూర్వ మామంత్ర్య పార్థివాన్. 41

వంశక్రమానుగతముగ నా వింటిని పొందిన సత్యవాది యగు నా తండ్రి రాజుల నెల్ల యాహ్వానించి ఇట్లు పలికెను.

ఇదం చ ధను రుద్యమ్య సజ్యం యః కురుతే నరః,
తస్య మే దుహితా భార్యా భవిష్యతి న సంశయః. 42

ఎవ్వడీ వింటి నెత్తి దీనికి నారిని కూర్పగలడో, అతనికి నా కూతురు భార్య కాగలదు. ఇందు సందేహము లేదు.

తచ్చ దృష్ట్వా ధనుశ్శ్రేష్ఠం గౌరవా ద్గిరిసన్నిభమ్,
అభివాద్య నృపా జగ్ము రశక్తా స్తస్య తోలనే.

బరువుచే కొండవలె నున్న నా శ్రేష్ఠమగు విల్లుచూ దానిని కదల్పలేక రాజులు దానికి ప్రణమిల్లి వెడలిరి.

సుదీర్ఘస్య తు కాలస్య రాఘవోఽయం మహాద్యుతిః,
విశ్వామిత్రేణ సహితో యజ్ఞం ద్రష్టుం సమాగతః.

అటుపిమ్మట చాలకాలమునకు గొప్పతేజశ్శాలి యగు రాముడు విశ్వామిత్రునితో కలసి యజ్ఞమును చూడవచ్చెను.

లక్ష్మణేన సహ భ్రాత్రా రామ స్సత్యపరాక్రమః,
విశ్వామిత్ర స్తు ధర్మాత్మా మమ పిత్రా సుపూజితః. 4
ప్రోవాచ పితరం తత్ర భ్రాతరౌ రామలక్ష్మణౌ,
సుతౌ దశరథ స్యేమౌ ధనుర్దర్శనకాంక్షిణౌ. 4

సత్యపరాక్రముడగు రాముని, అయన సోదరుడగు లక్ష్మణుని ధర్మాత్ముడగు విశ్వామిత్రుని నా తండ్రి చక్కగా గౌరవించెను. అపుడు విశ్వామిత్రుడు మా తండ్రితో- 'దశరథపుత్రులు సోదరులగు నీ రామలక్ష్మణు, లా వింటిని చూడగోరు చున్నారని చెప్పెను.

ధను ర్దర్శయ రామాయ రాజపుత్రాయ దైవికమ్,

శంకరుని యా వింటి నీ రాజకుమారుడగు రామునకు జూపు" మనెను.

ఇ త్యుక్త స్తేన విప్రేణ తద్ధను స్సముపానయత్. 47

అని యా విశ్వామిత్రుడు చెప్పగా జనకు డా వింటిని కొని వచ్చెను.

నిమేషాన్తరమాత్రేణ తదానమ్య స వీర్యవాన్,
జ్యాం సమారోప్య ఝడితి పూరయామాస వీర్యవత్. 48

పరాక్రమశాలియగు రాము డా వింటి నొక్క నిముసములో వంచి, అల్లెత్రాడు జతచేసి, శీఘ్రమే ఎక్కుపెట్టి పూరించెను.

తేన పూరయతా వేగా న్మధ్యే భగ్నం ద్విధా ధనుః,
తస్య శబ్దోఽభవ ద్భీమః పతిత స్యాశనే రివ. 49

రాము డట్లు పూరించుచుండగా, ఆ వేగమునకే ఆ విల్లు నడిమికి రెండుగా విరిగెను. దాని శబ్దము పిడుగుపాటువలె భయంకర మయ్యెను

తతోఽహం తత్ర రామాయ పిత్రా సత్యాభిసంధినా,
నిశ్చితా దాతు ముద్యమ్య జలభాజన ముత్తమమ్. 50

అపుడు సత్యప్రతిజ్ఞకల నా తండ్రి నన్ను రామున కీయ నిశ్చయించి, జలపాత్రము చేత ధరించెను.

దీయమానాం న తు తదా ప్రతిజగ్రాహ రాఘవః,
అవిజ్ఞాయ పితు శ్ఛన్ద మయోధ్యాధిపతేః ప్రభోః. 51

అయోధ్యాధిపతి, యగు తన తండ్రి ఇష్టమేమో తెలియక రాముడు నన్నపుడు గ్రహింపలేదు.

తత శ్శ్వశుర మామంత్ర్య వృద్ధం దశరథం నృపమ్,
మమ పిత్రా త్వహం దత్తా రామాయ విదితాత్మనే. 52

అంత నాతండ్రి, మా మామయు, వృద్ధుడు అగు దశరథ మహారాజు నాహ్వానించి, పరమాత్మ విదుడగు రామునకు నన్నిచ్చి పెండ్లిచేసెను.

మమ చైవానుజా సాధ్వీ ఊర్మిళా ప్రియదర్శనా,
భార్యార్థే లక్ష్మణస్యాపి దత్తా పిత్రా మమ స్వయమ్. 53

నాకు చెల్లెలు, సాధ్వి. దర్శనీయగాత్రి యగు ఊర్మిళను నా తండ్రి స్వయముగ లక్ష్మణునకు భార్యగా నొసగెను.

ఏవం దత్తాఽస్మి రామాయ తదా తస్మిన్ స్వయంవరే,
అనురక్తాస్మి ధర్మేణ పతిం వీర్యవతాం వరమ్. 54

ఈ విధముగా నే నపుడా స్వయంవరమున రామునకు భార్యనైతిని. పరాక్రమవంతులలో శ్రేష్ఠుడగు నా పతియందు ధర్మసమ్మతముగ ననురాగము కలిగియున్నాను" అని సీత అనసూయకు చెప్పెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
అష్టాదశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణమం దయోధ్యాకాండమున నూట పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

# ఏకోనవింశో త్తరశతతమః సర్గః
# నూటపందొమ్మిదవ సర్గము

అనసూయా తు ధర్మజ్ఞా శ్రుత్వా తాం మహతీం కథామ్,
పర్యష్వజత బాహుభ్యాం శిర స్యాఘ్రాయ మైథిలీమ్. 1

ధర్మము నెఱిగిన అనసూయాదేవి సీతాస్వయంవర రూప మగు ఆ మహాకథను విని, సీత శిరము మూర్కొని, ఆమె నాలింగనము చేసికొనెను.

వ్యక్తాక్షరపదం చిత్రం భాషితం మధురం త్వయా,
యథా స్వయంవరం వృత్తం త త్సర్వం హి శ్రుతం మయా.

స్పష్టాక్షరయుక్తములగు పదములతో, మధురముగ, ఆశ్చర్యము గొలుపునట్లు నీవు పలికిన స్వయంవరవృత్తాంత మంతయు వింటిని. ఓ మధురముగ మాటలాడుదానా ! నీ కథచే నేను మిక్కిలి ఆనందించుచున్నాను.

రమేఽహం కథయా తే తు దృఢం మధురభాషిణి!,
రవి రస్తంగత శ్శ్రీమా నుపోహ్య రజనీం శివామ్. 3

దివసం ప్రతికీర్ణానా మాహారార్థం పతత్త్రిణామ్,
సన్ధ్యాకాలే నిలీనానాం నిద్రార్థం శ్రూయతే ధ్వనిః. 4

శుభమగు రాత్రిని సమీపించి శ్రీమంతుడగు సూర్యు డస్త మించినాడు. పగలంతయు ఆహారమునకై యెల్లెడల తిరిగి, సంధ్యాసమయమున గూండ్లకు నిద్రింప నేతెంచిన పక్షుల కూజితము వినిపించుచున్నది.

ఏతే చా ప్యభిషేకార్ద్రా మునయః కలశోద్యతాః,
సహితా ఉపవర్తన్తే సలిలాప్లుతవల్కలాః. **5**

స్నానముచేసి తడసిన ఈ మునులు కలశములతో జలములు తీసికొని, తడసిన వల్కలములు కలవారై మఱలివచ్చుచున్నారు.

ఋషీణా మగ్నిహోత్రేషు హుతేషు విధిపూర్వకమ్,
కపోతాంగారుణో ధూమో దృశ్యతే పవనోద్ధతః. **6**

శాస్త్రోక్తముగ హోమము చేయబడిన ఋషుల అగ్నిహోత్రములలో పావురము మెడవలె అస్పష్టమగు ఎఱ్ఱదనము (అరుణవర్ణము) కల పొగ గాలి కెగురగొట్టబడి కన్పట్టుచున్నది.

అల్పపర్ణా హి తరవో ఘనీభూతా స్సమంతతః,
విప్రకృష్టేఽపి దేశేఽస్మి న్న ప్రకాశంతి వై దిశః. **7**

చీకటి కారణముగ తక్కువ ఆకులు కల చెట్లుకూడ దట్టముగా కనిపించుచున్నవి. చెట్లు దూరదూరముగ నున్నను దిక్కులు ప్రకాశించుటలేదు.

రజనీచరసత్త్వాని ప్రచరంతి సమంతతః,
తపోవనమృగా హ్యేతే వేదితీర్థేషు శేరతే. **8**

రాత్రులందు తిరుగు రక్కసిమూకలు అంతటను సంచారము కలిగియున్నవి. ఈ తపోవనమందలి లేళ్లు వేదికల మెట్లకడ పరుండియున్నవి.

సమ్ప్రవృత్తా నిశా సీతే! నక్షత్రసమలంకృతా,
జ్యోత్స్నాప్రావరణ శ్చంద్రో దృశ్యతేఽభ్యుదితోఽంబరే.9

సీతా! నక్షత్రములతో నలంకరించబడిన ఈ రాత్రి యొక్క చీకట్లు దట్టమగుచున్నవి. ఆకాశమున వెన్నెలను కప్పుకొని చంద్రు డుదయించి యగపడుచున్నాడు.

గమ్యతా మనుజానామి రామ స్యానుచరీ భవ,
కథయంత్యా హి మధురం త్వయాఽహం పరితోషితా.10

నీ వింక పోయి రాము ననుసరింపుము. నీ కిదే యనుమతించుచున్నాను. నీ విట్లు మధురముగా పలుకుటచే నేను చాల సంతోషపెట్టబడితిని.

అలంకురు చ తావ త్త్వం ప్రత్యక్షం మమ మైథిలి!,
ప్రీతిం జనయ మే వత్సే! దివ్యాలంకారశోభితా. 11

బిడ్డా! నీ వీ యలంకారములను నా యెదుటనే యలంకరించుకొమ్ము. దివ్యాలంకరణములతో శోభిల్లుచు నా కానందము కలిగింపుము.

సా తదా సమలంకృత్య సీతా సురసుతోపమా,
ప్రణమ్య శిరసా తస్యై రామం త్వభిముఖీ యయౌ. 12

దేవకన్యను బోలు ఆ సీత అనసూయ యొసగిన యాభరణములు దాల్చి, యామెకు ప్రణమిల్లి రాముని కడ కేగెను.

తథా తు భూషితాం సీతాం దదర్శ వదతాం వరః,
రాఘవః ప్రీతిదానేన తపస్విన్యా జహర్ష చ. 13

వస్త్రలలో శ్రేష్ఠుడగు రాము డట్లలంకరించుకొనిన సీత చూచెను. తపస్వురాలగు అనసూయాదేవి సీతపై కలిగి ప్రీతితో నిచ్చిన ప్రీతిదానమున కానందించెను.

న్యవేదయ త్తత స్సర్వం సీతా రామాయ మైథిలీ,
ప్రీతిదానం తపస్విన్యా వసనాభరణస్రజమ్. 1

అంతట సీత అనసూయాదేవి ప్రీతితో తన కిచ్చిన వస్త్ర ములు, ఆభరణములు, మాలలు తక్కిన అన్ని విషయములను గూర్చి పతికి తెలియజేసెను.

ప్రహృష్ట స్త్వభవ ద్రామో లక్ష్మణ శ్చ మహారథః,
మైథిల్యా స్సత్క్రియాం దృష్ట్వా మానుషేషు సుదుర్లభామ్

అనసూయ సీతకు ప్రీతితో నొసగిన మనుష్యులకు దుర్లభ మగు సత్కారమును చూచి రామలక్ష్మణు లానందించిరి.

తత స్తాం శర్వరీం ప్రీతః పుణ్యాం శశినిభాననః,
అర్చిత స్తాపసై స్సిద్ధై రువాస రఘునందనః. 16

చంద్రునివంటి మోముగల రాము డా యాశ్రమమున తాపసులచే పూజితుడై, ప్రీతితో పవిత్రమగు నారాత్రి యచట గడపెను.

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయా మభిషిచ్య హుతాగ్నికాన్,
అపృచ్ఛేతాం నరవ్యాఘ్రౌ తాపసా న్వనగోచరాన్. 17

ఆ రాత్రి గడువగా, మఱునాటి యుదయమున స్నానము

చేసి, యగ్నికార్య మొనరించిన ఆశ్రమవాసులగు తాపసులకడ రామలక్ష్మణులు సెల వడిగిరి.

తా వూచు స్తే వనచరా స్తాపసా ధర్మచారిణః,
వనస్య తస్య సంచారం రాక్షసై స్సమభిప్లుతమ్. 18

ధర్మచారులగు నా తపస్వు లాతడు పోవు ప్రాంతమంతయు రాక్షసులతో నిండియున్నదని రామలక్ష్మణులకు తెలియజేసిరి.

రక్షాంసి పురుషాదాని నానారూపాణి రాఘవ !,
వన స్త్వస్మి న్మహారణ్యే వ్యాళా శ్చ రుధిరాశనాః. 19

రామా ! వివిధరూపములు కలిగి, మనుజులను తిను రాక్షసులు, రక్తము త్రాగు క్రూరమృగము లీ యడవిలో కలవు.

ఉచ్ఛిష్టం వా ప్రమత్తం వా తాపసం ధర్మచారిణమ్,
అద న్త్యస్మి న్మహారణ్యే తా న్నివారయ రాఘవ ! 20

రామా ! ఈ మహారణ్యమున ధర్మచారులగు మును లశుచిగా, లేక అనవహితులుగా నున్న సమయము చూచి రాక్షసులు వారిని తినుచున్నారు. నీవు వారి నడ్డుకొనవలెను.

ఏష పన్థా మహర్షీణాం ఫలా న్యాహరతాం వనే,
అనేన తు వనం దుర్గం గన్తుం రాఘవ! తే క్షమమ్.21

రామా ! మహర్షులు పండ్లు తెచ్చుకొనుటకై యడవిలోనికి పోవుత్రోవ ఇది. నీ వీ మార్గముననే దుర్గమమగు నడవిలో పోవదగును.

ఇతీవ తైః ప్రాంజలిభి స్తపస్విభి
ర్ద్విజైః కృతస్వస్త్యయనః పరంతపః,
వనం సభార్యః ప్రవివేశ రాఘవ
స్సలక్ష్మణ స్సూర్య ఇవాభ్రమండలమ్. 22

అని యట్లు దోసిలి యొగ్గి యా తపస్వులగు బ్రాహ్మణులెల్లరు, మంగళాశీర్వచనములు పలుకగా, శత్రుతాపనుడగు రాముడు, సీతతో లక్ష్మణునితో సూర్యు డాకాశమండమును వోలె, నడవిలో ప్రవేశించెను.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకోనవింశోత్తరశతతమః సర్గః.

ఇట్లు ఋషిప్రోక్తము, అదికావ్యమగు శ్రీమద్రామాయణమందయోధ్యాకాండమున నూటపందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

అయోధ్యాకాండః సమాప్తః.
అయోధ్యాకాండము సమాప్తము.

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

—o—

# శ్రీమద్రామాయణము - తాత్పర్య సహితము

## పోషకులు

| | |
|---|---|
| శ్రీ ఆర్ష వాఙ్మయ సమితి | హనుమకొండ |
| ,, పుల్లారెడ్డిగారు జి. | హైదరాబాదు |
| ,, రెడ్డిగారు సి. వి. | ,, |
| ,, వెంకటేశ్వర్లుగారు పి | ,, |

## ప్రచురణ పూర్వవిరాళ దాతలు

| | |
|---|---|
| శ్రీ అచ్చన్న శాస్త్రిగారు అకెళ్ల | తిరుపతి |
| ,, అన్నాజీరావుగారు సి.వి. | మచిలీపట్నం |
| ,, అప్పయ్యపంతులుగారు పాలకోడేటి | గుడివాడ |
| ,, అప్పలాచార్యులుగారు తిరువడందం పోరెత్తు | ఏదులాబాదు |
| ,, అప్పారావుగారు మర్ల | హైదరాబాదు |
| శ్రీమతి అమ్మాజమ్మగారు వెంపలి | గుడివాడ |
| శ్రీ అవధానిగారు డి.బి. | హైదరాబాదు |
| ,, అవధానిగారు కె.వి.యన్. | విశాఖపట్నం |
| ,, ఆండాళ్లమ్మగారు తడకమళ్ల | బేతవోలు |
| ,, ఆంధ్రగ్రంథాలయం, ఆనందనగర్ కాలనీ | హైదరాబాదు |
| ,, ఆచార్యులుగారు యన్.సి.టి. | ,, |
| ,, ఉదయవర్లుగారు టి. | ,, |
| ,, ఎల్లప్పగారు డి.ఆర్.యం. | గద్వాల |
| ,, ఎస్. ఏ. పి. ఆర్ట్స్ అండ్ సైన్సు కాలేజి | వికారాబాదు |
| ,, ఒయాసిస్ స్కూలు | హైదరాబాదు |
| ,, కనకరత్నంగారు వై.యస్.ఆర్.వి.వి.యన్. | ,, |

| | |
|---|---|
| శ్రీ కరీం బేగ్ | హైదరాబాదు |
| ,, కామేశ్వరమ్మగారు చావలి | వసంతవాడ |
| ,, కామేశ్వరరావుగారు | హైదరాబాదు |
| ,, కామేశ్వరరావుగారు ఆకొండి | ,, |
| ,, కామేశ్వరరావుగారు వి. | వీరవల్లిపాలెం |
| శ్రీమతి కుముదవల్లి తాయారమ్మగారు కోసూరి | హైదరాబాదు |
| శ్రీ కృష్ణగారు వి.యస్. | హైదరాబాదు |
| ,, కృష్ణమూర్తిగారు ఇరివెంటి | ,, |
| ,, కృష్ణమూర్తిగారు చివుకుల | తిరుపతి |
| ,, కృష్ణమూర్తిగారు పట్నం | ,, |
| ,, కృష్ణమూర్తిగారు ఎ. | ఔరంగాబాదు |
| ,, కృష్ణమూర్తిగారు ఇ. | హైదరాబాదు |
| ,, కృష్ణమూర్తిగారు జె. | బెల్లంపల్లి |
| ,, కృష్ణమూర్తిగారు కె.వి. | అచనపల్లి |
| ,, కృష్ణమూర్తిగారు యన్ వి.జి. | హైదరాబాదు |
| ,, కృష్ణమూర్తిగారు యస్.టి.జి. | ,, |
| ,, కృష్ణమూర్తి గురుకుల్‌గారు యస్.యం.కె. | శ్రీకాళహస్తి |
| ,, కృష్ణశర్మగారు సి.వి.యస్.ఆర్. | హైదరాబాదు |
| ,, కృష్ణారావుగారు | ,, |
| ,, కృష్ణారావుగారు నాదెళ్ళ | పమిడిముక్కల |
| ,, కృష్ణారావుగారు ఆర్. | వరంగల్ |
| ,, కేశవులుగారు కె. | నాగర్ కర్నూలు |
| ,, కొండలరావుగారు యం.వి. | ఉత్తరాశిపల్లి |
| ,, కోటేశ్వరరావుగారు అర్. | మచిలీపట్నం |
| ,, గురునాథంగారు డి. | హైదరాబాదు |

| | |
|---|---|
| శ్రీ గోపాలకృష్ణయ్యగారు ఒ. | ఇరువెన్ను |
| ,, గోపాలాచారిగారు వి. | హైదరాబాదు |
| ,, గోపాలాచార్యులుగారు జి.టి.వి. | ,, |
| ,, గోవర్ధన్‌గారు యం. | నిజామాబాదు |
| ,, చంద్రశేఖరన్‌గారు యస్. సెక్రెటరీ, డివైన్ లైఫ్ సొసైటీ | రాశిపురం |
| ,, చంద్రారెడ్డిగారు పి. | హైదరాబాదు |
| శ్రీ చక్రపాణిరావుగారు యన్. | కొవ్వూరు |
| శ్రీ చక్రపాణిగారు వై. | హైదరాబాదు |
| శ్రీ చారిగారు లెఫ్టినెంట్‌కర్నల్ జి.యన్.యస్. | రాంచి |
| శ్రీ చారిగారు యం. జి. | తిరుపతి |
| శ్రీ చూడామణిగారు టి.కె. | హైదరాబాదు |
| శ్రీ జగన్నాథరావుగారు జి. | ,, |
| శ్రీ జగన్నాథాచార్యులుగారు జి. | ,, |
| శ్రీ జగన్మోహన్‌గారు తిరునగర్ | పరకాల |
| శ్రీ జగన్మోహనరావుగారు పి. | హైదరాబాదు |
| శ్రీ జగన్మోహన్‌రెడ్డిగారు జి. | గద్వాల |
| శ్రీ జానకిరాములుగారు టి. | ,, |
| శ్రీ తిరుపతిరావుగారు యన్. | హైదరాబాదు |
| శ్రీ దివాకర్‌గారు ఎ. | బళ్లారి |
| శ్రీ దుర్గాశంకర లక్ష్మీనారాయణశర్మగారు దిట్టకవి | హైదరాబాదు |
| శ్రీ దేవదానంగారు బి. | ,, |
| శ్రీ దేవరాజాచార్‌గారు టి.కె. | కర్నూలు |
| శ్రీ దొరస్వామిగారు | హైదరాబాదు |
| శ్రీ నరసయ్యగారు టి. | పి. కపకుంట్ల |

| | |
|---|---|
| శ్రీ నరసారెడ్డిగారు సి.సి. | పామిడి |
| శ్రీ నరసింగరావుగారు బొంగు | అల్వాల్ |
| శ్రీ నరసింహమూర్తిగారు దుద్దిళ్ళ | హైదరాబాదు |
| శ్రీ నరసింహమూర్తిగారు పెరపలి | కొత్తకోట |
| శ్రీ నరసింహమూర్తిగారు బి. | హైదరాబాదు |
| శ్రీ నరసింహమూర్తిగారు కె.వి. | కణుపూరు |
| శ్రీ నరసింహమూర్తిగారు కె.వి. | తిరుపతి |
| శ్రీ నరసింహస్వామిగారు అకలంకం | హైదరాబాదు |
| శ్రీ నరసింహాచార్యగారు డి.ఆర్ యన్.సి. | ,, |
| శ్రీ నరసింహాచార్యగారు పి. | ,, |
| శ్రీ నరసింహాచార్యగారు టి.కె.వి. | ,, |
| శ్రీ నరసింహాచార్యులుగారు తట్టా | గూడూరు-కృష్ణా |
| శ్రీ నరసింహాచార్యులుగారు కె. | నల్గొండ |
| శ్రీ నరసింహారావుగారు డి.ఆర్, ఎ. వి | హైదరాబాదు |
| శ్రీ నరసింహారావుగారు యన్. | ,, |
| శ్రీ నరసింహారావుగారు టి. | కొవ్వూరు |
| శ్రీ నరసింహారావుగారు పట్వారి కె. | కారువంగ |
| శ్రీ నరసింహారావుగారు డి.ఆర్. యన్. | వరంగల్ |
| శ్రీ నరసింహారావుగారు వి.ఆర్. | హనుమకొండ |
| శ్రీ నరహరిరావుగారు యల్. | కొంగరకలాన్ |
| శ్రీ నాగభూషణంగారు వేముల | ఏలూరు |
| శ్రీ నాగసిద్ధారెడ్డిగారు డి. | తిరుపతి |
| శ్రీ నాయుడుగారు టి.వి. | హైదరాబాదు |
| శ్రీ నారాయణగారు ఎ. | నాగర్‌కర్నూలు |
| శ్రీ నారాయణమూర్తిగారు కె.యస్.ఆర్.కె. | తాండూరు |

శ్రీ నారాయణాచార్యులుగారు డి.బి.వి. కొవ్వూరు

శ్రీ పట్టాభిగారు డి. హైదరాబాదు

శ్రీ పతంజలి శాస్త్రిగారు ,,

శ్రీ పద్మనాభరావుగారు బి. ,,

శ్రీ పర్వతరావుగారు యస్. ,,

శ్రీ పాండురంగాచార్యగారు కె. ,,

శ్రీ పూర్ణచంద్రరావుగారు డి.ఆర్.జె.వి. గుంటూరు

శ్రీ పూర్ణానందశర్మగారు చెరుకుపల్లి హైదరాబాదు

శ్రీ ప్రకాశరావుగారు సీతానగరం-విజయవాడ

శ్రీ ప్రకాశరావుగారు సత్యనారాయణపురం-విజయవాడ

శ్రీ ప్రభాకరశర్మగారు పి. ,,

శ్రీ బాపిరాజుగారు తాడికొండ అమలాపురం

శ్రీ బాలకృష్ణశర్మగారు వి. మర్చాల

శ్రీ బెల్డే యాదగిరిగారు డి.ఆర్. హైదరాబాదు

శ్రీ బ్రహ్మజీరావు సీతారామదంపతులు దొండపర్తి

శ్రీ భద్రంగారు కె వి. హైదరాబాదు

శ్రీ భాష్యకారాచార్యగారు ,,

శ్రీ భాస్కరశర్మగారు పి.వి. పొన్నూరు

శ్రీ భావనారాయణగారు వి. హైదరాబాదు

శ్రీ భావనారాయణగారు యస్. ,,

శ్రీ భూపాల్‌గారు ఆర్.డి. ,,

శ్రీ మల్లేశంగారు కె. ,,

శ్రీ మాధవరావుగారు కె. పిఠాపురం

శ్రీ మురళీధరరావుగారు సి. నాగర్‌కర్నూలు

శ్రీ మూర్తిగారు కె.వి.యల్.యన్. హైదరాబాదు

| | |
|---|---|
| శ్రీ మూర్తిగారు యం.జి.యస్. | హైదరాబాదు |
| శ్రీ మూర్తిగారు యన్.జి.కె. | " |
| శ్రీ మూర్తిగారు వి.యస్.కె. | " |
| శ్రీ రంగనాథంగారు జి.వి.ఎస్. | భువనేశ్వర్ |
| శ్రీ రంగనాథంగారు యన్.వి. | హైదరాబాదు |
| శ్రీ రంగనాథాచార్యులుగారు టి.కె. | ఉంద్రాజవరం |
| శ్రీ రంగాచార్యులుగారు టి.కె.బి. | హైదరాబాదు |
| శ్రీ రంగారావుగారు కె. | " |
| శ్రీ రఘురామ్‌కుమార్‌గార్లు యన్. | విశాఖపట్నం |
| శ్రీ రమణగారు యం.వి. | బళ్లారి |
| శ్రీ రమణిగారు డాక్టర్ సి. | విశాఖపట్నం |
| శ్రీ రమాదేవిగారు ప్రతాపరెడ్డి పి. | హైదరాబాదు |
| శ్రీ రాఘవయ్యజోశిగారు వి. | గోటూరు |
| శ్రీ రాఘవరెడ్డిగారు | కారువంగ |
| శ్రీ రాజశేఖరంగారు | హైదరాబాదు |
| శ్రీ రాధాకృష్ణమూర్తిగారు వి. | " |
| శ్రీ రామకృష్ణమూర్తిగారు అకెళ్ళ | వ్యాఘ్రేశ్వరం |
| శ్రీ రామకృష్ణయ్యగారు ఎ. | హైదరాబాదు |
| శ్రీ రామకృష్ణరావుగారు ముచ్చిమిల్లి | మద్రాసు |
| శ్రీ రామకృష్ణరావుగారు బి. | హైదరాబాదు |
| శ్రీ రామకృష్ణశర్మగారు సూరుగుచ్చి | " |
| శ్రీ రామకృష్ణారెడ్డిగారు కె. | " |
| శ్రీ రామకృష్ణారెడ్డిగారు యన్.వి. | బెంగుళూరు |
| శ్రీ రామకోటేశ్వరరావుగారు | హైదరాబాదు |
| శ్రీ రామచంద్రరావుగారు బి. | " |

| | |
|---|---|
| శ్రీ రామమూర్తిగారు సంతపురి | గద్వాల |
| శ్రీ రామమూర్తిగారు కె యస్. | తిరుపతి |
| శ్రీ రామయ్యగారు టి. | హైదరాబాదు |
| శ్రీ రామస్వామిగారు డి. | " |
| శ్రీ రామస్వామిగారు హెచ్.కె. | తిరుచిరాపల్లి |
| శ్రీ రామానందరావుగారు ఆర్. | సికిందరాబాదు |
| శ్రీ రామారావుగారు ఎ. | కొవ్వూరు |
| శ్రీ రామారావుగారు ఎ.వి. | హైదరాబాదు |
| శ్రీ రామారావుగారు కె. | డెహ్రాడూన్ |
| శ్రీ రావుగారు డి.సి.యస్. | సికింద్రాబాదు |
| శ్రీ రామేశ్వరరావుగారు వెలుదండ | మంగునూరు |
| శ్రీ రుక్మిణమ్మ దొరసానిగారు యస్. | హైదరాబాదు |
| శ్రీ లక్ష్మణమూర్తిగారు చాట | నెల్లిమర్ల |
| శ్రీ లక్ష్మణాచార్యులుగారు ఎ సి. | హైదరాబాదు |
| శ్రీ లక్ష్మయ్యగారు బిచ్చాల | తాండూరు |
| శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి దేవస్థానం | కదిరి |
| శ్రీ లక్ష్మీనారాయణగారు నందారం మిడిదొడ్డి నర్సింహులుగారి | కొడంగల్ |
| శ్రీ లక్ష్మీనారాయణదాస్‌గారు మోత్కూరి | పెద ఉప్పల్ |
| శ్రీ లక్ష్మీనారాయణరావుగారు | హైదరాబాదు |
| శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు పొన్నపల్లి | కూచిపూడి |
| శ్రీ లక్ష్మీపతిగారు ఆచంట | హైదరాబాదు |
| శ్రీ లింగమూర్తిగారు కపిలవాయి | పాలెం |
| శ్రీ వర్ధన్‌గారు డి.ఆర్.కె.పి. | గద్వాల |

| | |
|---|---|
| శ్రీ వసంతకుమార్‌గారు పరిగి | విశాఖపట్నం |
| శ్రీమతి వసంతకుమారిగారు వి. | హైదరాబాదు |
| శ్రీమతి వసుమతిగారు | " |
| శ్రీ వాసుదేవరెడ్డిగారు రావుల | " |
| శ్రీ విఠల్‌బాబుగారు ఎ.వి. | " |
| శ్రీ విఠల్‌రావుగారు ఎ.వి. | " |
| శ్రీ విఠోబాగారు కె. | హైదరాబాదు |
| శ్రీ విశ్వనాథంగారు పి. | " |
| శ్రీ విశ్వనాథరావుగారు బి. | కుమ్మరగడ్డ |
| శ్రీ విశ్వనాథరావుగారు యం. | హైదరాబాదు |
| శ్రీ వీరభద్రరావుగారు కె. | " |
| శ్రీ వీరయ్యగారు బి. | నాగర్‌కర్నూలు |
| శ్రీ వీరయ్యగారు జి. | హైదరాబాదు |
| శ్రీ వీరాస్వామినాయుడుగారు డి.ఆర్, యస్. | తిరుపతి |
| శ్రీ వీరనారాయణశర్మగారు వారణాశి | నల్గొండ |
| శ్రీ వెంకట కృష్ణ నరసింహమూర్తిగారు చతుర్వేదుల | నెల్లూరు |
| శ్రీ వెంకట నరసింహంగారు పూని | తిరుపతి |
| శ్రీమతి వెంకటనర్సమ్మగారు | హనుమకొండ |
| శ్రీ వెంకట రమణయ్యగారు నెమ్మాని | తిరుపతి |
| శ్రీ వెంకట రమణయ్యగారు మునగా | నెల్లూరు |
| శ్రీ వెంకటరావుగారు యన్. | కాకినాడ |
| శ్రీ వెంకటసుబ్బారావుగారు యార్లగడ్డ | హైదరాబాదు |
| శ్రీ వెంకటసుబ్రహ్మణ్యంగారు పోణంగిపల్లి | రాజమండ్రి |
| శ్రీ వెంకటాచార్యులుగారు చేట్లూరి | హైదరాబాదు |
| శ్రీ వెంకటాచార్యులుగారు డి.ఆర్.పి.టి. | " |

| | |
|---|---|
| శ్రీ వెంకటాచార్యులుగారు యస్ | హైదరాబాదు |
| శ్రీ వెంకటేశ్వరరావుగారు జోగిరాజు | వికారాబాదు |
| శ్రీ వెంకటేశ్వరరావుగారు లక్కరాజు | హైదరాబాదు |
| శ్రీ వెంకటేశ్వరరావుగారు బి. | " |
| శ్రీ వెంకటేశ్వరరావుగారు బి.యల్. | " |
| శ్రీ వెంకటేశ్వరరావుగారు పి. | " |
| శ్రీ వేదాంతంగారు జి. | " |
| శ్రీ వేదాద్రిగారు మఠ్జి | " |
| శ్రీ శంకరయ్యగారు చేపూరు | అమరాబాద్ |
| శ్రీ శఠకోప రామానుజాచార్యులుగారు యస్.టి.జి | చిట్టిగూడూరు |
| శ్రీ శర్మగారు బి అర్ కె. | హైదరాబాదు |
| శ్రీ శర్మగారు సి.ఎ. | " |
| శ్రీ శర్మగారు సి.వి.కె.వై.యస్. | " |
| శ్రీ శర్మగారు కె.యల్.యస్.యన్. | " |
| శ్రీ శర్మగారు కె.యస్ హెచ్.యు. | " |
| శ్రీ శర్మగారు యల్.యస్.యన్.అర్.ఎ. | " |
| శ్రీ శర్మగారు యం.యస్.యన్. | " |
| శ్రీ శర్మగారు యన్.అర్.యల్. | " |
| శ్రీమతి శారదాదేవిగారు | మెదక్ |
| శ్రీ శాస్త్రిగారు సి.యస్. | మద్రాసు |
| శ్రీ ప్రొఫెసర్ శాస్త్రిగారు కె.వి.యస్. | గుంటూరు |
| శ్రీ శాస్త్రిగారు పి వి.కె యం.యం. | హైదరాబాదు |
| శ్రీ శాస్త్రిగారు యస్.యల్.యన్. | " |
| శ్రీ శాస్త్రిగారు వి.బి. | " |
| శ్రీ శివకోటీశ్వరరావుగారు వై. | " |

శ్రీ శేఖరరెడ్డిగారు యం. నాగర్‌కర్నూలు
శ్రీ శేషగిరిరావుగారు చీమకుర్తి హైదరాబాదు
శ్రీ శేషగిరిరావుగారు బి. కొవ్వూరు
శ్రీ శేషగిరిరావుగారు పి. హైదరాబాదు
శ్రీ శేషాచార్యులుగారు బి.జి. "
శ్రీ శేషాద్రిరావుగారు కె. "
శ్రీ శ్రీకృష్ణగారు చావలి "
శ్రీ శ్రీధరరావుగారు కారువంగ
శ్రీ శ్రీనాథాచార్యులుగారు సి.హెచ్. కావేరమ్మపేట
శ్రీ శ్రీనివాసమూర్తిగారు పి. హైదరాబాదు
శ్రీ శ్రీనివాసాచార్యగారు తిరుమల "
శ్రీ శ్రీరామనరసింహంగారు తట్టా "
శ్రీ శ్రీరామప్రసాద్‌గారు కె. మెదక్
శ్రీ శ్రీరాములు నారాయణదాసుగారు కలువకొలను
శ్రీ షణ్ముగంగారు వి. హైదరాబాదు
శ్రీ సంపత్‌గారు యం.యస్. మదరాసు
శ్రీ సచ్చిదానందంగారు సింగరాజు తిరుపతి
శ్రీ సత్తిబాబుగారు సి హెచ్. విశాఖపట్నం
శ్రీ సత్యనాథన్‌గారు యు. మద్రాసు
శ్రీ సత్యనారాయణగారు వనమా హైదరాబాదు
శ్రీ సత్యనారాయణాచార్యులుగారు వేదాల "
శ్రీ సత్యనారాయణగారు జి. "
శ్రీ సత్యనారాయణగారు జి. "
శ్రీ సత్యనారాయణగారు పి.వి. "
శ్రీ సత్యాజీరావుగారు యం. తెనాలి

| | |
|---|---|
| శ్రీ సరస్వతీ విద్యామందిర్ కేశవనగర్ | హైదరాబాదు |
| శ్రీ సరస్వతీ విద్యామందిర్ వెంకటరమణనగర్ | " |
| శ్రీ సరస్వతీ శిశుమందిర్ | తాండూరు |
| శ్రీ సాంబశివరావుగారు యస్. | హైదరాబాదు |
| శ్రీ సాంబశివరావుగారు వి.వి. | " |
| శ్రీమతి సీతాదేవిగారు యం. | " |
| శ్రీమతి సీతారామమ్మగారు వేమూరి | మచిలీపట్నం |
| శ్రీ సీతారామయ్యగారు యం. | హైదరాబాదు |
| శ్రీ సీతారామయ్యగారు యస్. | " |
| శ్రీ సీతారామయ్యవర్మగారు జాస్తి | శ్రీనగర్ |
| శ్రీ సీతారామాచార్యులుగారు యం. | హైదరాబాదు |
| శ్రీ సీతారామానుజాచార్యులుగారు శ్రీపతి | గుడివాడ |
| శ్రీ డా॥ సుగుణాకరరావుగారు యం. | హైదరాబాదు |
| శ్రీ సుదర్శనాచార్యులుగారు కె. | " |
| శ్రీ సుబ్బచ్చారిగారు యస్. | తిరుపతి |
| శ్రీ సుబ్బయ్యగారు వి వి. | హైదరాబాదు |
| శ్రీ సుబ్బారావుగారు పి.వి. | " |
| శ్రీ సుబ్బారావుగారు యస్.వి. | " |
| శ్రీమతి సుబ్బులుగారు బోడాల | విజయవాడ |
| శ్రీ సుబ్రహ్మణ్యంగారు నంద్యాల | హైదరాబాదు |
| శ్రీ సుబ్రహ్మణ్యంగారు నర్లా | " |
| శ్రీ సుబ్రహ్మణ్యాచారిగారు డి. | " |
| శ్రీ సుభాష్ చందర్ గారు టి.యం | " |
| శ్రీ సుశీలా నరసింహారెడ్డిగారు పి. | " |
| శ్రీ సూర్యనారాయణమూర్తిగారు నేతి | ఏలూరు |

| | |
|---|---|
| శ్రీ సూర్యనారాయణమూర్తిగారు పేరి | ఏలూరు |
| శ్రీ సూర్యనారాయణమూర్తిగారు ఎ. | కొండవరం |
| శ్రీ సోమయాజులుగారు అర్.బి. | వికారాబాదు |
| శ్రీ సోమసుందరంగారు కె. | విశాఖపట్నం |
| శ్రీ స్వామిరెడ్డిగారు వి. | కొండిమ్యాల |
| శ్రీ హనుమంతరావుగారు వి. | తెనాలి |
| శ్రీ హరనాథ్‌గారు బి.కె. | హైదరాబాదు |
| శ్రీ హరినారాయణశర్మగారు కె.యస్. | " |

## ప్రోత్సాహకులు

| | |
|---|---|
| శ్రీ ఉదయవర్లుగారు టి. | హైదరాబాదు |
| శ్రీ నరసింహారావుగారు వి. అర్. | హనుమకొండ |
| శ్రీ ప్రసాద్‌గారు ఎం.డి.ఎమ్. | రాజమంత్రి |
| శ్రీ లక్ష్మనాథాచార్యులుగారు చిలకమర్తి | తాండూరు |
| శ్రీ వెంకటరమణయ్యగారు నెమ్మాని | తిరుపతి |
| శ్రీ శ్రీనివాసరావుగారు యం. | హైదరాబాదు |
| శ్రీ శ్రీరంగాచార్యగారు ఎస్. | పాలెం |
| శ్రీ సాంబశివరావుగారు వి. వి. | హైదరాబాదు |
| శ్రీ హనుమంతరావుగారు వి. | తెనాలి |